# కవిప్రశంసాదులు.

(క్రీ. శ. 1863?—1898.)

ఈ దాశరథివిలాసమును రచించినకవి కొత్తపల్లి లచ్చయ్య. పిఠాపురము సమీపముననున్న చెందుర్తిగ్రామవాస్తవ్యుఁడు. ఈతఁడాపస్తంబసూత్రుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. తెలుఁగాణ్యవైదికబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు రామన్న. తల్లి సుబ్బమ్మ. ఏనమండ్రన్నదమ్ములలో నితఁడు నాల్గవవాఁడు. తనవంశవృత్తాంతమును గవి కృత్యాదిని వివరించియున్నాఁడు. ఇక్కవికుటుంబము చిరకాలమునుండి రావువారిసంస్థానమునే యాశ్రయించి యుండెను. ఈతఁడు శరీరారోగ్యము చాలనివాఁ డగుట నారోగ్యేచ్ఛచే మొదట దుష్కరప్రాససూర్యశతకమును రచించెను. తర్వాత తిరుమలయాత్ర పాదచారియై చేసి వచ్చి శ్రీవేంకటేశ్వరున కంకితముగా శ్రీమన్నారాయణుని దశావతారములలో నేడవదియగు శ్రీరామచంద్రుని దివ్యచరిత్రమును (దాశరథివిలాసముగా రచియించి) సమర్పించెను. భారతవర్షములో నాబాలగోపాలమునకు నిత్యస్మరణీయుఁడును బూజనీయుఁడు నైన శ్రీరామదేవుని దివ్యచరిత్రమును తనలలితకల్పనాకల్పకమునుండి ప్రౌఢపద్యప్రసూనరూపమున వెలువరించుటకుఁ గవి తనయిరువదియవయేఁటఁ బ్రారంభించి తల్లి తమ్ముల మొదలగువారు మరణించుచుండుటచే నడుమనడుమ విఘ్నములు సంభవించుచుండినను బూర్కి విడువక పదిసంవత్సరములకుఁ బూర్తిచేసెను. తరువాత, తానే యిప్ప[illegible] రెండుప్రతులను వ్రాసెను. మొదటిచిత్తుప్రతి చాలభాగము తాళపత్రప్రతి. రెండుమూఁడుప్రతులు కాగితములు. కవి, తాళపత్రములమీఁదఁ గాకితములమీఁద నొక్కవిధముగానే వ్రాయఁగలిగి యుండెను. అతఁడు వ్రాసినశుద్ధప్రతులలో నొక్కటి చెన్నపురి ఓరి

యంటల్ లైబ్రరీలోనున్నది. రెండవదానిం బట్టి యీముద్రితప్రతి
సిద్ధముచేయఁబడియెను. కవి గ్రంథసమాప్తి చేసినపిమ్మటఁ దన
ముప్పదియైదవయేఁటఁ గావచ్చును, హేమలంబిసంవత్స రాశ్వయుజ
బ ౮ నాఁడు కాలధర్మము నొందెను. తనజీవితకాలములో ముద్రణ
మునకై యనేకయత్నము లొనర్చెను, గాని, కాలమును బురస్క
రించుకొని కొనసాగలేదు. తదనంతర మతనితమ్ములప్రార్థనమున శ్రీ
రాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దరుగారు తమమంజువాణి
పత్రికలోఁ బ్రకటింప ననుగ్రహించిరి. కాని యంతలో నాపత్రికా
ప్రకటనము నిల్చిపోవుటచే నైదాశ్వాసములతో నీగ్రంథ మసమగ్ర
ముగనే యుండవలసివచ్చినది. ఆపుస్తకములైన నెక్కడ దొరకుట
లేదు. ఇన్నినాళ్ళ కిపుడు రసజ్ఞులును, భాషాపోషకులును, నాశ్రిత
పక్షపాతులు నగు శ్రీరావు వెంకటనరసింహారావుగారీగ్రంథమును
జిత్తగించి చూపిన ప్రోత్సాహముచే గవివంశమునకుఁ బోషకు లగు
శ్రీకోలంకవీరవర సంస్థానప్రభ్వులు రాజ్ఞీమణులు సత్కార్యనిర్వహణ
మునకు ముందంజవేయువారు, దేవబ్రాహ్మణభక్తిపరతంత్రులు, నగు
శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావుబహద్దరువారి యొక్కయు శ్రీ రా
జారావు రామయ్యమ్మారావుబహద్దరువారియొక్కయుఁ గరుణాకటా
క్షలేశమున సంపూర్ణముగఁ బ్రకటింపఁబడినది. ఈదాశరథివిలాసము
పూర్తిచేసిన యనంతరమునఁ దనప్రభుభక్తి వెల్లడించుచుఁ గవి రచిం
చిన చెల్లయ్యమ్మశతకమునాఁడే యిక్కార్యము నెఱవేఱవలసినది,
గాని, యప్పటికి దీనికిఁ బ్రకటనకాలము రాలేదు. అనారోగ్యతచేతఁ
గవి వివాహమును నిరాకరించెను. ఈకవి విద్యాభ్యాసము తనపెద్దయ
న్నగారగుగంగయ్యగారి యొద్దఁ గావించెను. గంగయ్యగారు పురాణ
ము చెప్పుటలోఁ బ్రసిద్ధుఁడు. ఆయనతోఁగూడ నుండి రామాయ
ణాది పుస్తకములుచదివియే కవి యింతటిగ్రంథమును నిర్మించుప్రజ్ఞ

ను గడించెను. గంగయ్యగారిప్పటికి రెండుసంవత్సరములక్రిందట
జనదెబ్బదియవయేట స్వర్గస్థులైరి. ఈలచ్చయ్యకవి యాశుకవిత్వము
గూడఁ జెప్పువాఁడు. సమస్యాపూరణమున నిపుణుఁడు. పల్లెటూరి
జనులను రంజింపఁజేయుటలో గట్టివాఁడు. ఎవ్వరేకథ నేరీతిని జె
ప్పుమన్న నారీతిని బొబ్బిలిపాట, శారదకావ్యము, కోలాటపుఁబద
ములు మొదలగురీతులతో, అశుధారను గ్రామమధ్యమున రాత్రులలో
వీధిలో నిలువఁబడి పాడి జనరంజనము చేయువాఁడు. ఈయనపాటలు
వినఁగోరి చుట్టుప్రక్కల గ్రామజనులు పిల్చిన నచ్చట వివిధరీతులఁ
బాడి యానందపఱచువాఁడు. కొందఱు శిష్యులకాపాటలు నేర్పె
ను గాని యాశిష్యులును గురువుగారితోనే యున్నారు. నవ్వుపుట్టిం
చునట్లు మాటలాడువాడు. ఒక్కనాఁడు పొలములోఁ జెట్టెక్కి తేనె
పట్టును దీసెను. ఈఁగలు చేతిప్రేళ్ళమీఁద గుట్టినవి. ముంజేతివఱకు
వాఁచెను. చూచినజనులు“లచ్చయ్యగారు! చేయి వాఁచినదే”మని య
డిగిరి. ఝటితిస్ఫురణచేఁ బ్రత్యుత్తరముచెప్పి లోకమును మెప్పించు
నేర్పుగలుగుట—“నేనీనాఁ డుదయమున నడవిలోనికి వెళ్ళియుంటిని.
“పులిగవి”లో నొక్కసిద్ధుఁడు దర్శన మిచ్చి నీరసించిన నాశరీరము
బలుపుఁజెందుటకై యొకసిద్ధరసమును జెప్పినాఁడు. ఆయూకుఁ బస
రెంతవఱకుఁ బనిచేయునో యని నలఁపి యీచేతికిఁ బట్టించితిని.
పట్టినంతమట్టు నిట్లు బలిసినది”యని వారి నాశ్చర్యమగ్నులఁ గావించి
కొంతవడికి వాస్తవమును జెప్పి నవ్వించెను. ఇక్కవి తనకవిత్వము
కల్పనలు, వర్ణనలు, మొదలగునవి జన్మభూమి యగుచెందుర్తిలో
ప్రజలు, అక్కడి యడవి, పర్వతములు, మృగములు, వృక్షలతా
లును జూచియే విరివిగా సంగ్రహించెనని గ్రంథమునందలి యనేక
ప్రాంతములను బట్టి కవిస్వభావ మెఱింగినవారికిఁ బొడకట్టకమానవి
ఒక్కనాఁడు బొమ్మలాటవారివలె రంగనాథరామాయణములోని

లక్ష్మణమూర్ఛఘట్టము రాత్రిపూఁట జదువుచున్నాఁడు. అందు సంజీవకరణి విశల్యకరణి యిట్లేవో కొన్నిపేరులు వచ్చినవి. ఒక్కఁడు వానిని విని కరిణి యేమి టని ప్రశ్నించెను. కరిణి యెఱుఁగవా "మద్దెలకరిణి,......" యని నవ్వుచుఁ జెప్పెను. చెప్పినంతనె తనకు స్వవిషయ మొక్కటి తలఁపునఁ బడినది. ఈయనతమ్ముఁడు అక్కప్పయను అర్కయ్య జ్వరములోఁ జెవికిఁ్రింద నొక్కకర్తి యనుగడ్డ లేచి మృతుఁడయ్యెను. ఆవిషయము, కరిణియని చెప్పినంతలోఁ దోఁచి పుస్తకము మూసి తలవాంచెను. కారణము దెలిసికొని శ్రోతలు, ఎప్పుడో చనిపోయినవానికై యిప్పుడు మీవంటివారు విచారించెదరా? గతముగతమే యని యోదార్చిరి. అంతకుఁ గొంతకాలములోనే తనరామాయణములో (దాశరథివిలాసమున) లక్ష్మణమూర్ఛఘట్టము వచ్చినది. అపుడు 6 ఆశ్వాసము 921 పద్యమును-

సీ. ఒంటినున్నయపుడు సౌఖ్య మొందునపుడు
నాఁడునప్పుడు బంధులఁ గూడునపుడు
మఱపురాక సహోదరమరణశల్య
మెమ్ములను గీఱుచున్నె నూత్నేడ్లకైన.

అని వారికిఁ బ్రత్యుత్తరముగా వ్రాసిపెట్టెను. ఈఅక్కప్పగారిప్రజ్ఞ యసాధారణమైనది, అగ్నిస్తంభన, జలస్తంభనము, గారడి, నరవిద్య, సాము, గరిడి, కాగితపుటట్టలు కత్తిరించి తెఱబొమ్మలాడించుట, పందెమువేసి యగాధజలములో ననేకవిధముల గంటలకొలఁది నీఁదుట, వంటచేయుట, కావడిమోయుట, కుట్టుట, బొంగరములు రిఙ్గాలు పట్టుట, కమ్మరము, నేఁతపని, తాళ్లుపేనుట, మంచములు

యుట, బుట్టలల్లుట మొదలగు వివిధములైన చేతిపనులు వినోదమున
నైన యభ్యసించెను. కవిత్వము చెప్పువాఁడు, వివాహోపనయనాదులు
చేయుచు స్మార్తకలాపమును గొంతనేర్చెను. అట్టివానిమృతి యూరివారికి
విచారజనకము కాకపోవునా? ఇక్కడి బీదలనుగాంచి యోర్వలేఁడు.
తన కున్నదానిలోనే వారికి వారమునకు నెలకుఁ గొంత కొంత యి
చ్చువాఁడు. దానికై వినియోగించుటకుఁ మిత్రులయొద్దఁ జేసిన
చేబదుళ్ళు- ఈతనిమరణానంతరము జనశ్రుతినిబట్టి యుత్తమర్ణులను
దెలిసికొని గంగయ్యగారు మరల నిచ్చివేసిరి.

ఇట్టి మహనీయకృతిని పండితపామరలోకమునకు నొసఁగి
తత్ప్రసాదమున నుత్తమలోకమునందుఁ జిరస్థాయియై యున్నకవియొ
క్క చిత్తము శ్రీరాజ్ఞీస్వతీయమున కాతనిపైఁ గలవాత్సల్యమునఁ బ్ర
చురింప ననుగ్రహించినందునఁ బ్రశాంతమై యుండుఁగాక. ఇట్టిమహ
కార్య మొనర్చిన తమయేలికలయు వారిపూర్వులయు గుణకీర్తనము
గావించుచు, ప్రభుప్రశంస యనుపద్యములను మొదటఁ జేర్చినవారు
వురలో సూర్యరావు సుందరరామయ్య యనునిరువురును [illegible]
లు. రామచంద్రమూర్తి పెద్దన్నగారగు గంగయ్యగారి పెద్దకుమా
రుఁడు, సోమసుందరము రెండవయన్నగారగు వెంకయ్యగారి పెద్ద
కొడుకు.

శ్రీమతు లగునీప్రభ్వీద్వయము సాధుజనావనము సత్క్రియా
చరణమును గావించుటయే పరమధర్మం బని సంపూర్ణముగ నెఱిఁగి
యుండుటచే నింకను నిట్టిభాషాపోషకములును చిరకీర్తిదాయకములు
నగుకార్యము లొనరించి నిజసంస్థానము కవి

గ్యమై లక్ష్మీనరస్వతులకు విహారస్థానమై యుండునట్లు చేయునుగాక ! శ్రీవారియశస్సు దిగంతవిశ్రాంతముగా నుండు నట్లొనర్ప వారి యిష్టదైవము లనుగ్రహింతురుగాక.

సహజపాండిత్య మగుటను, పండితసాంగత్యము పూర్తిగా లేనివాఁ డగుటను గొన్నికొన్నితావులఁ బ్రమాదము లగపడును. దోషజ్ఞులు వానిని బెద్దచేయరు. కవిత్వమునందలి తక్కినసుగుణములఁ గాంచి య్యానందించిరేని గీర్తిశేషుఁడయినకవి కృతార్థుఁ డగును.

లక్ష్మీనరసాపురము,
4 జనవరి 1928.

చలికాని సూర్యారావు.



శుభమస్తు.

# ప్రభుప్రశంస.

ఉ. శ్రీశుభదాయకంబును, విశిష్టమనోజ్ఞము, వాంఛితప్రదం
బాశరథీనివారణ, మనంతకథాబహులం, బజాతసం
కాశము, ముక్తివేళ, మురుకాండవికాసము, ముక్తపాళహా
దాశరథీద్విలాసము ముదం బొనరించుత రావువారికిన్. 1

మ. వసుసంపత్తియుఁ, జక్రిపాలనకళాప్రావీణ్య, ముద్యత్ప్రభా
విసరోద్ఘాటితదోషయుక్తియు, బుధప్రేమాతిరేకమ్ము, లో
కనువ్యాప్తత్వమ్ము, స్వభావసిద్ధ మగుటం గాఁబోలుఁ జేర్గాంచి వా
రసమానప్రథఁ బద్మనాయకులు గేయామేయనిత్యోదయుల్. 2

ఉ. అందుఁ బ్రజానురాగపరులై, పరభంజనులై, విశేషశో
భం దనరారి మించిరి శుభప్రతిపాదకవృత్తి రావువా
రందు మహీపతీశ్వరబిరుదాంచితులై, సుయశోవిశాలురై
కొందఱు నైజవంశమునకుం గడువన్నియ వెట్టి రాఢ్యులై. 3

క. ఆమహీపతులకు నెల్లను, దా మూలపురుషుఁ డయి రిపువశననిపుణుఁ డై
శ్యామలకోటనికాంతుం, డై మనియెం దెలుఁగురాయఁ డమితప్రాభవ్. 4

గీ. తెలుఁగురాయని వర్ణింపఁ దివిరి వేల్పు, బాస యొండె కొల్పఁ దగుఁ గొంత బోఁకెప్పి
కొనియె నదియ తెలుఁగుబాస యనఁగ నొప్పె, గాక మిశ్రమ[illegible] 5

శా. భావింపందగు తెల్గుశ్రేష్ఠివిలసద్వంశమ్ము దీపింపఁగా
దేవబ్రాహ్మణకార్యతత్పరతఁ గుంతీమాధవారాధనన్
శ్రీవర్ధిష్ణునిజప్రజావనమతిన్ నీలాద్రిరాయప్రభుం
డావిర్భావము నొంది మించె సకలాశాంతస్ఫురత్కీర్తియై. 6

మ. ఘననీలాద్రినృపాలశేఖరుఁడు వేడ్కన్ రాజ్ఞిభావమ్మనం
దనదేవేరిఁ గోరి కాంచె సుతుల న్నానాసత్యసౌందర్యభా
జనుల న్మాన్యుల సింహసంహననులం జంద్రాననామీనకే
తనులన్ సూర్యకుమారనామకనృపంచాన్యు లౌనిర్యానన్. 7

శా. ఆనీలాద్రినృపాలుపిమ్మటఁ గుమారాగ్రేసరుండున్ బహు
క్ష్మానాథస్పృహణీయవర్తనుఁడు శ్రీమత్సూర్యభూపాలుఁ డ

త్యానందమ్ముఁ వహించి లోకములు కొండాడంగ నేలె న్మహీ
జాను ల్పాటిరియె వీని కన్య లన రాజవ్రాజధర్మక్షితీశ్. 8

గీ. ఇట్లు సూర్యకులమువార లెల్లఁబీఠ,పురము నేలువార లయి యొప్పుదురు వారి
వారిచరితలు వేర్వేఱఁ బలుకవశమె, పరఁగ నేండ్లును బూండ్లును బట్టుఁగాక. 9

క. వినుతయశుం డగుసలసూ,ర్యన్నృపాలునకుం గుదమ్మఁ దలరు న్నాజ
న్యనిధియు మాన్యచరిత్రుఁడు, మనుమార్గుఁడు నయి కుమారమహిపతి యనఁగన్. 10

సీ. అర్థిసంఘములదైన్యతుదీఱునందాఁక, నిచ్చివోనిక్ష్పాసముద్రుఁ డితఁడె
వినయప్రవర్తనమ్మున రామచంద్రుని, మఱపించుపితృభక్తినిరతుఁ డితఁడె
కఱకుశాత్రవునైనఁ బరుషాక్షరమొకండుఁ, బలుకనిసరళస్వభావుఁ డితఁడె
ప్రజ లెల్లఁ దనకన్నప్రజలట్ల భావించి, తన్పఁజాలెడిసమదర్శి యితఁడె

గీ. యనఁగఁ గోలంకవీరవరాధిపతి యా, శేషరాజలక్షణవిరాజితశుభయశుఁ
డగుకుమారమహీపతి రాజుంతు మించెఁ, గేవలన్నృపమాత్రుండె తర్కింప నతఁడు.

క. లక్ష్మీకరమూర్తి ననఘుఁ లక్ష్మీపరసన్నిభాను నమలచరిత విలస
ల్లక్ష్మణలక్షితను గుమా,రక్ష్మాపతి పెండ్లియాడెఁ బ్రేమద మెలర్పన్. 12

క. శ్రీరంగనాథపదసర,సీరుహాలగ్నప్రమోదచిత్తాంబుజ, ల
క్ష్మీరమణీకరుణాప్తగ,ధారాపరిపుష్ట యగుచుఁ దత్పతి వెలసెన్. 13

చ. అతులితభాగ్యశాలి యతఁ డాయమయందున నిత్యసూనృత
వ్రతులఁ గుమారరాజనృపరాజకిశోరుల రాజతేజులం
బ్రతిహతశత్రుభూకుల రాజితసద్గుణరాజులన్ మహా
ప్రతిభుల సూర్యధర్మమహిపాలురనిద్దరఁ గాంచెఁ బుత్త్రులన్. 14

ఉ. పెద్దది యాత్మగౌరవము, పెద్దవి చూపులు, సాహసంబు బల్
పెద్దది, సర్వభంగులను బెద్ద యువారగుణంబు పోల్పఁగం
బెద్దది కీర్తి, పేరు కడుఁ బెద్దది యొక్కఁడె కీర్తి లన్నిటం
బెద్దవహింప సూర్యవిభు వేల్పులపెద్ద సృజించె ధారణిన్. 15

శా. ఆర్యామోదిఁ, గుణాగ్రిధీలలితు, వ్యాయామసుస్ఫూటాంగున్ మహా
ధైర్యస్థైర్యసువర్ణభూధరుని, సంధాభార్గవున్, రావుశ్రీ
సూర్యారాయనృపాలకానుజుని సంస్తుత్యాశ్వశిక్షాకళా
చార్యుం జేర్కొనఁ జెల్లుఁ బుణ్యనిధి రాజాధర్మరాయప్రభున్. 17

గీ. అనఘ వెల్లంకివంశపావన తిమూర్య, విభుజగన్నాథరాయనిపిన్నపట్టి
రాజ్ఞి శ్రీచెల్లయాంబను రమణఁ జెట్టి, పట్టె శ్రీసూర్యరాయనృపాలమౌళి. 18

గీ. నట్టి శ్రీచెల్లయాంబ మహాజ్ఞ మసలి, సన్నుతుల నొందె నని యెందు జను లనంగ
నత్తరుం దలలోనాల్క యగుచు వెలసె, రమ్యసద్గుణనికురుంబ రామయాంబ.

సీ. తాతతండ్రులనుండి తమకొల్వుఁ దీర్చు భృత్యులఁ గాచి పుణ్యంబునొందు ననియు
దేశమ్ముఁ గాలమ్ముఁ దెలిసి ప్రజానురంజనముగఁ బాలింపఁ జాలు ననియుఁ
బుట్టినయింటికి మెట్టినయింటికిఁ, బేరుఁ దెచ్చి యశంబుఁ బెంచు ననియు
మానితసంస్థానమర్యాద లారసి, కులమువారల పేరు నిలుపు ననియు

గీ. నరసి చెల్లాంబ స్నుషకు రాజ్యం బొసంగె, నాదిరాజన్యపద్ధతి ననుసరించి
యహహ! స్వార్థపరిత్యాగ మనఁగ నిట్టు, లుండవలవదె యని మెచ్చ నుర్విజనము.

సీ. నాఁటనాఁటను రమానాథుపైఁ బొదలుభక్తి యవిరళం బని తెలుపుకొనుచు
వరనార్యరాణ్మహీభర్తపైఁ గల్గు కడింది ప్రేమముఁ బ్రకటించుకొనుచుఁ
పావనలక్ష్మీనివాసరంగములపై, భావ మెంతయుఁ దేట పఱచుకొనుచు
నిర్మలఘనయశోనిలయ నై యనియెద, నంచు జగతి కెఱిఁగించుకొనుచు

గీ. బళిర! చెల్లయాంబను దిరుపతియు నెండ్రపల్లె క్షేత్రంబు దామరవాడయు సిత
చంద్రసౌధ మ్మను స్వయుసాంత పట్లు, చెందె; మాఱు నె సాధ్వులశీల మెందు.

సీ. తనభవ్యవినయాదిఘనలక్షణంబులు, నారాయణాంశసంజనతఁ దెలుపఁ
దనగురుశుశ్రూష యనయంబు వాయని, సూర్యపత్నీత్వవిస్ఫూర్తి నెఱపఁ
దనయపూర్వసహజధర్మగుణప్రౌఢి, ప్రత్యర్థిపటలసంవర్ధనముగఁ
దనయండ యయి నిల్చిన నృసింహు నాదృతి, శ్రితులఁ బ్రహ్లాదత్వసిద్ధిఁ దేల్పఁ

గీ. ప్రబలుఁ గవిమండలాశీఃపరంపరాప్తి, పుణ్యరాజ్యాధికారప్రభూతపూత
నిర్మలవియన్నదీసదృక్షవిశదకీర్తి, రాజితాశాకదంబ శ్రీరామయాంబ. 28

సీ. సితచంద్రసౌధపఙ్క్తిప్రభావరణంబు, పద్మనాయకకులపాలితంబు
క్రూరనిశాటసంకులధూమకేతువు, మాధవక్రీడాసమానసీమ
విబుధసన్నుతసత్రవేశ్మప్రపూర్ణంబు, ధన్యసుమిత్రావతంసభవన
మనిలకిశోరవిహారోపవనరాజి, వనగతభూజాతివైభవంబు

గీ. భరతశత్రుఘ్నచణభద్రభటనివహాయుతంబు కుశలవసుప్రసిద్ధమ్ము నగుచు
రామరాజ్య మనంగ నీ రామరాజ్య, మలరె నన మించె రావురామాంబదేవి. 29

సీ. రావుసద్వంశవారాశి యుప్పొంగఁగా, వెలసినచంద్రునికళ లనంగ
ధర్మంబు నాల్గుపాదముల వర్తిలఁ గలిఁ, బ్రబలినధర్మదేవత లనంగఁ
ప్రాచీనకావ్యసుప్రకటవాసక్తి నై, జన్మమందినసరస్వతు లనంగ
సాంద్ర [illegible], భవ్యపావనతపఃఫలము లనఁగ

గీ. నన్వవాయమునను బ్రజ నరయుపట్లు, నధికవిద్యాప్రసక్తిఁ దా నధిక లగుచుఁ
రాజిలెదు చెల్లయాంబయు రామయాంబ, సన్నుతికిఁ బాత్రములు కారె జగతిలోన.

క. విద్యాసరస్వతులు నృప, విద్యాపారగలు భార్గవీపూర్ణకృపా
మాద్యత్సంపద్విలసిత, లాద్యలు మఱి యత్తకోడ లన్నిటిలోనన్. 31

ఉ. ఆరయఁ బూర్వికాశ్రితుల నాశ్రితపుత్త్రుల వారిబిడ్డలన్
వారియనుంగుమానల నవక్రదయామతిఁ గాచుపృథ్వి శ్రీ
ధారణి రావుచెల్లయమఁ దత్స్నుష రామమ యంచు లోకముల్
సారెకు సన్నుతింపఁగఁ జెలంగి వదాన్యత మించి రెంతయున్. 32

ఉ. అయ్యలు నమ్మలై ప్రజల నారయుచుండిరి చెల్లయాంబ రా
మయ్యయు వారి నెట్లనిన నర్హము; ప్రోషిత గాక యల్పమే?
యియ్యెడ నావహోబలుని నే మెదిరింతును మూఁడుమూర్తు చె
ల్లయ్యయు రామయాంబ యని యడ్డిఁక జాతము వ్యాకృతిప్రథన్. 33

క. ఇంద్రుం డని చంద్రుండని, నేంద్రుం డని పొగడు కవిమహాయమ్ముఁగ వా
డింద్రుఁడొ చంద్రుఁడొ తెలియది, నేంద్రుఁడొ యారి త్తమాట లేక్రికి మానన్. 35

ఆ. ఉన్న దున్నయట్లు లుగ్గడింపఁగ నేండ్లుఁ, బూండ్లుఁ బట్టు లేనిపోని వేల!
యట్టి కెగురలేని యోపికతో నుండి, స్వర్గమునకు నెగుర బోవునట్లు. 36

గీ. వర్తమానానురూపప్రవర్తనమున, మించి యశమునఁ బ్రజలఁ బాలించు నల్ల
దివ్యరేచర్లగోత్రసందీపిత లకు, నత్తకోడం డ్రొకానొక యవసరమున. 37

సీ. శ్రవణయుగ్మాభిరంజనదివ్యకుండల, భ్రాజితం బగుసోమయాజికులము
బహుమానితానర్ఘభర్మశాటీవిరా, జిత మగుపండితసింహాళితతి
శుద్ధమాణిక్యసన్నద్ధకాంచనకంక, ణాదిభూషితకవీంద్రావలియును
హారికిరీటకేయూరవిభూషాభి, రామ మా సామంతరాజసమితి

గీ. నాగవల్లీదళకరండపూగచూర్ణ, చందనాగురుకర్పూరచారుమకుర
ముఖ్యనృపలాంఛనద్రవ్యములు గ్రహించి, సేవకాళియు నందందఁ జేరియుండె. 38

మ. మముఁ గౌండిన్యసగోత్రసంభవుల సమ్మాన్యాహ్వలన్ శశ్వదు
త్తమకావ్యప్రకరప్రకల్పనకళాధౌరేయులన్ రాజస
త్తమనిత్యోదయకార్యవాంఛితుల సత్సాంగత్యశోభాఢ్యులం
బ్రమదాన్వీతులఁ బూర్వికాశ్రితులఁ బిల్వంబంచి ప్రేమంబునన్. 39

చ. కుశలమె మీకు బిడ్డలకుఁ గూరిమిఁ దప్పక మీర లుందురే?
పశువులు పాఁడిసేఁపెడినె? వన్యమృగంబులబాధ వాసెనే?

కుశలమె యూరివారలకుఁ గూపతటాకములందు నీరముల్
భృశముగ నున్నవే? తొలుత నిచ్చినక్షేత్రము పండుచున్నదే? 40

గీ. పూర్వముంబోలె సంతతంబును బురాణగోష్ఠి నుందురె? కావ్యముల్ గూర్చుచుండ్రె?
ఘనతరానుశ్రితకుటుంబగౌరవంబు, నడపుచుందురె మీర లందఱును వేడ్క? 41

క. అనిశంబును మీక్షేమము, వినుచుందును వారు వారు వినిపింపఁగ మీ
రును వచ్చిపోవుచుండం, జనుఁగాక! యటంచు నాప్రసంగవశమునన్. 42

ఉ. అచ్చనగారు లాఁడుతఱియందునఁ బ్రౌఢ మెలర్పఁ జెప్పె మీ
లచ్చన రామభద్రనిపలాస మపూర్వముగాఁగఁ దొల్లి; నా
మెచ్చుప్రబంధరాజ మది మేకొని నామదిఁ బాయకుండు నీ
వచ్చునుగాదె దానికి ధ్రువంబుగ నక్షరలక్ష లెమ్మెయిన్. 43

సీ. ఆంధ్రగీర్వాణము లభ్యసింపఁగలేము, సేవించి నేర్వ దేశికుఁడు లేఁడు
వ్యాకరణజ్ఞుల పరిచయంబు హుళక్కి, పండితస్నేహ మావంత లేదు
కవిజనపాళిసాంగత్యంబు పూజ్యంబు, ఛందోజ్ఞులప్రశంస స్వప్నవార్త
గ్రంథావలోకనగతియును నల్పంబు, సహపాఠులసహవాసంబు కల్ల

గీ. నయవిశారదుఁ డెన్న మనంబు వెన్న, వయసునకుఁ బిన్న కల్పనాప్రతిభ మిన్న
యమరఁ బదరాజిఁ గూర్పఁ బోతన్న కొత్త, పల్లిలచ్చన్న యతఁడు కేవలుఁడె తలఁప.

సీ. సభఁ బురాణముఁ జెప్పసాగినా రెండవ, సూతుఁ డీతం డనుచొప్పుఁ బొలిచి
రాజకీయరహస్యయోజనావిధుల యు, గంధరమంత్రిప్రఖ్యాతిఁ బడసి
మన్నించుప్రభువులమాట నొందలనిడు, పట్టి కేవలభటత్వంబుఁ జూపి
నీతిబోధనమును వెలిపుచో నసురచార్యుఁడె యీతఁ డనంగఁ దనరి

గీ. మానఘనుఁ డేయి మత్సన్నిధానమునను, చెలుతనాఁటను గొలె వసించినట్టి
లచ్చనార్యుని మఱవంగ వచ్చునెట్లు, కవివరుఁ డతండు రామనగన్న సుకృతి. 45

ఉ. ఆతనికల్పనావిభవ మాతనిమంజులశబ్దగుంభనం
బాతనిశైలిమాధురియు నాతనిసన్నియమప్రకీర్ణకం
బాతనియర్థగౌరవము నాతనిసాహితి యెన్నఁ బోలునే?
తాతకు వానితాతకు సతంబు ధరిత్రివహించుతాతకున్. 46

గీ. అరయఁ జెందుర్తి జన్మించి యంద పెరిఁగి, యన్య మెఱుఁగక నిజశక్తి నఖిలకళల
నెఱిఁగి జగములఁ బేరొందెఁ బెరటిచెట్టు, మందునకురా దటన్న సామ్యంబు దోఁప.

సీ. రామాయణగ్రంథరచనకు మున్నుగ, భాస్కరశతకంబు భాస్కరుండు
వ్రాసిన చందాన వ్రాసె సంయుక్తాక్షరప్రాసములను సూర్యశతకంబు

దాశరథిపరిబంధమునకుఁ దొలుత సూర్యోపాసకుండుగా నొప్పు మఱియు
నీతుల కిక్కయై నెగడు మత్కృతి గాఁగఁ, గల్పించె శతకమొక్కండు వేడ్క
గీ. ధన్యుఁ డాతఁడు జన్మసార్థకము గాఁగ, భగవదర్పిత మొనరించె భవ్యకృతిని
నాదికవిపథగామియు సాధువిదుఁడు, గామియు భ్రమింపఁజేసెను గాదె జగతి. 48
క. మతిఁదలఁప దివ్యుఁడొకఁడ డీగతి హేలాగతి జనించి కడచనె నన స
ద్గతిఁ జెందె లచ్చనకవి సుకృతిగతా నువనట్టు లేమన వచ్చున్. 49
క. పరలోకగతుం డగునా, పరమునిగ్రంథంబు జగదుపకరణముగ సా
దరవృత్తిం బ్రకటించుట, కర మనుయోగ్యంబుఁ గీర్తికారణ మెట్లున్. 50
మ. ఇది యెల్లప్పుడు నామనంబునఁ గడం బిష్టంబ యై యుండుఁ బా
యదు వో మత్సన్నయియ్యవృత్తికిని దోడై తద్ద ప్రేరేచెడుం
గద! ముద్రించుట మేలు సేత ధనమన్నం జెద్దయే మాకు న
మ్మద మిక్కార్య మటంచు మాకు నయి సమ్మానంబుతోఁ బల్కినన్. 51
గీ. తడవఁగా నెందు సత్సంతానములను, గృతిపరిశస్తము మఱియట్టికృతుల జగతిఁ
బ్రకటనము సేయు నాపుణ్యఫలవిశేష, మది యనంతము తలఁప మాయమ్మలార!
ఉ. మును పాకమంజువాణి యాశయుం గనఁగాఁ బ్రకటింపఁ బూనె ల
చ్చనకృత మైన దాశరథిసచ్చరితం బది సాగదయ్యె ల
క్ష్మినిఁ దనయుత్తఁ జెందమి ప్రసిద్ధము, కేవలలక్ష్మి నత్తఁజే
కొనె నిటు మంజువాణి యికఁ గోరిక లీరిక లెత్తుటబ్బిమే! 53

చంపమాలిక.

అగయఁ బ్రసిద్ధి కెక్కు దణులై నయపద్ధతి భూము లేలు భూ
వరులును రాజ్ఞులుం గలరు పల్వురు లోకములోన వారిలో
నరిది సువిద్యఁ బ్రోచెను మహత్తరు లందుఁ గవిత్వమాధురీ
పరిచితి గల్గువారు తడవం దడవ స్మృతి వేయికొక్కరుం
డునో యనుశంక, యట్లగుటఁ దోఁపదు సక్కవు లెందు డాఁగిరో
పరచనవృత్తి మాని తమవిద్య నెంచు నాఁడి ఘోరకాననాం
తరమునఁ గాయు వెన్నెల గదా యని యీయెడలన్ భవాదృశుల్
సరసత గారవించినఁ బ్రసన్నతఁ జూపి యశంబు రెట్టిగా
విరచితకావ్యులై చనుట వింతయె? తొల్లిటిగ్రంథకర్తలె
ప్పరుసున రాజమాన్యు లయి భవ్యకృతు ల్రచియించి మించిరో
యెఱుఁగనిదేమి? తజ్జ్ఞులు మహీపతు లెంచఁగ రావువారు శ్రీ

కరులును గ్రంథపోషకులు గాన వచింపఁగ వేయునేల? దా
శరథివిలాస మాదికవిసత్తమునట్లు రచించి దేవతా
పురి కరిగాం గవిప్రకరపూజ్యుఁడు లచ్చన పెక్కు లయ్యె వ
త్సరములు తత్ప్రబంధము ముదంబున ముద్రణ సేయ నెంచి యా
దరమున మా కనుజ్ఞ యిడఁ దద్దయు నాతనివార మాటచే
నపుడుగ లచ్చనార్యుఁ డనయంబు సజీవుఁడ యంచు నెంచి ని
ర్భరపరితోష మాత్మలఁ దిరంబయి నెక్కొన నున్నవార మీ
యుర వగుభాగ్య మెవ్వరికినుర్విలభించును? మీకుమీర యా
దురుగదసాటి యంచు నతితుష్టుల మై నుతియించి వేండియున్. 52

సీ. ధనలోపమునఁ బ్రకటనము సేయఁగ లేని, యాందోళనం బట్టె యడఁగిపోవ
నామూలమునఁ జూచి హర్షించుభాగ్యంబు, గలుగునే యని యాత్మఁ గలఁగకుండ
నే నాఁటివాఁడొ యీకృతికర్త యని తెలి,యఁగఁ గోరి కష్టంబు నందకుండ
నెన్నటికైన లచ్చన్న వ్రాసినకృతిఁ, గందుమే యని పొంపుకుందువోవ
గీ. మమ్ము బంధులఁ గాఁ బ్రియసఖులను, బాంధవావళి నానందవార్ధి ముంచి
యాశ్రితాదరణంబు నెయ్యముగ నించి, చూఱగొంటిరి, సద్యశస్సు నఖిలంబు. 53

సీ. మీమాట ధర్మసమీహితమై దుర్గ, నాట్టహాసమ్ముల నడచుఁగాత!
మీ వ్రాలు నిఖిలాశ్రిత వ్రాతవశముల్, తరతరంబుల దాఁకఁ దనుపుఁగాత!
మీయిల్లు తప్పక వేయింట్ల మొదలయి, బహుబాధవాదృతిఁ బడయుఁగాత!
మీకీర్తిలతికలు ప్రాఁకి దిక్కుడ్యమ్ము,లావలఁ గొనసాగి యలముఁగాత!
గీ. కృతయుగమ్మును చిఱపించి వితతధర్మ, పద్ధతిఁ బ్రజానురంజనపరత మించి
యాసుధాకరతారార్క మవని నేలు, చుండుదురుగాత! మీర లోహో యనంగ. 54

వ. అని ప్రస్తుతిసల్పి.

మ. సుజలాంతర్గతముఁ సుసస్యమును బ్రస్తుత్యర్హ మాహాత్మ్యమున్
బ్రజఁ బోషింపఁగ సాధనంబు లని తెల్పు న్నిందు శ్రీసింహాశై
లజసౌభాగ్యము నిల్వఁగాక! మనచెల్లమ్మయు రామాంబ సా
ర్వజనీనంబుగ నేలు రాజ్యమున నప్పన్నప్పు డుత్సాహియై. 55

శా. శ్రీమంతంబు ఫలప్రదంబు నగు శ్రీసింహాద్రిపై నిల్చు సు
శ్రీమంతుండు నభీష్టపత్సులను డా శ్రీనారసింహుండు వి
ద్యాహార్యుల రావు చెల్లమును రామయ్యమ్మ నెల్లప్పుడున్
బ్రేమం గాంచుత మత్తకోడలి నిత శ్రీమించ దీవించుచున్. 56

చ. బహుళతరరాజ్యవిస్తృతి శుభప్రదదీర్ఘతరాయువున్ మహా
మహిమయుఁ గీర్తి రావుకులమాన్యులు చెల్లయరామయాంబికల్
రహివహియింపఁగాఁ గరుణఁ బ్రీత్యహముం దలపోయుఁ గావుతన్
మహిపతి పద్మనాయకుఁడు మానుగ దత్త్వమువృద్ధి సేయుచున్. 57

ఉ. తామరకంటికిన్మగువ తామరకంటి వెడందడామరం
దా మనుబుట్టి తామరముదంపుఁగుమారునితల్లి యైనయ
త్తామరపేరితల్లి, విదితామరతామరసాక్షు లెల్లరున్
రా మనచెల్లమాంబకును రామమనం బొడనూపుఁగావుతన్! 58

మ. సమత స్వానకు నెండ కోర్చి బుధవిస్తారంబుఁ బోషింపఁగాఁ
దమిఁ జెందు స్త్రిని జియ్యకంబముకడం దా నిల్చియున్నట్టి య
య్యమపుత్రుం డగుబొజ్జదేవరయు నాయూ లేలురామాంబ న
య్యమయ త్తం దగఁ బ్రోచుఁగావుతను గార్యప్రాప్తి కాధారుఁడై. 59

క. రత్నము నురత్నగర్భను, రత్నాకరపుత్రిఁ బెన్నురంబున నిడునా
రత్నగిరిసత్యదైవత,రత్నము చెల్లాంబ రాజ్ఞి రామమఁ బ్రోచున్! 60

మ. కలలోనైనఁ దృణంబు ముద్దుగను నీఁగా నెంచి దాసాళి ద
వ్వులఁ మొక్కంగ నభీష్టదుం డయి కడుం బొల్పారి సన్నద్ధుఁడై
యలమేల్మంగనుఁ గూడి తిర్పతిని గుయ్యాలించు నవ్వేడికా
నులవెంకన్న కృపామతి న్సతముఁ బ్రోచుం జెల్లయమ్మన్ స్నుషన్. 61

మ. గరుడాద్రిన్ గృహగోధికావిలసదాకారంబుతో భక్తిత
త్పరతన్ వైష్ణవు లర్చన ల్సలుప మోదంబంది యెవ్వేళఁ దా
నురుభోగానుభవాప్తి నొప్పెసఁగు నయ్యుష్మాక శ్రీవేంకటే
శ్వరుఁ డత్యంతముఁ బ్రోచుఁ జెల్లయమ రాజారావురామయ్యయన్. 62

మ. అకలంకప్రతిభాభియోగ్యుఁ డయి ప్రత్యక్షుండుగా నిల్చి పా
పకత న్మించిన రావుచెల్లయమ నిష్టప్రాప్తి రక్షించుచున్
సకలేశుం డనుపేరఁ బీఠపురిసంస్థానమ్ముగా నున్న శ్రీ
సకలేశుం డిడుసర్వసంపదలు రాజారావురామాంబకున్.

శా. శ్రీరంజిల్లెడు తోఁటపల్లెయల గౌరీయుక్తుఁడై యొప్పి త
ద్ధారాపాతముదావహుం డగుట నిత్యంబంద కాంక్షైనిరా
కారుల్ కొండదొరల్ సతు ల్సలుపఁగాఁ గాపాడుమల్లేశ్వరుం
డారూఢస్థితి రావువారల కభీష్టార్థంబులం గూర్చుతన్!

వ. అని కృతజ్ఞతం దెలుపుకొనుచు నాశీర్వదించి.

గీ. శాస్త్రిలార! పండితులార! సత్కవీంద్రులార! సజ్జనులార! ధర్మాత్ములార!
యధిపులార! బంధువులార! యాప్తులార!, సకల సద్వర్ణులార! రసజ్ఞులార.

క. దేవతలను దాపసులను, దైవజ్ఞుల నమృతవాక్సుధావర్షుల స
ర్వావనిదేవుల యీమా, రావుకులాధిపులఁ బ్రోవఁ బ్రార్థింపుఁడొగిన్.

వ. అని లోకము ననారతము నారాధించుచున్నారము.

కొత్తపల్లి సూర్యరావు.
కొత్తపల్లి సుందరరామయ్య.
కొత్తపల్లి రామచంద్రమూర్తి.
కొత్తపల్లి సోమసుందరము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః.

# దాశరథివిలాసము.

## ప్రథమాశ్వాసము.



శ్రీమద్గైరికధాతువేష్టితము నై జీమూతసంవ్యాప్తమై
రామంబై తనరారువేంకటనగేంద్రంబు న్హరిదాశిరో
ద్దామంబై మృగనాభిలిప్తమగుపద్మాదేవివక్షోజ మం
చామోదించెడివేంకటేశ్వరుఁడు మమ్మాసక్తి రక్షించుతన్.

ఉ. మారుఁ గుమారుగాఁ గనినమాకినయే సతి పల్కఁగొమ్మ రో
వారిజహస్త నాయెదకువచ్చినదానవు నీవ యంచు శ్రీ
జారుఁడు హారకౌస్తుభముఁ జక్కఁ సమర్చనెపంబునం దదీ
యోరుకుచద్వయిం బుడుక నుబ్బెడు లచ్చి వసించు మాకడన్. 2

చ. శివుఁ డని యెల్లవారు నుతిసేయఁగ నుగ్రత నీకు ధర్మమా
రవిశశివహ్నిలోచన హరా యన శంకరి సర్వమంగళా
ప్రవిమలనామ్నివై తగునె భైరవిశాఁ జన నీకు నంచు న
న్నువిహితరాగుఁడై యుమఁ గనుంగొను శంభుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 3

చ. అనుపమబాహుశాఖల శిఖాభ్రిభవారసుమంబులం గన
ద్వనజవిరోధినిర్గత సుధారసపుష్పరసాతుమాలికా
ఘనఫలపఙ్క్తులం బోలుచు కామవిరోధిశరీరకల్పకం
బున నళిసంగతేద్ధలత వోలెఁ బెనంగొను గౌరిఁ గొల్చెదన్. 4

ఉ. నందకధారిపుత్రుఁడు సనందనముఖ్యులకెల్లఁ దండ్రి గో
నందననాయకస్తుతుఁ డనందగి యొప్పెడు మేటి నిర్మలా
నందమనన్యఁ డద్రి భవనందనవిక్రముఁడైన యాశతా
నందుఁ డొసంగుఁ గావుత ఘనంబుగ మాకుఁ జిరాయురున్నతుల్. 5

చ. వరచతురాస్య పుణ్యజనవర్ధన దీక్షితసత్యలోక మం
దిరమృదువాంసకస్ఫురిత దివ్యపదాబ్జప్రివాళహస్త వి
స్తరవిబుధాభినందితల సత్ప్రతిభారతిభారతీసమా
ఖ్యరహిఁ జెలంగు శారద దయామయత న్ననుఁ జూచుఁగావుతన్. 6

చ. అధిక మతి న్భజింతుఁ గలుషాభ్రమహాబలు నమ్మహాబలుం
గ్రిథనధరారివిక్రమహర న్మహితాంబరు నాహితాంబరు
న్విధివిహితస్తుతత్రిదివవేశ్మగణాధిపునాగణాధిపుం
బృథుభయదాంతరాయభుజగేంద్రవినాయకు నావినాయకున్. 7

చ. పటుతరహర్ష పాదప శుభస్థితిగాంచి ప్రపత్తిసత్ఫలో
త్కటరసమాని రాఘవకథాఘననిష్కుహవాసియై కడుం
జొటజొటఁదేనియల్గురియఁ బెంపున రామునిఁ బల్కుచున్న య
వ్వటుమణి నాంజనేయ శుకవర్యము నాత్మఁదలంచి మ్రొక్కెదన్.

సీ. చక్రంబు లెవనిచే సంతసంబుగ మను, నెవనిచేఁ జక్రంబు లేపుఁ జెందు
వసురాజు లెవనిచే నసమతేజము గాంతు, రెవనిచే వసురాజు లెసఁగుచుండ్రి
విబుధు లెవ్వాని సేవింతు రెవ్వానిసే,వింతురు విబుధులు విమలబుద్ధి
గగనధునీహంస గతిఁబొల్చు నెవ్వాఁడు, హంసాఖ్య నెవఁడు బ్రశంసనొందు
గీ. వరుణుఁ డెవ్వాని సారథి యైమెలంగు, నెవ్వఁ డిలనరుణాభిఖ్య నెలమినొందు
నట్టిశ్రీలోకబాంధవుఁ డనుదినంబుఁ, గృప మొలక లెత్త నన్ను రక్షించుఁగాత. 9

చ. వితతగుణాధినాథుఁ బృథివీమహితాధునికాసనాతన
స్తుతహితగాథు వేష్టిత విశుద్ధమనోమునియూథుసంతతే
ధితఖలతావిరోధు గురుదివ్యవినిర్మలబోధు సాధు న
న్నతకరుణాసనాథుఁ గురునాథు భజింతు నభీష్టసిద్ధికిన్. 10

సీ. వరుసఁ బ్రహ్లాదాది పరమ భాగవతుల, వ్యాసవాల్మీకాది వరమునులఁ
గౌతమీగంగాది ఘనపుణ్య నదులను, భూమ్యాది పటు పంచభూతములను
గరుడాదిహరిపార్శ్వ చరులఁ గుమారాది, కైలాసపర్వతాగ్ర చరుల
ద్వాదశాదిత్యుల వసువుల నెనమండ్రి, గ్రహముల నుత్తమ బ్రాహ్మణులను
గీ. నమరనాయకపావకాద్యష్టదిక్పతు,లనరుంధతి మొదలైన పుణ్యసతులఁ
బోతనను నన్నయాదిక పూర్వకవుల, మఱియుఁ దక్కిన పుణ్యుల మదిభజింతు.

గీ. అజ్ఞులగు దుష్టకవుల నేలాహసింప,బ్రాజ్ఞులగు సత్కవుల నేల ప్రస్తుతింప
దుష్టులని వారి దూషింప దుష్టుఁడయగు, బ్రస్తుతికి సంతసింపరు ప్రబలకవులు. 12

క. కృతినుతుని వేంకటేశునిఁ, గృతినాథునిఁ గానొనర్చి కృపవుట్టునమీ
స్కృతి గావించెద మఱి సత్కృతియింతటికన్నఁ గలదె యెన్నివిధములన్. 13

క. అనిమన్మనోభీష్టమహాభీష్టదిష్టపరిప్రార్థనంబును సత్సంభావనంబును
సంక్షేపరూపంబుగా నడప యస్మద్వంశానకీర్తనంబు గావించెద.

## వంశావళి.

క. ధన్యుఁడు వినమితముని మూర్ధన్యుఁడు సంశ్రితకళావదాన్యుఁ డఖిలస
న్మాన్యుఁడు సౌజన్యుఁడు కౌండిన్యుఁడు వెలయుం దపఃపటిమ నధికుం డై. 1

గీ. అన్నియమిగోత్రరత్నాకరాబ్జుఁ డగుచు, వేదవేదాంతవిద్యాప్రవీణుఁ డగుచు
గోత్రి నెంతయుఁ బొగడొందెఁ గొత్తపల్లి, నారసింహమనీషిమాన్యమతపోషి. 2

క. నరసింహత్వము భక్త్యాదరణత్వముఁ గలిగి యెట్లు తా నెన యగు న
న్నరసింహుఁడు విబుధాదరణగహితుఁ డై కొత్తపల్లి నరసింహునకున్. 3

క. అయ్యన నలుమొగములుగలజియ్యనదల్పుఁ దొలిచదువుచే ననఁ దగువాఁ
డొయ్యనమైలవరపుభోగయ్య నెనరుఁగూఁతుఁ బెండ్లియై తగువేడ్కన్. 4

ఉ. శక్తి పరాశరుం గనినచాడ్పున వెంకమయందుఁ గాంచె వి
ధ్యుక్తవిధానధుర్యుని విషోరగబంధనమంత్రతంత్రసం
యుక్తనుచర్యునిన్ హిమనగోపమధైర్యుని భూరిసూరి సం
సక్తసభాసభావితయశస్థగితాశుని వేంకటేశునిన్. 5

ఉ. కన్నకుమారకోటి నతిగౌరవ మొప్పఁగ నాదరించుఁ దాఁ
గన్నకుమారు లట్లు కడకన్ సరిసేయఁగవచ్చు గంగ ముం
గన్నకుమారుమారు నవకంబున మీఱును గొత్తపల్లివెం
కన్నకుమారులే రని మహామహు లెన్నఁ బ్రసిద్ధి నొందుచున్. 6

సీ. ఒకముఖంబున నేర్చె నో నాల్గువేదంబు, లని బ్రహ్మఁ గా దను నాగమోక్త
వేదాంతయుక్తులు విని నేర్చికొన్నవాఁ, డని శుకు మెచ్చఁ డధ్యాత్మవిద్య
ధర్మశాస్త్రంబు లర్థం బెఱుంగఁడు వ్యాసుఁ, డని ప్రహసించు స్మృత్యధిగమమునఁ
దనవారి కుపదేశ మొనరించెనా యని, ప్రహ్లాదు నవ్వు శ్రీపతిసుభక్తిఁ
గీ. దనయెదుట నురువటుము దగ్ధంబొనర్చెఁ, దత్కుం డని కశ్యపుఁ దఱిమి పల్కు
సర్పముఖవిషమంత్రప్రశక్తియుక్తి, నతఁడు గేవలుఁడే వెంకనాఖ్యసూరి. 7

సీ. అతిథి యై మాయింటి కరుదేరఁ జాలదే, యీతండు పాపంబు లింకిపోవఁ
జెలఁగి మాయూర వసించినఁ జాలదే, యీతండు మిగులఁ బ్రఖ్యాతిగాఁగ
నీతండు మాకుఁ జన్విచ్చినఁ జాలదే, సకలశాస్త్రార్థము ల్సంగ్రహింప
వేడుక నొక్కమా టాడినఁ జాలదే, మాతోడ నితఁడు జన్మఫలముగ
గీ. ననుచు నూరిజనుల్ దను వినుతిసేయ, వసుధఁ గీర్తి వహించె నద్వైతతోషి
యమలభాషి యరోషి దయావిభూషి, ఘననిగమపరవేషి వేంకనమనీషి. 8

ఉ. ఆతఁడు మొక్కరాలవిమలాన్వయదుగ్ధపయోధిచంద్రుఁ డా
నీతఁ డనంగ సంస్తుతి వహించిన యర్కయ పెద్దకూఁతు వి
ఖ్యాతచరిత్రి ధర్మనిభగాత్రి లసచ్ఛతపత్త్రనేత్రి నం
జాతరుణీపవిత్రి సతిపాత్రిను బ్రహ్మమగోత్రిఁ బెండ్లి యై. 9

ఆ. అనఘశీల సాధ్వి యైన తత్సతియందుఁ, గాంచె రామగోత్రుఁ గలితగాత్రు
ననఘమిత్రుఁ బాత్రు నమితదోషలతాల,విత్రు నుభయకులపవిత్రుఁ బుత్త్రు. 10

క. ఆరాముఁడు పితృభక్తికి, నారాముఁడు జూచువారి కా రాముఁడు నా
త్మారాముఁడు గుణనికరపి, కారాముఁడు విప్రమాత్రుఁడా తలపోయఁగన్. 11

సీ. అనఘవర్తన రామునట్టివాఁ డోఁ గదా, యచలసంధాప్రౌఢి నట్టివాఁడ
య్యాచారమున భీష్మునట్టివాఁ డోఁ గదా, యమితశాంతిస్ఫూర్తి నట్టివాఁడ
య్యాడితప్పమిఁ బలియట్టివాఁ డోఁ గదా, యౌదార్యశీలత నట్టివాఁడ
హరిభక్తిఁ బ్రహ్లాదు నట్టివాఁ డోఁ గదా, యఖిలసమానత నట్టివాఁడ
గీ. యనుచుఁ బొగడొందె ఖరదూషణాపహృతిని, మహి భరతలక్ష్మణాగ్రజన్మత్వమునను
వాసిమీఱినశివధర్మవర్ధనమున, రామనామంబుఁ దనకు సార్థక మొనర్చె. 12

సీ. ఒరులలేమికిఁ జింత నొందు నింతియు కాని, కలవారిసిరికి వెక్కసము లేదు
ఆత్మసంస్తుతి కలనైన సేయఁడు గదా, పరనింద వినుట కొప్పఁడు మనమున
లవమిచ్చిరేని మేరువుగాఁగ భావించు, నీయనివారిపై నీర్ష్య లేదు
అధికదుష్కర్ముని యందైన సుగుణంబు, నైకంబు గని వాని సంస్తుతించు
గీ. నాప్రతిగ్రహరాహిత్య మానిగర్వ, మాప్రమోదనిమగ్నత యాప్రశాంత
మానిభృతి రామనసుకృతి యందకాక, తిరిగి చూచిన మఱి కలదే పరులకు. 13

ఉ. తా నమరేంద్రసుస్థిరపదంబు వహింపఁగ రవుసూర్యరా
జ్ఞానవసాధకాళిమణి మానక కోరి యొసంగిన న్సమా
ధానము నాగమోదితవిధానముఁ గాంచనసస్యగర్భభూ
దానము రామనార్యుఁడు ముదంబున గాంచె నయోచితంబుగన్. 14

వ. ఏవంవిధమహానుగుణగరిష్ఠుం డగునమ్మహీసురశ్రేష్ఠుండు. 15

ఆ. పరమపావనుండు బ్రాహ్మణప్రవరుండు, నమలవిష్ణువర్ధులాన్వయుండు
ఘనవిహారి గతవికారి సుబ్రహ్మణ్య,సూరివరకుమారి శుభముగోరి. 16

క. అంబికకు సాటి యగుసు,బ్బాంబిక ధర్మవిధిఁ బెండ్లి యై నిజదాంప
త్యం బభివర్ణించెదు సుజనంబులఁ గని పొంగు రామనమనీషి కడున్. 17

సీ. కన్నతండ్రికిఁ గీడుగ మెలంగ కుండిన, దాక్షాయణీదేవి తనకు సాటి
యత్తమామల సపర్యల దాయొనర్చిన, జనకభూపతిసుత తనకు సాటి
ప్రజలభరింపనోపక బ్రహ్మతోనైన, వినిపింపకున్న నుర్వి తనసాటి
తాఁగట్టిదనుచు నందఱినోళ్ళఁబడకున్న, ననఘాత్మ శారద తనకుసాటి
గీ. కాని వెఱవారు తనసాటి గానివారు, గాపురంధ్రిజనవినుతి ఘనతఁ గాంచె
నమలతరకీర్తి దీన దయాప్రవృత్తి, దుర్మతి సపత్ని రామనధర్మపత్ని. 18
క. అలుకయను పేర యెఱుఁగదు, కలహముఁ గొండియముపీసుఁ గఠిన వచనము
ల్కలనైన నెఱుంగదు తత్కుల సతి సుబ్బాంబకీడె క్షోణిసురసతుల్. 19
సీ. ప్రొద్దునలేచి యిప్పుణ్యాత్మురాలి మొగంబుఁ జూచినఁజాలుఁ గలుష మడఁగ
నీసాధ్వియాత్రల నెదురైనఁ జాలును, సర్వకార్యంబులు సఫలతగన
బతిమాలికొనియైనఁ బనుపింత యీ కాంత, కిడినచోఁ జాలుజక్కనులు దనియ
నీయమ్మనుపూజియించినఁ జాలుస,మగ్రసౌభాగ్యసంపద వహింప
గీ. వేడ్కనీసతిగుణములు విన్నఁజాలు, వసుమతిఁ బతివ్రతలలోన వన్నెగొనఁగ
నని సమస్తజనంబుల వినుతిఁ గాంచె, సుగుణ మృదువచనకదంబ సుబ్బమాంబ. 20
గీ. పతిహితంబు తనకుఁ బరమ వ్రతంబును, బతియనంబు తనకు బహు ధనంబు
కాని వేఱ సొమ్ముఁ గలిత వ్రతంబును, లేదుసుబ్బమకును లేశమయిన. 21
గీ. అట్టిదగు సుబ్బమపురంధ్రి యందు రామ, నావనీసురకులముఖ్యుఁ డష్టపుత్త్రి
బహుధనంబన్న యట్టులఁ బడసె వసుస, ధృతులఁ బుత్త్రుల నెనమండ్రి సిద్ధయశుల.
క. అందఱు సర్వజనప్రియు, లందఱు సుందరులు సాధులందఱు మతివా
రందఱు సత్యవచను ల,య్యందఱు దృఢమతులు వారి కందరు వేల్పుల్. 23
క. వీరికిఁ దోఁబుట్టువులై, నారీమౌళిమణులైన వరసమయుఁ బురం
ధ్రీరత్నము బ్రహ్మమయును, జానుమతీ సుమతులనఁ బ్రశస్తిఁ గనిరిలన్. 24
వ. అట్టివిశాలయశస్సంతానపరిష్కృతదిశాదశకంబగు రామన సంతానదశకంబునకు నగ్ర
జుండై. 25
క. ఘనవిద్యాయోగమహి, తనయాంచితపాలనామదంబు శిర ధ
ర్మనిరూఢి నెల్ల గుణముల, జనకుని గతి గంగన కృతి జగతినుతిఁ గనున్. 26
సీ. అష్టాదశపురాణ తుష్టిసూతుఁడు సాటి, క్రోధశాంతికిఁ గుశికుండు సాటి
యతిథిపూజారతి నలముద్గలుఁడు సాటి, నిండుమతికిఁ గుచేలుండు సాటి
యద్వైతమతసిద్ధి కవనివ్యాసుఁడు సాటి, పటుజోస్యమున నార్యభటుఁడు సాటి
మృదువచోరచనకు విదురుండు దన సాటి, గురుమనీషాస్ఫూర్తి గురుఁడు సాటి

గీ. శ్రుతిహితాచారమునఁ బ్రియుండు సాటి, శాస్త్రధర్మములకుఁ బరాశరుఁడు సాటి
గాని పెఱవారుదన సాటి గారనంగ, నలరు హితవేషి గంగనాహ్వయ మనీషి. 27

క. సోదరులు పుత్త్రులన్యు, ల్సోదరులు సహోదరులు సహోదరులు సుత
ల్సాదరము మేదురంబనఁ, గాఁదర మేయిట్టిడనుచు గంగన సుకృతిన్. 28

వ. తత్సహోదరుండై. 29

సీ. తన పితృభక్తి సంధార్యాఢ్యభార్గవ, రాము నామోదవా రాశిఁ బైవఁ
దన విలేఖన విచిత్రము చిత్రగుప్తున, కత్యంత విస్మయం బావహింపఁ
దన సూనృతోక్తి సంతానమ జాతశ,త్రుపురుమోద వర్ధనముఁ గూర్పఁ
దన సౌకుమార్యభా వనభావజన్మున, కతనుత్వ సంతోష మాచరింపఁ
గీ. బ్రబలె వైదిక లౌకిక ప్రతతి వినుతి, బాంధవాదృత నిపుణత పాతవిహృతి
ననఘ మతి ఘననియతి సత్యగతినిరతి, నతిసుకృతి దుష్టనికృతి వెంకన్న సుకృతి. 30

వ. తత్సహజన్ముండై. 31

చ. సముచిత వాదిసర్వజన సమ్మతచారు వినోదిమద్దల
ప్రముఖ సువాద్యమోది హరిభక్తికి నాదిపరప్రమోది సం
శమితనిజాగ్రజానుజ విషాదిజ నేంగిత వేదిపీత భే
దిమధుర వాది సుబ్బన సుధీనగ భేది కడు న్విరాజిలున్. 32

వ. అతని తమ్ముండై. 33

క. రామానుజన్ముఁ డసుమి, త్రామోదక వృత్తి నగ్రజానుజ భక్తి
ప్రేమాధిక తన నంతక, ధీమతి లక్ష్మణుఁడ యనఁగ లచ్చన తనరున్. 34

వ. తదనుజుండై. 35

సీ. అన్నల కొకయెడు గైన దాఁటఁడు తమ్ము, లను గన్నులను గప్పికొనెను నీతఁ
డేసీమలోనియే యే కార్యములనైన, దృష్టిమాత్రమున గ్రహించు నితఁడు
చింత చే మునిఁగి కృశించువారల నైన, మృదువచోగతినగియించు నితఁడు
భూతబేతాళప్రభూతపన్నగ దుష్ట, మృగవృశ్చికవిభీతి నెఱుఁగఁ డితఁడు
గీ. సకల జనులకుఁ బరమహర్ష నిధి యితఁడు, ముఖ్య వేదాంతచర్యకు మూల మితఁడ
నల్ప చిత్రకళాపరి కల్పుఁ డితఁడ, నంగ నర్కున వెలుఁగొందు నవనియందు. 36

వ. తత్సోదరుండై. 37

సీ. పుష్కరాక్షవిహీనముఁ బొరయకుండినఁ, దగు నలభద్ర కౌంతతుల వచ్చుఁ
బెఱయూరఁ గోపత బిట్టుగిడ్వడ కున్న, మాద్రితోల్చాలింత మాద్రి వచ్చు

వనవాసనియతివివర్ణి గానుండిన, సువసంతుఁ డొక డంత నవతువచ్చు
నిజపాదపరిచారికానుజ నింప నుండినఁ, గమలవైరిరవంత సమము వచ్చుఁ
గీ. గాని త్ర్యంబకు చేతను గరిమ జెడిన, పంచసాయకుఁ డెబ్భంగిఁ బ్రతిమవచ్చు
ధరణిశుభలక్షణాంగక స్ఫురణ నితని, కనఁగ శ్రీసూర్యరావు పుణ్యనిధి వెలయు.
క. కడుభక్తిరతుఁడు సుజనను, తుఁడు బహుభాషారతుఁడు హితుఁడు మహితుఁడు శాం
తుఁడు సూనృతవ్రతుఁడు నియ, తుఁడు నాఁగను సూర్యరావు స్తుతచరితుఁ డురున్.
వ. తదనుజన్ముం డై. 40
శా. కామక్రోధవికారహారిలలితాంగశ్రీసమంచత్ప్రభా
కామక్రోధవికారకారి మృదువాక్యస్వైరిసత్సర్వభా
షాముద్రాక్షర గుంభనాపటిమ భాషామానినీ హారియా
శ్రీమత్సుందరసూరిసూరిపరిషత్సేవ్యుండు బొల్చుంగడున్. 41
వ. అతని తోఁడంబుట్టువై. 42
ఉ. ఆనయము న్నయంబు వినయంబు మితప్రియవాక్యయుక్తి వి
జ్ఞానము సూక్ష్మబుద్ధి సదసత్పరిభావనవిష్ణుభక్తి సం
ధానముఁ జారుగానము విధానము నీక్రియ నెట్టివారికిం
గానము వేంకటేశ్వరుఁడ గణ్యుఁడు నాఁబొగడొందు నెంతయున్. 43
సీ. ఏతల్లి గన్నదో యీసుకుమారుల, నని చూచువారు ప్రత్యభినుతింప
నాయమ్మ సంతాన మందఱు నందఱె, యని సర్వజనములు వినుతి సేయఁ
గన్నవారలు నోఁచి కొన్న నోముఫలంబు, వశమె వర్ణింప నెవ్వరికి ననఁగఁ
దండ్రి యట్టులఁ గాక తనయుల వృత్తి వే, ఱొందు నేయని బంధుబృంద మలర
గీ. వీరలెదిరిని మదికందనీరనంగ, వీరుకలనైనఁ గల్లలు వినరనంగ
వీరు మనవలదే పదివేలకనఁగ, వలరుదురు జిగిమరులు రామవకొమరులు. 44
సీ. బీదల ననదల సాదుల రోగుల, గనుగొన్న యంతన కనికరింతు
రట్లు ప్రేమించి తారమ్మడు వడిమైన, నర్థవ్యయ మొనర్చి యాదరింతు
రౌశరుగాననివ్యయం బొకరు సేయరు చేసి, రేని యదేమని యెన్నఁడడుగ
రడుగకున్నను దాఁప కంతయు వినిపింతు, రట్లు చెప్పిన విని హర్షులగుదు
గీ. రహహ యీసోదరుల ప్రసాదాభిముఖ్య, మర్థవాంఛావిరాహిత్య మైకమత్య
మమిత సజ్జనసాంగత్య మధిక సత్య, మరయ పాండుతనూజుల కైనఁ గలదె. 45
క. మాయూరికి రావలదే, మాయింట వసింపవలదె మముఁ గనవలదే
మారొద్దఁ బలుకవలదే, యీయన్నలుఁ దమ్ములనని యెంతురు జనముల్. 46

వ. అట్టి మహామహనీయాభివర్ణనీయసుగుణసంతానంబును, సంశ్రిత దీనసంతానసంతా
నంబునగు రామన పుణ్యసంతానంబునం జతుర్ధపుత్త్రిండనగు నేను. 47

గీ. పరమభక్తిని దుష్కరప్రాసకంద, సూర్యశతకంబు విరచించి సూర్యదేవ
తాశిరోమణి కర్పించి తద్దయావి, శేషమాధుర్యకసుధాప్రసిద్ధి మఱియు. 48

## షష్ఠ్యంతములు.

క. వ్యాసాదిముని మనోజ్ఞా, వాసునకుం దాసలోకవాంఛితఘటనో
ల్లాసునకున్ దుష్టజన, త్రాసునకుం బృథుమనోహరవిలాసునకున్. 1

క. అక్షిగతరాక్షసోత్కర, శిక్షునక సద్వృత్తునకుఁ బ్రసిద్ధతితిక్షా
పేక్షునకు దక్షునకుఁ బ, ద్మాక్షునకు న్వేంకటాచలాధ్యక్షునకున్. 2

క. చిత్రచరిత్రునకు జగ, న్మిత్రోత్పలమిత్రనుహిత నేత్రునకసద్
గాత్రునకుఁ బవిత్రునక రి, జైత్రునకు న్భక్తపికలసచ్చైత్రునకున్. 3

క. శీలునకున్ జలధిసుతా, లోలునకుం దుష్టధీవిలోలునకుఁ బ్రభా
జాలునకు న్నుతలోచన, ఫాలునకు న్సర్వలోకపరిపాలునకున్. 4

ఉ. హారికిరీటచారుమణిహారికి సన్నవహారికిల్బిషా
హారికి దుష్టసర్పఫణిహారికి నాశ్రితపూరుషప్రతీ
హారికి వేంకటాచలవిహారికి వార్ధిసుతాసతీమనో
హారికి భక్తదోషపరిహారికి నాస్యసరోరుహారికిన్. 5

వ. పరిసమర్పణంబుగా నా రచింప దొరకొనిన దాశరథివిలాసంబను మహాప్రబంధంబు
నకుఁ గథాప్రారంభం బెట్టి దనిన. 6

ఆ. వెలయునజునికరుణవిమలరామకథాప్ర, పంచ మెల్లఁ గానఁబడిన వేడ్కఁ
బ్రచురభంగిఁ జెప్పఁబ్రాచేతసుండు శు, భక్రమంబుగా నుపక్రమించి. 7



## కథాప్రారంభము.



## అయోధ్యానగరవర్ణనము.

శా. సాకేతాహ్వయరాజధాని జనతాసంస్తుత్యమై నిష్కుటా
నేకానోకహసత్ఫలామృతరసాపేక్షాధికీభూతచే
తఃకాతూహలతాసమాగతపతద్రాజ్యారవప్రచ్ఛలా
స్తోకాభిష్టుతదేవతానికరమై శోభిల్లు భూభూషమై.

గీ. గురువిబుధరాజనందనభరిత మగుట, శుభ్రితునగాభ్రమాతంగశోభి తయగుట
విమలభాసురవాహినీభి త్తి యగుట, నరయఁగ ధరామరావతియగు నయోధ్య. 2

గీ. చంపకోత్పలమాలికాసహిత మగుచు, వాట మగు నాటవెలఁదుల తేటగీత
ములమహోత్సాహమత్తేభముల నయోధ్య, కృతియుఁ బోలెమనోహరాకృతిఁదనర్చు.

మ. తలపం దత్పురరాజసౌధములు ప్రోద్యత్పర్వతోత్సేధము
ల్జలజాతాప్తపథావరోధములు గోసంబాధము ల్సాంతతా
కలితానర్ఘమణీసనాథములు సగ్రపిస్ఫుటాలేఖితా
ఖిలగంగావరరోధము ల్వ్రతబృహత్క్షేమోదకా గాధముల్. 4

ఉ. అప్పురసౌధమండలరు నబ్జముఖీముఖసౌష్ఠవప్రభం
దప్పక కాంచి లేనెల ముదంబున సామ్యము నొందఁగోరి సాం
పొప్పఁగ నంత షోడశకళోజ్జ్వలుఁడయ్యును దన్ముఖప్రభం
జొప్పడలేక సిగ్గునఁ గృశుండగుచుండుఁ గ్రమక్రమంబునన్. 5

క. సగరుల తాతలచేతఁ బో, సఁగి యొనుచేపడక భంగసంగతిలేమిం
దగుపరిఘఁబోల్పవచ్చునె, యగస్త్యుచేపడి సభంగ మగు సాగరమున్. 6

మ. సరియౌనిప్పురి వియ్యమందెద భవిష్యత్కాలమందంచును
ర్వరతచ్ఛోభనవీక్షణోల్లసితయై రానమ్మహాదేవిసం
భరియింపంగులపర్వతాళి దిగిభవ్రాతంబు రాఁబోలుఁగా
కరదంబు ల్ద్విరదంబు లేపురమునం దారీతిఁ గన్పట్టెనున్. 7

వ. మఱియును.

మ. వరదంతద్యుతివిద్యుతి ప్రచయము ల్భాంకారగర్జాధ్వని
స్ఫురితంబు ల్నిరతస్రవన్మదజలంబు ల్పర్వతోత్తుంగసుం
దరనీలద్యుతిసద్గతిప్రకరవిస్తారంబునం బోల్చి సిం
ధురసంతానము లభ్రముల్దలఁచి సంతోషింపఁ గానప్పురిన్. 8

సీ. అవిదితవిగ్రహులై బయల్జరియించు, వానివాహ్యములజవం బ దెంత
జడధిలోఁ బ్రభవించి స్వర్గమందచరించు, హరిహయుహయుసద్రయం బ దెంత
ఘనతఁగాంచియుజని చనిహీనతవహించు, జలదావిలంబిత చర్య యెంత
చతుశ్రవోసవ్యాచారి యై మీఱు న, నూరుతమ్ముని త్వరా నూన మెంత

గీ. యనుచు రణవిదితులకు వాహ్యంబులగుచు, జడతవుట్టక దళదిశల్సంచరించు
చునగడుంజని హీనతఁ గనక కనఁగ, వినఁగ యోగ్యతఁ గొఱలున వీట్టివారుల్లు.

క. పరుఁ డయ్యెనేని నీలాంబరుఁడైన న్విజితభూమిపసుతారాడం
బరుఁడైనం గడిమిదిగంబరుఁడైనం జెనకుదురు సుభటులావీటన్.

క. చతురాస్యులు వాగీశులు, నతిశయపద్మాసనాదికాసక్తులు భూ
స్థితికాధారులు సత్యాశ్రితులప్పురి విప్రుల విరించిసమానుల్.

చ. మహితలలాటలోచనులు మారజితాత్ములు సర్వమంగళా
వహులు శివాంకులు న్నవనవర్ధనులున్ ఘనపుష్పధారులు
న్విహితమహాభ్రకేశులును భీములుఁ గాంచనశైలధర్ములై
రహివిహరింతు రప్పురవరంబున నెంతయు రాజశేఖరుల్.

మ. తలఁపం దొమ్మిదిపెన్నిధుల్ గలిగి మిత్రక్షుద్రిత న్మాన్ప లేఁ
డల యక్షేశుఁడు చూడ నజ్జడధినాసాంచన్నిధిహాప్రుఁడై
హాలుపుం జెందియు నప్పలంగలఁగడుం బోయంచు నవ్వీటివై
శ్యులు హాసింతురు లెక్కలేనినిధులన్ శుంభద్గుణోజ్జృంభతన్.

క. భద్రులు నిరతాహాస్త, క్షుద్రులు భూదేవనికర శుభశుశ్రూషా
న్నిద్రులు నిరుపద్రులు ధైర్యాద్రులు నత్తగుణసముద్రులప్పురిశూద్రుల్.

సీ. రంభ మత్ప్రబలోరు రామణీయత గాంచి, మోడినిస్వాగత నొందవలదె
శశిరేఖ మన్ముఖసౌకుమార్యముఁ గాంచి, కృశతనాఁటికి నివురవలదె
హేమాభిధానమ దాశ్రిమాంగరుచిఁ గాంచి, నిశ్చేష్టయగుచు వహ్నిఁ జొరవలె
హారిణీసమాఖ్యమ దాలోకనములు గన్గొనిచిక్కి కసవేటి తినఁగవలదె

గీ. యమరసౌదామనిమదీయమైన సోయగంబుఁగని డాఁగి చలనంబు గాంచవలదె
యనుచు విహరింతు రప్పురి నతిచలితసు, ధీజనములగు వారనారీజనములు.

సీ. ననఁబోణి వినుమెత్తుకొనఁగ వాక్ట్వంబు, ద్రవిణసంపత్తియుం దట్టికి మూల
మలివేణి వలపులు సిలికెదు నీకొమ్మ, తనుమధ్యసుమనసత్త్వంబు కలిమి
రమణిగన్గొనఁగ వాకుముదంబు దనరారెఁ, గరమను రాగంబు గాఁగఁ గొనుము
పున్నాగములనేల పొఁడవు మృదువాణి, యేట్రికిఁ బొగడరం జిల్లుచుండె

గీ. నాలి కుచగుచ్ఛములనేల యంటనీయు, వేలయంటెదు చౌకగా నీవనంగ
ననుచు నర్మోక్తులాడుచు ననుపుకాండ్రుఁ, బువ్వులమ్మ రమణులు నప్పురిఁ బొలుత

గీ. ఉరురతిశ్రాంతపౌర పయోజముఖుల, చెమటలార్పంగఁ బోయివచ్చెడు కతమునఁ
గరువలి తదంగపరిమళకలితుఁడగుట, గంధవహుఁడయ్యె దొల్లి నిర్గంధుఁడయ

వ. మఱియు వసంతకల్యాణంబై భోగవతీపురంబును, ద్విజరాజమనోహరంబై హరజ
జూటంబును, శారదారామంబై సత్యలోకంబును, శైత్యకరంబై చంద్రమండ

బును, రాజకుమారాగ్రేసరంబై కైలాసంబును, సుధర్మాన్వితంబై నాకలోకంబును, బద్మానుకూలంబై కమలాకరంబును, గమలాకరంబై విష్ణువక్షఃస్థలంబునుం బోలి, పుణ్యజనసుప్రవేశంబయ్యును బుణ్యజనసుప్రవేశంబు గాక, అనవరతదానధారార్ద్రంబయ్యును ననవరతదానధారార్ద్రంబై యొప్పు నన్నగరీవరంబు నందు. 19

శా. ఆదిన్ మిత్రచరిత్రుఁడై జనుల కత్యానందసంధాత యై
యాదిత్యప్రభువైభవోజ్జ్వలుఁడు నై యాదిత్యవంశోత్తముం
డై దిత్యాత్మజవారఘోరతరబాహావీర్యుఁడై భూమి దే
వాదిస్తుత్యవిలాసుఁడై దశరథక్ష్మాధీశుఁడే పాలుచున్. 20

సీ. ఇనగోత్రవరుఁ డీతఁ డని వచింపఁగ నేల, ప్రబలప్రతాపవైభవము తెలుపుఁ
దగుసార్వభౌముఁ డీతఁ డని యాడఁగ నేల, దానకంకణసుహస్తంబు తెలుపుఁ
దనరుమహాబలుం డని చెప్పఁగా నేల, హరికృతనిరతసఖ్యంబు తెలుపు
రాజశేఖరుఁ డంచు రహిఁ నుతింపఁగ నేల, ద్విజరాజసుమనసస్థితియు తెలుపు
గీ. నితఁడు కువలయహితుఁ డని యెన్న నేఁ, డంబుమీఱు కరగ్రహణంబు తెలుపు
ననఁగ నొప్పె సఁగఁ బలాయితాఖిలారి, పఙ్క్తిరథుఁ డగుచున్న యప్రతిరథుఁడు.

గీ. నిక్కముగ దస్యునిచయంబు నుక్కడంచి, నిక్కముగ దస్యునిచయంబు నుక్కడంచు
వేడ్క విబుధులపూజగావించిమతియు, వేడ్క విబుధులఁ బూజగావించునతఁడు.

క. క్షుద్రుఁడు లేఁ డొకఁడైనన్, క్షుద్రుఁడు లేఁ డొక్కఁడైనఁ జూడం జూడన్
క్షుద్రుఁడు లేఁ డొకఁడైనన్, భద్రంబుగ నాతఁ డేలు పట్టణ మందున్. 23

ఉ. ధారణి లోక మెల్లఁ బ్రమదస్థితిఁ దన్గొని యాడ నీతి బా
ధారహితత్వ మొందియునుఁ దప్పవువో యతివృష్టి లెందు నా
ధారములేమి శత్రు వసుధావరమానవతీక్షణంబునం
ధారలుగట్టియు ద్దశరథక్షితినాయకు రాజ్యసంపదన్. 24

క. ఎంతయు సంతసమున మతి, మంతులు గొనియాడ నంశుమంతుని ప్రభ సా
మంతశిరోంతలతాంతని, తాంతమహోజ్జ్వలలస త్ప్రకాంతికుఁ డగుచున్. 25

చ. రమణవివాహమయ్యె రుచిరప్రభఁ గోసలరాజకన్యను
గ్రమహిషిఁ గా నరేంద్రుఁడు కరగ్రహణం బొనరించెఁ దాఁ గ్రమ
క్రమమునఁ గేకయాత్మజ నగణ్యచరిత్ర సుమిత్ర నుం బరా
క్రమవిధి యై యరాతులనఁగ న్వినఁగం బడ కుండఁ గందగన్. 26

వ. ఇట్లు కౌసల్యాకైకాసుమిత్రలం బాణిగ్రహణం బొనరించి. 27

క. తద్దయు వేడుక మువ్వురు, ముద్దియలం గూడి భోగములు సల్పుచు నొం
డెద్దియును మఱచియుండం, బెద్దయుఁ గాలంబు చనెను మితమాత్రంబై. 28

గీ. ఈతి రహితంబు గాఁగ నీ రీతి సంత, తక్షమాన్వితుఁడై నిరతక్షమాను
పాలనంబున శత్రు విఘాలనమున, నొప్పిని సంతతికిఁ గడు నొప్పి గదుర. 29

క. సంతానము పితృవరులకు, సంతానము గాన నాకు సంతానము లే
దెంతయుఁ బితృదేవులకున్, సంతోషము సేయలేని జన్మంబేలా. 30

ఉ. దానము లెన్ని యేనియును ధర్మములుం దగునట్లు సల్పితిం
దానమదంబు లేదు విహితంబగు భోగము లెన్ని యేని సం
తానసుఖంబు వోలు నెఘనంబుగ నాకుఁ దదాప్తికిం బ్రసం
తానసమార్చనాంచితవిధానముచే నగునంచు నెంచుచున్. 31

క. వెస నూహించి సుమంత్రా, దిసుమంత్రులతో నరుంధతీప్రియుఁడు సదా
భ్యసితామ్నాయుఁడు నగు న, వ్వసిష్ఠుఁ గురుఁ జేరి మ్రొక్కి వాంఛితమారన్. 32

క. హితుఁడవు వదిగాకపురో, హితుఁడవు నంచద్దయా సహితుఁడవు బాపా
హితుఁడవు నతిసుగుణగణమ, హితుఁడవు నీకీడుగలరె యెందును నిందుల్. 33

క. మిత్రుఁడవగు నీకరుణకుఁ, బాత్రుఁడనై యుండి దుర్లభస్థితి నాకుం
బుత్రరహితతిమిరవ్యాప్తి, చిత్రము సేయుంగదా వసిష్ఠమునీంద్రా. 34

వ. అనిన నఖిల గుణగరిష్ఠుండును మునిశ్రేష్ఠుండు నగు వసిష్ఠుం డిట్లనియె. 35

ఉ. ఏధితకీర్తి నీకుఁ దగునే యిటు దీనతఁ గుందచుత్తప
స్సాధితశక్తి చేనిదె ప్రసాధితసద్గుణభూషుల న్మహా
బాధితశత్రుల న్సుతుల భవ్యులఁ గాంచి సుఖింతువింకని
ర్వ్యాధితచిత్తవృత్తి నొనరింపుమభంగతురంగ మేధమున్. 36

క. అనిపలుకఁ దనమనంబున, జనియించిన కోర్కె కదియు సమమైనమనం
బునఁ బొంగుచు నెలమిం ద, జ్జననాయకుఁ డశ్వమేధ సవనోన్ముఖుఁడై. 37

మ. సరయంబారఁగ మంత్రులార వినుఁడీ శాస్త్రప్రకారంబున
న్సరయూపుణ్యనదీ సమీపమునఁ బ్రజ్ఞావంతులై మీరు భా
స్వరయూపంబులు నిల్పి శాలలును సంభారంబులం గూర్చి యా
శరయూధాధికవిఘ్నమేమఱక రక్షాతత్పరత్వంబునన్. 38

ఆ. మించి యజ్ఞవాట మంచితంబుగ నొన, రించి యశ్వవరము నెంచి సంభ్ర
మించి సద్విధి విడిపించి మౌనులఁ బిల్పించి యుండుఁ డని వచించి నృపుఁడు. 39

ఉ. వేచని కాంచెఁ గాంచన నివేశవినూత్నచిరత్నరత్నశో
భాచయరోచ మానమృదువస్త్రఘనస్థగితేద్ధకుట్టిమాం
తోచితసుస్థితి ద్విపభిదోద్యమదక్షసుతాప్తిహేతుధ
ర్మాచరణైకయత్నల దురాత్మసపత్నుల ధర్మపత్నులన్. 40

గీ. కాంచి యిట్లునఁబుత్రులఁ గాంచుకొఱకు, నిష్టియొనరింపఁ దీక్ష వహించినాఁడఁ
గాన మీరును వేడ్కఁ దీక్షను వహింపుఁ, డనిన ముదమంది దీక్షిత లైరి వారుఁ 41

గీ. కాంతలునుఁ దానునిట్లు లేకాంతదీక్ష, సంతసంబునఁ దాల్చి వసంతమునకు
నెదురుసూచుచునుండఁ గట్టెదుర భూమి, కాంతునకు సూతుఁడనియె నేకాంతముగను.

సీ. మహినాథవినుము వగ్రహాబాధయును రోమ, పాదుదేశంబునఁ బాదుకొనిన
నయ్యంగపతిప్రజ ల్డయ్యంగఁ గనుఁగొని, హితమంత్రిజనపురోహితులతోడ
మనవిషయమునకే మననిట్టియుపవస్థ, బాటిల్లెడిని నెప్పాటఁబాపి
కొనవచ్చుఁ జెప్పరే గొనకొని మీరిప్డు, డనవుడు వేగ నయ్యనఘమతులు

గీ. దమమనంబుల నీతిబాధానిరాసకంబు సేయంగ జాలుమార్గంబుఁ జాలఁ
బోల నూహించి యమ్మహీపాలవర్యుఁ, డెంతయును సంతసింపఁగా నిట్లు లనిరి. 43

క. కశ్యపపౌత్రుఁడు శివసాధ్యృశ్యుండు విభాండకాత్మదేహభవుం డై
వశ్యేంద్రియనిచయుం డై, ఋశ్యవిషాణుఁడు నా మునీంద్రుఁడు వెలయున్. 44

క. వనపూర్ణమహాతేజుఁడు, వినుసన్మార్గప్రచారి విమలాత్ముండున్
ఘనుఁ డఖిలభూతహితుఁ డాతని నిట రప్పింపుము విబుధస్తుత వేడ్కన్. 45

క. ఆతఁ డిట కేగుదెంచిన, నాతతవర్షములుఁ గురియు ననవుడు వారిం
బ్రీతిం గనుఁగొని యాతని, వేవే దక్షు లబలలని వినిసకతమునన్. 46

క. భూవరుఁడు బిలువనంపినఁ, గైవారము సేయుచు సముఖమునకుఁ గన్నా
కై వారస్త్రీవారము, రా వారలఁ జూచి యంగరా జిట్లనియెన్. 47

చ. అనఘుఁడు ఋశ్యశృంగుఁడు మహాముని ఘోరతపంబు సేయుచు
న్వనమున నున్నవాఁ డతఁడు వారలతాంగులు వీరు పూరుషు
ల్వన మిది పట్టణం బిది ధ్రువంబుగ నంచు నెఱుంగఁ డమ్మహా
త్ముని నిటఁ దోడితేవలయు మోద మెలర్పఁగ మీరు నావుడున్. 48

సీ. ముఖపంకజామోదమునకు మూఁగుచు నున్న, భ్రమరకంబులు భ్రమరకము లనఁగ
నడఁ గాంచి యంఘ్రుల వడిఁ బెనఁగొనుహంసకములు విస్ఫుటహంసకము లనంగ
శుకచంచుపుటనికృత్తకమహీపతితపల్లవములు జారుపల్లవము లనఁగ
నటనశ్రమోద్భూతపటుఘర్మబిందువిసరములు ముత్తెంపుసరము లనఁగ

గీ. జిమ్మపట్టైడు నెడఁ బైటఁ జిక్కు పూల,చెండ్లు సిబ్బెపుఁగబ్బిపాలిం డ్లనంగ
నిట్లు సేయనిశృంగార మింపుసేయ, మునివృషభుఁ జేర సురభు లై ముదిత లపుడు. 49

గీ. దంతకుట్మలములఁ బృథుస్తనగుళుచ్ఛ,యులును గరపల్లవంబులఁ బొలుపుమీఱ
సితనఖసుమంబులును బాహులతలఁ జెలఁగఁ, గొమ్మ లననొప్పి నడిచి రక్తోష్ఠ లపుడు

మ. పులినశ్రోణులఁ జక్రవాకకుచ లుత్ఫుల్లాబ్జపత్త్రాస్య లు
త్పలగంధు ల్వారకంబుకంఠులు లసత్పాఠీనదృగ్జాల లై
యొలమిం గశ్యపపౌత్రుఁ డుత్తమతపం బేవేళఁ గావింప ను
జ్జ్వల మౌ నవ్వనరాశికి న్నదులయోజం జేరి రబ్భామినుల్. 51

శా. కీరంబు ల్పెలరేఁగి కూయ మునిసాంకేతంబునుంగూర్చి వి
స్తారోదారకుచోల్లసత్కచమహాభారానతస్వాంగ లై
యీరంబు ల్వడిఁ దూఱి డాఁగుచు మృగాహీనధ్వను ల్వించు శృం
గారం బొప్ప వరాభిసారిక లనంగా నేగి రచ్చెంతకున్. 52

క. శృంగారవతులు వేడుక, సంగీతరవంబు సెలఁగఁ జని కాంచిరి ని
స్సంగుఁ బ్రభూతియుతాంగున్, శృంగారానంగు ఋశ్యశృంగు నభంగున్. 53

క. కని తాపసు లతికోపను, లనియును గినిసిన శపింతు రనియు వెఱఁగియు
న్మునికడకు నశంకిత లై, చని రబలలు దలఁప నధికసాహసలు గదా. 54

ఉ. ఈగతి నేగుదెంచిన మునీశ్వరుఁ డెంతయు సంతసించుచు
న్వాగమృతంబునం దనిపి వారికి నర్ఘ్యముఁ బాద్యము న్లస
ద్వేగముగా నొసంగి కడువింతతపస్వు లటంచు వారితో
నాగుణశాలి పల్కు వినయంబు నయంబు భయంబు మీఱఁగన్. 55

క. ఎక్కడివారలు మీ రీ చక్కటి కేతెంచుటం బ్రశస్తుఁడ నైతి
న్నిక్కము నామతి మీపై జిక్కె న్మీతోడఁ గూడి చేయుదు నెల్లన్. 56

చ. అనుచుఁ గుచంబు లంటుఁ బొగరారుపిపాణము లంచుఁ గామినీ
జనత సుమధ్యము ల్పణుకు సన్నము లంచుఁ దదాస్యగంధ మిం
పునెఱయఁ గ్రోలు నెంతయు నపూర్వ మటంచును మించుఁగ్రొమ్ముడు
ల్గొను నతివింత లంచుఁ జటిలుండు గడుం జతురుండపోలుచున్. 57

సీ. ఉన్నంత నతనితో నన్నెలంతలు మునినాథ మాపుణ్యవనంబునకును
జనుదెంతు గాక నీ వని మఱియును గొను, మని యాతనికి మనోహారము లైన
యంబరంబులును భక్ష్యంబులు లేపనమ్ములు నొసఁగినఁ గొని మునివరుండు
నిట్టివల్కలములు నిట్టిఫలంబులు, నిట్టివిభూతియు నెన్నఁ డెఱుఁగ

ఆ. ననుచు విస్మయాత్ముఁ డైనయామునిబాలుఁ, జేర నరిగి వారనారు లపుడు
వలసివచ్చినట్టి వనదేవత లనంగ, బలసి భూషణప్రభలు వెలుంగ. 58

చ. కుచము లురంబునం గదియఁగ్రుమ్మి కవుంగిటఁ జేర్చి మోహపా
శచయమువోని వేణుల భృశంబుగఁ జుట్టుచుఁ బల్లవోల్లస
ద్రుచిరుచిరాధరంబుఁ గరతోయజము ల్దగఁ జాఁచిముట్టుచు
న్విచలితధైర్యుఁ జేసి రరవిందనిభానన లీక్రమంబునన్. 59

వ. అంతం దమయందు బద్ధానురాగుం డగుట యుపలక్షించి యచ్చంచలాక్షులు మబ్బుం
జొచ్చుమించులంబోలె వంచనం దొలంగించి చనుటయు. 60

ఉ. ఎప్పుడు వత్తురో యనుచు నెంతయు వారలు సన్నమార్గముం
దప్పనిచూడ్కిఁ జూచు టిది తప్పనియెంచక యగ్నికార్యముం
దప్పని యమ్మహాత్ముఁడు ముదంబునఁ దద్గుణకీర్తనంబులం
దప్ప నితఃపరంబు మదిఁ దార్పకయుండె ససంభ్రమంబునన్. 61

క. ఆత్మభవసదృశుఁ డమ్ముని, యాత్మభవవికారరహితుఁ డైయుండియుఁ దా
నాత్మభవారివిభాండకు, నాత్మభవుఁడు దన్నె విచలితాత్ముం డగుటన్. 62

క. మరునాఁడు చెలఁగుచును వే,మరు నాడుచు మౌనికడకు మగువలు త్వరతో
నరుదెంచిరి యరుదెంచుట, యరుదెంచుట విమలఖరకరాన్వయముఖ్యా. 63

వ. ఇట్లు వచ్చుటయు.

క. నిధి గన్న పేదవోలెన్, బుధనుతుఁ డన్నియమివారిఁ బొడఁ గాంచి యువ
ర్బుధతేజుఁ డిట్టులనుఁ ద,ద్గ్రథితమనోగ్రంధి యగుచు దైన్యము దోఁపన్. 65

చ. ననువిడనాడ న్యాయ మగునా మిము నమ్మినవాఁడ నంచుఁ బ
ల్కిన నగుఁగాక ర మ్మనుచు లేనులు చిల్కను బంజరంబుఁ జే
ర్చినక్రియ నమ్మహామహుఁ బ్రసిద్ధగుణాస్పదరోమపాదకుం
భినిపతి పట్టణోత్తమసమీపఘనోపవనోపకంఠమున్. 66

క. హర్షముగఁ జేర్ప నత్యు,త్కర్షముగా నెల్లయెడలఁ గరశాయుత మై
వర్షంబు దేవతాసుమ,వర్షముతో నెనసి కురిసె వసుమతి యలరన్. 67

ఆ. అంత రోమపాదుఁ డా ప్రమంత్రిపురోహి,తాదిసుజనసహితుఁ డగుచు ఋక్కి
నెదురు సని విధి సువిహితపూజ లొనరించి, వేడుకలరఁ బురికిఁ దోడితెచ్చి. 68

ఆ. సంతసమున విప్రసంతర్పణ మొనర్చి, వరపురమున నుత్సవంబు చాటి
వారముఖ్యలకు సహారవిభూషణాం,బరములొసఁగి వినయభరితుఁ డగుచు. 69

క. మునిపతికిఁ బెండ్లి సేసెం,దనరఁగ సద్గుణనితాంతఁ దనసుతశాంతం
దనుగంధజితలతాంతం, జననివహాభినుతమహితశాంతస్వాంతన్. 70

వ. ఇట్లు పరిణయమహోత్సవంబు నిర్వర్తించి జామాతం దన యింట నునిచికొని యనావృష్ట్యాదిభయంబులు నిజరాష్ట్రంబునకుం గాకయుండ రోమపాదుండు సంతోషితుం డైయుండె నని చెప్పి సూతుండు వెండియు.

ఉ. స్వేష్టగుణాకరుం డగువసిష్ఠుఁడు తో నరుదేర నెంతయుం
బ్రేష్ఠము గాఁగఁ బాండురవరిష్ఠయశోనిధి ఋశ్యశృంగు బం
హిష్ఠము గా నుతించి తగ నిక్కడకుం దోడితెచ్చి హెచ్చి సా
ధిష్ఠము గాఁగఁ దద్దయ విధిం దనయేష్టి యొనర్చి చెచ్చెరన్. 72

గీ. ఆత్మజాతుల నలువుర నతులబలుల నిర్జితారాతులం గని యూర్జితముగ
నలరెదవని సనత్సుజాతాగ్రజాతుఁ డనియె నని చెప్పుటయు దశస్యందనుండు.

గీ. సూతువాక్యామృతము దన శ్రుతిపుటములఁ, దనివిసనక నరేంద్రుఁ డెంతయునుఁ గ్రోల
హృదయకుహరంబు నిండి పై కెగయుచున్న, వరసుధాధార లనఁ బాష్పపూరములఁదనరి.

సీ. హితమంత్రిజనపురోహితసహితంబుగాఁ, బటుతరోద్భటవీరభటులు గొలువ
మంగళరవము సెలంగ నుత్తుంగతు,రంగతరంగమతంగజాంగ
మకరనికరభీకరకరాసిదర్వీక,రసుఖేటకమతవిభ్రాజితంబు
లైనవాహినులు దన్ననుసరింప రసాధి,నాథుండు సంగీతనాదముల న

గీ. గణ్యపుణ్యాగ్రజన్మాగ్రగణ్యవిహిత,సాదరాశీర్నినాదము ల్మేదురముగ
రోమపాదధరాధీశ్వరునిపురంబుఁ, జేర నయ్యంగపతి సవిశేషభక్తి. 75

క. మన్నించి మీరువచ్చుట, మన్నిలయము పూజ్య మయ్యె మహనీయగుణా
ధన్యు న్నిన్నుఁ జూడఁగఁ గంటిఁ గ,డు న్నిర్మల మై తనర్చెడు న్మది నాకున్. 76

క. ఆగమచోదితధర్మవ,రాగమమూలానుకూలయతిధైర్యసువ
ర్ణాగమనోమోదము భవ,దాగమనంబునకు మూల మది యెయ్యదియో. 77

క. ఆనతియిం డాకార్యము, మానతరిపులోక దశరథాధీశ్వర స
న్మానముతో నొడఁగూర్తు, న్మానక యది యెంతయఘటమానం బైనన్. 78

క. నావుడు సత్యవ్రత విను, మీవంతటివాఁడ వగుట యే నెఱిఁగియు కా
దే వచ్చితి వినిపించెద, నావచ్చినకార్యసరణి నరనుతచరితా. 79

ఉ. ధీత్పుణ్యగావపావనుఁడు వేదవిధిజ్ఞుఁడు సాధితేద్ధవి
ద్యాత్పుడతీతసంస్కృతి మహాంహ్సృతదూరుఁడు నిర్మలాత్ముఁడున్

ధాతృనిభుండుఁ గశ్యపవిధాతృసుతాత్మభవుండు నీరజా
మాత్రుఁడు ఋశ్యశృంగుఁ డసమానుఁడు మానవవంశదీపకా. 80
క. ఆతనిఁ గొనిపోవుటకై, యేతెంచితి నమ్మహాత్ము నెలమిం దారా
న్వీతునిఁగా మత్పురమున, కాతతగుణ పనుపు మిది ప్రియం బగు నాకున్. 81
చ. అనవుఁడు సంతసించి తనయల్లునిఁ గన్గొని భక్తిఁ దద్విధం
బు నుడివి యాతఁ డియ్యకొన భూవరుఁ డెంతయు సన్నుతింప న
య్యనఘుని ఋశ్యశృంగుని నిరంతరవర్ష సమార్ద్రభూమిపం
కనిరసనార్థ మంపె ననఁగా నతఁ డంపె జగద్ధితంబుగన్. 82
క. శాంతాత్ము ఋశ్యశృంగుని, శాంతాసహితముగఁ దెచ్చి జననాయకుఁ డా
శాంతాపూరితయశుఁడు ని,శాంతము సొత్తెంచె సకలజనములు వొగడన్. 83
గీ. శాంత నంతఃపురమునకు సంతసమున, ననుప నమ్మునిపత్ని కయ్యాధిపపత్ను
లెదురు సని ప్రమొక్కి యయ్యువ కిష్టమెసఁగ, భక్తిసేయంగ నుండె నప్పరమసాధ్వి.
వ. దశరథుండును ఋశ్యశృంగసందర్శనసంభాషణంబుల సంభావితుండై యుండ. 85
ఉ. చాల ముదంబు సేసెను విశాలరసాలకిసాలలోలపై
శాలము వల్లరీస్థమధుపాళిభరానమితోల్లసల్లతా
జాలము సౌఖ్యమూల మురుసౌరభసంయుతమందమందవా
తూలము ప్రాణకూలము నుతుల్గొనుమాధవకాల మంతటన్. 86
సీ. మాధవురాకకు మానితామోదయై, నవవనలక్ష్మి జీర్ణచ్ఛదములు
తగ వని నూత్నచ్ఛదము లోలి ధరియించి, హస్తము ల్సాచి రమ్మనుచుఁ బిల్చు
చున్నదో యన సుగంధోద్భాసి యై పండు, టాకు లూడిచి తలిరాకు లెలమిఁ
దనరఁ బికాళిబృందంబు లందందయా,నందంబు నొంది ధ్వానములు సేయ
గీ. నొవరె మఱియును దత్సంగ ఘనసుఖమున, నొదవుపుల్కలచాలునా నొప్పుమీఱె
నమలనిజరుచివిజితనీహారకేద్ధ,తారకము లగునభినవకోరకములు. 87
గీ. శ్యామ యల్పతరుస్కంధసాక్రమణము, గాదనుచు వేడ్క ఘనతరుస్కంధ మెంచు
ననఁగ నల్పతరుస్కంధసాక్రమణము, గాదనుచు శ్యామమున తరుస్కంధ మూనె.
క. కమ్మనితెమ్మెరలుం జుం, జుమ్మనుతుమ్మెదలు స్ఫుటవిశుద్ధతరమనో
జ్ఞమ్ము లగుసుమమ్ములు గడు, నెమ్మెలు గులుకఁగ వసంత మిమ్మెయిఁ దనరన్. 90
వ. దశరథుండు ఋష్యశృంగున కిట్లనియె.
ఉ. ఆయతకీర్తిశాలి ముదమార వసంతము డాసియొప్పె య
జ్ఞాయుతనంబున న్సకల మాయితమయ్యె మునీంద్రు లెల్లశి

ష్యాయుతసంఖ్యులై కడు రయంబున వచ్చిరి రాజకోటి సే
నాయుతమై క్రతూత్సవఘనంబుఁ గనం బురినిండెఁ గావునన్. 91

క. నాయజ్ఞము నెఱవేర్పుము, నా యజ్ఞానము సహించి నలువొందుదయన్
న్యాయజ్ఞ మునీశ్వర ప్రభు, నా యజ్ఞామాత్యులెల్ల నవహితబుద్ధిన్. 92

క. నీపంపుసేసి మెలఁగఁగ, నేపార వసిష్ఠమునియు నీరలుఁ దగుపు
త్రాపాదనహయమేధ,వ్యాపారమునను మెలఁగవలయు నటంచున్. 93

క. మునిపతి వసిష్ఠు గుణధా,మునిహతేంద్రియవికారు నురుచిజితసో
మునిపతితాదితపఃకా,ముని పతి యిట్లనుచుఁ బలికె మోదమెలర్పన్. 94

ఉ. మేధ్యముగాఁగ నన్ను హయమేధ మొనర్పఁగఁ బంచి శాత్రవా
సాధ్యుల సంతతప్రణుతసాధ్యులఁ బుత్త్రిల నిద్ధసద్గుణా
రాధ్యులఁ గాంచునట్లుగ వరంబుఁ గరంబు నొసంగుమంచు సా
న్నిధ్యమునందు వేఁడుధరణీపతిఁ గాంచి వసిష్ఠుఁ డాదృతిన్. 95

క. కాకుత్స్థాన్వయదీపక, నీకింతవిచార మేల నేఁగలుఁగఁగ ను
శ్లోకులఁ బుత్త్రిలఁ బడసెదు, ప్రాకటసరయూనదీవరతటంబునకున్. 96

క. విను నీవు నీదుభార్యల, జననాయక మంత్రిపౌరజానపదుల స
జ్జనుల మునుల విప్రులఁ దోఁడ్కొనిచను మేఋశ్యశృంగు గొని యేతెంతున్. 97

వ. అని పల్కుటయు. 98

గీ. రహి శిలీముఖచక్రవిభ్రాజితంబు, నై సముత్క్యాదగుల్మసమావృతంబు
నై హారిస్ఫురితంబునై యలరుచుండి,న సరయూవాహినిం జేరి నరవిభుండు. 99

వ. విబుధపరివృతుం డై మహేంద్రవిభవంబున విశిష్టగుణగరిష్ఠుం డగువసిష్ఠుండును, మంగళగుణానుషంగుం డగు ఋశ్యశృంగుండును, హర్షు లగుమహర్షులును, దపోనూను లగుమౌనులును, మహానుభావు లగుమహీదేవులును, సర్వజ్ఞు లగుదైవజ్ఞులును, సారు లగుపౌరులును, జ్ఞానవిదు లగుజానపదులును, నిర్వర్తితరాజ్యతంత్రు లగు సుమంత్రాదిమంత్రులును, శాంత లగుపుణ్యకాంతలును, సువ్రతైకయత్న లగుధర్మపత్నులును, వినయనిధు లగువందిమాగధులును, శృంగారాధార లగువారనారులుం దోడరా ననురూపరూపయూపప్రపాసుందరంబును, స్పష్టాష్టాపదేష్టికావిరచితవేదికాకుండమండితంబును, ప్రసిద్ధక్రతూత్సవాలోకనాగత చాతుర్వర్ణ్యతత్తదుచితనికాయ్యనికాయకాయమానసమావృతంబును, కుంభామనోహారంబును, ధనధాన్యశాలితండులఘృతతైలగుడసూపశాకతృణకాష్ఠజలప్రభూతవస్తుప్రశస్తంబును, విమలసరయూకమలానుకూలకూలలతాసాలజాలనూనసుగంధవహాగంధవాహాసుప్రవేశంబును, దక్షి

ణానీతఘనాపీనమై చికీమణీగణసంభరితంబును నై విచిత్రంబు లగుధవిత్రంబులును, పవిత్రంబు లగుసువర్ణపాత్రంబులును, నవంబు లగుస్రుక్స్రువంబులును, మంజులోల్బణ రత్నకంబళపుంజంబులును, మఱియుం దక్కినవివిధోపకరణంబులునుం గలిగి యొప్పు నభినవసవనభవనంబుఁ బ్రవేశించి ధర్మపత్నీసహితుం డై. 100

గీ. శుభముహూర్తంబునను వసిష్ఠుఁడును బుష్యశృంగుఁడును మునివరులును నెలవొసంగ నగ్నిముఖు లగ్నిముఖమునఁ దలర నప్పు, డగ్నిముఖమొనరించెఁ గ్రత్వాదియందు.

వ. తదనంతరంబున. 102

శా. ధారాయ్యాసర్ధితజాతవేదహితమధ్యప్రస్థితాపూతసా
న్నాయ్యప్రాహుతినిర్గమత్ప్రబలనానావర్ణధూమాభ్రసా
హాయ్యంబొప్పళితక్రతుండుఁ గ్రతుభాగార్థంబు రా దక్షిణా
నాయ్యాద్యగ్నులయాజ్ఞికోత్తములు ఛందోజ్ఞు ల్ప్రవర్గ్యాదులన్. 103

గీ. సముచితంబుగ వేల్వ నశ్వముఖులసదు, పాకృతకమన మొప్పవసాప్రహోమ విధుల నింద్రాదు లైనదివిజవరులకుఁ, దృప్తి యొనరించె నజ్జగతీవిభుండు. 104

సీ. ఈక్రమంబునను సర్వక్రియాసంపూర్ణ, మై వివిధాన్నపానాదితర్పి తాఖిలలోక మై యనవద్యదక్షిణాభ్యూచ మై కృతవపాధూమ మై వ రం బయి విఘ్నదూరం బయి ఖచరభావ్యం బయి ద్విపదపశ్యంబు నై స భాసదాహ్లాద మై బహుళసంస్తావపూతం బయి పాపకాదంబినీప్ర

గీ. భంజనం బయి వాద్యసంభరిత మై ధ, రామరాశీర్వినాదవీణానుకూల నాదపుణ్యాంగనాగాననాదఘూర్ణ, మాన మై యశ్వమేధ మనూన మయిన. 105

చ. పుడమివిభుండుఁ దాపసవిభుండు విభాండకునాత్మజుం డ్నతిం
పుడు నతిహర్షుఁ డై కరుణఁ బుత్రకకామవరేష్టి నేయ న
ప్పుడ మితభాషి తన్మని ప్రభూతహితాహుతు లొప్ప వేల్చిన
ప్పుడమిజనంబులెల్లఁ గడుఁబొంగి కనంగొనుచుండ సద్విధిన్. 106

మంగళమహాశ్రీవృత్తము.

ఆసమయమందుఁ గమలాసనుని గన్గొనఁగ వాసవపురస్సరముగా సం
త్రాసు లగుచుం ద్రిదివవాసు లొగిఁ డాసి నతిచేసిన దయామయుఁడు నావా
ణీసతినిఁ గూడి దరహాసము ముఖంబున వికాసమమర న్సురలతోను
ల్లాసమొదవం గరుణచేసి పలుకు న్వెతలఁబాసి ముదమందుచు వినంగన్. 107

క. ఈకడకు మీరువచ్చిన, యీకార్యముఁ దీర్ప దక్షుఁ డీక్షితి నరయ
న్వైకుంఠపురాధీశుఁడు, వైకుంఠుఁడు గాక యొరులువలఁతులె యనుచున్. 108

గీ. వారిఁ దోడ్కొని యప్పు డవారితముగ, వారిజభవుండు పూర్వదేవారి యుండు
వారినిధి గాంచి యచట దేవారిహాతుస,వారిహితుఁ గాంచి పొగడె నవారిగాఁగ 109

సీ. అచ్యుతసంకర్షణాదినామోత్కర్ష, పాలితామృతతర్ష పరమహర్ష
భక్తనేత్రోద్ధర్ష బహుసద్గుణాకర్ష, యమితప్రకర్ష సహస్రశీర్ష
సుజననిరామర్ష కుజనఘనాధర్ష, దానవసాఘర్ష మానితార్ష
వరకృపామృతవర్ష వాహనవిహగర్ష, భఘునాఘమర్ష సంభరితవర్ష

గీ. యాజిఘర్షితరిపుశీర్ష కామకర్ష, సంతతానందయోగిసత్సన్నికర్ష
కరుణ మామొఱ వినిపొమ్ము పరమపురుష, యాధికతరదుఃఖరాశిసమాపకర్ష. 110

క. లోకంబులు గలిగింపను, లోకంబులు మనుప సర్వలోకంబులు వే
నేకార్ణవంబు సేయఁగ, నీక చనుం గమలనాభ నిరుపమశోభా. 111

క. లోకాధారుండ వఖిల, లోకాతీతుండ వార్యలోకహితదయా
లోకుండవు నసమానా,లోకుండవు సోమలోకలోచననేత్రా. 112

క. అభవుఁడ వైయుండియు దు,ష్టభయంకరరాక్షసప్రశమనంబునకై
ప్రభవించెద వొక్కొకతఱి, శుభచరితుల నుల్ల భక్తసులభుఁడ వగుటన్. 113

చ. అనఘ త్వదీయదర్శకులయత్వవిహీనతఁ శప్తులై జయుం
డును విజయుండు లోకము గడుం భయమందఁగ దైత్యులై జనిం
చినను వరాహరూపమునఁ జెన్నువహించి హిరణ్యనేత్రునిం
దునిమి నృసింహవిస్ఫురణఁ ద్రుంచితి వగ్రజు హేమభోజనున్. 114

క. ఆదనుజాధము లఖిలస,రాదులు ఘటకర్ణరావణాహ్వాయులచే
మేదిని జనించి దిక్పాలాదుల భర్జించుచుండి రతిబలు లగుటన్. 115

సీ. నిమిషస్థితి లేదు నిర్జరవరులకు, నఖిలదిక్పతులు నిరాశులైరి
పాతాళమునకు నై పాఱిరి భుజగులు, గిన్నరుల్ గుహల డాఁగిరి భయమున
గ్రహములు నిర్వక్రగతిఁ దనర్చుట లేదు, సాధ్యుల కధికవిచార మయ్యె
బ్రాహ్మణోత్తములకు రాగహీనత ఘనతరుల కామలపాటు పరిఢవిల్లె

గీ. వరమఖంబులు కడు దుర్లభంబు లయ్యె, మునుల గర్వసమృద్ధి నిర్మూల మయ్యె
ఖచరకాంతాక్రమణమహోత్కంఠుఁ డైన, పఙ్క్తికంఠుఁడు సేయు నుపద్రవమున.

క. హేమనగశరాసనునక, మేమనఁ గల దతఁడు లీలనెత్తిచో నిం
కేమనఁగ నెంత నితిచెద, మేమనఁగల మే సురారిమీఁదికిఁ జనినన్. 117

క. రావణు సమస్తలోకవి,రావణుఁ బరిమార్చి చెచ్చెరం దదనుజునిం
గావర మారించి మముం, గావ రమాధీశ నీవ కలవనియుటకున్. 118

వ. చనుదెంచినవార మని పలికి వెండియు. 119

క. భవదారితనామ మనో,భవదాహక మిత్రహిత విభవదాయక ధీ
భవదాలోకము కుంఠీ, భవదాశరలోక మగు నభవదాంతనుతా. 120

క. అని కమలాసనముఖ్యులు, వినుతింపఁగ సంతసించి విశ్వమయుఁడు చ
య్యనఁ బ్రత్యక్షం బయ్యె, న్వనజోదరుఁ డెపుడు భక్తవత్సలుఁడు గదా. 121

సీ. కాదంబినీసముద్గమము లై చంచల, త్వంబు నొందనితటి త్తండ మొక్కొ
శ్వేతషోడశకళాశృంగారయుగపత్ర్ప,దీప్యత్సహస్రేందుదీప్తు లొక్కొ
యవనీభరవహశేషాద్యశేషవిశేష,ఫణిఫణామణిఘృణిప్రచయ మొక్కొ
యత్యయద్వాదశాదిత్యసంస్తుత్య ఘ,నాత్యంతరుచిరతీవ్రాంశు లొక్కొ
గీ. యనఁగ జాడ్కులు మిఱుమిట్లు గొనఁగఁ జల్లఁ,దనముమీఱఁగ నధికచిత్రంబు గాన
సహానదుస్సహముగ నొప్పు మహితదేహ,కాంతు లెల్లెడఁ బర్వ సాక్షాత్కరింప.

క. చతురాననుండు నిజఘన,చతురాననములను విష్ణు జనవరిష్ణుం
జతురాగమములఁ బొగడెను, జతురత యొప్పంగ సంతసము నిండారన్. 123

గీ. అపుడు తద్దివ్యమూర్తి తేజోవలోక,నంబు సేయఁగ నధికముదంబు గదుర
నఁ శతక్రతుఁ డురుసహస్రాక్షుఁ డయ్యె, నమరవరు లెల్ల ననిమిషు లైరి మీఱి. 124

సీ. అశ్వమేధశతఫలావాప్తిగోత్రభే, దికి సర్వభక్షునకు శుచిత్వ
మురుదండధరునకుఁ గురుధర్మదేవత్వ, మలరాక్షసునకుఁ బుణ్యజనఘనత
జడపతికిఁ బ్రచేతసత్వంబు లోకప్ర,భంజనునకు. జగత్ప్రాణమహిమ
నరవాహనునకు ధనదమహాభిఖ్యయు, సర్వజ్ఞతనుధర్మశాస్త్రమునకుఁ
గీ. దనదు తేజోమయాత్మ దర్శనముకతనఁ, గలుఁగఁ జేయుచు నందఱఁ గలయఁ జూచి
మేఘగంభీరములును నమోఘములును, మధురములు నైన వాక్కుల మధుహరుండు.

ఉ. భానుకులాగ్రగణ్యుఁ డగుప జ్క్తిరథాత్మసతీత్రయంబునం
దేను జతుర్వరాకృతుల నెంతయు వేడ్క జనించి రావణు
న్మానమదాతిరేకములు మాన్చి యమాత్యసహోదరాప్తసం
తానము మున్నుగా యమపదంబున కంపెదఁ జింత యేటికిన్. 125

క. మీవలని యనుగ్రహమున, మీవలనికి వచ్చితి నిటమీఁద నరుఁడనై
మీవలసినటుల మెలఁగెద, రావణు మాత్రములు మీకు రావణు బాధల్. 126

ఆ. అతని వరము లడుగు నప్పుడు నరవాన,రాళిఁ జావకుండ నడుగఁ డతఁడు
గాన నేను మర్త్యయోని జనించెదఁ, బుడమిఁ బ్లవగులగుచుఁ బుట్టుఁడీరు. 127

వ. అని యానతి యొసంగి. 128

క. రోహిత నిధిశయనుఁడు పటు, రోహిత కరమహితదీప్తి పరుచిరుఁడు సుగపా
రోహిత కోటిదిధిమణిఁ డా,రోహిత ఖగనాథుఁడై తిరోహితుఁ డైనన్. 129

క. వనజజుఁడు జాంబవంతుని, సునయులు హరిహరులు వాలిసుగ్రీవుల న
శ్వినులల మైందద్వివిదుల, ఘనభల్లుకకీశపతులఁ గలిగించిరొగిన్. 130

క. అనలాత్ము వంశమున నం,జనయను సాధ్వీమతల్లి సద్గర్భపయో
ధినిఁ దగఁ గపికులచంద్రుఁడు, హనుమంతుం డుదయమయ్యె హరిదయ మఱియున్.

క. తమతమ యంశంబుల న,త్తమతముల వలీముఖులను దఱుచుగ సురస
త్తము లిలఁ గలిగించిరి చి,త్తము లానందింప దైత్యదర్పచ్యుతులన్. 132

వ. ఇట్లు గలిగించిన దేవాంశసంభూతు లగు నాప్లవంగపుంగవులు. 133

ఉ. కొందఱు నీలుని న్నలుని గొందఱు గొందఱు మిత్రసంభవుం
గొందఱు గంధమాదనుని గొందఱు మైందుని గొంద ఱంగదుం
గొందఱు గేసరిం గజుని గొందఱుఁ గొందఱు వాయుపుత్రునీ
యందఱు నింద్రనందను నహర్నిశముం గొలువం దనర్చుచున్. 134

ఆ. పర్వతంబు లెత్తి బంతులాడుచు గండ, శిలల నుగ్గుగాఁగ జేఁజఱచుచు
ధరణి గ్రక్కదలఁగ దాఁటుచు నుండిరి, ఋశ్యమూకముఖగిరీంద్రములను. 135

క. అంతక మున్న క్కడ సుర, లెంతయు సంతసిల దశరథేశ్వరుఁ డఖిలా
శాంతవ్యాపితధూమా, త్యంతమనోహరసుతేష్టి యమరించు నెడన్. 136

తే. యజ్ఞకుండాంబునిధి ఋగ్యజాంగమాథ,వానుశాసనమున విబుధాధిపుండు
మంత్రమంథనగంబుచే మథనవిధియొ,నర్ప నమృతంబు దెచ్చు ధన్వంతరి యన. 137

ఉ. ఆయత యజ్ఞకుండ మహితాంతరము న్వెస నిర్గమించి శో
భాయుత దివ్యమూర్తి రఘువంశసుదీపకుమారసంభవో
పాయసపాయసుండయి నృపాలకృతాహుతిసద్విధానవి
స్పాయదనుగ్రహంబున విభావసుఁ డాత్తనిజస్వరూపుఁడై. 138

క. ఆతుఱమునఁ దనకుం బ్ర, త్యక్షంబయ్యె ననదివ్యుఁడగు నొకపురుషుం
డక్షిణ ప్రభనొప్పఁ బ్రదక్షిణ మొనరించె విభుఁడు దయితాయుతుఁడై. 139

వ. ఇట్లు. 140

చ. తనకుఁ బ్రదక్షిణించి యుచితంబగు భక్తి నమస్కరించి యుం
న్న నరవరేణ్యుఁ గాంచి మహినాథ తనూజులు నీకు నల్వు ర
త్యనుపమమూర్తు లిద్ధబలు లర్కకులాగ్రణు లుద్భవింతు రీ
ఘనతరపాయసంబుఁ గులకాంతలకు న్నొసఁగ నిచ్చినన్. 141

క. అని చెప్పి మనోరథసిద్ధి నొసంగినభంగిం బురుషు దివ్యపురుషుఁ డొ
య్యనఁ దత్పాయసపాత్రము, దినకరగోత్రున కొసఁగి యదృశ్యుం డయ్యెన్. 142

క. పరమాన్నస్వర్గ్యయుత మహీపరమాకర్షణపరుండు పఙ్క్తిరథుండు త
త్పరమాన్నపాత్రఁ జేకొని, పరమాహ్లాదమున నప్పుడే పట్టణమునకున్. 143

సీ. చనుదెంచి యప్పాయసము రెండుభాగము, ల్గావించి యొక్కభాగంబుఁ బెద్ద
భార్యకు రెండవభాగంబు రెండవభార్య కొసంగి భూభర్త పిదపఁ
గౌసల్యపాలిసగంబును గైకభాగంబున సగము రాగంబు మీఱఁ
దెచ్చి సుమిత్ర కందిచ్చె భాగములు నా, ల్గింటిలో రెండు గ్రాల్గొంటి చిన్న

ఆ. భార్య కయ్యెఁ గడమ భాగద్వయంబు భా, ర్యాద్వయమున కయ్యె నధిక మైన
ప్రేమ పతికిఁ జిన్నపెండ్లాము నందును, దల్లికిఁ గడగొట్టుతనయునందు. 144

మ. పరమాన్నానుభవంబున న్సతులకున్ భావింపఁగా వృద్ధిఁ గాం
చె రహిం గోర్కులు నాస్యపాండిమయులున్ శృంగారవక్షోజభూ
ధరము ల్జిట్టుము లాపులింత లణుమధ్యంబు ల్మదంబు ల్విశే
షరుచు ల్కన్నుగ మందమయ్యె నడలు న్సద్యోభవాపేక్షులన్. 145

క. కటిరుచకవభారలసుం, బటుతర మకుమన్న గర్భభారంబులతో
స్ఫుటభార సురుచిరమహో, త్కటరత్నాభరణగణము గడుభరమయ్యెన్. 146

గీ. అధికమధుపానమత్తత నబ్జవాంఛ, భ్రమరకంబులు చక్రవాకముల మీఁద
వ్రాలెననఁ గాంతలకు లిప్తవరకుచాగ్ర, నీలిమ దనర్చె నత్తొలిచూలువేళ. 147

సీ. ప్రియపుత్రదర్శనస్పృహ మించె నృపతికిఁ, గంబుకంఠులకు శ్రేయంబు మించె
నాఱనిమతుకంబు మీఱె నరేంద్రున, కంబుజాస్యలకు నూఁగారు మీఱె
బటుతరంబుగ మేను పాటకరించె మహీవిభున కంగనలవళుల్ ప్రకటకరించెఁ
దెలివవ్వు మొలకలెత్తె నిలాపతికిఁ జంద్రముఖులకుఁ దెలిడాలు మొలకలెత్తె

గీ. మానినసత్తమవిహితకుమారకామ, సప్తతంతుప్రభవపురుషప్రవరస
మాత్తమాధుర్యపాయసాహారకలనఁ, బ్రాకటంబగు దౌహృదశ్రీకతమున. 148

ఆ. సకలజనులకుఁ బరమహర్షంబు నిండ, దేవతాస్తుతిరవముల దివము నిండఁ
గలితజీవితకాలం బరులకు నిండ, నెలఁతలకు నంతఁ బండ్రెండునెలలు నిండ. 149

మ. మధుమాసాగతశుద్ధశుద్ధనవమీమధ్యాహ్నకాలంబునన్
బుధవారాదితితారఁ గర్కటకసత్పుణ్యోదయలగ్నంబున

న్విధుదేవేజ్యులుగూడఁగా విధిముఖు ల్వేడ్కఁబ్రశంసింపఁ జ
క్రధరార్ధంబగు నొక్కపుత్త్రుఁ గనియెం గౌసల్య సాఫల్యయై. 150

సీ. ఘనతరు ల్మునుచనోవికాసతఁ జెన్నొంద, భువనము ల్గల్మషంబుల దొఱంగ
విపులధర్మము లభివృద్ధి నొందఁగఁ గళా,స్ఫూర్తి సంతసము విబుధుల కొదవ
సన్మార్గసహితరాజప్రవర్తనముఁగా, ద్విజకులం బురుఫలాప్తిని రహింపఁ
గువలయామోదంబు గుమ్మరింపఁగఁ బుణ్య,జనజాతమునకు వర్ధనము గాఁగఁ
గీ. ఖర్వదినశార్వరీనాథగర్వనిర్వ, పణముఖుండు ధరిత్రీసుపర్వవరసు
పర్వసుముఖుండు లోచనపర్వయశము, పర్వ నృపునగ్రసతికి సంప్రభవ మయ్యె. 151

గీ. విబుధహర్షంబుఁ గువలయవికసనంబు, పుణ్యసుచకోరలోచనాపూర్ణసంత
సప్రవృద్ధియుఁ బటుతమశ్శాంతి యయ్యె, ననఘుమతి రామచంద్రుని జననవేళ. 152

క. గ్రహబాధ లాతనియను,గ్రహమాత్రంబున నపాయుఁ గలవనెడిసువి
గ్రహజన్మలగ్నమహిత,గ్రహలగ్నము వింత గాదు రహి నూహింపన్. 153

క. సంతాన మధిపుఁ డొందఁగ, సంతానము గురిసె విరులసంతానంబు
ల్వంతలు దొఱఁగి రమరు లా,వంతలు లేకుండ సారవత్స్వాత్మకులై. 154

క. అగ్రసతీమణివలన ని,జాగ్రసుతోత్పత్తి విని నృపాగ్రణి గడుఁ బ్ర
త్యగ్రాగ్రహారములనుది,నగ్రగ్రహణయశుఁడై ద్విజావలి కొసఁగెన్. 155

సీ. విమలవానిహృదబ్జవృత్తికి సూతికా,గృహవృత్తి మనమున కెక్కఁబోలు
వభవాభ్యభీష్టతుం డైయొప్పుప్రభునకుఁ, బుట్టువు పై నిచ్చ వుట్టఁబోలు
దుగ్ధాబ్ధి నోలాడుదొరకుఁ గౌసల్యాకు,చోరుదుగ్ధాపేక్ష యొదవఁబోలు
శారదమహతీస్వనము మెచ్చుమేటి కం,గవలజోలలభ్రమ గలుగఁగఁబోలు
గీ. శేషుపైఁ బండుఱట్టి విశేషమతికిఁ, దూలతల్పంబు లధికమై తోఁపఁబోలు
ననఁగ నిందీవరశ్యాముఁ డఘురాముఁ, డమితగుణధాముఁ డుద్దాముఁ డవతరించె.

క దశదిగ్వేశదముగ విపు,ద్దశ దిగ్విభులెల్లఁ బాయఁ దగుమీనమునం
దశమీగురువారమునన్, దశరథుసతి కైక గనియెఁ దనయున్భరతున్. 157

మ. కవివారోరగతారఁ గర్కటకలగ్నప్రాకపై కాదశిం
గవివారాభినుతు ల్సెలంగ జగదేకశ్లోకవిఖ్యాతులన్
సువివేకాత్ముల నిర్వురం గనియె నత్యుద్రోరుచారిత్ర బాం
ధవసంస్తోత్ర సుమిత్ర మిత్రజనబృందం బాత్మ హర్షింపఁగన్. 158

వ. ఇట్లు. 159

క. నలగురురూపకళాఢ్యులు, నలుగురునుతు లుద్భవింప నలువుగ విరివా
నలు గురియన్వేల్పులుంజా,నలు గురుతరవాద్యముల నొసర్చిరి మింటన్. 160

క. పాపంబులు భక్తమన,స్తాపంబులుఁ బాపనోపు తద్బాలురస
ద్రూపంబులు పురటిండ్లకు, దీపంబులు గాఁ జెలంగె దీపితభంగిన్. 161

క. పురుషోత్తము లగుపుత్రులఁ, బురుషార్థచతుష్టయంబుఁ బోలెం గని కా
పురుషామిత్రజనమదం, బురుపాసహితముగ నృపుఁడు ప్రుంగుడువతిచెన్. 162

వ. తదనంతరంబున. 163

సీ. పుణ్యాహవాచనపూర్వకజాతక,ర్మానంతరంబున మానవేంద్రుఁ
డతిభక్తిఁ గులగురుం డగువసిష్ఠునిఁ గాంచి, సతుఁ డయిసుతులకు నామకరణ
మొనరింపుఁ డనుడు నయోధ్యాగిముఖ్యుండుఁ గోసలరాజకన్య కౌసల్యసుతునకుఁ
గైకపుత్త్రునకు మాగధరాజపుత్త్రిక,పుత్త్రులకును క్రమంబున నొనర్చె
గీ. రాముఁ డని రాముఁడనుచు భరతుఁడు గాన,భరతుఁ డనిలక్ష్మణుఁడు గానఁ బరఁగలక్ష్మ
ణుండటంచును శత్రుఘ్నుఁ డండ్రు గాన,మహిమశత్రుఘ్నుఁడనుచు నామంబులపుడు.

చ. క్రమమున నాద్యపక్షమిహికాకిరణోరుకళోపమానులై
సుమవిశిఖావరీణపటుసుందరులై వినుతాంబుజాసనా
ద్యమరులునై నరేశ్వరుఁడు నంబలు సంతస మంద మిత్రగో
త్రము వెలుఁగంగ రాట్సుతులు తద్దయు నొప్పిరి నాఁడునాఁటికిన్. 165

గీ. తల్లిదండ్రుల సంతోషవల్లిప్రాఁకఁ, బ్రాఁకనేర్చిరి చిలుకలపలుకు లెలమిఁ
బలుకనేర్చిరి ధర్మము ల్ప్రబలినడువ, నడువనేర్చిరి పెడపెడనడక లపుడు. 166

మ. కని మోదించిరి తల్లిదండ్రులు జగత్కల్యాణచారిత్రుల
న్వనజాతాయతనేత్రుల న్విమల శోభా గాత్రులం బౌరలో
చననీరేరుహమిత్రుల న్మధురభాషాచిత్రుల న్మిత్రకా
ననసచ్చైత్రులఁ గూఢజత్రులను నానాస్తోత్రులం బుత్రులన్. 167

వ. అని మనోల్లాసంబుగా నుపన్యసించి. 168

క. ఖండనరిపుఖండన ఖల,దండన గుణమండనానితాంతప్రణుతా
ఖండల మణికుండల భూ,మండలధర విధుదినేశమండలనేత్రా. 169

శా. జంభారాత్యభియాతిఖండనపటిష్ఠప్రోల్లస ద్ఖడ్గదో
స్తంభాభిష్టుతభూరిభూరిమణిదృబ్ధప్రస్ఫుటోద్దామ దా
మాంభోధ్యాత్మ భవాసమాశ్రిత సువక్షో దీనరక్షాంచితా
రంభాదంభమహాభిలాష జగదారాధ్యాంఘ్రిపద్మద్వయా. 170

లయగ్రాహి.

సారఘనసారసువిసారసుమవారపటుహీరవరక్షీరధృతసీరసితతారో
దారఘనపారదపటీరహితశారదనిశారమణశారదశరీరమృదుముక్తా
హారమధుపూరసురవారణసమీరణకుమారవరహారవరహాగవిలసద్డిం
డీరబహుతారకతుషారకలిశారమణకైరవమహోరగపచారుతరకీర్తీ.

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణపదాబ్జధ్యానపరాయణ భూమధైర్య
వినయ రామనార్యతనయ పండితసేవాసముచ్చయ కొత్తపల్లి
లచ్చయప్రణీతం బైన దాశరథివిలాసం బనుమహాప్రబం
ధంబునందుఁ బ్రథమాశ్వాసము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః.

# దాశరథివిలాసము.



## ద్వితీయాశ్వాసము.



...వదన వర, రామాజనమదన సుందరరదన రిపుమహో
...కదన రుచిరసువర్ణామేయచ్ఛదన వేంకటాచలసదనా.
...ంతరకథావిధానంబు భగవంతుండగు వల్మీకోద్భవుం డిట్లని చెప్పం 2

...ల కానందమధిక మగుచుండ రాజతనయులు ప్రో
...లైయు, త్తమవృత్తము పౌరులకు ముదం బొనరింపన్. 3
...ు మనోభిరామలీల, భరతశత్రుఘ్ను లురుశుభభరితలీలఁ
జక్కవకవల తీరుడు, వేలుపులకూడుఁ గూడు నవ్విధము గాఁగ. 4
వసిష్ఠు నొద్ద ననుజాన్వితంబుగా నెంతయు
మొనర్చి రాముఁడు మహావేదవేదాంగము
...ని యట్ల నేర్చి మఱియు వ్వీరుండు ప్రోద్యద్ధను
...గుఁ డయ్యె భీతి సమితోర్వీనాయకు ల్గుందఁగన్. 5
...వీఁకఁ దురగంబుల నెక్కి రణంబొనర్చుట
...క్కి పోరుట లీలాస్థితి జన్యము సేయుట ల్పతాం
...కిఁ గాండపటుకాండపరంపరఁజూపుట ల్వరాం
... రాముఁ డధికంబుగ నేర్చె సహోదరాత్తుఁడై. 6
7

...ండితబృంద రక్షులం దుష్టజనవిదారకుల మహో
...విశేషులఁ, దారకరాజనిభముఖులఁ దారకనఖులన్. 8
...ుఁడు పుత్రరత్నములకుం గళ్యాణము ల్సేయఁ జ
...న్య సుకన్యల నైదకుచో గాఢేయుఁ డామర్ష శో

కనిరాకర్షణుఁ డేగుదెంచుటయు వేగంబొప్ప నమ్మౌని రా
కనిజాధీశున కేర్పరించిరి భటుల్ గౌతూహలోపేతులై. 9

క. భటులిటు లెఱిఁగించిన న్యద్భుత సంతోషమున నెదురు పఱతెంచి శుభా
ర్భటు లెసఁగఁ దోడితెచ్చెన్, భటునిక్రియ న్మహితవినయుభయభక్తుం డై. 10

వ. ఇవ్విధంబునం జితేంద్రియామిత్రుండగు విశ్వామిత్రుం దోడితెచ్చి సుఖాసనంబున
నాసీనుం జేసి. 11

క. మునికౌశికుఁ డగుకౌశిక,మునికర్ఘ్యముఁ బాద్యమొసఁగి ముదమున రవిధా
ముని పాదశౌచవరజల, మునిజశిరంబున వహించి బుధులు నుతింపన్. 12

గీ. కాయము పవిత్రమయ్యెఁ ద్వదీయపూజ, నయున యుష్మత్పదాబ్జరజమున గృహము
నమితశోభనములకిర వయ్యె శిష్య,కోటికిని మీరుఁ గుశలమే కుశికవంశ. 13

క. ప్రాణతనుత్రాణధను,ర్బాణకృపాణంబులును గృపాపర యస్మ
త్ప్రాణపదస్త్రైణపదా,క్షీణతలును నీయవియ కుశికవంశమణీ. 14

క. పొచ్చెంబుగ నాడుట గా, దచ్చెరువుగ నిపుడు మీర లందఱుఁ జూడం
జిచ్చుఁ జొరుమన్నఁ జొచ్చెద, వచ్చిన పని యానతీయవయ్య మహాత్మా. 15

వ. అని యిట్లు మస్తకన్యస్తహస్తుండై యున్న దశరథునకు విశ్వామిత్రుం డిట్లనియె.

క. సత్యాధారకులోత్తమ, సత్యసమాధారరాజసత్తమభాసా
సత్యాశ్రయచిత్తమహా, సత్యాంచిత రూపవిను దశరథమహీపా. 17

చ. కుశలమతి న్వసుంధర రఘుక్షితిపాలుని యట్టులన్నిరం
కుశగతి రత్నసల్పు దనఘుండవు ధర్మమతిం ద్విషద్గజాం
కుశ యరుణాంశువంశనృపకుంజర కావున మాకు సర్వముం
గుశలమ యుంచు సాధుసుముఖుండు తపోమహితుండు వెండియున్. 18

క. ద్రోహులు గాధానోన్యస్య,స్నేహులు సందేహులతి నిషిద్ధాస్రమిశ
ద్దేహులు ఖలమారీచసు,బాహులు చండతరదీర్ఘబాహులు వెలుచన్. 19

చ. తవిరిమఖంబు సేయఁటకు దీక్షవహించితి నేని వారు నీ
తివిడిచి యజ్ఞవస్తుపితతిం బలుమాఱును రక్తవర్షము
ల్దివిని వసించి మించి పటుతీవ్రగతిం గురియించుచుండు ర
ద్దివిజవిరోధు లధ్వర ముదీర్ణతఁ బూర్ణము గాకయుండఁగన్. 20

ఉ. వారిరుహాప్తవంశజనవల్లభ వారిటు లెన్ని చేసిన
న్వారిశపించుటం దప మవశ్యము లోపము నొందుఁ గాన దే .

వారివిభేదనక్రమము నాత్మఁ గడుందలపోసి సత్కృపా
వారిధి వైన నీకడకు వచ్చితి మెచ్చితి నీదుభక్తికిన్. 21

శా. ఆపాపాత్ముల సంహరింపఁగ మదీయం బైనజన్నంబు నెం
తేపూర్ణంబుగ నిర్వహించి విలసత్కీర్తిం బ్రతిష్ఠింపఁగా
నీపుత్త్రు రఘురాముఁ బంపు మితఁ డానీరేజపత్త్రేక్షణుం
డీపృథ్వి న్నరుఁడై జనించె ఖలశిక్షేచ్ఛన్ ధరిత్రీశ్వరా. 22

ఉ. ఈతఁడు సర్వలోకగురుఁ డీతఁడు దానవలోకభీకరుం
డీతఁడు మాధవుండు మఱి యీతఁడు మాధవభావభావితుం
డీతఁడు సర్వభూతహితుఁ డీతఁడు భూతలధారి గావునం
భీతి యొకింతయేని మహిభృద్వర పొందకు పంపు మింపునన్. 23

వ. అని పల్కి శ్రీరాము నుద్దేశించి. 24

గీ. తానవారితలీల నిద్దానవారి, దానవారిఁ జంబుచందాన వారి
ముఖకమలములు నిజశిలీముఖకరహతి, వ్రచ్చఁ గళ్యాణయుక్తుఁడై వచ్చె మఱల.

గీ. అనుచు నవ్వాక్యములు వినుచుఁ గర్ణరంధ్రములఁ బడి హృదయాంతరంబు నిండఁ
బ్రజ్ఞ చెడె నవలగ్నంబు భగ్నమయ్యె, మేను మ్రానయ్యెఁ బ్రాణంబు క్షీణమయ్యె.

క. ఉల్లము జల్లుమనఁగ మో, మెల్లను వెల్లఁదన మూన నింద్రసఖుఁడు భూ
వల్లభుఁ డల్లన నమ్ముని, తల్లజుఁ బలుకు స్వరంబు దల్లడపడఁగన్. 27

క. తండ్రి విను రాముఁ డెక్కడ, క్రూరులు రాక్షసులు వారిఁ గైకొనక కడుం
దండించి నిలుచు టెక్కడ, వేండ్రము లీమాట లుడిగి విను నాపలుకుల్. 28

సీ. ముఖపద్మసౌరభోన్ముఖముఖరితశిలీ, ముఖవిముఖుండు రాముండు గలహ
ముఖమునఁ బూర్వాగ్నిముఖశిలీముఖపరాఙ్ముఖుఁ డగు వారిదేవముఖసురప్ర
ముఖులు షణ్ముఖుఁ గూడి మొనయుతే రామునిముఖుల రాము దెస సుముఖుఁడవు గమ్ము
ముఖవిలోచనచతుర్ముఖపతిప్రహార్ప, ముఖ మహేంద్రగిరి దిఙ్ముఖమునీంద్ర

గీ. ముఖ్యదండప్రసిద్ధగోముఖ మటంచుఁ, గరము ఖరకరవంశశేఖరుఁడు దైత్య
ధనము ఖండితమగుఁ డుఁ జిత్తము గలంగ, ముఖము దిగవైచె మౌనిసమ్ముఖమునందు.

చ. ఇటులు నధోముఖుండయి దశేంద్రియవృత్తులు మాని మౌని యై
కిటకిటలాడి కొంతవడికి న్మొగమెత్తి నరేంద్రచంద్రుఁ డ
జ్జటిలునితోడ నిట్లనియె జానుగ నే నటు కేగుదెంచి ది
క్కటనుతకీర్తి నైన మఖముం గాచెద నేఁచెద దైత్యవర్గమున్. 30

క. పేర్చిబలంబుల వేసము, దూర్చికొని మహాత్మ మిమ్ముఁ గూర్చి ఖలవనిం
గార్చిచ్చేర్చుపగిదిఁ బో, కార్చి పవనము నెఱవేర్చి యరుదెంతు వనన్. 31

క. మునిసింహుఁడు నృపకుంజరుఁ, గనుఁగొని సటలునిగుడంగఁ గవలుగదుర ది
గ్గన గద్దియడిగ్గనుఱికి, చననుద్యోగించి యద్దశరథునితోడన్. 32

మ. వినవర్ణ్యంబులుగానివాక్యముల నీవేళం బ్రశంసించినా
వినవంశంబునఁ బుట్టి సూనృతవచోహీనాంతరంగుండ వై
వినయంబు న్నయమున్ భయం బనయము న్విధ్వస్తముం జేసి తీ
వినవర్యు ల్వినుబోలె బొంకఁగల వారే పాతకాభీతులై. 33

క. జ్ఞానంబు విడిచి సూనృత,హీనమ్మున కొర్చినాఁడ వింతియచాలుం
గానిమ్ము పోయివచ్చెదఁ, బోని మ్మనునంతలోన భూపతితోడన్. 34

చ. కడఁగి వసిష్ఠుఁ డిట్లనియెఁ గంజహితాన్వయ మౌనిపాదముల్
గడిగి విశేషభక్తి నొకగద్దియనుంచి మునీంద్రచంద్ర నీ
కడిగిన వెల్లనిత్తు నని యాయనఁ బల్కి కుమారుఁగోరనీ
కడఁగి నిజంబుఁ దప్పుట మహత్త్వమె మెత్తురె దీనినుత్తముల్. 35

ఉ. దాఁప సమస్తవస్తువు లుదాత్తత నిచ్చెద నంచుఁ బల్కియుం
దాపసనాథవృత్తి యుచితంబె కుమారుఁ గుమారధీరునిం
దాపసనాథువెంట నుచితస్థితిఁ బంపు మితండు ధాత్రిలోఁ
దాపసమాన్యుఁ డీతనివిధం బెఱుఁగంగ నశక్య మేరికిన్. 36

క. ఈమునితజ్ఞానికి సుతు, నీ మని మనమంత్రి మేని యితఁ డల్గినచో
నీమునికిఁ జెల్లనిచ్చునె, యీమునికిం జోను గలరె పృథ్వీనాథా. 37

వ. అని చెప్పిన విని. 38

క. గురునిభుఁ డగుగురునాజ్ఞన్, గురుతర మని తల ధరించి గురుహర్షమునన్
గురుఁ డాడుచున్న తన నలు,గురుపుత్త్రులఁ గాంచి కృపయుగురువెట్టంగన్.

క. బాలకుల నహితగజజం,బాలకుల వినీలనీలపరిహాతరోలం
బాలకులను గైసేయఁగ, బాలకచులముఖుల నపుడు బనుపుటయుఁ దగన్. 40

ఉ. తజ్జగదీశునాజ్ఞ ముదిత ల్ముదితాత్మక లై రయంబునం
గొజ్జఁగ తేటనీట నృపకుంజరపుత్త్రిలకుం గ్రమంబున
న్మజ్జనమాచరించి వదనంబులఁ గస్తురిరేఖ లుంచుచుం
గజ్జలముంచి రాట్సుతుల కన్నులఁ గన్నులపండువై చనన్. 41

సీ. అబ్జాస్యయొకతె శుభ్రాంశుకంబు లొసంగఁ, బుష్పంబు లొకతీవఁబోణి యొసఁగ
నొకశైలకుచ బంగరుకటకంబు లొసంగ, గంధం బొకస్మరాశుగనిభ యొసఁగ
ఘనవేణియొకతె ముక్తావళు లొసఁగ భ్రూ,కటియొర్తు రత్నకంకణము లొసఁగ
నొకఘనరసవతి యూర్మిక లొసఁగ రం,భోరువొకతె చంద్రహారముల నొ
గీ. సంగ నబ్బాలురకు సొంపెసంగుచుండ, నిట్లు గైసేయఁ దల్లుల కెలమి మ్రొక్కి
రాజహంసల గతులనా రాజసుతులు, రాజహంసల గతుల విరాజు లగుచు. 42
సీ. తమమందహాసజ్యోత్స్నాపూర మచటిచం,ద్రోపలంబుల నీర మూరఁ జేయఁ
దమకచమేచకతమము భిత్తికల యు, త్తమహీరములను నీలములఁ జేయఁ
దమపదపల్లవోద్గమశోణ మచటఁగూ,ర్చినకెంపులజిగితోఁ జెలిమి సేయఁ
దమవిలోకనసుధాధావళ్య మచటి గృ,హాయులకుఁ దగువితానములఁ జేయఁ
గీ. దమతనూస్వర్ణరుచులవిస్తార మచటి, సకలజనులకుఁ బరమహర్షంబు సేయ
వచ్చి మ్రొక్కిరి మృదుతనూవల్లులకును, దల్లులకు సద్గుణవతీమతల్లులకును. 43
క. మ్రొక్కిన దీవన లొసఁగఁగ, నక్కొడుకుల నెత్తి ముద్దులాడుచు నెంతే
మక్కువఁ జుబుకము లంటుచు, గ్రక్కున నారాజవర్యు కడ కనుచుటయున్.
చ. నలు వగురీతి వచ్చి మునినాథులకు న్నరలోకభర్తకు
న్నలువురు మ్రొక్కి నిల్చిన ఘనంబుగ దీవన లిచ్చి రంతన
న్నలువురిలోన నగ్రజు ఘనాఘనరాముని రాముఁగాంచి య
న్నలువకుఁదుల్యుఁడు న్నియమినాథుఁడు నైనవసిష్ఠుఁ డిట్లనున్. 45
చ. రవినిభ బాలమేల మన రాముసలక్ష్మణుఁజేసి తాపస
ప్రవరుని వెంటఁబంపుము శుభంబగు నీకును నీదునాత్మసం
భవులకు నంచుఁ బల్కుటయుఁ బార్థివుఁడు న్ముదమంది బాణతూ
ణవిహితపాణిహంసుల నొనర్చి తనర్చిన పుత్త్రమోహమున్. 46
క. ఒక్కింతసేపునకు దిగఁ, ద్రొక్కియతీశ్వరునిఁ గాంచి తోడ్కొని చనుమీ
చక్కనిబాలుర నని ధృతి, నెక్కొనఁ గా మఱియు నమ్మునీశ్వరు తోడన్. 47
క. కంటి బహుకాలమున కీఁ,గంటి న్నిమ్మువంటివారికార్యార్థము మీ
కంటెఁ గృపాపరు లెవ్వరు, కంటికి ఱెప్పవలె సుతులఁ గాపాడవలెన్. 48
వ. అని చెప్పి యాక్షణంబున నాక్షోణీపతి యక్షీణక్షణంబునఁ గృతలక్షణులును, సకల
కళావిచక్షణులును, గిల్బిషారణ్యాశుశుక్షణులును, శిష్టసంరక్షణులును, దుష్టజన
శిక్షణులును, ధర్మాన్వీక్షణులును, వినతలాలేక్షణులును, బద్మపత్త్రేక్షణులును,

సమాచరితగురుప్రదక్షిణులును, లక్ష్మణులునగు రామలక్ష్మణుల సమర్పించుటయు
నవ్విశ్వామిత్రుండు. 49

ఉ. ఆడెదు రామలక్ష్మణుల నాదరపూర్వము గాఁగఁ జూచి కొం
డాడెదు రాజుఁ జూచి యిటులాడకు భీతిని నేను వీరిఁ గా
పాడెడువాఁడ నే ధరణినంతయు దుర్దశనొందకుండఁ గా
పాడెదువారు వీరు దునుమాడరె దుష్టుల నన్నికృష్టులన్. 50

వ. అని యూఱడిల్లం బలికి. 51

మ. వెనకయ్యన్నరజన్ముఁ గూడి మహిమ న్వెంచేయుశంభున్వలె
న్వెనుకయ్యన్నయుఁ దమ్ముఁడుం గొలువఁగా వెంచేసె నమ్మౌని పా
వనభూతిర్లలితాంగముం ఘనజటాబంధం బుర న్నాకభూ
వనభూజాతసుమంబులోలిఁ గురియన్ భావంబునం బొంగుచున్. 52

క. కామక్రోధరహితు లరి, భీములు ధర్మావనులుఁ గృపీటజనేత్రు
లోన్మునిఁ గొలుముఖంబుల,తో మునిపతి వెంట దశరథునిసుతు లరుగన్. 53

క. చల్లనిగాడుపు గడువెద, చల్ల నికటభూరుహముల సత్సూనంబు
లల్లని సేసలగుచుఁ బై, జల్లని రాలంగ సంతసమునఁ బొదలుచున్. 54

మ. గణనాతీతలసద్గుణాగ్రణులు రంగత్కాంచి కాకింకిణీ
క్వణనాసేచనకోరువిగ్రహులు లోకాలోకధైర్యు ల్సుధీ
జనమారాయులు రామలక్ష్మణులు భాస్వద్వీక్షణు ల్సార్థమో
జనదూరంబు పయోజబాంధవునియోజ న్మించునమ్మౌనితోన్. 55

క. మది నానందించుచు నెమ్మది నీగతి నేగి ఫేనమహిమ న్నగుచు
న్నదివోలెఁ బొలుచు సరయూనది గాంచిరి రామలక్ష్మణకుమారు లటన్. 56

సీ. పిఱుఁదులకెనయగు పృథుపులినంబులు, వాలసామ్యమగు శైవాలములును
స్తనసదృశంబులౌ చక్రవాకములు నే, త్రములకీడగు శఫరములగములు
బాహులవంటి శోభనబిసంబులు భ్రమ,రకసదృక్షములైన భ్రమరకములు
నాననశోభాసమానాంబుజంబులు, చెక్కులరీతి భాసిల్లుశుక్తు

గీ. లమరుపొక్కిళ్ళఁ బోలిన యట్టిసుళ్ళు, వళులకెనయగు వీచికావళులు గలిగి
వారికేళీసమాసక్తవారిజాన, నారుచిరవోలె మిగులఁ దనర్చు దాని. 57

మ. సరయూశైవలినీలలామఁ గని విశ్వామిత్రుఁ డా రాముతో
దరహిం బల్కుఁ గుమార యి త్తటినిఁ జూడం బంకజామోదయై

వరమహాకంకణహంసకోర్మికనుశోభాయుక్తయై కామినీ
స్ఫురణం బెంపు వహించెఁ జూచితివె యంచుం దత్సమీపంబునన్. 58

క. వనజాతతటమనోహర, వనజాత సుమప్రభూతవరగంధము లోఁ
గొని శీతవాతపోతముఁ, గొనియాడఁగ నిట్టు లలమికొనిన నలయు మన్. 59

ఆ. విశ్రమించి రామవిభురామవిభుఁ గాంచి, వత్స యీజలముల వార్చి రమ్ము
సకలభయనివారణకర మహావిద్యోప,దేశ మొసఁగువాఁడఁ దెలియ ననిన. 60

మ. తనపాదోద్భవ యైనగంగమహిమం ద్రైలోక్యలోకాళిఁ బా
వనముం జేయుచు నుండఁ దాను సరయూవాఃపూరపూతాత్ముఁ డై
మునిసంఘంబులు దన్ను వార్చి ఘను లై మోదించుచుండంగ న
మ్మునియాజ్ఞ న్వెస వార్చి రాముఁ డనుజన్ముంగూడి భక్త్యున్నతిన్. 61

క. కరములు జోడించి జగద్గురుఁడుఁ గళాయుతుఁడుఁ గౌశికుని గురుఁ డనువుం
గరము వినుతించె విద్యా,పరిగ్రహముఁ గోరి నియమిభాగ్యం బసడే. 62

క. ఈపగిది నిభృతుఁ డైనమ,హీపకుమారకుని సంయమీశ్వరుఁ డభయ
ప్రాపకబలాతిబలవి,ద్యాపరిణతుఁ జేసి మఱియు నమ్ముని పలుకున్. 63

చ. సనకసనందనప్రముఖసన్మును లీవహనీయవిద్యలం
దనర బఠింతు రధ్వములఁ దానవబాధలు మానసీవ్యథ
ల్దనకవు క్షుత్పిపాసలును దార్కొన వెంతయు సంతసం బగు
న్వినుము నృప యీసువిద్యలను వేడ్క భజించిన యంతలోననన్. 64

క. కొనియాడుచు విద్యలు చే,కొనియాడుచు ననుజుఁ గూడికొని వాక్షించెం
దినవాథుఁ డస్తగిరి నొం,దిన నాఘరణీశసుతులు దృణతల్పములన్. 65

క. ఆరాత్రి నిద్రఁ జెందిరి, యారాత్సరయూతరంగజానిలములను
న్వారిరుహాయతనేత్రులు, వారిరువురు వేడ్క మానివర్యసహితు లై. 66

వ. ఇట్లు నిద్రించి విశ్వామిత్రప్రబోధితు లై కాలోచితకృత్యంబులు నిర్వర్తించి. 67

క. వేగంగ మనోముదమున, వేగంగ మనోన్ముఖులయి విద్విషులు మది
న్వేఁగంగ మానియుతు లై, యేఁగంగ బవిత్ర యనుచు నేగంగఁ దగున్. 68

గీ. అట్టిజాహ్నవిఁ గని ద్యుమణ్యన్వవాయ,మణులు రమణీరమణులు లక్ష్మణులు రామ
లక్ష్మణులు సంతసమున నేలాలతానుకూలకూలంబు నంత మ్రొక్కుచును జేరి. 69

చ. లలితతరంగరంగమునలాస్యము సల్పుచు నున్నరాజహం
సలు జలపానలోలుపలసద్విపయూథపపఙ్క్తి మేఘమం

డిలము లటంచు భీతి గగనంబునకు న్వెసఁ బాఱి బారు లై
యులరెను శారదాభ్రములు బట్టులు చాతకభీతిసేయుచున్. 70

చ. కమలవనీవిహారమునఁ గొను పరేణుసమావృద్ధ మై
యమరెఁ గనుంగొనంగ మధుపాళి సువర్ణత గాంచియుంక నె
ట్టిమలినులైనఁ జేరిన ఘటింపదె యోగ్యత యందుఁ గౌశికుం
డు మతి యుఁ దన్ను సీవరమనోజ్ఞమహాత్త్వముఁ దెల్పుచుండఁగన్. 71

క. అంగములు వొంగ రంగ,ద్భంగము మజ్జజ్జనాఘభంగము జలమా
తంగరథాంగము సరయూ,సంగముఁ దటవానుప్రసంగము నెనరన్. 72

వ. కనుంగొని రంతం దత్సమీపప్రదేశంబున. 73

సీ. తాలహింతాలరసాలసాలతమాల,కృతమాలపనసాలనితతిఘనము
నృపకంఠనీలకంఠోత్కంఠకలకంఠ,కలకంఠరుతమనోజ్ఞప్రదంబు
సారవిసారవిస్తారసారసహార,సాధారకాసారకాన్వితంబు
రంగత్కురంగాభిమంగభృంగాంగనా,భంగసంగీతశోభాయుతంబు

గీ. గండభేరుండసదవేదండకాండ,గండశోద్దండపుండరీకప్రచండ
జీవజాలావనము మునిజీవనంబుఁ, బావనం బగు నొక్కతపోవనంబు. 74

క. కని రాముఁ డెవరియాశ్రమ, మని మునిపతి నడుగ నాతఁ డావరమున ని
ట్లనియె ఘనాఘనగర్జా,ధ్వని దశదిగ్వదనదశనధవళిమ మెఱయన్. 75

క. విను కామాశ్రమ మిది రా,మనృపాలక తొల్లి మూర్తిమంతుండై పా
వననిష్ఠుం గందర్పుఁడు, ఘనతప మొనరించె నిందు గరళగళుండున్. 76

చ. పరమతపంబొనర్పఁ గని భర్గుని కయ్యమతోడిపాత్తుఁ గూ
ర్తు రహీనటంచు దేవవితతు ల్వినుతు ల్ఘటియింప నేగి చె
చ్చెర హరుచిత్తముం గలఁగఁ జేసిన నాతఁ డెఱింగి మారు భీ
కరనయనాగ్ని దగ్ధునిఁగా నొనరించె నిమేషమాత్రలోన్. 77

ఉ. కాముఁ డెఱుంగునే యుచితకాలగతు ల్దనుఁ డిట్లు భీముఁ డై
భీముఁడు చూడ దగ్ధుఁ డయి పృథ్వి చలింపఁగ వ్రాలె వ్రాలిన
వ్రామ తదంగసంగమున రాజిలు నివ్విషయంబునం గసం
జ్ఞామహిమంబు వొందె నని గాధిసుతుం డెఱిఁగించి వెండియున్. 78

క. వినుమిది నృపాల యుభయసరిన్మధ్యము ఘనకలుమపరిక్షయ మిచ్చో
టన్నన మీనినశేషంబు నృతి రేపు యుఁ గడపి ప్రొద్దు వోడుదినన్. 79

క. సంధ్యాకాలికవిధు లన,వంధ్యగతిం దీర్చి జ్ఞానవారితనిజచి
త్తాంధ్యు లగువారు కౌశికు, వింధ్యాచలధైర్యుఁ గాంచి వినమితు లగుడున్. 86

ఉత్సాహ. వారి నాదరించి మానివల్లభుండు జాహ్నవీ
వారి వే తరించి పోవ వాంఛచేసి పూజ ల
వ్వారిగాఘటించి మ్రొక్కి వచ్చుమానివర్యుల
న్వారియాశ్రమముల నుంచి భావ మంచితంబుగన్. 87

క. తరణి యుదయించుచుండఁగఁ, దరణికులాభరణు లన్నదమ్ములు గొలువం
దరణిన్ భవభయసాగర,తరణిన్ జాహ్నవిఁ దరింపఁ దా నుద్యతుఁ డై. 88

గీ. యానపాత్రమహామనుధ్యాని మౌని, యానపాత్ర మధిష్ఠించి యరుగుచుండ
వటి గరము వొంగె హరిజగన్నాథుఁ దాల్చు,కతన భువనప్రసిద్ధి గాంచితినటంచు.

గీ. పావనావనుధేశనందనులు రామ,లక్ష్మణులు లక్ష్మణాలు పుణ్యులవారిఁ గడచు
నెడల నెడలనిరవముల నెలమినాల,కించి కించిజ్జదూరు నక్షీణపుణ్యు. 90

ఉ. కౌశికుఁ జూచి మౌనిజనకౌశిక యిమ్మధురారవంబు లి
ట్లాశు గతిన్వినంబడియె నాకుగవృత్తి వశంబునంద యా
వేశతచి తృత్తి వతివేడ్క సదభ్రమహాభ్రఘోషనీ
కాశఘనోత్కులం దెలియఁగా నెలవి మ్మవి యెందుఁ బుట్టెనో. 91

వ. అనుటయు. 92

క. సరయూగంగాసంగమ,తరంగసంఘట్టనాద్భుతప్రభవమహో
త్తరనినదము లివి మ్రొక్కుఁడు,కరము వినీతు లయి ఫాలఘటితాంజలు లై. 93

వ. అని యానతిచ్చుటయు. 94

క. వలరాజుసోయగముఁ గ,ల్వలనే ల్గన్నులును గలకవలవాంపుడ
వ్వలను గనుంగొని మ్రొక్కుచు, వలసినయవి యెల్ల మానివలనఁ దెలియుచున్.

క. కలమాదిసస్యములు విచి,కలమాలూరాదిలతలు ఝ్మోజాతంబు
ల్గలమానితతీరంబునఁ, గలమారానుతులు డిగిరి కౌశికయుతు లై. 96

క. వలిగాడు పెదిరికొన న,వ్వలియొడ్డునవిట్లునావ వదలి యరుగుచు
న్వలిముఖులులాయశరభా,వలి ఘేరవఘోరతరరవలి గలదానిన్. 97

గీ. భీకరం బగుదాని శమీకతింత్రి,ణీకశమ్యాకపటుతిక్తశాకశాక
పీలుకాశోకవితతశేఫాలికామ,ధూకబంధూకవటముఖానోకహములు 98

క. కలిగితమోదూషిత మై, ఖలుంచి త్తమువోలె దురవగాహం బై కా
కుల పెనుమూఁకలచే సం,కుల మగుదాని నొక పెద్దకోనం గనిరొయ్యన్. 99

చ. కనుఁగొని యయ్యగస్త్య మగుకాననమెవ్వరిదో మునీంద్రచం
ద్ర నుడువు మంచు వేఁడిన నతండు మహోదరణంబు మీఱ రా
మ నగవిభేది వృత్రుఁ బరిమార్చిన బ్రాహ్మణహత్య చుట్టుము
ట్టినఁ దగఁ దద్వినాశము ఘటింపఁ దలంపమునీంద్రబృందముల్. 100

ఉ. మానులఁ గూడి పావనకమండలశీతలవారిసేచనా
నూనవిధానము ల్సలుప నుత్కటమౌ మలదుష్కరూశము
ల్మానవనాథపుత్త్రి విను మానగభేదితనుచ్యుతంబు లై
మానుగ నిమ్యోడం బడె నమర్త్యులు మానులు సంతసింపఁగన్. 101

క. ఇద్ధరణిపయిం బడిన, న్వృద్ధశ్రవుఁ డంతటం బ్రహృష్టాత్ముం డై
శుద్ధతనుఁ డయ్యెఁ బిదపఁ బ్రసిద్ధముగా మలకరూశచిహ్నిత మగుటన్. 102

క. మలదకరూశము లనుచు వి, మలదయ నామములు వెట్టి మానితదేశం
బులు ధనధాన్యసమృద్ధం, బులు రెం డొనరించె సురలు మునులుం బొగడన్. 103

ఉ. ఇందునిభాస్య రామ విను మీఁగతి సొం పెసలారుచున్న సం
క్రందననిర్మితంబులు పురంబులు చేరి దయావిహీన యై
సుందునిభార్య క్రౌర్యమునిశోషిణితాటక చాలనార్తు లై
యందలిమానవు ల్బెగడ నందఱ మ్రింగెఁ గ్రమక్రమంబునన్. 104

క. మందుని సిరివలె మనుజుల, మందునకు న్లేకయుండ నదయునఁ దినెనే
మందు నరేశ్వర వరలే, శం దునుమాడంగ బలసమగ్రుఁడు లేమిన్. 105

క. తనకంటెన్ డళి తనయుఁడు, తనతనయుఁడు క్రూరుఁ డగుచుఁ దత్పౌరుల మ్రిం
గ నలరి యమ్మారీచుని, జననియు నధ్వగులఁ జంపు జనని యయుతములన్. 106

క. అప్పటి నుండియు రాఘవ, యప్పట్టణయుగము శూన్య మయియుండుటచే
నిప్పగిది మార్గములు కడు, నొప్పక దుర్గమము లగుచు నుండు ననయమున్. 107

మ. ఇటు లాతాటక యగ్ధతౌజనమున స్స్వేచ్ఛావిహారంబునం
దిటు మెప్ప న్నివసించు దాని కెదు రై దేవేశుఁడుం బోవలేఁ
డటుగాన న్వెస దానిఁ జంపి యశ మత్యంతంబుఁ జేకొంటు క
చ్చొటుకుం బోవఁగ నీకుఁ దక్కవశమే క్షోణీశ యెవ్వారికిన్. 108

వ. అని మతియుం దజ్జన్మబలపరాక్రమప్రకారంబు లుపన్యసించుచుండం బాటితసవన
పాత్రిక యగుతాటక యున్న వనంబున కభిముఖు లై చనిచని 109

చ. మునివరు నాజ్ఞ దుష్టమృగము ల్బెగడొందఁగ సన్మునీశ్వరు
ల్వీని ముద మొంద రాముఁ డరవిందదళాక్షుఁడు దక్షుఁ డై కరం

బున విలు సుందరం బెసఁగఁ బూని భుజాబలసూచకంబుఁ గా
నినదులసూత్రిమౌర్వి మొరయించె దిగంతర దంతురంబుగన్. 110

గీ. అమ్మహాధ్వని నిజహృదయమ్ము గలఁపఁ, బోతరమున సుకేతునికూఁతు రంత
నఖిలజనములు బెగడంగ నార్చికొనుచుఁ, బండ్లు గొఱుకుచుఁ ద్రుళ్ళి పైఁ బాఱుదేర.

క. కని రతివిశాలకుక్షి, న్మనుజామిషభక్షిణిని సమర్త్యవిపక్షిన్
ఘనసవనకరేణుని బ్రహ్మణగుణహార్యక్షి లోహితాక్షిన్ యక్షిన్. 112

వ. కనుంగొని రాసమయంబునం బవిత్రచరిత్రుం డగువిశ్వామిత్రుండు దశరథాగ్రపుత్త్రున
కిట్లనియె. 113

క. మానిని యను ననుమానము, మాని నియమిమాఁత్రి దీని మడియింపుము రా
మా నిను యశంబు వొందెదు, మానియమితవృత్తి నీవు మానితము గదా. 114

సీ. అనుచు మహాప్రేమ నా రామునకు మౌని, యానతి యిచ్చుచో నన్నిశాటి
కడురజఃకలితన స్ఫురణినమ్ముఖ్వర, మించి రజోవృష్టి ముంచి ముంచి
దూషితం బగుతమోరూషిత నని తెల్పు,మాడ్కిని మాయాతమంబు నన్ని
హెచ్చుసత్వము పొట్టవచ్చిన లేదు క,నుంగొనుఁ డనుభంగి నోరు తెఱచి.

గీ. చిత్తము శిలామయం బని చెప్పునట్లు, పరుషపాషాణవిసరము ల్వఱపి వఱపి
వారిజాప్తేద్ధతేజుల వారి గ్రింగఁ, డాయఁ జనుదెంచెఁ గాలఁబు డాయుకతన.

వ. వెండియు నన్నక్తంచరి. 116

ఉ. మానక పైపయి న్వివిధమాయలు పన్నుచు దుష్టచేష్ట న
మ్మానవనాథనందనుల మానవమాత్రులఁగాఁ దలఁచి దు
ర్మానమదాతిరేకమున మానస మంతకునంత కుబ్బ న
మ్మానవమాంసభోజి యనుమానము మాని పరాక్రమించినన్. 117

క. కని రాముఁడు తన్మాయా,వినివర్తితశరము వఱపి వితతకృపం దీ
నిని జంపుట యెట్టులు మా,నినిజంపుట దోష మండ్రు నిగమవిచారుల్. 118

వ. అని దయాస్వరూపిగావునం బాపి నక్కామరూపిణి విరూపిణిం జేయనిరూపించు
సమయంబున సమీపించి విశ్వామిత్రుండు. 119

ఉత్సా. రామ సద్గుణాభిరామ రామ యంచుఁ గ్రవ్యభు
గ్రామ నిష్ఠ చంపకుండరాదు పిన్నతొల్లి సు
త్రామవందితుండు చక్రధరుఁడు భృగునిభామ ను
ద్దామ దుష్టకామఁ జంపి దాన దోష మొందెనే. 120

వ. కావున. 121

సీ. తాటకను వధించి తపసుల మెప్పించి, గహన మివ్వనము నిష్కంటకంబు
గావించి పుణ్యంబు గట్టికొ మ్మదియును, గాక మదాజ్ఞ నిక్కముగ నాతి
జంపిన నీకుఁ దోషం బగుఁగాని దోషంబు గా దిదె ప్రమోదంబు దాయుఁ
జనుదెంచెనేని రజనిచరులకు బలఁ, బధికంబు గావునఁ బథిక లలర
గీ. దృఢభవద్బాహుబల మాదితేయు లెల్ల, వినుతి సేయంగ రక్కసు ల్వొరగ నొంచ
దీనిఁ బోనీకు మనుడు నమ్మౌని యాజ్ఞ, నంబుజాతేక్షణుఁడు సంశయంబు మాని.
ఉ. వైపయిఁ బ్రస్తరంబులును బాదపము ల్నిగుడించి మించి యే
వైపునఁ దాన యొకడై ల్రతమ్ముఁగ నార్చుచు యుక్తి కుక్షినా
క్షేపితపక్షిరాజ మనఁ జెన్నగుచున్న ప్రమత్త మేయుచున్
నైపుణ తత్సహస్రగజసత్త్వము వమ్మయికూలె సోలుచున్. 123
క. ఆరామ యురంబున నీ, ట్లా రామశరంబు పటుతరార్భటిఁ దాఁకెన్
ఘోరం బగు తద్రూపము, నీరంధ్రై తోరఁగాఁ దపసినికరం బలరన్. 124
క. హాటకవర్ణుఁడు రిపుకర,హాటకకలహంసధైర్యహాటకగిరిని
ష్కూటకుఁ డనుజుఁడు మే లనఁ, దాటక మునియాజ్ఞ నడుగు దాఁటక కూల్చెన్.
క. మునిపతి కౌతూహలమున, మునిఁగి భుజాద్రక్షణవిత్తముని సద్గుణధా
ముని రాముని నాతనిత,మ్ముని శాస్త్రవశైస్త్రాక్రముని నగ్గించెన్. 126
వ. తత్సమయంబున. 127
శా. రాముం బుణ్యగుణాభిరాము భువనత్రాణైక కాము న్మహో
ద్దాము న్నిగ్రహకాముఁ జూచుటకు సుత్రాముండు బృందారక
స్తోమంబు ల్దనుఁగొల్వఁ గల్పసుమవృష్టు ల్మన్నగా వచ్చెఁ జే
తోమోదంబునఁ గౌశికుండు భయభక్తు ల్మెఱ నగ్గింపఁగన్. 128
వ. వచ్చి వృద్ధశ్రవుం డమ్మువ్వుర నభివందించి ధామనిధ్యన్వవాయపయోనిధిసుధాధా
ముం డగు రాముం గనుంగొని విశ్వామిత్రున కి ట్లనియె. 129
శా. అత్రాసంబునఁ దాటక న్వివిధమాయానాటకం దున్మెనో
క్షత్రాణైకపరాయణత్వమున లోకాలోకధైర్యధ్యుఁ డీ
పుత్రాగ్రేసరుఁ డాదివిష్ణుఁడు కృపన్ భూభారముం దీర్ప గా
మిత్రాఖ్యాన్వయవార్ధిచంద్రుఁ డయి జన్మించె న్మునీంద్రోత్తమా. 130
ఆ. మఱియు నితఁడు దుష్టమార్గులఖండించి, శిష్టజనులఁ బ్రోది సేయుకొఱకు
మహితకరుణతోడ మానవాకారుఁడై, యవని నవతరించె ననుచుఁ బలికి 131

క. శస్త్రాస్త్రసముదీర్ణనృపపం, చాస్త్రునకీ విశ్వామిత్రయకుమారునకున్
స్వస్త్రాభరణంబులు గదా, శస్త్రాస్త్రము లట్లు సంతసముగా నొసఁగెన్ 132

క. భీకరతరకౌశిక నా, నాకౌశిక మగువనంబున న్మౌని వినుతుం
డాకౌశికు వీడ్కొని చనె, నాకౌకసు లెల్లఁ గొలువ నాకౌశికుఁడున్. 133

మ. అకలంకం బగు వస్వదన్వయసముద్రాబ్జుండు రాముండు కౌ
శికు వెంటన్ జనకాజ్ఞ నేగి యట దోషిం గ్రూరఁ ద్రైలోక్యకం
టకి యాతాటకఁ ద్రుంచె నంచుఁ దెలియ న్బ్రాతాశిలోకంబువా
రికిఁ దెల్పం జనుభంగి నవ్యపరవార్ధిం గ్రుంకె మిత్రుం డొగిన్. 134

క. సమయకదంబకదంబక, మమరం బుష్పించి యతిశయం బగు నాకా
శ మనెడుతటాకమున నొ, క్క మొగిం బువ్వాల్చె నన్నగతి సంజయుఁడెన్ 135

క. తత్సమయోచితకృత్యము, లుత్సాహపురస్సరముగ నొనరించి కడు
న్వాత్సల్యంబున వత్సల, నుత్సంగముఁ జేర్చి ప్రీతి నుపలాలించెన్. 136

వ. ఉపలాలించి. 137

క. పుణ్యజనరహితవింధ్యా,రణ్యంబున రాజపుత్త్రరత్నంబులతోఁ
బుణ్యస్థలమున సుగుణా,గణ్యుఁడు నిద్రించె నగ్రగణ్యులు పొగడన్. 138

ఉ. గ్రామణి సేవితుండు చతురత్వఘనుండు నిపాతితేంద్రియ
గ్రాముఁడు గాధినందనుఁడు కాశ్యపిసారథి వేడ్కఁ బూర్వది
గ్రాము నలంకరించుటకుఁ గా జను దేరకమున్న భీమసం
గ్రాముల రామలక్ష్మణుల గాఢదయామతి మేలుకొల్పెనన్. 139

క. లలిమేల్కని యానృపపుత్త్రులు కృతకృత్యు లయి శర్మదుం డగుమునియుం
ఘ్రుల వాల్చిల నెత్తి ముదమునఁ, నలఘుఁడు దీవించి శిరము లాఘ్రాణించెన్. 140

వ. ఇట్లు గాఢాలింగనపూర్వకంబుగా గారవించి చారుమేఘశ్యాముం డగు రాముం గనుంగొని కామరూపంబు లగురూపంబు లొసంగెదం గొను మని పరిహాపితనిర్వక్రహారిభుజాదండచక్రం బగుదండచక్రంబును వినాశితనిశాచరచక్రంబును పాలితధర్మచక్రంబగు ధర్మచక్రంబును విపక్షహృదయశూలం బగుశూలంబును నిరాదృతకాలపాశం బగు కాలపాశంబును విబుధమాయావంతంబగుమాయావంతంబును దృఢశక్తి యగుశక్తియు దుష్టసంవర్తం బగుసంవర్తంబును బ్రహ్మాస్త్రబ్రహ్మశిరోస్త్రనారాయణాస్త్రంబులును నశనినిభంబు లగుపద్మనాభ మహానాభ సునాభసర్వనాభంబులును మఱియుం బేరుగల నానాముఖంబులగు శిలీముఖంబులును సంప్రయోగోపసంహారక్రమపూర్వకంబుగా నొసంగుటయు శుచీభూతుం డై పరిగ్రహించి య

బ్బాణంబుల నుద్దేశించి మిమ్ముం దలంచినప్పుడ రావలయునని నిర్దేశించి యనుజసమేతుం డై కౌశికు నాలోకించి పునఃప్రణామంబు లాచరించి యవ్వలం జనుచుండి నిబిడీకృతప్రకాండకాండం బగునొక్కతరుషండంబుం గనుంగొని యివ్వనంబున ఘనం బగుతపం బొనరించిన మహాత్ము లెవ్వరనుటయు నిది త్రివిక్రమదేవు పూర్వాశ్రమం బనియెఱింగించి విశ్వామిత్రుండు వెండియు నిట్లనియె. 141

ఉ. బలియను చక్రవర్తి గురుభార్గవశాసనవర్తి లోకము
ల్బలిమియుఁ దనంగఁ జేర్చి సురపాలకు నోర్చి కడంక నిర్జరా
వలి వెసఁ దోలి వారల నివాసము లోలిఁ బరిగ్రహించి దై
త్యులఁ దగ నేలి జన్నము లనూనముగా నొనరింపుచుండఁగన్. 142

క. నాకౌకసులు వనౌకసు, లై కడుదుర్దశల నొందనదితి వికలశో
కాకులితమానసాంబుజ, యై కశ్యపుఁ జేరి వినత యై యిట్లనియెన్. 143

క. నా పుత్త్రులు దితిపుత్త్రులు, రూపింపఁగ నీకు నొక్కరూప యయిన స
ద్వ్యాపారుల నేలుట దు, ర్వ్యాపారుల వాజ్ఞ సేత న్యాయము కాదే. 144

వ. అని తన తనయులకుం దన సవతికొడుకులవలన నైన యుపద్రవం బెఱింగించి సురలకు శుభాపాదకం బగుదాని నానతీవే యంచు నుడుగక వెడలు నశ్రుకణంబుల నతని పాదంబు లభిషేకించుచున్నం గనుంగొని తపోవిశేషంబున సర్వంబు నధిగతం బగుట నొక్కింత విచారించి కశ్యపుం డిట్లనియె. 145

మ. తరుణీ యేటికి దుర్వివేకగతి సంతాపించె దుద్యద్దయా
పరు సర్వేశ్వరు నాశ్రితార్తిహరణప్రావీణ్యలక్ష్మీమనో
హరు భూతాత్మకుఁ బూజ సేయ నఖిలార్థావాప్తి చేకూఱు శ్రీ
హరి సేవించినవారికిం గలవె దైన్యక్లేశసంతాపముల్. 146

చ. అని ప్రియమారఁ బల్కి తమిఁ బ్రియాసహితంబుగ నివ్వనంబున
న్వినుతతపం బొనర్పఁ గని విశ్వమయుండు జనార్దనుండు స
జ్జనసులభుండు వారి దగు శాంత తపోవిభవంబు మెచ్చి మీ
తనయుఁడ నై బలిం జెఱచెద న్సురలోకము వజ్రి కిచ్చెదన్. 147

క. అని యంతఁ దిరోహితుఁ డై, చని యమ్మునిదంపతులు భృశం బగుసంతో
షనిమగ్నులుగా విష్ణుఁడు, జనియించెం గశ్యపాగ్రసతికి నదితికిన్. 148

క. వామనమూర్తిం గశ్యపు, వామనయన కనిన విరులవానలు గురిసెన్
రామమహేశ్వర వినుమా, వామనునకు నీకు భేదభావము గలదే. 149

క. ఉపమాతీతుఁడు హరి కశ్యపవనజాననున కాత్మసంభవుఁడై తా
నుపనీతుఁ డయ్యెఁ దగ నెఱిఁగి పఠింపక పొందె వేదగీశ్చయ మతనికిన్. 150

ఉ. ఆతఁడు తల్లిదండ్రులకు నన్నలకుం బ్రియ మాచరింప దై
త్యాతత నైజ గంధము లయం బొనరింపఁ దలంపు గల్గి ని
గూఢదశ బ్రియుం డగువిరోచననందను జేరి యమ్మహో
దాత కడంగి శాస్త్రవిహితమ్ము గునర్చన లెల్ల జేయుచున్. 151

మ. కులగోత్రంబులు చెప్పి మ్రొక్కుటయు సక్కుజ్జుండు దీవించి యా
క్కులగోత్రాచలధైర్య దైత్యుఁ గని గక్షోనాథ ని న్నెల్లది
క్కులగోత్రామగులుం బ్రదాత వను మం గొండాడఁగా మూఁడె యు
గ్గులగోత్ర న్నినె వేఁడవచ్చితి మరుద్గోత్రాటవీపావకా. 152

క. ఇమ్మాగనీనోపిన వా, కిమ్ము. పదత్రయధరిత్రి నిది యిచ్చుటచే
సమ్మతివడి నీసర్వస్వ మ్మిచ్చినయంతసంతసమునఁ బొదలుదున్. 153

క. అను నెడ భార్గవుఁ డీవల, దనినుడిగిన నుడుగకయె విప్రునకు నొసఁగు దై
త్యునిఁ గొనియాడుచు దానమ్మును గొనియెం బాలుఁ డుదకపూర్వము గాఁగన్.

వ. ఇట్లు విశ్వంభరాదానాదాన మాదానవవదాన్యచేతం బరిప్రాప్తం బగుటయు సన్ము
నిజనంబులు మహామహుం డనియును, సర్వవ్యాపకుం డనియును, నాద్యంతరహితుం
డనియును బొగడువచనంబులు నెగడింప దలంచినచందంబున బ్రహ్మాండకరం
డంబు వగుల మిగులం బెరిఁగి యొక్కపాదంబున వసుంధరయు నేఱొక్కపదంబున
వియత్పథంబును సమాక్రమించి త్రివిక్రముఁడై యధికబలు బలి న్బంధించి కరుణాక
సంబున రసాతలంబునకుం బుచ్చి పిష్టపాగ్రగణ్యం బగుత్రివిష్టపంబు విష్ణుఁ గొసఁగి
కృతకృత్యుం డయ్యెం బ్రసిద్ధం బగునీసిద్ధాశ్రమంబున ననేకులు సిద్ధిం బొందిరని
చెప్పిన మహానందభరితుం డై భరతాగ్రజుండు 155

క. కంటిమి పుణ్యాశ్రమములు, వింటిమి సత్కథలు మిగుల వేడుక మునుమున్గం
గంటిమి తీర్థంబులఁ గడు, మంటిమి నీకరుణ సుగుణమహితాభరణా 156

క. అని చాతుర్యంబునఁ బల్కినరామునిపల్కు లాలకించి ముని ముదం
బునఁ బొంగి రామ నీ వెఱుఁగనియర్థము గలదె ముజ్జగంబులయందున్. 157

వ. అని మఱియు నిట్లనియె. 158

సీ. విత్రాసముగ నీపవిత్రాశ్రమమ్మున, సవన మొనర్ప నుత్సవముతోడ
దొరఁకొన మునులకు దొరకును గడుభీతి, గలిగించి కలఁగించి కలవాఁ బన్ని

మోదమున నధికసమ్మదమున మునుల క్రతువులు ల్పాపాణపూర్వకముగఁ
జేతుర్వ్యాఘ్రగు లిట్టిపూర్వఘోరముగ వర్షించి చిత్తముల హర్షించి విఘ్న
మాచరించి పోరు రట్టులు గాకుండ, సహజబలవిరాజు సహాజుఁ గూడి
రాక్షసుల వధింపు రక్షింపుము మదధ్వరంబునకు నిరంతరాయముగను. 159

అని సవనోన్ముఖుఁడై పల్కిన రాముం డిట్టు లనియెఁ గృతపుణ్యుఁడ వీ
వొనరించెదు వినుతాధ్వరమునకు విఘ్నంబు సేయఁ బురహరువశమే. 160

నీ కరుణ గలిగెనేని య,నేకానీకములు వచ్చెనేనియు వెసఁ బో
నీక వధింతుము యజ్ఞని,రాకరణాల రక్కసుల దిరం గుశిక్తిఁ. 161

• అంచు రామునకు సాహజుండయు నుహోహాస్యంబునం బల్కఁగా
వించు నమ్మచున మించి మించుశశిధివిం దద్వాక్యంబుం బ్రవే
శించె స్వాచితహేమ్య లందలి మునుల్ సేవించి పూజింపఁగాఁ
జెంచచ్చాపకళాధను ల్నృపసుతు ల్నబ్భీతులై వెండఁడన్. 162

వృత్తులతాపకీయతా,న్వీక్షిత ముఖతద్వనమున విశ్వామిత్రుం
డతీక్షణక్షణముగఁ గ్రతు,దీక్షితుఁడై యొప్పె రామదేవుని యాజ్ఞన్. 163

ఎమలు నాఁ దరుణోదయంబున. 164

కృతకవిదూరమానసుఁ డకిల్బిషుఁ డమ్మని సత్వరంబునం
గృతకరణీయుఁడై మహామునీంద్రపుగవ్యప్రియుఁడై కదుంబరి
వృత్తి మగుభూతధాత్రిపయిఁ గేవలమానిత నగ్నికార్యముం
గృతమతి నాచరింపఁదొడఁగెం దతమూదచయాఖిలాశుఁడై. 165

వ. అంత రాజపుత్రు లాఱుదినంబుల,దీక్ష యనుదమునులు దెలుపఁ దెలిసి
సవనవిఘ్నకరుల సమయించి కాకకు, నిష్టమిల్ల దీర్ప నిచ్ఛసేసి. 166

శా. చాపము లెక్కువెట్టి యురుచాపలు లాపలలాము లెప్పుడే
వైపునుండి వచ్చినను బ్రచ్ఛేద మంచుఁ గడంగి ధీరులై
చూపులు ద్రిప్పకే దిశలు చూచుచు నిద్దఱు నేఁ చిత్తులై
గోపిక నట్లు కాచికొని యుండిరి దక్షత రామలక్ష్మణుల్. 167

ఆ. అట్టు లయిదుదినములైన నాఱవదివ, సమున నమితసంతసమున మౌని
వేల్పుహోమఘూమవితతి యభ్రంబున, నభ్రసమితి యట్టు లావరించె. 168

ఉ. మేచకహోమధూమవతిమేదురమై గగనంబు ముట్టినం
జూచి నిశాచరుల్ కనదనూనబలులు ధర్మవివర్జితక్రియా

నీచులు తన్మఖంబు మహనీయతఁ బూర్ణము గాక యుండునా
లోచనచేసి రేఁబగలు ఖలు లధ్వరధర్మవినాశ మెంచరే. 169

శా. మారీచాదులు మానుషాను లతిదుర్మార్గస్వభావంబుల
న్మారీతు ల్దలపోయ కీతఁ డనుమానంబు న్విసర్జించి యి
ట్లారూఢిం గడు నాచరించు సవనవ్యాపారముం జూడఁగా
నైరింపం బని లేదటంచుఁ గురియ న్సాగించి రస్త్రౌఘముల్. 170

గీ. విబుధహిత మగుధర్మంబు విపుల మగుచుఁ, బుణ్యజనులకు సమ్మతంబుగ నెసంగు
విబుధహిత మగుధర్మంబు విపుల మయ్యెఁ, బుణ్యజనుల కసమ్మతంబుగ, నెసంగు.

ఉ. ఆగతి యజ్ఞవిఘ్నకృతికాగత మైనసుబాహుముఖ్యర
క్షోగణవీక్షణం బధికకోప మొనర్పఁగ సానుజుండు ధై
ర్యాగము రామభద్రుఁడు శుభాయతలోచనపుండరీకము
ల్రాగముఁ జెంద వారలశిరంబు లిలం బడ నేయ నెంచుచున్. 172

క. సవ్యకరంబున ననుపమ,దివ్యం బగుధను వమర్చి దృఢశక్తి న్వా
యవ్యాస్త్రము సంధించి గ,ణావ్యాహతరీతిఁ దాటకాత్మజు నేసెన్. 173

క. ఆశరమారుత మురవడి, నాశరు మారీచు నెత్తి యాక్షణము పయో
రాశిఁ బడవైచె మఱియుం, దాశరథి గడంగి భీషణం బగుదానిన్. 174

క. దమునో స్త్రము తమ నాదం,బమునం భంగింప నాత్మఁదలఁచి మహో
దమునఁ జెలంగు సుబాహు మ,దము నణఁపఁ దలంచి యుద్భటమున విసుగుచున్.

ఉ. సాహసవృత్తి నీతి నిశాచరు లత్యయముగా నొనర్చి నా
సాహసికేంద్రచంపకుఁడు సారజలుఁడు మహీమహోజ్జ్వల
ద్బాహుజవంశ్యవర్యుఁడు సుబాహుఁడు నైచిరోప మగ్రతం
బాహుజవంబురూపఱ సుబాహుని గూల్చె నిమేషమాత్రలోన్. 176

గీ. ఆశుగతి నంత విహితాశుగాశుగమునఁ, దక్కునిశాచరుల నెల్లఁ దక్కనీక
యక్కజంబుగ నొక్కట నుక్కడంచె, దక్కుఁ గూను మునిపతులు ముదమ్మునొందఁ.

ఉత్సాహము. అంతరాయ మొందకుండ యజ్ఞపూర్తి యైనచో
నంత రామమూర్తిఁ గాంచి యమ్మునీంద్రుఁ డనియె న
త్యంతరాగరసము మీఱ నఖిలసన్మునులను నీ
వంతరాత్మ వనఁగ నెగడు దవనియందు బుధులచేన్. 178

గీ. మఱియు నమ్ముని రామలక్ష్మణులఁ గొంచు,గొంచి నా వెంట జంట నేతెంచి తాట
కాసుల వధించి జన్నంబు నరసి ప్రోచి, ధరణిఁ గృతకృత్యు లైతిరి తమ్ములార. 179

క. చెనక వశము గాని మహీ,జనకతినుల రక్కసులను సాధించిరి మీ
జనకు నిదేశంబున నిఁక, జనకునిదేశంబునకును జనఁగావలయున్. 180

క. తద్విషయము భావన మే,తద్విషయము వినుఁడు జనకధరణీవిభుఁ డం
చద్విధి సవనార్థము బల,వద్వృషభయుగంబు యుగము బంధించి కడన్. 181

క. పూత మగుచున్న హాలమున, భూతలముం దున్నుచున్న భూతిసమునకున్
భూతధృతికి సీతాసం,భూతం బగుమందసంబు పొడఁగనవచ్చెన్. 182

వ. ఇట్లు పెక్కుసంబుఁ నొక్కబొక్కసంబు దోఁచుటయు. 183

గీ. రత్నగర్భ ప్రయత్నపూర్వకము గాఁజి, రత్నరత్నము లిట సృష్టింబు గాఁగఁ
బదిలపఱిచెనో కాక నాపాలిలక్ష్మి, నను గృతార్థునిఁ జేయ దీనను గలుగునో.

క. అని తత్సమీపమునకుం, జని మనమున నమితసంతసము పొంగారన్
మునిజనులమతమున జనక,ముని యించుక వెఱచి గాని మూతఁ దెఱచుడున్.

చ. చలువునిశీప్రయాణమును సంతతరాహువిరోధము న్హాలా
హాలగళుఁ దగ్గిలోచనుఁడు నాజగరాన్వితుఁ డైఁక్షిము పెం
దలను నివాసముం గని సుధాసిధి సైఁపక యిట్టు లొంటి ని
ర్మలుఁ డయి డాఁగెనో యనినమాణిక్య ముఖంబు వెలుంగుచుండఁగన్. 186

సీ. మెఱపుఁ దీవలలోని మెఱుఁగు నేఱిచి తెచ్చి, నవక మై తగుమందనంబుఁ దెచ్చి
ప్రవ్వసంపదలోనిపాలుపు నంతయుఁ దెచ్చి, వెన్నెలలోనీటు వెదకి తెచ్చి
కాయంబు గా నబ్జగర్భుఁడు సవరింప, వలయు లేకున్న నీతళతళయును
నరమీమ్పదుత్వవైభవమును సౌరభం, బీప్రసన్నత ధర నెందుఁ గలుగ
గీ. దనుచు నుతియింప ననువగు తనువుతోడ, నక్కజంబుగ నుదయించె నొక్కబాల
జనకభూపాలుఁ డానందజలధిఁ దేల, నీలవాల మనోజ్ఞలీలాలవాల. 187

వ. ఇవ్విధంబున నుదయించి. 188

క. సన్నని యవలగ్నంబున, సన్నని సుస్వరముఁ గడుఁ బ్రసన్ననిటలముం
జిన్నతనంబునుఁ గలిగియుఁ, గన్నులు బెద్ద యయియుంటు కరమరుదు గదా. 189

గీ. ప్రమదలమదం బడఁపఁగోరి పద్మభవుఁడు, పరమశృంగారముల నేర్చి భామ గూర్చి
వసుధ లజ్జావశులు తల ల్వంతు రనిత,లంచి పెట్టియఁబెట్టి డాపించబోలు 190

చ. అని కొనియాడఁ బాత్ర మగునట్టిసుమారిక నార్యమంత్రిస
జ్జనగురుసమ్మతంబునను సమ్మద మిమ్మడియై తనర్పఁ ద
జ్జనకుఁడు ప్రీతి నెత్తుకొని చయ్యన నాత్మపురంబు సేరి పౌ
రనికర మెల్లఁ జూచి యవురా యని సంతస మందుచుండఁగన్. 191

క. అంతిపురమునకుఁ జని తన, యింతికిఁ గాఁపుటయు శిశువు నెత్తికొని కడున్
సంతోషించెడు నామెకు, వింతగ బాలెంతరాలివిధములు దోఁచెన్. 192

ఆ. పురమువారు నంతిపురమువారును హర్ష, జలధిఁ దేలుచుండ జనకుధర్మ
పత్ని పుత్త్రిఁగాఁగ భావించి పెంచఁగఁ, బెరిఁగెఁ దండ్రి వేడ్క పెరుఁగుచుండ.

క. పేరును వసుపాత్రమును మ, హాదాతకుఁ బాత్ర మడవి కలచైత్రము సం
పాదిత మగుచందంబున, నాదంపతులకుఁ గుమారి యట్టులు కల్గెన్. 194

క. సీత యన హలపథమునకు, ఖ్యాతిగ నామంబు గలదు కావున మును వి
జ్ఞాత యగుట సీత గానఁ బ్రతీతాహ్వాయమబ్భవాణి తివిరియొఁగొప్పెన్ 195

చ. జనకునిచేతఁ బెంపఁబడి జానకి నాఁగ బ్రసిద్ధ యై మహీ
జననముఁ గాంచి మించి మహిజాత యనం బొగడొంది కామినీ
జనమణి యైనసీత యిలజవ్వని యై తనరారెఁ గుందనం
బునకును సౌరభంబు జత పొందినయట్లు క్రమక్రమంబునన్. 196

వ. సంప్రాప్తయౌవన యగుతనయం గనుంగొని తనయంతరంగంబున జనకుం డగు
జనకుండు. 197

సీ. పృథుకుసుమామోదినీలతాతన్వి నే, ఘనతరనకుఁ గూర్చి ఘనతఁ గాంతు
సౌభాగ్యదేవత నీభవ్యపద్మహస్త నీక నే పురుషోత్తమున కొసఁగుదు
నీసర్వమంగళ యాసతీతిలక నే, సర్వజ్ఞునకు బెండ్లిసలుపఁ గందు
మృదువాణి నీమనోహృతహంసయాన నే, లోకేశునకు నింక లోనుపఱుతు

గీ. హంసకమహోర్మికాకంకణాభిరామ, రమణి నీఘనవేణి నేరసనిధికి నొ
సంగువాఁడనో యనుచు నజ్ఞనవిభుండు, ప్రమదమున నుండి తా నొకప్రతిన జేసె.

క. తమమందిరమునఁ జిరకా, లమునుండియుఁ బూజ్య మగుచు లలినొప్పెడు ను
త్తమసత్వం బగుగంగో, త్తమాంగు చాపంబు నధికతరరూపంబున్. 199

ఉ. ఎవ్వరు బాహుసత్త్వమున నెక్కిడనోపుదు రట్టివారి కీ
జవ్వనిఁ బెండ్లిసేతు నని సర్వజనంబు లెఱుంగఁ బల్కఁగా
నివ్వసుమత్యధీశ్వరు లనేకులు తన్మహనీయచాపమున్
దవ్వులఁ గాంచి భీతిలి మదంబతిపాటును రేమిచెప్పఁగన్. 200

వ. అనిపలికి రాముం గనుంగొని. 201

ఉ. ఆవసుధేశుఁ డిప్పుడు మహాధ్వరకర్ముఁ డై మునీంద్రుల
న్నావిరి బిల్వఁగాఁ బనిచినాఁ డటుఁ గావున సత్వరంబునం

పోవుద మమ్మఖోత్తమవిభూతిఁ గనుంగొనఁ గార్ముకాగ్ర్యమున్
జేవదలిర్ప నెక్కిడి కడిందిమగంటిమిఁ జూపు మేపునన్. 203

గీ. కార్ముకగ్రాపునజ్జ్యల తాక్కార్ముకంబుఁ, బృథివి నేక్షత్రియులు నెక్కువెట్ట లేరు
దిట్టతనమున నీ వెక్కువెట్ట నేర్తు, వాయనకు నీకు భేద మింతైన లేమి. 204

క. హరువి ల్లెక్కిడి జగదీశ్వరులెల్లను సంతసించుసరణి న్సీతా
తరుణిం బరిణయమై మీ పురి కరిగెదుగాక యనిఁ బొంగుచు నతఁడున్. 205

క. శిష్యులము యుష్మదంఘ్రిభు,జిష్యులము భవద్గృహావిశేషముకతనన్
దూష్యచరిత్రుల నాకపి,శిష్యులను వధించితిమి ప్రసిద్ధము గాఁగన్. 206

మ. భవదీయం బగు నాజ్ఞ నేయుట మహాభద్రంబు తన్మేదినీ
ధవుఁ డక్షీణశమక్షమానిరతుఁ డుద్యత్క్రియ న్పెయి నా
శివధర్మంబును మత్సరోగ్రఫలలాశిస్తోమభీమంబు నా
శివధర్మంబును జూడ నయ్యెడకు వేంచేయంగ నిష్టం బనన్. 207

క. మునిరాజయ్యుద్ధులు వెసఁ,గొని రాజనకావనీపకునిఁ ధర్మయుఁ గ
న్గొని రాజును నప్పు డెదిర్కొని రాజర్షిలీల విన్నకోడు కలరింపన్. 208

సీ. కుశనాభుఁ డను రాజుకు చరిత్రంబును, గాత్రికేయునిజన్మకారణంబు
గంగామహత్త్వంబు గంగావతరణంబు, గంగ జాహ్నవి యైనసంగతియును
క్షీరాబ్ధిమథనంబు క్ష్వేళాభిహరణంబు, నమృతసంభవము దేవాసురాజి
సప్తమారుతముల సంభవక్రమమును, వరవిశాలాపురీవర్ణనంబు

గీ. గాధినందనుఁ డత్యంత గౌరవమున, దెలియఁ జెప్పెడినుడువులఁ దృప్తులగుచుఁ
గతిపయదినంబులకు రాజసుతులు సేరి, రుచితపవనము మిథిలాపురోపవనము. 209

క. కలకలముగఁ బలికెడు, చిలుకల విచికిల కుసుమవాటికల జింకల మూ
కల నలపూఁదేనియవాకల నటుఁగల సకలశారికలఁ గలయంగన్. 210

వ. కనుంగొని ఘనంబగు విస్మయంబు మనంబునం బెనంగొన. 211

చ. ఘనతరహర్మ్యసంగతపికాగము మోములఁ దోఁప సింహాస
హాసనులు రామలక్ష్మణు లహర్పతితేజులు మానసయుక్తులై
చని చని నాగరంగవటసాలరసాలవిశాలసాలచం
దనపటుసుందరంబుఁ బ్రతిసం బగునొక్కతపోవనాగ్ర్యమున్. 212

వ. సందర్శించి 213

శా. తన్నైదిగ్ధముసం జరించు సెడఁ జిత్రస్ఫూర్తిరా మోల్లస
త్పన్నీరేజరజోలవం బొకమహాపాషాణము న్సోఁకి వి

ద్యమ్నాఘుం డురుదండ ఱాయి పవిత్రత్వంబుం దగం జెంది సం
యమ్నారీమణికోడ లట్లు నిలిచెం భగ్నప్రతీతాంగి యై. 214

చ. కమలవరాస్యముం బులినకమ్రవిశాలకటిప్రదేశముం
గుముదసుగంధముం జలజకుట్మలయుగ్మనిభస్తనంబులు
న్సముచితమీననేత్రములు శైవలవేణియు ఫేనమందహా
సముం దగుకంబుకంఠముం బొసంగినయాసరసీలలామతోన్. 215

వ. రామచంద్రుం డిట్లనియె. 216

సీ. పుండరీకంబుల గండడంపంగం జాలి, గండుమీల నగువాల్గన్నుందోయి
చక్రవాకంబుల జతనమేలంగం జాలి, జతనందమగు వీగుం జన్నుందోయి
తనరుబంభరముల ఘనత డింపంగం జాలి, ఘనతతి నిరసించు కచభరంబు
మహనీయవేదికామహిమ నొంపంగం జాలి, మహిమాఢ్యందగు కటిమండలంబు
ఆ. కంబుసోయగంబుం గలంపంజాలి కరంబుం, గలరవమున మించు గళము గలిగి
యొప్పుభామ వన్య నిప్పాట ఱాయివై, నవయ నేమికారణంబు చెపుము. 217

క. నవయౌవనాంగి యీగతి నవయవములు గానరాక యశ్మాకృతితో
నవయంగ నేమి దీనివి, నవలయు మా కానతిమ్ము నవలా యనినన్. 218

గీ. వృషభవాహనతుల్యుండు ఋషివృషభుండు కలండొకద్విజోత్తముండు మహిగౌతముండు
ప్రియతముండు సదావర్జితవిపులర, జస్తముండు విఖండితాంహస్తముండు. 219

మ. ప్రమదారత్నముగాం బయోజభవుం డొప్పన్నన్న సృష్టించి స
ప్రమదస్వాంతముతో నహల్య యనుచుం బ్రఖ్యాతమౌ నామధే
యము నాకుం బొనరించి గౌతమున కీయన్మౌనియు న్నేను ను
త్తమలీల న్విహరింపుచుండితిమి తత్తత్పుణ్యశీలంబులన్. 220

ఉ. నీరసమీరభూపతితనీరసపత్త్రము లన్భుజించి వి
స్తారతుషారవార్షికనిదాఘదినంబుల దీర్ఘకాపయః
పూరశిలాతలోరుహుతభుఙ్ముఖమధ్యములం ద్రిలోకసం
చారులు దేవమానవభుజంగమపుంగవులెల్ల భీతిలన్. 221

క. గౌతముం డొనరించెడు వి, ఖ్యాతతపముం గాంచి యోర్వంగాలేక సను
జ్ఞాతేర్ష్యుం డై వజ్రి వి, ఘాతం బొనరించి కలంపంగా నుద్యతుం డై. 222

చ. వడి నిటకేగుదెంచినను వాంఛ గనుంగొని మారుబారిం గి
ద్వడి పరకాంతరంగగతి వాసవుం డీనలినాక్షి నెమ్మికై

వ. అహల్యాకౌసల్యానందనుండగు రాముం డనుజసహితుండై విశ్వామిత్రు వెనువెంట నిర్వాణంబునకు రాఁగలం డమ్మహామహు నైర్మల్యాంఘ్రిధూళ్యాస్పృష్టవై యతుల్య మాంగల్య నిజరూపంబుఁ బ్రాపించి కల్మషసాకల్యావందంబున నతనిం బూజించి శాప రజాక్రాంతవగు నీవు కల్మషవై జన్మసాఫల్యంబునొందెదని వాత్సల్యంబున నానతి యిచ్చి చనుటయు నాటంగోలె నిమ్మహాటవీవాటంబున నెచ్చోటికిం బోవ వాటంబులేక నిష్పాటవ నవయుచున్న నన్నుం గటాక్షించి శాపమోక్షంబు గావించి రక్షించుటకై ప్రత్యక్షంబుగా జనుదెంచిన మిమ్ము వీక్షించి కృతార్థనైతినని యనంతరం బనంతసంతోషితస్వాంతంబునఁ దనయుదంతమాద్యంతంబును దెల్పి. 234

క. మిత్రానందప్రదులన్, మిత్రీయదప్రసదతిమిరమిత్రుల విశ్వా
మిత్రాశ్రితులను రామను,మిత్రిసుతులను నుతించె మృదువాక్యములన్. 235

క. గౌతముఁడమ్మేదకుంబటు, కౌతూహలమెసఁగవచ్చి కనునీయగణ్యో
పేతురఘురాముఁ దారా, న్వీతుండై పూజచేసె వివిధవిధులచేన్. 236

గీ. చెలఁగియాంతరాముఁబూజించిపాప, రహితమహితచరితచరిత్ర యహల్య
తోడ రామమ్మునీ ద్రిదండ్రిండు గౌతముండుసనియె శాలయశుండు వేడ్క. 237

వ. తదనంతరంబున (రామలక్ష్మణ విశ్వామిత్రులు) మిథిలాపురోపవనేశాన్యభాగంబు నకుఁ జేరి. 238

మ. కనిరమ్మువ్వురు హోమధూమవితతాకాశావకాశంబుశో
చనిధబ్రాహ్మణమానివాధసునివేశంబున్సగణ్యోల్లస
ద్ఘనవేదీజ్వలితాగ్నిహోత్రిచయోద్దామప్రకాశంబువి
ఘ్ననిరాసంబువిదేహభూరమణుజన్నంపుఁబ్రదేశంబొగిన్. 239

క. ఘనజాత్రరూపయూపా,ద్యనుపమగుజనకనృపతి యజ్ఞాలయముం
గనుఁగొని యమ్ముగ్గురు వే,డ్కనుగొను యాజ్ఞుచుఁ దదంతికమునకు సనఁగన్. 240

క. నిత్యసమాచరితాధ్వా,హుత్యభినందితులు హుతవహులు తేజోతాగ్న
ల్పత్యక్షమాన్విఘ్నవరుఁ బత్యక్షంబైన యట్టిభంగిజనంగన్. 241

చ. మితహితభాషులన్ గుణసమృద్ధులఁ జాయచిరత్నరత్ని
ర్మితసువిభూషణోజ్జ్వలల హృష్టమనస్కులబాలురందర
స్మితజితశీతభానులను మిత్రికులీనులఁ గాంచిచాలవి
స్మితమతులైరసభాసదులు చిత్తములన్వినుతించిరయ్యెడన్. 242

సీ. ఆనందమునసహల్యానందనుండుశౌ, తానందుఁ డర్ఘ్యపాద్యములు గొనుచుఁ
దోనరుదేరశతానంద నిభుఁ డుశౌ, తానందుఁ డమ్మిథి లాధినాథుఁ

డకలంకభక్తిఁ గౌశికునకు నెఱరేఁగి, శాస్త్రోపదిష్టపూజావిధాన
ములనలరించి యిమ్ములనలయు ఖ్యాతిఁ, దోడ్తో బ్రమిగులసంతోషితాగుమ

గీ. సంచితాసనములఁ గాంచి సముచితముగాని, సమితి నెసమితి లేని యాశ్చర్యముందు
చుండఁ బ్రావృట్పయోదగర్జోపమోక్తి, వాక్యములనిట్టులనియె భూవల్లభుండు 243

క. దూరీకృతాఘవారక, దూరీకృతవేదసార యాచితవిచారా
నీరేకమాకుఁ గరుణా, నీరాకర శుభములొసఁగు నిజమెబ్బంగిన్. 244

ఉ. రాజకులప్రభూతయతి రాజశిరోమణి గాధిపుత్త్రిగో
రాజనిహారదీధితిలిభ రాజమనోహరయానలజ్జినీ
రాజలసత్ప్రతాపులరి రాజసమిత్ప్రతిరాజులీ మహా
రాజకుమారులెవ్వరు పరాజితరాజకుమారసుందరుల్. 245

క. మారులురూపంబునకును మారులు విక్రమమునందు మారులుకక్షో
మారులు ఘనలీలాజకు, మారులెవరు విజితదుర్గమారులు తలఁపన్. 246

సీ. అనిన విశ్వామిత్రుఁ డనుమనీశ్వరునకు, నంతయూవేశక నిట్టులనియె
భానుకులప్రదీపకుఁ డన వెలసిన, పఙ్క్తిరథాత్మసంభవులు వీరు
తండ్రి యాజ్ఞ జగత్హితంబుగ నావెంటఁ, జనుదెంచి తాటక సంహరించి
మారీచు గర్వంబు మాయించి సజ్జన, ద్రోహులసుబాహునిఁ ద్రుంచివైచి

గీ. గౌతమాంగనశాపంబుఁ గ్రమ్మఱించి, భవునిచాపోత్తమము భవద్భవనసీమ
నుండుట యెఱుఁగ ప్రులెక్కడ నోపమియును, వినికనుంగొనవచ్చిన ఘనులు మతి రూ. 247

చ. రహీనహీకంకణోత్తమశరాసన మెక్కిడునట్టివారికిన్
మహిమహితానురాగమున మానితశీలసమేతసీత నా
దుహితహితంబునన్ ఘనము తుల్యవతింపఁగఁ బెండ్లిసేయుద
మహిమహిమాంశుపావకులు సాక్షిగ నీవు ప్రతిజ్ఞసేయుటన్. 248

క. వినిత వ్యాపోత్తమముం, గని యెక్కిడులావు త్రిమరుఁ గలదనియే తెం
చినవారలీకుమారకు, లనవద్యులు రామలక్ష్మణాహ్వయులను చున్. 249

క. మునివిశ్వామిత్రుఁడు దెల్పినఁ దద్విధమెల్లఁ దెలిసి ప్రీతాత్ముండై
జనకుండబ్బాలురఁ, బద్మనిభాక్షుల నాదరించెఁ దదవసరమునన్. 250

శా. [illegible]హానాకృతిభర్తృశాపశిఖిసంప్రాప్తోష్ణసంతప్తయై
మోహారత్నమహల్య కాఆడవినట్లుండం గటాక్షించి సం
తోషస్వాంతముతోడనంఘ్రికమలోద్భూతోల్లసద్ధూళిచేఁ
బాషాణత్వము మాన్చిమన్చె నవిశ్వామిత్రుఁ డమ్మౌనితోన్. 251

క. పలికినపలుకులు మేనం,బులకలెగయఁ జవినదుకర్ణముల నమృతంబుం
జిలికినక్రియవినిపూటను, తలిదండ్రులకోడ వెనని శతానందుఁడనున్. 252

క. స్వస్థత లేమింగతివా,వస్థ రహిం దొరంగియున్న వనితఁ బ్రతుకని
ట్లాస్థఁగొని తెచ్చితివికల, హాస్థైర్యులరాజసుతుల వక్కృట్రికమునన్. 253

వ. అనిమతియు విశ్వామిత్రుం బ్రశంసించి రాముంగనుంగొని. 254

క. కట్రికేతనంబునమునియ,క్కృట్రికం బొకయింతలేక కనలి శపింపం
గటుకటుపాషాణతనై, కృట్రి నవయము మనున్నయింతి కలువ మడంపన్. 255

సీ. విశ్వామిత్రునివెంట సానుజుఁడవై వచ్చేసియున్నట్టిపూ
ర్ణశ్వేతాంశుయశోవిశాలసదదభ్రప్రాభవోపేతుని
న్విశ్వాత్ముస్సనకాదిభావితపదు న్విశ్వంభరాధారుస
ర్వైశ్వర్యాన్వితుభక్తియుక్తినతిసేయన్నాకుసామాన్యమే. 256

గీ. రామ రామాభిరామధరామరామ రామలానందమునిపికారామఖలవి
రామప్రావృడ్జలదనిభరామశౌక,రామరజ్యేష్ఠనుత సుందరా! మహాత్మ. 257

మ. అని రామున్వినుతించి కౌశికుని యమ్యాఖండలుం జూపి రా
మునితో నీమునితోయజాతభవసామ్యుండండ్రుఁ దజ్జన్మని
ర్ఘ్నవైచిత్ర్యతపఃప్రభావసుమహత్వంబుల్ శతానందుఁడిం
పునఁగీర్తింపఁగ నాలకించికడుసమ్మోదంబునం బొంగుచున్. 258

చ. అనుజసమేతుఁడద్దశరథాత్మజుఁ డమ్మునిసాధువాక్యము
న్వినితగుభక్తిఁ గౌశికముని ప్రవరున్ జనకావనీశ్వరున్
ఘనుఁడగుగౌతమాత్మజునగణ్యతపోధనులం బ్రియంబున
న్వినుతియొనర్చెఁ బ్రాతరనవింద దళాక్షుఁడనేకభంగులన్. 259

క. బోధాత్ముఁడు గాధేయుని, గాధల్విని మానసలధిక కౌతుకమత్తులై
రాధివ్యాధిహరుఁడుదిన, నాథుఁడస్తాద్రిఁ జేరనడిచె నరుణుఁడై. 260

చ. అవిచరమాద్రిఁ జూచె రవి వెలుఁగాచె రఖిగాలిరవంబు మించె రాజ
కృవకపక్షిద్రఁ గూడె నిధి ప్రకరంబొగినూఁకఁ జీరెను
త్కృవసుజకోరముల్ జతలుగోరె లసద్విషనీలాబ్జినీమహో
త్సవములు సారెసారెకును జానందమంబును బేరెభోగులన్. 261

వ. తదనంతరంబున. 262

క. సలలితనిష్కుటములఁ గుట్కృముల ఖగములగముల గోదలుమునుకొని గ్రామ
మ్ములమిక్కుటముగఁ గుక్కుటముల రవములు నెసఁగె దిశలు మోదం బందన్. 263

వ. అంత. 264

క. అస్మద్వంశభవుఁడు ప్రగ ల్భస్మరగురువిల్లు నిమి సీతకై కొని టుకడు
న్విస్మయము చూతునను మది తస్మయుఁడై యుండెం జెనకఁగ ధరణి యుఁదోఁ చెన్. 265

వ. ఇట్లు నిర్వర్తిత సర్వజగత్కార్యుండును బరిరక్షితార్యుండు నగు సూర్యుండుదయిం
చుటయు. 266

క. కృతకృత్యులైన యారా ట్సుతులను లక్ష్మీసుతజిత సుందరుల దృఢ
వ్రతుఁడగు కౌశికుని సమంచితముగ జనకుండు పూజ చేసి నయుఁడైన్. 267

గీ. అహితగణభీము సకలగుణాభిరాము రవికులాంచితధాము శ్రీరాముఁ జూపి
కౌశికమునీంద్రుఁడు జనకక్షితీశుతోడ నిట్లనిపల్కె సంతోషితుఁ డగుచు. 268

క. వసుధేశ్వర విను భవదా వసథంబునఁ గలపురారి వరచాపమును
వ్వసుధామాన్యుఁడినకులుఁ బూర్వసుధాశనభయదునకు నవశ్యము గాఁగన్. 269

క. చూపుము దచ్చాపము ఘ రూపము వెస నెక్కుఁ బెట్టి రోషముఁ గూర్చుం
దాపుమునీశ్వరులిచ్ఛ నిప్రతాపముఁ గొనియాడ నత్యుదగ్రస్ఫురణన్. 270

వ. అనిన సర్ధర్మవర్తియగు జనకచక్రవర్తి యిట్లనియె. 271

క. మారమదహరుఁ డహారుఁడును, మారమణుఁడునై త్రిపుర మర్దనుఁడును ద
మ్మారమదస్వాయుపతిగుఁ, మూర మహాశక్తికిన్ వుంచితమతిన్. 272

గీ. దేవరాతునకొసఁగెఁ దద్దివ్యధనువు, నాసనము నాటఁగోలె నుదన్వయమున
నమితపూతకమికులఁ బూజ్యముగనుండ, బూజసేయుదు నేను నెప్పుడును దాని. 273

ఉ. సిద్ధము వెక్కువెట్టఁ ముదమ్మున నా సుతసీతనంచు నే
తద్ధరణీతలాధిపవితాన మెఱుఁగఁగఁ జాటఁబంపఁగా
సిద్ధబలుల్ మహీధవుల నేకుల నేకచమూసమేతులై
యుద్ధతి నేగుదెంచిరి మహోజ్జ్వలదోర్గ్రహిణాసమానులై. 274

వ. ఇట్లువచ్చి. 275

క. కదలిన్ప్రదూరువుఁ గొమవీఁకఁ దలిర్పఁగ నేగుదెంచి ఘనకార్ముకముం
గదలింపలేక భీతిం, గదలిచనిరి రాజవరులు గతమత్సరులై. 276

క. పరులెవరనో పరపరాత్పరు చాపము నెక్కు వెట్టఁబోలుండితఁ డే
ప్పురుషుని సెక్కుడుఁ జూపఱు లరుదొప్పఁగ సన్నుతించునట్లు మునీంద్రా. 277

వ. అనిపలికి విజ్ఞానజనకుండగు జనకుండు మఱియును. 278

ఉ. బాలకులంచు వీరి సులభంబుగఁ జూచుట పాడిగాదు లో
లాలకబాలకప్రమదలానన లంచితదీర్ఘబాహుశో

భాలలితుల్యమస్సరువి భక్తశరీరులుధీరులున్మహా
శాలివిశాలవక్షులినచంద్ర సద్వృక్షులుదక్షులెంతయున్. 279

చ. అదియునుగాక తాటక సమావృతకూటక సంహరించుట
న్పదపడితత్కుమారకుసుబాహునిగూల్చి తదగ్రజన్మను
ర్మదమడఁగించిగౌతము నిమానినిశాపము ద్రెవ్వఁజేయుట
న్మదిఁదలపోయవీరలసమానభుజాబలులట్లు గావునన్. 280

క. ఈయతిశీలసమేతుల, కాయతసత్త్వయుతము గ శరాసనముఁ గనం
జేయుటయుచితమయని గా, ధేయునితోఁబల్కె యమ్మిథిలపతియంతన్. 281

క. పవనాశనభూషణుఁడున్, భవనాశనుఁడైన యుభవు బాణాసనము
న్నవనాశనవినుతసభా, భవనమునకుఁ జేర్పఁబనిచె భటునివహములన్. 282

చ. పనిచిన నేగితద్భటులు భాతిగఁ జేర్చిరితత్పినాకము
న్వనజభవాద్యశేషసురవందితరూపము దైత్యలోకదు
ర్జనపరితాపము న్వినుతసైన్య మదప్రతమోగ్రదీపమున్
జనకనృపాలకాచరిత సౌరభధూపము నీశుచాపమున్. 283

క. తెచ్చినధనుర్లతామము, వచ్చెరువడిసభికులెల్ల నాలోకింపన్
హెచ్చినముదమునమునితో, దెచ్చిననృపసుతులఁగాంచి ధృతినిట్లనియెన్. 284

గీ. రామలక్ష్మణులారసంగ్రామభీమ, లారమణిమ్మఖదోర్గర్వలారమాను
లారయనతృణప్రాయమైన విల్లు, నెక్కువెట్టుడు సన్నుతికెక్కునట్లు. 285

వ. అనిపలికి రామచంద్రు నుద్దేశించి విశ్వామిత్రుండు వెండియు. 286

ఉ. ఈధను వెక్కువెట్టుమన హీధవులెవ్వరునిన్నుఁబోలె స
త్త్వాధికులాశ్రితార్యబహుళార్తి హరుండవు నీవు నావుడన్
గాధితనూజుఁడెంతయు వికాసముఁనొందఁదనందగందప
స్సాధనులంతనంతనతి సల్పఁ నల్పకళాకలాపుఁడై. 287

క. దండఁగలనియమిపతులకు, దండములర్పించి యద్భుతంబొప్ప భుజా
దండంబుసాచియుక్కో,దండము వేదండమిచ్చు దండమువోలెన్. 288

వ. వామకరంబునందిగిచి. 289

క. మేధ్యమతిరాముఁడమితా,సాధ్యుఁడుదగనెక్కువెట్ట సవరింపధను
ర్మధ్యమునకిటిగెఁ దత్సా,న్నిధ్యంబునవారలెల్ల నివ్వెఱపడఁగన్. 290

క. హరుచాపమట్లువిఱిగిన, హరుచాపము విఱిగినట్లు హరిదంతరముల్
గిరికొని యొక్క మహాధ్వని, గిరిగహ్వరగుహలఁ బ్రతిరవమ్ములఁ గొల్పుటయున్. 291

ఉ. రాముఁడు లక్ష్మణుండు యతిరాజగు గాధితనూజు సాక్షిఁ బూ
ర్వామరసంఘముం జిదిమి యన్నియమిప్రభునధ్వరంబు ను
ద్దామతనొందఁ గాచి ప్రమదంబున జాతిని గోతిఁ జేయఁగా
మామిథిలాపురోపవనమార్గమునం జనుదెంచి రొప్పుగన్. 304

గీ. ఇట్టు లేతెంచి యెలమి మాయింటు సార్వ,కాలమును బూజితంబగు కాలకాలు
చాపరాజంబుఁ గాలసర్పోపమంబు, నేపుమీఱంగ మేమంతఁ జూపుటయును.

ఉ. మత్సరవాసు లిద్ధమతి మత్సరపాగ్రణులున్ మహాయశ
స్సత్పరుఁడైన లక్ష్మణుఁడుఁ దాపసనాథ వరేణ్యు లేనునం
చత్పరమానురాగమున సన్నుతిసేయఁగ రామభద్రుఁడు
ద్యత్పరవైరికార్ముకము నశ్రమఁడై తగ నెక్కువెట్టఁగన్. 306

క. నవరించి వంచుటయు వా,సవసుగ్ఘర మయినవిల్లు సవమునవిఱిగెన్
సవినయమ త్తనయుసుహా, నవరింపఁగ నింక రామచంద్రునకతగున్. 307

వ. కావున. 308

శా. తద్వైవాహికముం గనుంగొనఁగ నుద్యద్వైభవం బొప్పఁగా
విద్వన్మంత్రిసువ్యాప్తభటార్యసచివాన్వితుండై రమ్ము స
త్సర్వోపాంతరపూరితామలయశోధావళ్యసంగ్రామశా
మ్యద్వైరివ్రజగంధ పఙ్క్తిరథ నిత్యస్తూయమానప్రథా. 309

క. అని మద్వచనంబులుగా, జనవిభుఁడగు పఙ్క్తిరథుని సముఖమునఁ దగ
న్వినిపించి తోడితెండని, తనమంత్రుల ననిచి సమ్మదంబున నంతన్. 310

చ. అనఘులఁ బంకజాప్తకులశాన్వయముఖ్యసుజన్మరామల
క్ష్మణమునినాథుల న్సుగుణజాలసనాథుల నొక్కమందిరం
బున నివసింపఁజేసి కడుమోద మొనర్చుచుఁ బంధురాజులన్
జనకుఁడు పిల్వఁబంచెను భృశంబుగ జాంఘికసాంఘికంబులన్. 311

క. ముదమొప్ప వెండి విప్రస,ముదయమునం బిల్వ సుభటముఖ్యుల ననిచెం
దదనంతరంబ పౌరులు, దదనుమతిం బడసి వింత దళుకొత్తఁగన్. 312

సీ. కస్తురినీటిచేఁ గలయంపిచల్లించి, ముత్తియంబులఁ గ్రొత్తముగ్గుపెట్ట
విస్తారముగను రంభాస్తంభములు నిల్పి, విపణిమార్గంబులం విశదపఱచి
గుమగుమకలచు సంకుమదంబు వెదచల్లి, తలుచు గోడలకుఁ జందనముఁ బూసి
గోపురమ్ముల శాతకుంభకుంభము లుంచి, రమణఁ బచ్చతోరణములు గట్టి

గీ. చంద్రరాజాఖ్యభూపముల్ సంఘటించి, ప్రతిగృహంబున రత్నదీపములమర్చి
యధికతరకంబళాములు నంతిపురముఁ, బురముఁగై సేసి రంత నబ్బురము గాఁగ.

క. సీతాకల్యాణము సంజాతప్రేమమునఁ జూచు పర్వామరులం
బ్రీతిఁ బురలక్ష్మి పిలిచెను, రీతి న్విరచించి రప్పురిం గేతనముల్. 314

క. తనయావివాహవేళం, దనయల్లుని పాదపద్మధావనకై మే
దిని యిమురతసపు బల్లెగ, మనఁగాఁ గల్యాణవేది నమరించిరొగిన్. 315

వ. ఇట్లు సకలసంపద్భరితంబగు నిజపురంబుఁ గనుంగొని జనకుండు హర్షోత్కర్షుండై
వివాహోపకరణమంగళద్రవ్యంబులు సంఘటించి మహోత్సుకుండును సఫలమనోరథుం
డునగు నద్దశస్యందనరాజకుమారుండని యంతం దనచే నామంత్రితు లగుమం
త్రులు. 316

శా. తూర్ణప్రక్రియ నేగుదెంచి కని రస్తోకాశ్వమత్తద్విపో
దీర్ణారామభటచ్ఛటాసుపరిఘావిభ్యద్విటంకాంబుదా
కీర్ణార్ణఃపరిపూర్ణపుణ్యసరసిక్రీడావలాంచత్ప్రపా
నిర్ణీతధ్వజసౌధగోపురగరథాన్వీతంబు సాకేతమున్. 317

గీ. ఇట్లు గనుంగొని తత్పురాధీశవైభవంబునకు సంతసింపుచు వచ్చి తమకు
సమయమగుటకుం దశరథక్ష్మాతలేశ్వరునకుఁ గొలువుండుకడ [illegible] నింపు వేడ్క.

సీ. ఇట్టిపల్కు దుర్వీశ్వర మీ పెద్దపట్టి లక్ష్మణుని వెంటఁ బెట్టి గాధి
పట్టితో వంప నప్పట్టున నెట్టనఁ, బెట్టుతాటక మున్కుపట్టుఁ జేరి
దిట్టమై దానిఁ గన్పట్టి గట్టిగఁ జంపె,పట్టి యిట్టట్టనుఁ గొట్టిబిట్టు
పొట్టప్రవయ్యఁగఁ జేసి కట్టిఁడిమారీచు, రట్టుమానిచి వాధిఁ గట్టనతనుఁ
గీ. బెట్టి యంతసుబాహు నిదొట్టి సోఁకు,దిట్టలను జిట్టలుగ నరికట్టి కాలు
పట్టణప్రోదోవ వెసఁ బట్టునట్టు మట్టి, నట్టి మునిజన్నమును దుదిముట్టఁ జేసి. 319

గీ. హేళిదులవకాళి విమపదనాళి జేసి, హాళినౌకరాతిఁ గవచిజతాళిఁ జేసి
కేళిమిథిలకువచ్చి బుధాళివినుత, పాళి దంభోళిసమమిందుమాళిధనువు. 320

క. విసనెక్కువెట్టి దివిచిన, బసచెడి తత్కార్ముకంబుఁ బరికింప నిలిం
పసభాసదుల దరిపడం, బ్రసభంబున లస్తకమున భగ్నంబయ్యెన్. 321

గీ. రాజుశేఖరి నెక్కిడ రానికార్ముకంబు విఱిచిన రాముని కడిఁదినచ్చి
నాకుమారిక సీత ఘనంబుఁగాఁ వివాహమొనరింపఁ జాల నుత్సాహమొందెద. 322

శా. తద్వైవాహికముం గనుంగొనఁగ నుద్యద్వైభవం బొప్పఁగా
విద్వన్మంత్రిపురోహితాశ్రితజనాన్వీతుండవై రమ్ము స

స్తద్వీపాంతరపూరితామలయశోధావళ్యసంగ్రామశా
మ్యద్వైరివ్రజగంధపఙ్క్తిరథ నిత్యస్తూయమానప్రథా. 323

క. అని జనకుం డాడిన విధ, మని దశరథుతోడ వార లనుటయుఁ దెలియ
న్విని యన్నరపతి యంతిం, తని చెప్పఁగరాని సమ్మదంబున మునిఁగెన్. 324

వ. మఱియును. 325

చ. అమృతముఁ ద్రావునప్పుడు బలారియు నయ్యమృతంబుఁ దెచ్చుచో
నమృతమరీచిదీప్తి విహగాధిపుండు న్మదిసంతసించిన
ట్లమృతమయంబులైన సచివావళివాక్యము లాలకించి తా
నమితముదంబు నొందె మహితాత్ముఁడు పఙ్క్తిరథుండుసత్ప్రభన్. 326

క. మతిహీను లైనతనయుల, మతమునకకరంబు నలరు మహీంద్రుఁడును స
మ్మతి సుతులభినుతులైనన్, మఱి జనకుఁడు సమ్మదాబ్ధిమగ్నుఁడు గాఁడే. 327

వ. తదనంతరంబున. 328

క. కాంతలకు న్మణిమండన, కాంతలకున్ గ్రథితచంద్రకాంతోజ్జ్వలశు
ద్ధాంతలకుం దచ్ఛుభవృ, త్తాంతం బెఱిఁగించి గాఢతరహర్షమునన్. 329

ఉ. తచ్ఛుభవార్తనెంతయు ముదంబునఁ జాటఁగఁ బంచిపట్నము
న్స్వచ్ఛగుళుచ్ఛపూర్ణకలశప్రకరధ్వజసాలభంజికో
ద్యచ్ఛవిమత్పటామల ఘటాలి యలంకరణంబు సేయ నూ
త్నచ్ఛదభూషణాదుల ఘనంబుగఁ దాను నలంకృతాంగుఁడై. 330

సీ. శిష్టచరితులు వసిష్ఠాదిమునివరు, ల్మహిపసుమంత్రాదిమంత్రివరులు
ప్రకటవైణికవైణవికనికరంబులు, వందిమాగధభటబృందములును
బుణ్యకాంతాజనమ్ములు విబుధోత్తము, లాప్తు లాశ్రితులు మహాత్ములును
బృథుసైంధవములు గంభీరవేదిసులక్షు, ణాంచితప్రోన్మత్తహస్తికములుఁ
గీ. గొడుకులునుఁ దోడ రాఁ బెద్దకొడుకు పెండ్లి, కొడుకు గాఁగలఁ డనుచు నెక్కుడుకుతూహ
లమున వారాంగనానటనములు సెలఁగ, రుచిరతుంగోల్లసద్రథారూఢుఁడగుచు. 331

క. ఘనఘనపటహపటహపటు, పనవోర్ధ్వకజర్ఝరాంక్యబంధురభేరీ
ధ్వనుల వియత్పథ మవియన్, ఘనురవ్యన్వయుఁడు మందగమనము పేర్మిన్. 332

ఉ. బాహుజవంశ్యులెల్లెడలఁ బ్రస్తుతి సేయ నృపాగ్రగణ్యుఁ డు
త్సాహత నేగి కాంచె విలసత్పరిణాహవివాహవస్తుసం
దోహవిశేషనిష్కుటమనోహరపుష్పరసప్రవాహని
ర్వాహసువర్ణరత్నభరితోజ్జ్వలగేహవిశేష మంతటన్. 333

క. కని తత్పురంబుఁ జేరం, జను నెడ వార్తించి జనకజననాథుఁ డెదు
ర్కొని తూర్యధ్వను లులియఁగఁ, గొనియాడుచుఁ బురికిఁ దోడికొనిపోయి వెసన్. 334

మ. ఉపకంఠంబున మాగధు ల్వొగడఁగా నుత్కంఠ దీపింప న
న్నృపకంఠీరవు నిట్లు తెచ్చి మహితోన్నిద్రోపచారంబుల
త్యుపకారంబులు నాచరించి మణిఘృణ్యుజ్జృంభితైదూకమా
నుపకార్యంబున నుంచి యుల్లసితచిత్తోత్ఫుల్లనీరేజుఁ డై. 335

తే. బంధురక్షణ వినుజగద్బంధువంశ, బంధురం బగునీదుసంబంధ మస్మ
దన్వయాబ్ధికిఁ జంద్రోదయంబుకరణిఁ, బెంపుఁ గావించె జనులు నుతింపుచుండ. 336

ఆ. అని నుతింపజనకుఁ డాచరించెడుసప, ర్యావిశేషములకు నాత్మ నలరి
యా ప్రమంత్రిబాంధవాత్మజోపేతుఁ డిట్లనియెఁ దెలియుఁ దశరథాధిపుండు. 337

క. యత్నంబులు భయదప్రతి, యత్నంబులు మాని తిరుగునట్టి తపస్వీ
రత్నంబులు మీచెలిమికి, యత్నము సేయుదురు పొగడ నలవియె మిమ్మున్. 338

తే. అట్టిమీరలు వేడ్క మాయట్టివారి, బాంధవముఁ గొనియాడు టబ్రంబు గాదె
మాకుమారకుపూర్వజన్మసుకృతంబుఁ, బొగడవశమె హరస్వయంభువులకైన. 339

వ. అని యిట్లొకరినొకరు చతురవచనంబుల నగ్గించుచున్న సమయంబున. 340

క. రాముని లక్ష్మణుఁ గొనివి, శ్వామిత్రుం డేగుదెంచి వాసవహితుఁ డ
బ్భూమివిభుఁడు దశరథుఁ డెం,తో మోదముతోడ మ్రొక్క దీవన లొసఁగెన్. 341

క. నాకావాసులు పొగడఁగ, నాకార్యము నిర్వహించి నాకార్యజనా
నీకస్తుతులు ఘటించి పినాకశరాసనము విఱిచి తగన్. 342

క. భూతనయన్ భూతనయ న్నీత,న్వరియింపఁ గోరు శీతాంశుముఖు
న్నీతనయు రాము ననుజా న్వీతుం, గాఁడును మహావినీతుం బ్రీతున్. 343

క. అని మునిపలికినపలుకులు, తనచెవులకు నెలమినమృతధారలు వోలెం
దనరుటయు మ్రొక్కి నిలిచిన, తనయుల దీవించి పులకితశరీరుండై. 344

ఉ. భూమివిభుండు మోహమునఁ బుత్రులఁ గౌఁగిటఁ జేర్చి వారినె
మ్మోములు మోమునిల్పి శిరము ల్గడుమూర్కొని చెక్కుటద్దము
ల్ప్రేమయొసంగ ముద్దుఁగొని పెద్దయుఁబ్రొద్దు సుతోపగూహనో
ద్దామసుఖాతిరిక్తుఁ డయి తాపసవర్యునితోడ నిట్లనున్. 345

క. మునుగుణహీనులు గుణవం,తునిసంగతి గలిగి సద్గుణులగుదురుగదా
మును గుణహీనులు వినునా, తనయులు గుణవంతులైరి తగునీకరుణన్. 346

వ. అని మఱియు ననేకవిధంబుల నభినందించి నందనసందర్శనంబునం దనివినొందనిపురం
దరవిభవుండగు దశరథునికడకు జనకనిమంత్రితుండగు నొక్కమంత్రిపుంగవుండు

మఱినా దరుదెంచి మిమ్ము నిజసభాభవనంబునకుఁ దోడ్కొనిరా నన్నుఁ బనిచె నని
చెప్పుటయు నాక్షణంబ. 347

సీ. పురుషోత్తమునిచతుర్భుజములు నా సుతు, లక్ష్మ సేవింప విద్వన్నుతుండు
ఘనుఁడు వసిష్ఠుండు గనుఁగొని తనరను, త్తమములాంగికమంగళములఁ దెలుపఁ
బుణ్యకాంతాజనంబులు సేస లొలుకంగ, బ్రాహ్మణోత్తముల దీవనలు సెలఁగ
స్తుతిపాఠకులు మాగధులు సందడింపఁగ, నాప్తమంత్రులు భటులను సరింపఁ
గీ. తూర్యములు మ్రోయ నార్యులు స్తుతులు సేయ, గాయకులు పాడ సహితుల గర్వమూడ
సురభిసౌరభవిసరమారుతము విసర, మందగమనంబు గ్రాల నమందలీల. 348
వనగజకుంభంబులఁ గల, ఘనమౌక్తికవితతి వెలికిఁ గాన్పించెను నా
స్తనములఁ బ్రబల స్తవకగో, స్తనములు మెఱయంగ వారసతులు నటింపన్. 349
వ. రాజవిభవంబున రాజమందిరద్వారంబుఁ జేరం జనునప్పుడు. 350
మ. మును మున్నైచనుదెంచె నొక్కసతి రామున్ రాజచూడామణిం
గనుసద్వాంఛఁ గుమారు నెత్తికొని వేడ్కన్నిల్చి రామోల్లస
త్తనులీలం గలధౌతభూధరమహాత్సౌధాగ్రభాగప్రభ
ద్ఘనితాంతోజ్జ్వలరత్నదీప్తిఁ దనరత్కాంతి న్విడంబింపుచున్. 351
ఆ. కాంతయొకతె చంద్రకాంతశిలావృద్ధ, వేదిఁ దలుపుచాటు వెట్టి మాచెఁ
దాపమొదవు మరునితూపులవలనిభ, యంబు నొవ్వలేనియది యనంబోలె. 352
క. భూవరుఁ గాంచెనుత్వర గన, లేవిటుఁ దాల్పకయుఁ గాంచి నిడిననుదెంచెం
భావజనిభుఁ గాంచినచో, నీవెసడలునంచు నొక్క నెలఁత మెఱఁగువన్. 353

ఉ. కౌటిల్యాలకమూర్తు రాముఁ గనువేడ్కం గింకిణీధ్వానయై
వాటం బైవకవాటయుగ్మము భుజద్వంద్వంబునం బూనియో
వీటన్నేఁడు భవాదృశుండనుచు సర్వస్వర్గలోకాపులం
జాటం జిత్రపుఁ బత్రయుగ్మమున మరన్సంధించెనో నా తగన్. 354
క. బాలయొకతె నీలోత్పల, మాలిక యూదంగ సంభ్రమంబునఁ గాంచె
న్నీలతను నతని నతనుని కోలల, నిటమీఁద లెక్కఁగొననను భంగిన్. 355
వ. తత్సమయంబున. 356
గీ. పార్శ్వములనుండి చూచెడు పౌరబాలి, కావరేక్షణముఖనాసికలు దనర్చెఁ
బ్రకటనీలోత్పలాబ్జచంపకసుమములఁ గలయఁగ్రుచ్చినవనవమాలికల విధమున. 357
వ. అట్టిమహోత్సాహజనకసమయంబునం బురంబునం గలపురంధ్రీజనంబులుదమలోన. 358

క. మనసీత కితఁడు దగునీ, తనికి న్మనసీత మిగులఁ దగుఁ దుల్యవయో
ఘనలావణ్యాదుల నని, కొనియాడిరి గుంపుగూడికొని బహుభంగిన్. 359

చ. అనితనపుత్త్రి రాముఁ గొనియాడెడు పౌరజనాళివాక్యము
ల్విని చతురబ్ధిరుద్ధపృథివీతలరాజ్యము దన్ను నొందిన
ట్లనుపమసమ్మదంబున మహాత్ముఁడు పఙ్క్తిరథుండు వొంగిత
జ్జనకుసభాప్రదేశము ప్రశస్తవిశేషమణిప్రకాశమున్. 360

వ. కనుంగొని యదంభశాతకుంభకుంభిత భద్రకుంభరంభాస్తంభోజ్జృంభితంబును నవనవ
నవరత్నవిరచితోచితవేదికాకవాటసోపానతోరణభద్రాసనకుడ్యచిత్రకంబును విచి
త్రమణిపుత్త్రికాదీపదీపితంబును బటీరనీరతుషారవారప్రసిక్తంబును గృత్రిమరూ
పాతిరిక్తంబును బరిణయాలోకనాగత చాతుర్వర్ణ్య వ్రాతతనుచిత్రప్రదేశవిశాలంబును
సమస్తవస్తుప్రశస్తంబును సకలజననయనాభిరామంబునగు జనకమునిచక్రవర్తి సభా
మంటపంబు దరిఁజొచ్చు నవసరమ్మున. 361

ఆ. ఎదురులేనికడిమి నెసఁగుపఙ్క్తిరథక్షితీంద్రుఁ జనకుఁ డప్పు డెదురుకొనియెఁ
దావులెల్లఁ గ్రోలి తగురీతివలిగాలి, యెలమిమీఱు మున్న యెదురుకొనఁగ. 362

వ. ఇట్లెదిర్కొని. 363

ఉ. వేడుకగౌరవించి పృథివీవిభుఁ బఙ్క్తిరథు న్మహారథుం
దోడుకవచ్చి రాముని వధూజనకాముని గీర్తికాముని
జూడఁగ వేఁగు సేయు పరిశుద్ధమనోరమకాయు గేయుసా
మాద్రిదధికోపలతుణు సురప్రతిపత్తుభిదావిచక్షుణున్. 364

క. నముచితరోపశమనసునుసను,చితరూపప్రదీప్తు సౌమిత్రిఁ బరా
క్రమనిధుల భరతశత్రుఘ్నమహోత్రియులను బొగడుచుఁ గడువాగ్మిమునన్. 365

క. అద్రిపులీనుల నతిధైర్యాద్రుల రాఘవుల శాత్రవాద్రిపవులకుం
భద్రత్నభద్రసముచిత, భద్రాసనముల వసింపఁ బంచి ముదమునన్. 366

క. భూవరుఁ డనంతరంబున, ధీవరుఁ డనఁదగు నరుంధతీవరు వాగ్దే
వీవరతుల్యు వసిష్ఠుని, దేవర్షిప్రణతుఁ బరమధృతిసంయుక్తున్. 367

గీ. తాపసవిరహితు నుచితచితాపసనమున, సన్నుతింపుచు నతనినివిష్టుఁజేసి
నతజనవిధేయు గాధేయు నతులభక్తి, మహితనుగుచోటఁ దగనుపవిష్టుఁ జేసి. 368

వ. మఱియుం దగినవారి నుచితాసనాసీనులం జేసి దానుం దగినయెడ సుఖోపవిష్టుండై
సర్వజనమనఃప్రమోదంబుగా సుప్రసంగంబు సేయుచుండి జనకుండు దశరథున కిట్ల
నియె. 369

క. జాతానందంబున భూ,జాతప్రామునకుఁ దదనుజాత స్సుముఖా
బ్జాత న్మ్రతనుజాతన జాతోపమనేత్ర మదనసాయకగాత్రన్. 370

గీ. లలితపరిమళనూర్మిళ లక్ష్మణునకు, నొసఁగెదనటంచు మిగుల సొంపెసఁగఁ బలికి
మఱియు నిట్లను దశరథక్ష్మాతలేంద్రుఁ, డగ్గలంబైన సంతోషమతిశయింప. 371

క. అనఘాపఘ్నులకు న్మని జనశత్రుఘ్నులకు భరతశత్రుఘ్నులకున్
ఘనముగ నొసఁగెద హితులవు, వనఁగ మదనుజుని తనయల నలఘుతనయాలన్. 372

వ. అని యిట్లు రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు శ్రుతకీర్తులగు భూమిసుతోర్మిళామాం
డవీశ్రుతకీర్తుల నొసంగి వివాహంబులు సేయువాఁడుగా నిశ్చయించి పలికినమ్మహీ
విభుండు మహానందంబునొందెం దక్కిన సభాసీనులును సమ్మదంబునందేలి యాఁనుచుం
జనకుం బ్రశంసించి రయ్యవసరంబున. 373

.క పరమమునీశ్వరచేత,స్సరోజవాసిగు రామచంద్రుని కతనం
గర మొప్పెం దత్సభహిమ కరోదయావసరదుగ్ధకంధి విధమునన్. 374

వ. అంత. 375

క. తనకులజులకు వివాహము, లని రాగము మీఱ సమ్మదాంబునిధి మునిం
గినచందంబున వరుణుం, డనుపమరాగమునఁ బశ్చిమాంబుధి వ్రాలెన్. 376

మ. తనసాంగత్యము వాసి పద్మహితుఁ డంతర్ధాన మొందన్న భో
వనజాతాయతహ స్తపిల్పుక్రియ విద్రావత్వను ల్మించె వా
తని రేపాకరుఁ గ్రోధతామ్రగతి సంధ్యారాగముం దద్వియో
గనిదాఘాంబుకణప్రకారమున నక్షత్రంబులు న్భాసిలెన్. 377

క. ఇనునికరస్పర్శము మా,నిన విరహము నొందు పద్మినీక్రమమున వ
య్యినునికరస్పర్శము మా,నిన విరహము నొందు పద్మినీక్రమమ మరెన్. 378

చ. అహితుఁ డహీనతేజుఁ డగునప్పుడు డాఁగి తదంచితప్రభా
రహితుఁడు గా నెఱింగి పరరాష్ట్రము నాక్రమణం బొనర్చున
ట్లు హిమకరుండు తేజుఁ డగునప్పుడు డాఁగి తదంచితప్రభా
రహితుఁడు గా నెఱింగి తిమిరంబులు ముంచె ధరాకటాహమున్. 379

వ. ఇవ్విధంబున సూర్యాస్తమయం బగుటయు నద్దశరథుండు. 380

ఉ. పాపవిదూరుఁ డమ్మిథిలభర్త నుతింప నుతు ల్భజింప ఘుం
టాపథ మొప్పఁ జేయుచు ఘనప్రభ రాజగృహంబు జేరె సు
ద్దీపితరత్నదీపకరదీపసహస్రము లుల్లసిల్ల ధా
త్రీపతి తూర్యగావబధిరీకృతసర్వదిగంతరాళుఁ డై. 381

క. ఆర్యులు వసిష్ఠకౌశికు, లార్యాపతిసములు సముచితాత్తశములు ని
ర్ధార్యు లమాత్యశ్రేష్ఠులుఁ, గార్యజ్ఞులు బొగడఁగ నుపకార్యం జొచ్చెన్. 382

వ. ఇవ్విధంబున భృత్యామాత్యపుత్రమిత్రసమేతుండై విడిదికిం జని యుచితవినోదంబులం దగిలి రోచులం జంద్రమరీచులం జాలకనసేయు ధౌతకలధౌతశశనసౌధాగ్రభాగంబున గగనధునీవీచుల నీవిచుంబలితపవనం బొలయ వీణానాదంబు లులియ సుఖనిద్రం జెందియున్నంత. 383

సీ. పద్మిని మదనతాపంబునను గృశించెఁ, బద్మిని సంతోషభరిత యయ్యె
క్షీరతుషారసంసిక్తయై మహి యొప్పె, సరగఁ దుషారసంచయ మడంగెఁ
గువలయంబునకు నెక్కొనియె వికాసంబు, గువలయస్మయము సంకుచిత మయ్యెఁ
దతతారకాప్రభాతతి మందమై తోఁచె, నోలిఁ బ్రభాతవాయువులు వీచెఁ

గీ. దామ్రచూడధ్వను లెసఁగెఁ దద్దతూర్వ, తామ్రమై యొప్పె నంత భక్తజనవృజిన
కర్తనుం డుదయించె వికర్తనుండు, భవతమోవిభావసుఁడు విభావసుండు. 384

గీ. మిహిరునుదయంబునకు మున్న మేలుకాంచి, కృత్యములు సల్పి దశరథనృపవరుండు
నగరఁ బుత్రచతుష్టయసహితుఁడగుచుఁ, గౌశికవసిష్ఠులకు మ్రొక్కి కడుముదమున.

క. కార్తాంతికదత్తేద్ధము, హూర్తంబునఁ దనయులకు మహోత్సవములకుం
ధూర్తాంతకులకు గురితవి,హూర్తాంతికులకును బరిణయము లొనరింపన్. 386

వ. కృతోత్సాహుండై యుండునంత జనకుండు సుతల నలంకృతలం జేయం బుణ్యసతుల నియోగించుటయు నవనిజం గదిసి. 387

క. అమ్మానిను లిట్లని రో, యమ్మా నిన్నుఁ బెండ్లియాడునతఁడు ఘనుఁడు రా
మమ్మా విద్యుల్లతికా, సమ్మానితదేహ సుగుణసహితస్నేహా. 388

క. అని పలుకుటయు నల్లజ్జానతతానన యైనసీత వనజాతనిభా
క్షి నజాతసామ్యఁ గొని మజ్జనశాలకు నేగి యుచితసంభ్రమలీలన్. 389

ఉ. ముద్దులగుమ్మ లందియలమ్రోఁత లెసంగఁగ డాసి క్రద్దనం
దద్దయు వేడ్కఁ రత్నఖచితం బగునొక్క పసిండిగద్దియ
న్ముద్దియ నుంచి యాఘనమనోహరలోచన పద్మహస్తతో
నద్దియటంచు నంతఁ దనుయష్టులు లెంతయుఁ బల్లవింపఁగన్. 390

గీ. కమ్మనూనియఁ దలయంటి రొమ్ము గులుకఁ, గడిగి యుద్వర్తనము వర్ణకమునఁ జేసి
మజ్జనంబు ఘటించిరి మనము లలరఁ, బుష్కరాననలు మనోజ్ఞపుష్కరముల. 391

వ. ఇవ్విధంబునం బెండ్లిపాటలు పాడుచు మంగళస్నానంబు సమాచరించి. 392

క. ధారాధరములు ఘనము ల,పారద్యాసములు నయ్యెఁ బ్రతినిధి యగు నే
యారామకురుల కనుచును, నీరారిచె నొక్కసతి వినీలత యొప్పన్. 393

క. అభ్రావలగ్నయును విమ,లాభ్రాలక యైనసీత కానందమున
న్విభ్రాజితముగఁ గట్టెను, శుభ్రాంశుక ముఖి యొకర్తు శుభ్రాంశుకముల్. 394

సీ. నిర్మలస్ఫటికవినిర్మితఫలకభా,స్వన్మధ్య సముదితచ్ఛాయ యనఁగ
సమ్మృతకళాపూరితాంతరితుం డగు, శశిలోన మించులాంఛన మనంగఁ
దుహినవారోదయోత్ఫుల్లపనోహా,పద్మాంతరస్థబంభర మనంగఁ
బ్రకటసమ్మార్జితముకురబింబాంతర,నిహితసుందరహరినీల మనఁగ

గీ. నలకములు బాయఁగాఁ ద్రోచి యలికభాగ,ఫలకమునఁ గమ్మతావులు జిలుక సమ్మ
దంబునను సర్వజనులచిత్తంబు లలరఁ, దిలక మొనరించె నొకసతీతిలక కులుక.

గీ. ప్రకటసౌవర్ణసాలభంజికలలోన, మెలఁగుజనకతనూజాత తెలియరాద
టంచు నొకసతి యానవాలుంచెసనఁగఁ, జెక్కుటద్దంబునం దొక్కచుక్కఁ బెట్టె.

ఉ. పాటలసన్నుతోష్ఠియును బాటలగంధియు నైనసీతకు
న్సాటివధూటి లేదనుచు సాక్షిపచించెద నంచు మించుఁ బ
న్నీటఁ గుశేశయంబులన నీటుగుకన్నులు తోమి వాటమౌ
కాటుకఁ బెట్టె నొక్కసతి కాటుకపిట్టల గేణిసేయఁగన్. 397

క. పారపరిమళితఘనఘన,సారమిళితగంధ గంధసారంబున వి
స్తారానందంబున నొక,సారసలోచన యొనర్చెఁ జర్చ మహిజకున్. 398

సీ. పువ్వుఁబోణికి మల్లెపువ్వులు దంతము, ల్జవ్వని నాసిక నవ్వుపువ్వు
తాపసంపెఁగపువ్వు తనువు దిర్సెపుఁబువ్వు, మానినీమధ్యంబు మట్టిపువ్వు
పల్లవాధరమవ్వు తెల్లఁగిపువ్వులు, పాలుపాయుపాక్కిలి పొన్నపువ్వు
మోము తామరపువ్వు మోవి మంకెనపువ్వు, కన్నులు నల్లని కల్వపువ్వు

గీ. లేల నీపువ్వుఁబోణి కనని హేలనొక్క, కాంతకరవీరమందారకర్ణికార
మాలతీచాంపజాజీసుమావళుల నొ,సంగె సీతకుఁ గడుసొం పెసంగుచుండ. 399

వ. ఇవ్విధంబున నూర్మిళా మాండవీ శ్రుతకీర్తులకు ననుపమశృంగారంబు లొనరించి
యున్నంత నక్కడ. 400

చ. అంగన లంగజన్ముఁ డని యంగవిలాసము సన్నుతింపఁ బు
ణ్యాంగనలొప్పఁ బాడుచుఁ బ్రియంబున రాము నభంగమంగళా
భ్యంగన మాచరించి హృదయంగమవాణ్యు లలంకరించి రు
ప్పొంగుచు భూరికాంచనవిభూషణము ల్బరితోషణంబునన్. 401

గీ. తనరుకస్తురిబొట్టులాంఛనము గాఁగ, మందహాసంబు చంద్రికామహిమ దనర
సరసవాక్యము లమృతరసంబు గాఁగఁ, జంద్రుఁడై వడి శ్రీరామచంద్రుఁ డొప్పె. 402

క. లలిఁ గంతు జయంత వసంత లలితు లన నొప్పు లక్ష్మణ భరత శత్రు
ఘ్నుల శత్రుఘ్నులఁ గామినులు, లలంకరించిరి విభూషణాంబరపటలిన్. 403

వ. తదనంతరంబున. 404

క. నయముల స్వవినయములం బరిణయసౌభాగ్యములఁ బద్మపత్రనయనల నసమా
నయశోధన్యుల నాత్మజ, నయులఁ గని జనకుఁ డతిఘనం బగు వేడ్కన్. 405

చ. చెలఁగి మహార్థనిశ్చయముఁ జేసి విదేహమహీధవుం డమా
త్యులఁ బిలిపించి యద్దశరథున్సుతబంధుసమేతుఁ బంకజా
ప్తబలితవంశ్యుఁ దోడ్కొని ముదమ్మున రం డన వార లమ్మహో
జ్జ్వలుకడ కేగి యిట్లని రవారణ వాక్చతురత్వ మేర్పడన్. 406

మ. అవనీనాథభవత్తనూజులకుఁ గల్యాణంబుల న్నేయ నీ
దివసం బుత్తమమంచుఁ దెల్పఁ దని వైదేహుండు మమ్మంపినాఁ
డవనీదేవసమావృతుండ వయి ర మ్మాలస్య మింకేల భూ
ధవులెల్లం గొనియాడఁ బుత్త్రహితభృత్యశ్రేణితో నొప్పఁగన్. 407

గీ. అనిన ముదమంది యొసఁగె నయ్యంబరమణివంశమణి వారలకు ననవద్యమణులు
నమితతాంబూలజాంబూనదాంబరాది, మహితబహుమానములు బహుమానముగను.

వ. ఇట్లొసంగి. 409

చ. దశరథుఁ డంత బ్రాహ్మణవితానసమర్చనమాచరించి స
త్వరగతు లైన మానులు ముదంబునఁ దోనరుదేర శత్రుదు
ర్వశరథసామజాశ్వభటవర్గసమేతముగా నరేశ్వరు
ల్వశులయి కొల్వఁ బౌరజనవారము సంతసమంది చూడఁగన్.

క. రాజముఖుల సేసలు నీరాజనములుఁ గొనుచు నుచితరాజపథమునన్
రాజవిభవమున నఖిలధ, రాజనులు నుతింప బంధురాజసహితుఁడై. 411

వ. చనునవసరమ్మున. 412

చ. తెలియవు కామినీజనుల దీటగుపాటలు వేణునాదము
ల్దెలియవు పల్లుసేసలును దేవత లొల్కెడుపుష్పవర్షము
ల్దెలియవు పంకజాప్తకరదీధితులు న్మణిభూషణాంశులుం
గలసి వెలుంగుటం ధరణికాంతుఁడు పెండ్లికిఁ దర్లుచుండఁగన్. 413

క. అమరధునీవిమలాంభః, కమలవనీవిహరణంబు గాంచి మలయభూ
భ్రమరుత్కిశోరమధ్వ,శ్రమజనితనిదాఘబిందుసంచయ ముసుపన్. 414

వ. దశస్యందనుండు పురందరు చందంబునం బురంబువా రబ్బురంబంద నందనులం బుర
మవృషభులం బురస్కరించికొని యమంద మహానందకందకందళితహృదయారవిం
దుండై మందసుందగమనంబున వందిమాగధులు సందడింపం జిందంబుల రొదలు గ్రందు
కొనం దరణికిరణంబులకుం దెలిపి యాని గొడుగులం దనివినొందు మండెదవ కెలంకుల
నందలుమంత్రులుం దగురీతి నడువం దలుచుగ సుందరమకరందబిందువులు జిందు
మందారకుసుమసందోహంబులు బృందారకబృందంబు లందంద గురియింప ధరణీబృం
దారకు లాశీర్వదింపం గొందఱు సుందరులు గ్రంతలుగొని ముందఱ నడువ నందమ్మొ
లగు నందియ లడుగుందమ్ములం దొడిగి చందనం జలంది యిందింది రంబులం దెగడి
సంక్రందననీలంబులం గ్రిందుపఱచు కురులుం దోవలందిరస్కరించు కస్తవలపొం
దికలుం, గందుకంబులం ద్రిప్పు కుచద్వంద్వంబులుం, గుందనంబుడంబు డిందుపఱ
పందగు తనుచ్ఛాయలుం, దలిరాకుమోవులుం, దెలిచెక్కులును, దరస్మితంబులుం,
గుందరదనంబులుం గలిగి యువజనంబుల డెందంబులు గొండలంబందఁజేయుచుం దన
మోసలం దండలాసకాది వివిధవిధానంబులం దాండవంబు సల్పుచు నందకేళి పడు
పుందెలివలరుగం జందనోదకంబునం దడిసి గందవడి నందంబగు రాజమందిరంబుందరి
యంజొచ్చు నవసరమ్మున నహల్యానందనుండగు శతానందనిభుండు శతానందుండు
తోడరా జనకుం డెదుర్కొని తోడ్కొని చని. 415

క. సముచితముగ నర్ఘ్యమును బాద్యము నొసంగి యనంతరము ముదంబున మణిపీ
ఠములిడి జనకుఁడు పూజించె మహారథు దశరథుం బ్రసిద్ధుల మునులన్. 416

వ. ఇట్లు పూజించి సమస్తజన మునిజనకదంబానందజనకంబు లగువచనంబుల దశర
థున కిట్లనియె. 417

చ. బుధజనమాన్య పఙ్క్తిరథ భూనుతకీర్తికి రామమూర్తికి
న్మథితవిరోధిలక్ష్మణకుమారునకున్ భరతాభిధానమూ
గధతనయాకుమారులకుఁ గావలయుం ద్వాలోవివాహము
ల్పృథివి శుభస్యశీఘ్ర మను పెద్దలవాక్యము పాలకింపమే. 418

వ. అనుటయు మహానందమగ్నుండగు దశరథుండు. 419

క. తదవసరంబున సుతులకు, సదమలులకు నలువురకుఁ బ్రశస్తంబగున
భ్యుదయార్థ మధిపుఁ డొసఁగె, న్మొదలన్విప్రులకుఁ బాడిమొదవులఁ బొదలన్.

క. విధివంతంబుగ జనకుఁడు, మిథిలానాయకుఁడు విప్రమిత్రసహితుఁడై
మధుపర్కంబులొసంగెను, మధుపసమానాలకులకు మనువంశ్యులకున్. 421

వ. తదనంతరంబున. 422

క. కలధౌతధౌతసుందర, కలశోదక మాత్మపత్ని గైకొనియొసఁగ
న్నాలకులిశజలజరేఖా, కలితనృపకుమార పదయుగములు గడుగుచున్. 423

క. అన్యములగు దానమ్ములు, కన్యాదానసదృశములు గావనియొసఁగెం
గన్యాదానంబులు జన,మాన్యులమ న్నేస దశరథమహీపతులకున్. 424

వ. అంత. 425

చ. చెలఁగి యరుంధతీపతి వసిష్ఠుఁడు రాముకరంబుఁ బూని ని
ర్మలనవరత్నగుంభనవిరాజిత దివ్యవివాహవేదికో
జ్జ్వలకనకాసనంబున నిషణ్ణునిఁజేసి సువాసినీజన
మ్ముల నియమించె నింపెనయ భూతనయందగఁ దోడితేరఁగన్.

క. సీరపథజాతకుఁ బ్రతి,సీరమలుఁగు వెట్టి స్ఫుటకుశేశయముఖలా
శీరుకులు సెలఁగ సునా,సీరనిభుఁడు రామచంద్రు చెంతనునిచిరన్. 427

క. ఒకరినొకరు చూచెడువేడుకలు కడునోర్మిలక లెత్తుడు వధూవరిదృ
గ్వ్యకరిమ్యగ మిరినఁద గెయవ,నిక యమునావిమలవాహినీభంగమనన్. 428

వ. అంత. 429

ఆ. తెఱవ లుచితరీతిఁ దెరఁ దలువమరల్ప, జనక భాగ్యరాశి జనకతనయ
తలుఁగులేని వారిధితరగల నుదయించు, సిరివిధమునఁ దేజుసిరి వహించె. 430

గీ. లలితమాలా మనోహార గళయగుచుఁద,మాలసాలంబు సరసనేలాలత యన
నీలమేఘుంబు చెంత శంపాలతయన, బాల తనరారె రామనృపాలుఁ బ్రోల. 431

ఉ. సీతకటాక్షవీక్షణము శ్రీరఘురాము ముఖప్రభాతకం
జాతవిచిత్రచిత్రకిత సారకురంగ మదంబుఁ గా సము
ద్యోతితమయ్యె రాఘవ మహోజ్జ్వలదృష్టి కరంబుమీ ఱెభూ
జాతకుఁ గజ్జలంబునఁ బొసంగనొనర్చిన చెక్కుచుక్కగన్. 432

వ. తదనంతరంబున. 433

మ. కులకాంతాతిలకావలీవలయిత క్షోణీకుమారీ పవి
త్రలసచ్ఛీర్షముగ న్మునీంద్రజనమందారుండు రాముండు తాఁ
దలఁబ్రాల్దోయిటఁబట్టి వేడుక భుజద్వంద్వంబుపై కెత్తియుం
చె లతాగ్రంబునఁ బుష్పగుచ్ఛమనరం జిలంగులాచారతన్. 434

ఉ. హేమవికాసమంద భుజమూలరుచుల్వెలుఁగొందఁ గంకణ
స్తోమఘృణిం ఝణంకృతులు సొంపెసఁగం జిఱునవ్వు నవ్వుచుం
దామరసాక్షు లెంతయు ముదంబునఁ దోడయి హెచ్చరింపఁగా
రాముశిరంబుమీఁదఁ దలఁబ్రా లునిచెందగ భూమిజాతయున్.

ఆ. మఱియు వేడ్కచేత మహిజాత తా శ్వేత, మౌక్తికములు రాముమస్తకమున
ననుపఁబూన హస్తయుగము గడునొప్పెఁ, జూచువారికెల్ల శుక్తి యనఁగ. 436

వ. తన్మహోత్సవ సమయంబున. 432

క. జనములు క్రిక్కిఱిసి దవ, చనరామి నెఱిఁగి యుచితజాలపథములం
జని రాముని పరిణయమున, జనరాజితలీల మెలఁగె శ్వసనాంకురముల్. 438

క. గళదురుగండశిలాన, గ్గళభేరీధ్వనుల రిపులు గలవరమందం
గళమున బంగారపు మం, గళసూత్రము రాఘవుండు గట్టె మహిజకున్. 439

ఉ. భూజనకల్పభూజుఁ, డజపుత్త్రితనూజుఁడు రాముఁడంచితాం
భోజదళాక్షుఁ డిద్ధవిధి భూమిజఁగూడి మహాముదంబునన్
లాజల నాజ్యధారల దళంబునఁ దృప్తిఁగా నొనర్చె న
వ్యాజగురుప్రసాదుని నుతాగమనాథుని జాతవేదునిన్. 440

ఆ. సర్వసాక్షి కర్మసాక్షివంశజుఁ డగ్ని, సాక్షికముగ సీత సారసాక్షి
నఖిలలోకసమ్మతాక్షీణలావణ్యఁ, బ్రీతితోడ నిట్లు బెండ్లియాడె. 441

శా. శోభాగాత్రి కరుంధతీసతికి నత్యుద్రోరుచారిత్రకుం
బ్రాభాతామలపద్మనేత్రకు సతీవ్రాతాంచితస్తోత్రకున్
సౌభాగ్యం బభివృద్ధినొంద రఘువంశస్వామి రాముండు సీ
తాభామాసహితంబుగా నెఱఁగె నత్యంతం బ్రజల్మెచ్చఁగన్.

క. జనుల కరుంధతి మఱిదలఁ, చినమాత్రన కల్గు సర్వసిద్ధులుఁ దన్నా
నినిఁ బ్రత్యక్షముఁ బూజించిన సత్సౌభాగ్యసిద్ధి చేకుఱుటరుదే. 443

వ. మఱియుం బంచమహాశబ్దంబులు బ్రాహ్మణాశీర్వాదనాదంబులు ననూనపుణ్యాంగనాగాననాదంబులు నింగిముట్టం జెలంగుచుండ వసిష్ఠుండు లక్ష్మణ భరత శత్రుఘ్నులకు నూర్మిళామాండవీశ్రుతకీర్తులఁ బాణిగ్రహణంబులు క్రమంబున నడిపిన నిట్లన్నదమ్ములు నలువురు నేకకాలంబునం గృతోద్వాహులయి వధూసహితంబుగా జాతవేదునకు నమస్కరించి వసిష్ఠ విశ్వామిత్ర శతానందప్రముఖ నిఖిల మునిప్రకరంబునకును దశరథజనకభూమీధవులకుం బ్రణమిల్లి స్వస్తివచనంబులు పరిగ్రహించి యున్నంత. 444

క. దానోత్తమమగు భోజన,దానంబున జనులఁ దనిపెఁ దజ్జనకుండుం
దానంబుల నురుభక్తి వి,ధానంబుల ద్విజులఁ దనిపెఁ దజ్జనకుండున్. 445

వ. అంత. 446

గీ. గంధసింధురయవనకంఖాణసుభట,రత్నధేనుసువర్ణవస్త్రప్రశస్త
దాసదాసీవిశేషశయ్యాసనంబు, లరణము లొసంగె వేర్వెఱ నల్లురకును. 447

క. విశ్వానందప్రదస,ప్తాశ్వకులుల యుచితపరిణయంబులు గనియు
ర్వీశ్వరు దీవింపుమ న,వ్విశ్వామిత్రుం డభీష్టవృత్తిం జనుడున్. 448

ఉ. కూఁతులఁ జేరఁబిల్చి జనకుండు మహాదరణంబు మీఱ వి
ఖ్యాతపతివ్రతాత్వవిధితాంచితశీలము లెల్ల వారికిం
బ్రీతి నుపన్యసించి యలరించి విశేషవిభూషణాంబర
వ్రాతసువర్ణరత్ననికరంబు లొసంగె మనోముదంబుగన్. 449

క. హరియును సిరియును మానవ, శరీరములు దాల్చినట్టి చందమున వధూ
వరు లీ సీతారాములు, గర మొప్పిరటంచు జనుల కలకల మెసఁగెన్. 450

క. అధికతరానందుఁడు దశ రథ,ధరణీవిభుఁడు దత్పురంబున మహిత
ప్రథఁ గొన్ని దినంబులు జన,కధరాధిప మాన్యుఁడై తగన్ వసియించెన్. 451

వ. ఇట్లుండి యొక్కశుభదినంబున జనకుననుమతంబు వడసి యపరిమితపరిచారికావ్ర
తలగు వధూరత్నంబులును మహానందయుతులగు సుతులును సమస్తబంధుమిత్రా
మాత్యులును సముచితవాహనంబు లధిష్ఠించి యనుగమింప రథారూఢుండై పుణ్యకా
మినీజనమ్ములు సేసలు చల్ల నమ్మిథిలాపురంబు వెలువడి తన్ను నుపవచ్చు జనకచక్ర
వర్తి నధికధర్మమూర్తి సపరివారంబుగా నెట్టకేలకు మరల్చి యుచితయానంబున
సాకేతాభిముఖుండై. 452

క. దారితశాత్రవనిచయుఁ డు, దారుఁడు పఙ్క్తిరథుఁ డేగు దారిభయదముల్
క్రూరతరమారుతంబులు, దారుణముగ వీచె నత్యుదగ్రస్ఫురణన్. 453

గీ. ఇట్టి దుశ్శకునంబుల నెట్టిగట్టు, పుట్టునో యని కులగురువునకుఁ దెల్పి
తద్విధం బెల్ల నాత్మబోధమునఁ దెలిసి, యాతఁ డాతని కిట్లను నంతలోన. 454

సీ. క్షత్త్రియారణ్యాగ్నిహోత్రమహోజ్జ్వల,త్కీలకుఠారంబు కేలఁ గ్రాలఁ
గాంచనాచలకటకవిశాలవక్షస్స్థలంబునఁ దెలిజన్నిదంబు మెఱయ
నఖిలమానవనివహాభయంకరము లైన,దృష్టుల నంగారవృష్టి లొలుక
నధికప్రతిభ దెల్పు నరుణకాంతి వహించు, ముఖమునఁ గనుబొమ ల్ముడివడంగ

గీ. దశరథుం డిచ్చు పూజావిధానములఁ బరిగ్రహింపక యాగ్రహోదగ్రుఁ డగుచు
నిగ్రహానుగ్రహసమగ్రు నీరజాక్షు, రాముఁ జేరంగఁ జని భృగురాముఁ డలుక. 455

క. విత్రాసస్థితివిగత, క్షత్రము గావించి తొల్లి కశ్యపునకు ని
ద్ధాత్రిసమస్తము నొసఁగిన, ధాత్రీసురముఖ్య జామదగ్న్య యెఱుఁగవే. 456

క. హరుజీర్ణచాప మెక్కిడి, పురుషోత్తముఁడ ననికొందుఁ బొంగెదు పురఘు
స్మరుచాప మచలమేనరవరుఁ డని నినుఁ బొగడి రెల్లవార లెఱుఁగమిన్. 457

క. నాచేతం బూజితమై, నాచేతం బొల్చు పద్మనాభు ధనువొగి
న్నీచేత నధిజ్యమగుడు, నీచేఁతలు చిత్రములని నెఱినమ్మవగున్. 458

క. ధృతి నాధను వెక్కిడిన, స్మృతి నిను భావింతు సత్త్వమహితునిఁ గాఁ గా
కతిమహ్కర మేనియ నింద్రిత రాజసతామసములు నీకుం గలవే. 459

చ. అని తను జామదగ్న్యుఁ డనయంబులు వల్కఁగఁ గార్ముకమ్ముతో
న నతని సత్త్వముంగొని ఘనంబుగ నెక్కిడి రామచంద్రుఁ డా
తని వరపుణ్యలోకసుపథంబులు గూల్చి మదంబడంచి తం
డ్రిని నిజబంధుకోటి నలరించె ననంత భుజాబలాఢ్యుఁడై. 460

గీ. రాము వలగొని భార్గవరాముఁ డల మహేంద్ర పర్వతమునకు నై యిచ్చ జనియె
రామునటుఁ బుచ్చి దశరథరాముఁ డలమహేంద్ర విభవంబుతోఁ దండ్రి కెలమి మ్రొక్కె.

క. రాజకులమౌళి రాము ప, రాజయమును నిజజయంబు గహి నెఱిఁగింపన్
రాజాననుఁ డగు సత్రత, నూజు సౌందర్యజితమనోజుం బొగడెన్ 462

వ. ఇట్లు పొగడి. 463

క. తనరవసిష్ఠుం డెఱిఁగించినవిధమునఁ దొలుత భయము జెంది జనకుఁ డై
క్కొనఁ గల్గెనుచుఁ దన మనమున గుహల యమే యబోధయునకుం బొంగెన్. 464

వ. మఱియును రామభద్రుని ధైర్యౌదార్యశౌర్యౌదార్యగాంభీర్యస్థైర్యాదిగుణంబు
లగ్గించుచుఁ దమరాకకు నలంకృతంబగు సాకేతంబుఁ గౌతుకంబునం గనుంగొని.

క. పురజనము లెదురుకొన రథ, కరితురగగ ధాపణమగు ఘంటాపథముం
దరిసి చనునవసరమ్మున, బురసతులుఁ దెఱవలను రాముఁ బొడఁగని తమలోన్. 466

సీ. జనకునియాజ్ఞ విశ్వామిత్రుతో నేగి, తొలుదొల్తఁ దాటకఁ దునుముటయును
నీచుమారీచు మున్నీట ముంచుటయును, బిదప సుబాహునిఁ బడఁపుటయును
గౌశికుజన్నంబుఁ గాపాడుటయు నొక, గ్రావంబు నంగనఁగా నొనర్చు
టక్కపీఠ జోటు కార్ముకము ద్రుంచుటయును, భ్రాతృయుక్తముగా వివాహమగుట

గీ. తండ్రిమదిలోని భయమెల్లఁ దలఁగఁ బరశు,రాము మాఱొక్కని యతనిగర్వం బడంచి
చెలఁగి సాకేతమునకు విచ్చేయుటయును, జెప్పికొని చాల సంతసించిరి మఱియును.

చ. పురవరవర్ణిను ల్వివిధభూషణభూషితలై సువర్ణనూ
పురరవము ల్సెలంగఁ గడుఁ బొంగెడు రాగరసంబు జేర్మి గో
పురవరసౌధభాగములఁ బొందుగ నిల్చి నరేంద్రు రాము గో
పురవరు సౌరకామినులపోలికఁ జూచిరి సేస లొల్కుచున్. 467

వ. తత్సమయంబున. 468

సీ. అగణితసౌధయాతా నిగమాంబురాశికి, రాజించు తనరాక రాక గాఁగ
సమధికభయదరాక్షసచమూపతులకుఁ, దనదర్శనము సుదర్శనము గాఁగ
వీతవిద్వేషులౌ విబుధనాయకులకుఁ, దనచరిత్రములు చిత్రములు గాఁగ
నహితరాజన్యసైన్యములకుఁ దనప్రతాపంబు మిక్కుటపుఁదాపంబు గాఁగ

గీ. సత్యధర్మక్షమాదయాశౌచరత్న, సమితికిఁ దనగుణములు గుణములు గాఁగఁ
దమ్ములనుగూడి రామచంద్రప్రభుండు, వేడ్క విహరించె నప్పురవీథులందు. 469

వ. ఇట్లఖిలజననయనోత్సవంబుగా విహరించి. 470

క. తమ్ములు తరుణీయుతు లుచి,తమ్ముగఁ దనుఁ గొలువఁ జాను దైతాయుతుఁడై
తమ్ముఁ గను వేడ్క నధికము,ద మ్మందుచు నున్నయట్టికల్లుల కెరఁగన్. 471

వ. అంతఃపురమ్మునకుం జను నవసరమ్మున నవసరమ్ము లురమ్ములఁ గరమ్ము మెఱయఁ గరమ్ముల కంకణ నికరమ్ములు మెరయఁ గుచమ్ము లొరయఁ జతనమ్ముగ రతనమ్ములు చెక్కిన పసిండిపళ్లెరమ్ముల ననురూపమ్ము లగుహిమవాలుకాదీపమ్ముల దీప్తులు తమతలప్రదీప్తులకుం దగ వనిక్రిందుపఱచుట తగవనిన చందమ్మునం గొమ్మలు బాహుబిసమ్ములు సాఁచి యొసంగు నీరాజనమ్ముల రాజిల్లుచు నెడ నెడ వినోదమ్ము లగువీణానాదమ్ములకు ముదమ్ము నొందుచు జనయిత్రులపంపున నెదురొక్కని పుణ్యకామినీజనమ్ము లొసంగు రక్షాకరణమ్ములకు సమ్మతించుచు నుభయపార్శ్వమ్ములనుండి యిభరాజగమనలు శుభాచారలాజమ్ములు చల్లుచు నాసేచనక మ్మగు నిజమూర్తివిలాసమ్ము నాలోకనమ్ముఁ గావింప మనోహరరత్నగుంభనవిచిత్రభిత్తికానికాయంబులవలనను లసమానాసమానకాయమానంబులవలనను నిరుపమానమానినీబృందంబులవలనను రమణీయతరపదార్థంబులవలనను గరం బొప్పు మాతృగృహంబుఁ ధరియం జని. 472

ఉ. తమ్ములఁగూడి రాఘవుఁడు తల్లులపాదతలమ్ము లాత్మమూ
ర్ధమ్ములు సోఁక మ్రొక్కిన ముదమ్మున వీఁక లిచ్చి గ్రుచ్చి ప్రే

మమ్మునఁ గౌఁగిలించికొని మక్కువ లెక్కువలై తనర్ప నా
యమ్మలు ముద్దులాడిరి ప్రియమ్మున నిద్దపుఁజెక్కుటద్దముల్. 473

క. చన్నుల దుగ్ధంబులు వా, ల్గన్నుల నానందబాష్పకణములుఁ గలిగెం
గన్నులపండు వగుచు సుతు, లన్నలువురఁ జూచుతల్లులకుఁ జిత్రముగన్. 474

వ. తదనంతరంబున. 475

సీ. అంబుజంబులమీఁది యళులవిధమ్మున, మోమున నలకలు ముసుఁగువడఁగ
నడుము లున్న వని తెల్పెడుభంగిఁ గాంచికా, కింకిణీక్వణనము గ్రీలుకొనఁగ
నీలమేఘమ్ముల మేలమ్ములాడువి, ధమ్మునఁ జికురబంధమ్ము లమరఁ
బదతలమ్ముల కెంపు లాదవి సుధాధాత, సోపానము లరుణచ్ఛాయ లొందఁ

గీ. జిలుఁగవు లాననములకుఁ జెన్నొనర్ప, వినయమునులు రూపములు దాల్చె ననువుగాఁగ
నల్లనల్లన జనుదెంచి యాత్తలకును, మోదమునఁ గ్రొత్తకోడండ్రు మ్రొక్కుటయును.

క. శ్రీవనితాచతురాకృతు, లీవనిత లటంచుఁ బ్రీతి నెత్తికొని కడుం
దీవింపుచు నెంతయు సం, భావించిరి మానసములు ప్రమదం బందన్. 477

క. శ్రీకరమూర్తులఁ బుత్త్రిల, నాకోడండ్రఁ గని యుబ్బి యాడిరి విమలా
స్తోకచరిత్రలు కౌసల్యాకైకామగధతనయ లానందమునన్. 478

క. వనితాయుతుల న్సుతులం, గని జననీజనకు లమితకౌతుకమతులై
రని చెప్పి తనమనంబున, ననుపమ మగుహర్ష మంతకంతకుఁ బెరుఁగన్. 479

చ. పరమకృపారసానిలయభావితమౌనిసుచిత్తసారసా
నిరుపమసాహసావినుతనీరజగర్భకృపీటరేతసా
గురుతరదేహసారపరికుంఠితదుష్టనికృష్టరాక్షసా
భరిత మహాప్రసాద హితభక్తజనావన సక్తమానసా. 480

క. శరణాగతజనశరణా, శరనారదకీర్తిస్తనితసంకాశరణా
స్ఫురణోత్క్రమదాశరథా, చరణా వేంకటమహీధరసాధరశరణా. 481

మాలినీ. ప్రణమదఖిలసూరీ భక్తలోకోపకారీ
ప్రణవఘనవిహారీ భాసురానందకారీ
రణవిజితసురారీ బ్రధ్నచంద్రానుకారీ
క్షణకలుషవిదారీ సర్వదా నిర్వికారీ. 482

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణ భూమధైర్య
వినయ రామనార్యతనయ పండితసేవాసముపార్జిత క్రొత్తపల్లి
లచ్చయ ప్రణీతంబైన దాశరథివిలాసం బను మహాప్రబం
ధంబునందు ద్వితీయాశ్వాసము.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః

# దాశరథివిలాసము.



## తృతీయాశ్వాసము.



శ్రీమద్వేంకటనాథోద్ధామ ధరాధామ సుగుణధామ రవిసుధా
ధామ నయనవందితసుత్రామా రిపుభీమ సుందర విజితకామా. 1

వ. అవధరింపు మనంతరకథావిధానంబుఁ బ్రచేతసుం డగు ప్రాచేతసుం డిట్లని చెప్పం దొడంగె నట్లు సుప్రఖ్యాతమనోరథుం డగుదశరథుం డొక్కనాఁడు నిండుఁగొలువుండి యమాత్యులం గలయం గనుంగొని. 2

ఉ. సంతతి లేదు లే దనువిచారము దూరముఁ గాఁగ బుత్త్రిలన్
సంతసమందఁ గాంచితి నసాధ్యబలాఢ్యులు వారు వారికి
స్సంతతకీర్తిశాలుర కెసంగఁగ సన్నుతపుణ్యకామినీ
సంతతులైనకన్నియలఁ జక్కఁగఁ బెండిలిచేసితిఁగతిన్. 3

క. నాకులము గడువెలింగె, న్నాకులసత్కీర్తి యయ్యె నాపులమొప్పె
న్నాకులకాంతల మతులున్, నాపులములు గాఁ దనర్చె నాపులకరుణన్. 4

వ. అని పలికి వెండియు. 5

క. బుద్ధివికల మగుదృష్టియుఁ, బిద్ధం బగుబలము చెడువివేకం బుడుగు
న్వృద్ధతగదిరినజనునకు, సిద్ధం బతఁ డెంతయుం బ్రసిద్ధుం డైనన్. 6

ఉ. అర్థజనావనంబు వివిధాహితసైన్యవినాశశక్తితా
నిర్థరణంబు నంచితమనీషయుఁ గోపవిశేషరోషని
ష్పర్థనమంబు రాజులకు సమ్మతధర్మము లౌటఁ జూడఁగా
నర్థులు గారు రాజ్యమున కంధులు వృద్ధులు బుద్ధిహీనులున్. 7

వ. అని యిట్లు తనకృతార్థత్వంబును, వృద్ధత్వంబును, రాజ్యపాలనాసమర్థత్వంబును దేటపడం బలికి మఱియును. 8

ఉ. నించెదఁ గీర్తి దిక్కులఁ ననిందితధాముని రాముని బ్రీతి
న్నించెదఁ బూజ్యరాజ్యమున శిష్టజనానుమతుండనై యను

ష్ఠించెద సద్వ్రతంబులు విశేషధృతి న్సుకరంబుగా నధి
ష్ఠించెద సంతసం బెసఁగ దివ్యసువర్ణసువర్ణహార్మ్యముల్. 9

వ. అనిన విని యద్దశరథునకుం దదీయమంత్రిపుంగవు లఖిలజనానుమతంబు వడసి యి
ట్లనిరి. 10

క. ధాతవు విద్యలకు న్మాం, ధాతవు విక్రమసమృద్ధి దాతవు శుభసం
ధాతవు జనముల కివ్వసు, ధాతల మేలితివి తొంటిధరణిపులక్రియన్. 11

వ. ఒక్కనాఁడు నీయందు గోరంతకొఱంతఁ గంటిమే యని పలికి మఱియును. 12

ఉ. నీవు మహానుభావుఁడవు నీతివివేకవిశారదుండవుం
గావున నిట్టిసత్సుతులఁ గాంచి సుఖింపఁగఁ గంటి వీరలుం
దేవసమాను లగ్రజుఁ డుదీర్ణభుజాబలుఁ డార్యలోకసం
భావితుఁ డీసమారకునిఁ బట్టముఁ గట్టఁ దలంపు టొప్పగున్. 13

ఆ. పట్టభద్రు రామభద్రుఁ గనుంగొని, యుల్లసిల్లుదురు తదుత్సవమున
కఖిలజనులు నేము నలరుదు మీవు నుజ్జ్వలుఁడ వగుదు వట్లు చలుపు మనఘ. 14

వ. అని తనమనంబున కనుకూలంబుగాఁ బల్కుటయు నమ్మహీవిభుండు. 15

గీ. చెలఁగి శ్రీరామపట్టాభిషేకమునకు, వలయుసంభారములు దెండు వలను మెఱసి
యేతదుత్సవ మెఱిఁగింపుఁ డెల్లవారలకు నొనర్పుఁడు పురము నలంకృతముగ. 16

వ. అనిచెప్పి యంతఃపురంబునకుం జనుటయు నమాత్యులు. 17

శా. రంభాస్తంభము లెల్లచో నధికచిత్రస్ఫూర్తిఁ గల్పించి నూ
త్నాంభోజోత్పలమాలిక ల్నెఱపి వేశ్యాలాస్యము ల్మిఱఁ బ్రో
జ్జృంభత్కాంచనభద్రకుంభతతి నక్షీణస్థితి న్నిల్పి రా
జంభారాతిపురావధీరణలసత్సౌందర్యయుక్తంబుగన్. 18

వ. మఱియుం బరమశోభనంబుఁ గావించి రప్పురవరంబు వినూతననికేతనకేతనం బై, పూతానీతపుణ్యనదీతోయాన్వితం బయి విమల కమల కమలాకర కమనీయ కమలాకరం బై యనూనోద్యాన వనఘనోపవన పవన మనోభిరామం బై దేవమానవతీ సమానమానినీమానితం బయి మధురమాగధగానంబులవలనను, మహోత్సవాలోకనాగత జనపరస్పరాహ్వానధ్వానంబులవలనను, భేరీమృదంగాదిమంగళస్వానంబులవలనను, జృంభితమదకరిబృంహితధ్వానంబులవలనను, బూర్ణిమాసుధాపూర్ణభానూదయ సమయఘూర్ణమానార్ణవం బన నిర్ణయింపం దగి యింపు దళుకొత్తుచుండె నంత నొక్కశుభదినంబున. 19

గీ. గురునియోగతి రఘువంశ్యగురుఁడు రామ,చంద్రుఁ డతివేడ్కఁ జానకీసహితుఁ డగుచు
నలఘుతరమంత్రపూతాంబువులను గడుఁ బ్రియంబునను మంగళస్నాన మాచరించి.

క. తా నపుడు వొలిచె వసానిని,ధానుఁడు కృతపుణ్యతరవిధానుఁడు శుభసం
ధానుఁడు ధౌతాంబరపరిధానుఁడు సౌమిత్రిసన్నిధానుఁడు మిగులన్. 21

వ. అయ్యవసరంబున మంథర యను దాది తనదొరసాని యగు కైకకడకుం జని ససంభ్ర
మంబుగా నిట్లనియె. 22

క. మతిఁ గార్యగతి నెఱుంగక, యతివా పతి నాకుఁ గూర్చు ననుచు మిగులన
మ్మతి వతిమతిహీనవు వసు,పతి సవతిసుతుండ యేలు మహిమోజ్జ్వలుఁడై. 23

వ. అని పల్కి వెండియు. 24

మ. పతి కౌసల్యకుఁ గూర్చి తత్సుతునకుం బట్టంబు గట్టంగ ను
ద్యతుఁడై యుండుట తెల్లమయ్యెను సపత్నీవ్యక్తోద్భవుం దుర్వరా
పతిగాఁ జూచెను వంత పెద్ద భరతుం బట్టానకుం బాపి దు
స్థితినొందించిన గుండుపుత్త్రుఁ గనున త్రివాత్రికంటెం జెలీ. 26

చ. వరములు తొల్లి నీకుఁ జనవల్లభుఁ డిచ్చెను రెండు వానిలో
భరతునిఁ బూజ్యరాజ్యపదబంధురుఁ జేయుట యొండు గానన్
ర్వరఁ బదునాలుగేండ్లజినవల్కలము ల్ధరియించి జానకీ
శ్వరుఁడు చరించుటొం డివి ధ్రువంబుగ నొందుదొడంగి వేఁడుమీ.

చ. అన విని కైక చిత్త మురియాడఁగ నిట్లను మంథరాధరా
వనమున కగ్రపుత్త్రికు నవశ్యముఁ బూన్పక మాన నేర్చునే
మనుజవరుండు నీ వనుక్రమంబున వేఁడుట నాకధర్మమై
నను బతిఁ జేరి యివ్విధమున న్మొగమోడక మాఁదలించెదన్. 27

వ. అని పల్కి దైవప్రేరిత యగుటం జేసి ధర్మంబుఁ దలంపక. 28

సీ. ధవుఁ జేరి మేదినీధవ భవదగ్రభార్యాసుతు శ్రీరాము నడవిలోఁ జ
తుర్దశాబ్దంబులు దుర్దశ నొందఁగఁ, బంపి నాపుత్త్రికు భరతు నిఖిల
రాజ్యంబునకు నిష్ఠ రమణుని గావింపు, మీవు రెండువరంబు లిచ్చినాఁడ
వెఱుఁగుము తొల్లి నీ విటుఁ జల్పి తగుకీర్తి, వడసి కృతప్రతిజ్ఞుఁడవు గమ్ము

తే. భానుకులులు రాజ్యహీనంబునకు నైనఁ, దరము గాని యాపదలకు నైనఁ
బ్రాణభయద మైనప్రథనంబునకు నైన, వెఱవ రసత్యమునకు వెఱచినట్లు. 29

వ. అని యడుగుటయు నప్పలుకులు ములుకులక్రియ నలుకువ వెట్టుటయు నులికిపడి
యమ్మహీవిభుండు. 30

క. కైక వినుము రాముని లో, కైకవినుతనాము నడవి కనుపు మనుచు నీ
కై కడఁగి యొరుల నెడనుడిఁ, గైకొనఁగాఁ దగునె క్రూరకర్మము గాదే. 31

మ. ధనము ల్వేఁడిన వేఁడగాఁ దగుసుతుల్ ధాత్రీతలం బేలఁగో
రినఁ గోరందగు నీవు నీకు సుతుల్ బ్రీతి న్వను ల్సేయఁజూ
చినఁ జూడందగుఁ గాక వారిజముఖీ చిత్తంబు భగ్నంబుగా
మునివృత్తి న్వనవాసిఁ గాఁగ రఘురాము న్వేఁడ నీ కర్హమే. 32

క. మునివృత్తిం గానల రా, ముని వర్తింపంగఁ బనిచి మునుకొని యిఁక నే
మనియెద తాల్మి నిలిపి యే, మని యెద నేమని యెదను రమణిరో నిన్నున్. 33

వ. అనుటయు నక్కైకయరాజనందన. 34

క. నేర్చిన యక్కౌసల్యకుఁ, గూర్చితి వీవనినయట్లు కొంకక యిడఁగా
నోర్చెద వని నమ్మితి నిను, జర్చింపఁగ నైతి మును మృషావచనునిగాన్. 35

ఉ. అక్కట కోసలాత్మజకు నాప్తుఁడ వై నను దుఃఖవార్ధిలోఁ
ద్రొక్కఁదలంచు సాహసివి తోయజమిత్రకులీను లీక్రియ
న్నిక్కముఁ దప్పఁద్రొక్క రవనీశ్వర నీవొకరుండుదక్క నీ
వెక్కడ సత్యవాక్య మదియెక్కడ కొంకితి మానినీప్రియా. 36

క. అగ్రసుతు రాము విభవస, మగ్రుని గావించి బ్రదుక మన సయ్యె నబ
ద్ధగ్రసితోగ్రమహాహ్రద, యాగ్రంథివి నీకు నిక్క మది యిం పగునే. 37

క. అని తనుదూఱెడుపలుకుల, తన పుత్రుఁ దూఱుటయు విని యుతం బగు నిష్టు
ల్లనిచినఁ జేష్టలుగతి న, మ్మనుజవిభుఁడు భూమి నుడిగి మూర్ఛపడియుండెన్. 38

వ. అంత నక్కడ రామచంద్రుం గనుంగొని వసిష్ఠుండు పట్టాభిషేకసమయం బాస
న్నం బయ్యె దశరథుం డేలతడసె నీవరిగి యతనిం దోడ్కొనిరమ్మనుటయు నతండు.

ఉ. గారవ మొప్పఁ దండ్రి కెరఁగం దదనుజ్ఞఁ బరిగ్రహింప శృం
గారరసంబు దేహమునఁ గాఱ విచిత్రలసన్మనోహరా
గారముఁ జేరుచుండ నెరఁగా రతనంబులు గూర్చియున్న బం
గారపుఁ ద్రై వెఁ దనువు గాలిచు వెట్టఁగ కందు భూపతిన్. 40

క. కనుఁగొని మతి కైకం గనుఁ, గొని జనయిత్రి యి దేమి ఘోరపుశోకం
బున భూపతి మునిఁగినవాఁ, డని యడిగినఁ గైక నిర్దయామతి యగుచున్. 41

క. మనమున నించుకయేని దయ, నను మానము మాని పలికె నవికారుఁడ వై
విను తనయా వినుతనయా, విని చెద నేతద్విధము సవిస్తరఫణితిన్. 42

ఆ. నాకుఁ దొల్లి మీజనకుఁ డిచ్చినవి రెండువరము లందు భూమిభరము భరతుఁ
బూన్చు టొకటి నీవు పూని చతుర్దశాబ్దంబు లడవిఁ దిరిగివచ్చు టొకటి. 43

క. సమయం బగుడు వరద్వితయము వేఁడిన నితఁడు గపటి నై యీక్రియ మా
నముఁ బూనియున్న వాఁ డని, చమత్కృతి యొసంగఁ జెప్పి చయ్యన మఱియున్. 44

క. శ్రీదొరఁగి యొకట వనముల, లోఁ దిరుగుట నీకుఁ దొలిగలుగుట న్నిను బు
త్త్రా దివిజులు వొగడఁగఁ బి,తృదేశము సేయవలయు నవికారుఁడ వై. 45

చ. అనవుడుఁ గైకఁ జూచి పరమాదరణంబున రామచంద్రుఁ డి
ట్లను జనయిత్రి నాకు జనకాజ్ఞ యొనర్చుట మేలు నాదుత
మ్ముని వసుధాభరంబునకు ముఖ్యునిఁ జేయుట యంతకంటె మే
లరయముఁ గాననాంతరవిహారము మూఁడవ మేలు చూడఁగన్. 46

వ. అని జనకుదెసం గనుంగొని. 47

చ. ఇతఁడు ప్రతిజ్ఞ దప్పిన మహీతలమెల్ల వణంకదే సరి
త్పతి జల మింకదే గతవిభాస్థితిఁ బ్రాగ్గిరిఁ బ్రొద్దు గ్రుంకదే
మతి ననుమాన మించుకయు మాని చతుర్దశవర్షము ల్వన
క్షితి విహరించి మించి కృతకృత్యుఁడ నయ్యెదఁ బోయివచ్చెదన్. 48

వ. అని యంత నిలువక. 49

చ. జనకునిసత్యవాక్యము ప్రసన్నత మయ్యెడునంచు రత్నభూ
షణవసనస్రగాదికవిసర్జితుఁ డై యజినోత్తరీయము
ల్పనుపడఁ జేసి యంగమునఁ భస్మముఁ బూసి జటావిభాసి యై
ఘనవనవాసివేషము వికారము రోసినమానసంబుతోన్. 50

ఆ. తాల్చి కైకఁ బిల్చి తల్లి యే బ్రహ్మచర్యవ్రతంబు మెయి నరణ్యభూమి
సమయసమము లొప్పఁ జరియించి వచ్చెద, ననుచుఁ బలికి వెసఁ దదాజ్ఞ వడసి. 51

క అంతకమును వంత న్వ్యవ,శాంతఃకరణుఁ డగుజనకునంతికమునకు
న్సంతసమునఁ జని యమ్మహి,కాంతుని వీడుకొని మ్రొక్కి కదలెను వెడలన్. 52

క. రామునిమునివేషముఁ గని, సౌమిత్రి విశేషరుట్కషాయితముఖుఁ డై
భూమీశుదెసకు నదర, న్రాముఁడు వారించి యనుజునకు నిట్లనియెన్. 53

చ. ఎటు తెగితయ్య లక్ష్మణ యహీనుఁడ వయ్యు విపోక్తు లాడఁగా
నిటుఁ దగునే కదా యనుచు నెంతయు శాంతునిఁ జేసి తమ్ముఁడా
యటవిఁ బితృప్రదిష్టసమయాబ్దములం ద్రుటికాలమట్లు నె
క్కటి విహరించవచ్చెద నకంపిత నావుడుఁ గంపితాత్ముఁ డై. 54

క. అన్నా నాయనుగమనం,బు న్నీవొందఁబడక ,రాదు పొమ్మన్న విమం
బున్నమలి విడుతుఁ బ్రాణము, లన్న నతఁడు హృదయమాదరార్ద్రిం బగుడున్. 55
గీ రామచంద్రుండు సౌమిత్రిరాక కెట్టి,కేల కొడఁబడి యాతనికేలు గేలఁ
గీలుకొల్పి భయంబు నీకేల నిన్నుఁ,బాసి చరియింపనేర్తునే భరితవినయ. 56
వ. అని యూఱడిల్లం బలికిన నతండు సంతసిల్లె నయ్యవసరంబునఁ దద్వృత్తాంతం బంతయు
వినుటంజేసి. 57
చ. నడు మసియాడ వేఁలి ఘనం బయి వీపునఁ దూలియాడ మో
ముడుపతి మేలమాడ నధరోష్ఠము బింబముఁ బంతమాడ మె
చ్చెడుగతిఁ గర్ణికారుచివిశేషము చెక్కులఁ జిందులాడఁ బే
రడఁకువ వచ్చెఁ జిత్త మురియాడఁగనీక మహీజ చెచ్చెరన్. 58
వ. ఇట్లు వచ్చిన ప్రేయసిం గటాక్షించి. 59
క. పితృశాసతి సెల్లింపఁగ, నతివా విను పదియునాల్గుఁబ్దంబులు న
మ్మతి వనవాసముఁ దగ న్సల్పి తిరిగి యేతెంచెద విలపింపకు మబలా. 60
చ. అనుటయు సీత నీకుఁ బితృశాసతిసేఁతయు నాకు భర్తృపా
వదలినసేవయుం బరమధర్మము లి ట్లనరాదు నీవు నా
యనుగమనం బొడంబడనియప్పుడ మృత్యువు నొందినైన నీ
యనుగమనంబుఁ దప్ప విప్రులాదికభూతగణంబుసాక్షిగన్. 61
క. నాయనుగతి కొడఁబడుము వి,ధేయను గోపంబుఁ దక్కి తెలియుమిను తను
చ్ఛాయను బోలిన జాయను, బాయను ధర్మంబె నీకుఁ బరమవివేకా. 62
క. అని వెచ్చనూర్చి మంచుక,డిన నెంతయుఁ దేజమేది డిందువడినప
ద్మనిభం బగుమోమును వాడిన,మోవియుఁ గల్గి తల్లడించుచు నుండెన్. 63
క. మగనికడ మెలఁగుమగువకు, నగపడ విల నెంతలేసియాపద లైనన్.
మగనిం బాసినమగువకుఁ, దగుసౌఖ్యము లెన్నియును వృథాగతి నుండున్. 64
వ. ఇవ్విధంబున. 65
ఉ. కన్నుల శోక వేగమునఁ గాలువగట్టెడుబాష్పధారలం
జన్నులకుంకుమం దడఁపుజానకిఁ గన్గొని మానవేంద్రుఁ డో
యన్నులమిన్న నిన్ను విడనాడఁగనాడుట కాదు కాన నా
పన్నత నొందఁజాల వనిపల్కుతి నింతులు వంత కోర్తురే. 66
క. అని కలికి సీతరాకకు, ననుకూలత దోఁపఁ బలికి యరిగి సుమిత్రా
తనయుజనకతనయాయుతుఁ, డనఘుఁడు శ్రీరాఘవుఁడు నిజాంబవలనికిన్. 67

ఉ. క్షత్రియమిత్రగోత్రుఁడు ప్రశస్తచరిత్రుఁడు రామమూర్తి సౌ
మిత్రియుఁ ధాత్రిపుత్రియును మేకొని రాఁ జని కాంచె నత్యుర
స్వాత్రికఁ బ్రాణవాయుకృతశుద్ధయశోమగధావనీశస
త్పుత్రికఁ జేతనాత్తమణిపుత్రికఁ గోసలరాజపుత్రికన్. 68

వ. కనుంగొని నమస్కరించి. 69

చ. కరములు మోడ్చి తల్లి విను కైకయిఁ దొల్లి కరంబు నెయ్యుఁడై
వరములు రెండొసంగె జనవల్లభుఁ డాయమ యిప్డు వేఁడె రా
జ్యరమ దొరంగి యే నడవిచక్కటి వర్తిల భూతధాత్రికిన్
దొర యనఁగాఁ బ్రభూతభరతుం భరతు న్నియమించునట్లుగన్. 70

క. వేఁడిన సమ్మతులు చెవి, చూఁడినయట్లయిన నృపుఁడు సుడివడియెడు నా
తోఁ డాడినమాటకు నీ,రేడేఁడులు వనిఁ దిరిగి తిరిగి యేతెంతున్. 71

క. అమ్మ నెమ్మది నించుక, యుమ్మలికము మాని ధైర్య మూఁదు మనుఁడు వా
లమ్ముల గుచు నవ్వాఙ్మయమ్ములు నాటుటయు వివశ యై యిట్లనియెన్. 72

ఉ. యోగ్యము గాఁగ నీవు మహితోజ్జ్వలలీలఁ గృతాభిషేకసౌ
భాగ్యము నొందఁగాంచుటకు భాగ్యము గల్గెనటంచు నున్నచో
యోగ్యనుకూలవర్తనకు నోర్చి విశేషసుఖంబు లెల్ల వై
రాగ్యము పేర్మి వీడి నగరం బిటు వెల్వడఁజూడఁ గల్గెనే. 73

క. సమ్మతిఁ దాప మ్మడిపి కృ,రమ్ముల లాలించి సత్సరణి మెలఁగిన దో
షమ్మెలుఁగఁ డనుచు నెమ్మది, నమ్మంగా రాదు రాజనామములన్. 74

వ. అని పలికి కరంబులు విదుర్చుచు నిట్టూర్పు నిగిడించి కైక నుద్దేశించి. 75

కమలవిలసితవృత్తము.

అధిపతి తనవశుఁ డని తగునే ని, న్నధికభయద మగునడవికి నంపం
బ్రథితయశోమయుఁ జెలుపఁ దలఁచెనే దుర్విధివిలసిత మెటు వృథ యగుఁ బుత్రీ. 76

సీ. ధర్మనాశముఁ గ్రూరకర్మం బటంచుఁ గొంకక నెట్లు వరములు గైక వేఁడె
నాలిమాటలకు లోనై నీవు కానరుఁ, బోనంగ నెట్లోర్చె భూవిభుఁడు
అడవికి నిను బంపు టన్యాయ మనియొత్తి, చెప్పంగలేడె వసిష్ఠమౌని
సకలసౌఖ్యముల కాస్పద మైనలక్ష్మి వి,సర్జింప నీకేల సాహసంబు

గీ. అనుచు వెచ్చనూర్పు హా యని పలవించు, దైవమా యటంచుఁ దల్లడించుఁ
గరముఁ గోపగించుఁ గౌసల్య పుత్రవి,యోగశోకమునకు నోర్వలేక. 77

వ. మఱియుం జెన్మాతిశోకంబునం గుమారుం గనుంగొని. 78

రమ్మా చేరం జూడఁగ,నిమ్మా నెమ్మోము నైక కెదిద్రోసముగున్
జుమ్మా నమ్మఁగ నయ్యెడఁ, బొమ్మనియెనె నిన్ను భూవిభుండు కుమారా. 79

హారము లొత్తి కందు భవదంగము లిప్పుడు నిద్ర లేక నా
హారము మాని కాననవిహార మొనర్చిన నెట్టులోర్చు నా
హా రమణీమణీగణమహారమణీయవిలాస దైత్యసం
హారముఁ గోరి పోయెద వహార్పతితేజుఁడ వేమిసేయుదున్. 80

అని ప్రలాపించుచుం. 81

మ్రొక్కిన లక్ష్మణుఁ గనుఁగొని, యక్కునఁ గదియించి తమ్ముఁ డాయడవులయం
దొక్కరుఁడు మెలఁగలేఁ డని, నిక్కము మీయన్న తోడ నీవు నరిగెదే. 82

లక్ష్మీవంతుఁడు రాముఁడు, లక్ష్మిం బెడఁబాసి కానలకు నేగెడుచో
సూక్ష్మమతి నీవు నేగుట, లక్ష్మణ యిది భ్రాతృవత్సలత్వము గాదే. 83

అనుసెడ సీత మ్రొక్కి వినయంబు నయంబు భయంబు మీఱ నే
నును బతితోడ నేగెద ననుజ్ఞ యొసంగు మటంచు వేఁడ నీ
జనకుఁడు గూఁతు రామునకు సమ్మతిఁ బెండిలిఁ జేసినాఁడ నే
నని ముదమందు మీరు మునులై యిటుఁబోవు టెఱుంగఁడేకదా. 84

వహ్నిశిఖాసదృక్ప్రథుగభస్తిచయాన్వితుఁడై నిదాఘమ
ధ్యాహ్నములం బ్రతాపము సహార్పతి జూపఁగఁ జక్రవర్తినీ
చిహ్నము లింత లేక ధృవుఁ జేద్పడి కంటక చక్రివర్తినీ
చిహ్నిత మైనమేనునఁ గృశించెదె నీపతి నిన్నుఁ జూడఁగన్. 85

అని మఱియు ననేకవిధంబులం దల్లడించుకౌసల్యం గనుంగొని యుచితవచనంబుల మనస్తాపోపశమనంబు గావించి. 86

తల్లడ మేల విధికృతికిఁ, దల్లీ లలు చిత్రములు ముదంబులు ననుచుం
దల్లి నిటు వీడుకొని పిన,తల్లిం గులకామినీమతల్లిం గనియెన్. 87

ఇవ్విధంబునం బ్రియానుజప్రియాసహితుఁడై చని కాంచి నమస్కరించి రాజాజ్ఞ యొఱింగించి కరకమలంబులు ముకుళించి వెండియు. 88

ఉ. మ్రొక్కినరామచంద్రుఁ గని మోదము దక్కి సుమిత్రపుత్రి నీ
విక్కడఁ బాసి కారడవి కేగిన మాగినమూర్ఛఁ దల్లి నీ
దిక్కన నైనశోకమునఁ దీనత నొంది కృశింపకున్నె యే
దిక్కును లేక దానపరదగ్ధిదితేందుసమంచితాననా. 89

అని మఱియును. 90

సీ. కువలయంబున కీర్తిఁ గూర్చుచు నిను విరోధునిఁగ భావింప రాజునకుఁ దగునె
యాడుమాటలఁ గంప మంది మహీభృద్వరున కిలఁ గడుచుల్కఁదనము తగునె
ప్రజలలో సత్రసంభవ ముఖ్యునిఁగ నెఱుంగక యున్న దాతకుఁ గలదె కీర్తి
దానవారుల మించు దానవశాత్మకత్వము వహించుట సార్వభౌమునకును
గీ. దగునె యీదుర్విచారంబుఁ దలఁగఁ డేని, యీసుమంత్రు సుమంత్రకుఁ డనఁగఁ దగునె
యీవు గుణరహితుని యట్లు నీసుమాలి, యీకరణి నిల్లు వెడలుట నీకుఁ దగునె. 91

వ. అనిపలికి యనంతరంబున లక్ష్మణుం గనుంగొని గాఢాలింగనపూర్వకంబుగా నాశీర్వదించుచు. 92

క. జనకసుత న్ననుఁగా మీ, జనకునిగా రామభద్రు సాకేతముగా
వనమునుఁ దలంపు మేగుము, మనమున నొకసంశయంబు మానుము పుత్రా! 93

శా. క్షుద్రాభీలమృగారవాన్వితము రక్షోభీకృతం బాకుభు
క్ఛిద్రాకీర్ణముఁ జీర్ణపర్ణబలిభుక్సేవం బరణ్యంబున
న్నిద్రాహారవిసర్జితుండ వగుచు న్నీ వెల్లపొద్దు న్మహో
న్నిద్రారాధనతత్పరుండ వగుమీ నీయన్న హర్షింపఁగన్. 94

వ. అని బోధించి కోడలిం గుసుమకోమలిం గనుంగొని. 95

క. దానవసంకులములు గజ, దానవధుపంకిలములు దగ్ధహానము లు
ద్యానవనంబుల నలికెను, దాన వెటుల సంచరించుదానవు సాధ్వీ. 96

క. విను మొకతతీ వసుహీనతఁ, గనఁబడినను గువలయంబుఁ గారించువిక
ర్తనుఁ డై తాపము నొందించిన దైవము గాఁగ నిను భజింపఁగవలయున్. 97

వ. అని యుపదేశించి కాననగమనోత్సుకు లగుసీతారామలక్ష్మణులం గనుంగొని. 98

క. ఇంపగు రాజ్యసుఖంబులు, సంపదలును విడచి యడవిఁ జని యం దివురు
ల్దుంపలుఁ గాయలు నాకులుఁ, దెంపితినుం డనుచు నొసఁగితి న్నెల వకటా. 99

వ. ఇట్లు సెల వొసంగి వెచ్చనూర్చుజనయిత్రి సుమిత్రవీడ్కొని చిత్రచరిత్ర యగుధాత్రీపుత్రియు సౌమిత్రియుం దోడగా నమిత్రగోత్రలతాలవిత్రుండును, మిత్రగోత్రపవిత్రుండును, గోత్రామరసుత్రామాద్యమరసంస్తోత్రపాత్రుండును నగు దశరథు సత్రపుత్రుండు సుమంత్రసారథికం బగురథం బధిష్ఠించి చిత్రాసంబుగ నరణ్యయాత్ర గావింప నుద్యోగించు నవసరమ్మునఁ బురమ్మునఁ గల సమస్తజనమ్ములు సెట్టిన నొక్కపెట్ట నతనిం జుట్టుముట్టి పెట్టినసొమ్ములుం గట్టినపుట్టమ్ములు నెఱుంగక బిట్టుమూర్ఛిల్లుచు, హాహా యింతవుట్టునే యనువారును, దైక రట్టడి కిట్టాడిఁగట్టునే యనువారును, రాజున కించుకయేని నక్కటికంబు వలదే యనువారును, నింతవింత

గలదే యనువారును, రాముం డింతసాహసుం డగునే యనువారును, వారింపక గురుం డుపేక్షింపఁ దగునే యనువారును, మోమోడెడువాఁడు గాఁడు లక్ష్మణుం డిట్లు పోవచ్చునే యనువారును, భరతుం డెఱుంగఁ డెఱింగిన నింత రానిచ్చునే యనువారును, దెఱవంగూడి తెర వెఱుంగని యడవుల నిడుమలంబడుట యెంతయు మోసం బనువారును, మహానుభావుం డితనికి వనవాసం బనాయాసం బనువారును, జానకీసాధుచరితం బింతయొప్పునే యనువారును, దైవకృతంబు దప్పునే యనువారును, వీరలం గనుంగొన్నం బగవారికైన వగలు మిగులకున్నే యనువారును, సుమంత్రుం డీమర్మంత్రంబు వారింపమి చన్నే యనువారును, దెలియ దీతనియభిప్రాయం బనువారును, యశంబు శాశ్వతంబు ప్రాణంబు తృణప్రాయం బనువారును, ధరణిం బడి పొరలువారును, ధరణీశ్వరుం గెరలువారును నై యేము నీతోడివార మిదె నిన్నుంగూడ నేతెంతుము గా కిప్పురంబున నుండ నేర్తుమే యని యందఱు నేకనిశ్చయంబున దాశరథి వెంబడించి రయ్యవసరంబున. 100

చ. దశదిశలన్ యశంబు విశదం బయి పర్వ వనంబునం జతు
ర్దశసమము ల్వసింపఁ బ్రియదారసహోదరసంయుతంబుగా
దశరథసూనుఁ డెంతయు ముదంబు ఘటిల్లఁగఁ బౌరులెల్ల దు
ర్దశదురటిల్ల నిట్లు పురరాజము నల్లన నిర్గమించుచున్. 101

వ. దశరథుం డధర్మనిర్భీకం గైకం గనుంగొని. 102

ఉ. పాపము గట్టికొంటివి నృపాలశిఖామణి రాము నిక్కడం
బాపఁగ నూహచేసితివి భార్యవె మృత్యువ వీవు నాకు నీ
పాపఁడు గాఁడె యాతఁడు కృపాపరతంత్రుఁడు భక్తియుక్తుఁడుం
బాపవిదూరుఁ డింక నగపాటు కరంబు భరంబు మానినీ. 103

క. నముచిరిపుతుల్యు రాము వ్వనమునకు ననిచితివి యీదినము మొదలుగ మో
సముఁ జేసిన నీదునివాసము చెంతకు రాను నే ననుచితచరితా. 104

మ. అని తద్దేహము నగ్నిలగ్న మగు గేహంబు న్విసర్జించుభీ
రునిచందంబునఁ బాసి హా సుత మహారోషంబునం జేసి కా
ననివాసంబుగఁ జేసి న న్నధికచింతాసాగరాంతర్నిమ
గ్నునిఁగాఁ జేసితె నీ సితేద్ధయశముం గుప్పించితే దిక్కులన్. 105

వ. అని మఱియు ననేకంబు లగువిధంబులం బలవించు. 106

చ. దశరథుఁ డప్డు రాముని రథస్థునిఁ గన్గొని పుత్ర కామినీ
వశుఁ డితఁ డంచు నన్న నలువం దగునైనను బ్రాణధారణా

వళితఁ గృశించుతండ్రిఁ బితృవత్సల కాకఁగ రాఁగదయ్య యి
ర్వీ శమదమాదిసద్గుణగరిష్ఠ నీసరిగారు మానులుఁ బో. 107

క. భీకర మమితవినష్టప్రాకారము గరీంద్రహస్తశీకర మురుద
ర్వీకరము గాననము ఫూత్కారము వ్యాఘ్రకరము భరము చరియింపన్. 108

వ. మఱియును. 109

లయగ్రాహి.

ఘూకము సముచ్ఛ్రితమధూకము భయంకరశమీకము మహోద్భటదనేకము జలన్ని
ర్మోకము సమావృతవనాకము ప్రభూతరుతకాకము ద్వీపివ్రజసమీకము గరీంద్రో
ద్రేకము మహాద్విపదనీకము భుజంగయుతలోకముఁ బ్రచంక్రమణకోకము విరహా
లోకము రుకాననము నోకముగఁ జేసి యిటుశోకముల ముంచి జనలోకము గృశింపన్.

సీ. కటకటా కంటకోత్కటకుటోత్కరములు, పాదలు మవ్వంపుఁబూఁబొదలె నీకు
నుష్ణకరోష్ణకరోచ్ఛాదితాశ్మము, లచ్ఛమైన పటువులే పట్టె నీకు
ననువొంద మంగళహారతు లొసఁగెడు, గోతులే కోఁతులు గుఱ్ఱు నీకు
దుష్టచేష్టాప్రతికృష్టాశరుల కోడిఁగములు నిద్దపుటూడిగములె నీకుఁ

గీ. బాయఁడు తోలంగుఁ డని బరాబరులు సేయు, బంట్లె కడుదుండగపుటెల్గుబంట్లు నీకు
డంబుమీఱిన మణిఖచితంబు లైన, గృహములే నిండితపుగొండగుహలు నీకు. 111

క. వినుతగుణ నీకుఁ దళవే, శ్మనివాసముఁ గూర్చెఁ గడు నసాధ్యము గలదే
విను శర్కర మొసఁగినన్నో,టనె చేదు భుజింపఁజేయుఁ టక్కటవిధికిన్. 112

సీ. ఘనశివాలాపము ల్వినిసంతసిలు నీవు, ఘనశివాలాపము ల్వినియె దింక
మావుల నెక్కి క్రుమ్మరునీవు పండ్లకై, మావుల నెక్కి క్రుమ్మరియె దింక
గోపురంబులనీడఁ గూడియుండెడి నీవు, గోపురంబులనీడఁ గూడె దింక
స్వర్ణోటజంబులఁ జరియింపఁ దగునీవు, పర్ణోటజముల పాల్పడియె దింక

గీ. నాకుల మొకించుకయు లేక రాకుమారు, లెలమి సేవింపఁ బెంపు వహించు నీవు
నాకు లొగిరాల భయదప్రచాకువార, మలమికొనఁ గంపము వహింతు వనఘ యింక

ఉ. నీముఖచంద్రమండలవినిర్గతసుస్మితకౌముదీరుచి
స్తోమము నీమృదూక్తిపరిశుద్ధతయున్ భవదంకసుస్ఫుర
చ్ఛామలకుండ్ద్వితీయజలజాతవిలోచనసౌష్ఠవంబు శ్రీ
రామసునందనంబు గొన్న మునిరాజియు మోహము నొందకుండునే. 114

క. వాత్సల్యమహిత నిను సాంవత్సరికులు దొల్లి చక్రవర్తి వగుదువనా
వత్సముని పై చతుర్దశవత్సరములు నడవిఁ దిరుగవలసెనె నీకున్. 115

క. అన్న సుమిత్రాసుత మీ, యున్న ధరిత్రీసుతాసహాయత వనమం
దున్నయపుడేమఱక కొలు, వన్నీ వరిగెదవు ధైర్యవంతుఁడ వగుటన్. 116

వ. అనిపలికి కోడలిం జేర్కొని. 117

క. రాలచ్చి విడచి యేడుకు, జాలవజీయుండు గ్రాల జాలనునిప్పు
డ్రాలను విహరింపను జవ, రాలా నీ వేమి పేదరాలవె చెపుమా. 118

వ అని మఱియుం బరిభ్రమితాంతరంగుం డగునమ్మహీకాంతుండు. 119

ఉ. వేగము గాఁగ నేగురఘువీరుని తేరగపాటు లేమిఁ జిం
తాగిళితాంతరంగతిఁ దద్రథకేతనదీప్తిఁ గాంచుఁ ద
ద్రచ్చి గనరామి వేదనను జెంది తదుద్ధతధూళిఁ గన్గొను
ద్రాగమమీఱఁ దద్రథపరాగము గానక వంతఁ జెద్పడున్. 120

గీ. మఱియుఁ బెక్కుగుగతుల నమ్మనుజనాథుఁ, డగ్రభార్యావరసతీసహాయుఁ డగుచుఁ
జిత్తమున నుత్తలము గదుఁ గ్రొత్తసేయ, నుల్ల ముదుకఁ బ్రలాపించుచుండునంత

మ. ఉదుకుం డేటికిఁ బౌరులార వనవాసోద్యోగమంచుం గదు
న్నుడువ న్మానక వెంబడింపఁగ సుమంత్రుం డెంతయు స్వాంతఁ బెం
పడరం జయ్యనఁ దేరు దోల రఘువంశ్యస్వామి శ్రీరాముఁ డ
ప్పు డరణ్యంబున కేగె సానుజుఁడు భూపుత్రీసమేతంబుగన్. 122

చ. చనుసెడ సౌరభంబు వెదచల్లఁగఁ జల్లనిగాలి తమ్మెదు
రొక్కవఁ గొనలేనిహర్షమునకు న్నిలయం బగుదాని మీనపా
కనిబిడపుండరీకజలకాకబలాకసమీకచంచరీ
కనినదకోకకోకనదకమ్రతగం బగుదాని నెంతయున్. 123

ఉ. పావనచారుజీవనశుభం బగుదాని సమస్తజంతుసం
జీవన మైనదాని మునిసేవిత మైనతటంబుదాని రా
జీవనటన్మధువ్రతవిశేషరుతాకవితోల్లసద్ద్రువీ
చీవృత మైనదాని సరసీమణి నుత్తమసాతరంగిణిన్. 124

వ. కనుంగొని తత్తీరలతాకుంజపుంజంబు లవనిజకుం జూపుచు రాముండు వెండియు.

సీ. అరలోకనము సేయు కువలయానందంబు, లీవఃతమసానదీవనములు
చూడు ప్రవాళసంశోభితంబులు దగు, నీవనతమసానదీవనములు
గనుఁగొను మెంతయుఁ గమలావనోజ్ఞము, లీవనతమసానదీవనములు
సుదతి వీక్షింపుము సుస్వాదుఫలదంబు, లీవనతమసానదీవనములు

గీ. కుసుమమృదుగాత్రి విపులసారసహితములు, తెలియు మీవనతమసానదీవనమ్ము
లనుచుఁ గాంతకుఁ దెల్పుచు నచట విశ్రమించెఁ బౌరసుమంత్రసౌమిత్రులలర.

వ. అంత.

అ. కాంతతోడ భయద కాంతారమున నిజాన్వయుఁడు తిరుగఁ జూడ వచ్చునెట్టు
లని యదృశ్యుఁ డయ్యె నవఁ గ్రుంకెఁ బద్మినీకాంతుఁ డంశుమాలి కాంతిమాలి.

క. అట్టియెడఁ దమమనంబుల, మట్టిపకో కాంధకారమునకు మెఱుంగు
ల్వెట్టి తమ మదరఁ జీఁకటి, చెట్టులక్రియఁ దోఁచెఁ దరువిశేషములెల్లన్. 129

వ. ఇట్లు నిశాసమయంబగుటయుం గృత్యంబులు దీర్చి తత్తరంగిణీపయఃపానంబునం
బరమానందంబు నొందుచు లక్ష్మణసంకల్పితం బగుపర్ణపర్యంకంబున ...
ప్రియాసహితుండై సుఖనిద్రితుం డయ్యె సుమంత్రుండును దక్కిన పౌరలో...
ద్బణపాషాణపర్ణ నిజబాహుదండంబులు శయనోపధానంబులుగా ...
న్నంత నంతరాత్రంబున నరేంద్రుండు మేల్కని సీతాలక్ష్మణసుమంత్రు... ప్రబో
ధించి వారలతో రహస్యవచనంబుల నిట్లనియె. 130

చ. మనము సమస్తపౌరజనమాన్యుల మై యడవి న్వసించిన
న్మనమున నొందు గాక ననుమానము నొందెదుఁ గాక గాన ని
వ్వనమున నీరిడించి పెనువంచన నేగుద మొందుచోటు కీ
జనులు నయోధ్య కేగుదురు సత్వరులై మనచోప్పెఱుంగమిన్. 131

వ. అని తనమనోనిశ్చయంబు వారల కెఱింగించి యప్పుడ. 132

క. రీఘాదూరులు పౌరులు, గాఢతరసుషుప్తి నున్న కాలమున రథా
రూఢుఁ డయి రాఘవుండు ని, గూఢస్థితి నేగ నంతఁ గొంతట్రిలోన్. 133

చ. తొగ రగుఱేఁడు దమ్మలకుఁ దోడు నివంబులఁ దోలువాఁడుఁ ...
దొగలకు సూడు జక్కవలదోయికి నెంతయునింతనెయ్యపుం
బగ లొనరించువాఁడు గడుఁ బచ్చని తేజులవాఁడు వేడుకం
బగ లొనరించువాఁడుఁ గనుపట్టెను తూరుపుమెట్టుపట్టునన్. 134

చ. పురజను లంత మేలుకని భూతనయాపతి లక్ష్మణాగ్రజుం
డరిదముతో సుమంత్రయుతుఁడై తమ వంచనఁ బాసిపోవుటం
బురపురఁ బొక్కి పంక్తిరథపుత్రుఁ డయోధ్యకుఁ బోయెనంచు నేఁ
బురమున కేగుదెంచిరి ప్రభూతఘనార్తరవంబు లిచ్చుచున్. 135

క. విపరీతస్థితి మెలఁగక, నపగతరోషుఁ డయి ప్రజల నందఱఁ ...
గృపఁ బ్రోచిన క్రియఁ గాచిన, నృపతిం బాయంగ నేర్తురెట్లు జనంబుల్. 136

ఆ. ఇట్లు వచ్చి మిహిరహీనాంబరమువోలె, రామరహిత మగుపురంబు సొచ్చి
యేమిసేయు దింక నెవ్వార మనకుఁడి, క్కనుచు వగచుచుండి రంత నచట. 137

మ. నిజమాయాపిహితాంతరంగు లగుచు న్నిద్రాసమాసక్తిఁ బౌ
రజనంబు ల్శయనించియున్నతఱి శ్రీరాముండు గోత్రాసుతా
నుజసంయుక్తముగా రథస్థుఁ డయి మాన్యుం డాసుమంత్రుండు వా
యుజవస్ఫూర్తి హయంబులం దఱుమ నయ్యుగ్రాటవిం బోవుచున్. 138

ఉ. అంతట నంశుమంతునుదయంబున సంతమసం బదృశ్యమై
సంతస మావహింప నృపచంద్రుఁడు రాముఁడు చారుసౌరభా
త్యంతలతాంతకాంతగహనాంతరదంతురితాళిపాళికా
క్రాంతసరస్సరోజనికరంబులు చూచుచు నేగి ముందటన్. 139

మ. అవలోకంబులకుం బ్రియం బెసఁగు గోష్ఠాభీరపల్లీస్ఫుర
న్నవవల్లీగిరిపక్కణంబులు నరణ్యంబు ల్గనుంగొంచు సీ
త విలోకింపుము సీవటంచు విలసత్కంజాతసంజాతమో
దవతి స్వేదవతిం గనుంగొనియె నుత్కంఠం బకుంఠంబుగన్. 140

క. కని తత్స్రవంతి సత్త్వరనిరూఢలతాలతాంతరమణీయతకు
న్మనమునఁ బొంగుచు నటఁ గడ, చని సరయువు దాఁటి రామచంద్రుం డవలన్.

వ. అభంగరంగత్తరంగాధారం బగుగంగాతీరంబున విఖండితమత్తమృగాస్పక్కణం
బగు నొక్కపక్కణంబు గనుంగొని తత్సమీపంబునకుం జని. 142

క. బహునియమాయాసవహుఁ, న్మహుస్మహుర్గతముద్రశుముక్తానివహుం
గుహుఁ గని రచితోచితక్రమ, గుహు సద్గుణగణగుహు రఘుప్రవరు లాగిన్. 143

వ. ఇట్లు కనుంగొని రయ్యవసరంబున. 144

చ. రభసముతో నిషాదపతి రాము నెదుర్కొని సద్వినీతిభ
క్తిభరితమానసుం డగుచుఁ దియ్యనిమాటల నాదరించి త్వ
చ్ఛుభతరదర్శనంబున విశుద్ధమనస్కుఁడ నైతి నంచు వీ
తభయుఁ డెసంగ నర్ఘ్యసహితం బగుపాద్య మొసంగి వేడుకన్. 145

క. నీపదశౌచజలమునకు, నాపదలం బాపుహరజటాంతరపదసం
దీపితవర్తన యైనసు,రాపగకును వేఱు గలదె యని తజ్జలమున్. 146

వ. శిరంబునం జల్లికొని వెండియు. 147

చ. గుహుండు నమస్కరించి నృపకుంజర కుంజరకుంజరమ్య మీ
గమనమునం బ్రియానుజులఁ గైకొని యిట్లు చరింపఁగా మహా

మహాత్ముఁడవు నీకుఁ జన్నె గుణమండన నావుడు వానికి రఘూ
ద్వహుఁడు నిజప్రవృత్తి విదితంబుగఁ దెల్పి సంతసించుచున్. 148

తే. రామచంద్రుఁడు కాంతఁ డా రాత్రి మధుర, వివిధ వనరసఫలముల విందొనర్చి
వరధనుర్ధరుఁ డగు సోదరుఁడు గొలువ, నధికకృప సీతతో నట నధివసించి. 149

క. గుహుఁడును సుమంత్రుఁడును దను, బహువిధములఁ గొలువఁ బర్ణపర్యంకమున
బ్రహి నిదుర జెంది రాముఁడు, మిహిరోదయమునకు మున్న మేల్కాని సరగన్. 150

వ. సమయసముచితకృత్యంబులు నిర్వర్తించి నిజసేవాపరతంత్రు సుమంత్రుం గనుంగొని.

క. సముచితము గాదు రథయానము మా కిటమీఁదఁ గావున మగల సాకే
తమునకుఁ గొని చనుమీ యరదము నీ వనుటయు నతఁడు దప్తహృదయుఁడై.

చ. అటువిని మిన్ను మ్రింగి పురి కారడి శూన్యరథంబుతోడ నే
నెటువలెఁ బోవువాఁడ సుతుఁ డేగని పఙ్క్తిరథుండు సాదరో
త్కటవ్యవసాయంబుతో నడుగఁగ దత్ప్రతి కేమని తెల్పువాఁడ నీ
కిటుగలెనాఁడ ధర్మమగునే విడనాడకు మింద యుండెదన్. 153

చ. అనవుడు రాఘవుండు భవదగ్రసుతుండు సతీసహోదరు
ల్దనుఁ గొలువంగ నెంతయు ముదంబున నిప్పురిఁ బోలెఁ గాననం
బున నొకయింతవింత యును బొందని డెందముతోడ నున్నవాఁ
డని వినిపించి మజ్జనకునార్తి హరింపఁగ నీవు పోవనా. 154

గీ. అనిన నేమియు ననుటకు ననువులేమి, నాసుమంత్రుఁడు శ్రీరాము నపుడు వీడు
కొని యయోధ్యకు నేగ నెగ్గొనినచింత, రథముతోఁ బ్రిపలుఁడై రథముతోడ.

వ. తదనంతరంబున. 156

మ. విలసద్వేషులు వీతదోషులు జగద్విద్వేషవిద్వేషు ల
చ్చలసంతోషవిశేషభూషితమనీషాశ్లేషు లానందభా
షులు నిర్దోషులు ముఖ్యసత్త్వగుణసంజూషు ల్జిగీషు ల్హితై
షులు సంతోషులు రామలక్ష్మణులు సంస్తుత్యాభిలాషు ల్గనన్. 157

వ. చని చని. 158

మ. ఘనసౌగంధికగంధవాహచలితక్ష్మాభృల్లతావాలము
న్వినుతాభంగతరంగశీకరసమావిర్భూతశైత్యోల్లస
న్మునిసంకల్పితపర్ణవేశ్మసవిధామోదైణశార్దూలముం
గని రస్తోకవిశాలము న్మహితగంగాహ్రాదినీకూలమున్. 159

క. కని జనకసుతాయుతు లై, చని మధుకరమధురనినదసంభృతవికచా
బ్జాటస్మరాళసితకరు,దనుపమధౌతపరిధాన యైన తగు దానిఁ గాఁ. 160

క. ఖ్యాత మగు దాని గంగా,ఖ్యాతం బగు దానిఁ గుముదఘనకమలాసం
ఖ్యాత మగు దాని జనసౌ,ఖ్యాతతశీతలజలప్రియం బగు దానిన్. 161

సీ. తలఁచినయంతమాత్రన జగజ్జనముల, కానందసంధాయి యైనదాని
బ్రహ్మహత్యాదిపాపంబులనైన భస్మంబు గావించెడు మహిమ దాని
హరుజటాస్థలినుండి యవతరించినదాని, రమణీయుపహలతీరముల దాని
సగరవంశజులఁ బుణ్యగతి కనిచినదానిఁ, బరమపవిత్ర నాఁ బరఁగు దాని

గీ. సర్వతోముఖ యనుట నిజంబు గాఁగ, నలినులసమావృతము లగునంబుజంబు
లలరులను సుగుణడి మించు నలికములను, నొప్పుగులికెడు జాహ్నవి నొనరఁ గాంచి.

వ. తత్సవిధవివిధవిశేషంబులకు సంతోషంబు నొందుచున్న యవసరంబున రాముం
గనుంగొని లక్ష్మణుం డను. 163

క. గంగాసరసి నిరం గని, యంగజశరము దభంగ యై నుడివనఁ జ
ల్లంగడఁగిరి శిశిరత క, భృంగీకాంతలు పరాగ రేణువు లనఁగన్. 164

క. నిజభావంబునఁ బొంగి మ,నుజనాయకుఁ డపుడు లక్ష్మణునకిట్లనియెం
ద్రిజగత్పావని యీయది, మజనుల కీచెంత నిలువఁ గొఱ గాదు సుమీ. 165

వ అని మఱియు ననేకవిధంబుల నన్నదీమచర్చికఁ జర్చింపుచుం జనకసుతాలక్ష్మణ
సహితుం డై రఘునాయకుండును గుహుండును నావయందుంగా నోడ యెక్కి సితగగుద్ద
రుత్పంభినంబు గాంచి బంధురకమలకైరవసుగంధం బాస్వాదించి తుంగతరంగఘట్టన
నించుక పొదవి శీతలశీకరంబుల యూతఁ గొని మందమందగమనంబున నెదురొక్క
ను మరుత్కిశోరస్పర్శనంబున నానందంబు నొందుచుం దనకనూతనతనూవిలసనంబు
నిశాంతిరస్ఫురదాప్రిజీవశోకవదీక్షణంబుల నిరీక్షించియుం దనివిపనక తను వెల్ల నయ
నంబులు గావించికొన్నవనుపునం గండుగండకంబుపిండులమండిత యగు భాగీరథి
ను తరించి పంపుటాకులను కోకలు వటిచి కేకికేకారవవ్యాజంబునం బిల్చుచున్న
యక్కలియొద్దునం దరణిడిగి కొమ్మలను కొమ్మలు ముమ్మరమ్మునం గ్రుమ్మరించు
సుమమ్ములను నాచారలాజమ్ములకు సమ్మతించుచు గుహునిం బహుమానపూర్వకం
బుగా వీడుకొని ఛాయామూలంబులునుఁ బుచ్ఛశిలాటుకంబులునుం బత్రపత్రంబు
లును ముఖకోరకంబులునుం గలిగి జంగమకింశుకంబు లనం గగనంబునం బారు లై
పోటుకుకనికరంబుల నాలోకించుచు విశీర్ణజీర్ణపర్ణంబుల నించుకించుక గనుపించు
పాషాణంబులయందు ఘలకలు వెట్టుకొని నిదురించు కొండచిలువలయందు విభేదంబు

పరిశోధించుచు గుసుమితానేకాశోకానోకహషండంబు దవదవసమావృతస్థలంబు గా
శంకించుచు మొట్టమొదళులం బుట్టలు దిట్టలుగ దొట్టినం బట్టుపుట్టంబులు చుట్టు
గట్టికొన్నట్టు గన్పట్టు ఱేఁకుఁజెట్టులతిట్టలకడ నిలువక దుస్తరంబు లగుకంటకప్రస్త
రంబులవలనను జాతుసౌరభలతాంతలతావితానంబులవలనను భయంకర ఘుంట
రీక భల్లూక సమీకంబులవలనను సారకృష్ణసారకిశోరవారభసలకిసలవిసంబులవల
నను మనోభిరామభీమంబగుగహనకదధ్వగమనపరిశ్రాంత యగునిజకాంత నుద్దే
శించి లక్ష్మణుం గనుంగొని. 166

చ. అడవి భయంకరోరగసమావృత మెంతయు సంకటంబు న
య్యెడ విహరింపఁజాలవు సుమీ వలదంచుఁ గడు న్వచించునా
నుడి విన కిందు వచ్చి యతనశ్రమపాల్పడి కంది కుందె వె
న్నడివిధి యేఁచ నేరికయినం దలమే దలఁగంపలంపఁగన్. 167

క. నడికెతుఁ జిత్తముతో న్నెన్నఁ డెఱుంగని యట్టి యడవినడుమం ద్వరతో
నడువంజాలదు జానకి, నడు మల్పము గుచభరం బనల్పం బగుటన్. 168

క. ఫుల్లాబ్జనేత్రపదముల, నల్లికొనినతీవ లొప్పె నతివమృదుతనూ
వల్లికి నోడి కడుం బ్రణ,మిల్లి పదద్వయము పట్టి మిడికెడు కరణిన్. 169

వ. అని పల్కి మఱియు నమ్మహారణ్యమార్గంబునం జనునవసరంబున. 170

సీ. క్రోడవిదారితక్షోణితలముఁ గనుంగొన్న నిషాదులు దున్నిరనుచు
శల్యకప్రఖనితస్థలములు గనుఁగొన్న, మునులు దుంపలు ద్రవ్వికొనిరటంచు
ద్విరదనిపాతితోర్వీజము ల్గనుఁగొన్న, నురుఫలభారత నొరగెననుచుఁ
బొదలనిద్రించుబెబ్బులులశరీరంబు, లరసిన బర్హిబర్హంబులనుచుఁ

గీ. కలభములఁ గన్నఁ బెనుగండశిలలటంచు, గుహలు గనుఁగొనఁ దపసులగృహములనుచు
నెఱుఁగకుండ వచించుఁ దా నెఱిఁగె నేని, సీత భయమందు నని మొకుచింతకతన.

వ. తదనంతరంబున నయ్యన్నదమ్ములు. 172

క. ఘనకలుషపిశాచనివర్తనము సుదర్శన మనం బ్రశస్తము గు సుద
ర్శనతీర్థముఁ గని యచ్చట, వనఘులు నివసన మొనర్చి రారేయిఁ దగన్. 173

వ. మఱునాఁ డరుణోదయంబునం గృతకాల్యకరణీయులై సీతాసమేతంబుగా నయ్యు
సహోదరులు ధనుర్బాణంబులు సహాయంబులుగా నాఁడు మూఁడుయోజనంబు
లరిగి. 174

క. పటువిమలస్థలభయదా,నటుమఖపురసాలతాలవటముఖతరుసం
కటమగు నటవిం జని యుత్కటము నల ప్రయాగవటముఁ గని దాశరథుల్. 175

ఉ. భూజనవంద్యుఁ దాపసవిభుం జతురాననసన్నిభుం భర
ద్వాజుని సంశ్రితాంగణవివర్ధితకల్పమహీజు నిందిత
వ్యాజుని ధిక్కృతేంద్రియమహారిసమాజుని భాస్కరోల్లస
త్తేజునిఁ గాంచి చేరఁ జనుదెంచి నతించి నమస్కరించినన్. 176

శా. వారి న్సాదరబుద్ధిమీఱఁగ భరద్వాజుండు మన్నించి త
ద్ఘోరారణ్యపటుప్రవర్తనకు హేతుత్వంబు నిత్యాత్మబో
ధారమ్యుండు దనంతటం గని సమాధానార్ఘ్యపాద్యాదిస
త్కారంబు ల్పచరించి మూలఫలశాకంబుల్ సమర్పించుడున్. 177

క. అవియన్నియు నవియాన్వయు, లవిరళసంతోషు లగుచు నందికొని మనో
జ్ఞవచోరచనలఁ గను న్యయ్యవనీసురవర్యుఁ బొగడి యమ్మాప్రతటిన్. 178

క. తలఁగడలు గాఁగఁ దమకర్ణలములు గావించి యొండొకతలపు లుడిగి పెం
దలముగు దలకృతశయ్యాతలముల నిదురించి రొక్కతలముని వొగడన్. 179

వ. అంత. 180

క. మిహిరానికాయ ముదుప్రచు, మిహిరోదయ ముదయశిఖరి మీఱియు మనిస్వా
మిహితాదేశంబున న్మహితాత్మకు లరిగి యరిగి మార్గములోనన్. 181

చ. కని రలచిత్రకూటము నగాధరఘోరోభయపార్శ్వరోధరూ
ఢనిబిడవల్లరీపటునటన్మధులిణ్మృదుగానభాసమా
ననవలతావితాన లలనాకృతిచారుతరోపగూహనో
జ్జనితనిరంతరప్రమదసద్విటపవ్రజచిత్రకూటమున్. 182

గీ. కాంచి యట పర్ణశాల నిర్మించి చిత్రకూటకూటమహోత్కటకటనికటగు
హాగృహావిహారకిన్నరీహారితరసు, గానవిస్వానసమ్యగాకర్ణు లగుచు. 183

చ. వలసినకందమూలరసవత్ఫలప్రసవరసత్ప్రవాళము
ల్వాలఁపుగ సంగ్రహించి మహిపుత్రి కొసంగుచు దుష్టదంష్ట్రిలం
బులులను దుర్వృకంబులను బొబ్బమెకంబులఁ బింగదృష్టులం
బులుఁగులఁ దోలుచు న్ముదముఁ బొందుచు నందు వసించియున్నెడన్. 184

క. రహితనయుఁ డొక్కదినుఱాఁడు, మహితనయానయముఁ గాంచి మాకళివపువు
స్వాహియించి నిజనిశాతనఖహాతిఁ గుచాంతరముఁ జీరెఁ గాముకవృత్తిన్. 185

సీ. జేవితేశ్వరి నిట్టు చిరజీవి సేయఁ, దండగంబుల రామవిభుండు చూచి
కసలి మంత్రించి యొకయిషీకంబు వైవ, నది భయంకరకీలశరమగుచు నిగిడె. 18

శా. మంటల్ మండుచు విస్ఫులింగములు వోడ్మం దత్కాలంబంబు వె
న్వెంటం గెంటు శరణ్యశూన్య మగుచు న్విభ్రాంతహృద్గ్రంథి యై
మింటం బర్వులువాఱుచుం గహనవల్మీకంబులం డాగుచు
న్మంటిం జేరుచు నొచ్చె నిట్లు శ్రమక్రమ్మం గాకి యేకాకి యై. 187
క. దిక్కులు పదియును గ్రుమ్మరి, దిక్కెవ్వరు లేక రామదేవునిపదము
ల్దిక్కనుచుఁ దలఁచి యాతని,దిక్కు మొగం బరుచు నేకదృష్టి మరలుచున్. 188
క. ప్రేమసి నిట్టు లలంచిన, వాయసముం గాంచి దీనవరదుఁడు రాముం
డాయెడఁ ద్వన్నయనము మృత్సాయకమున కొసఁగు మిది ప్రశాంత మగుననన్.
గీ. నెమ్మనమ్మున వాక్యమ్ము క్రమ్మికొన ఘనముగానమ్మనక నయనమ్మొసంగి
యత్యరిష్టంబు నొందుచు వరిగెనయ్యరిష్ట మప్పు డరిష్టంబు రిష్టముగను. 190
వ. తదనంతరంబున. 191
క. చతురశ్వవారణమా,ర్యతుషాయవిపణ్యుతురక్షోగణదు
ర్వ్ర్యతుశరవ్రతుబుతుత,రతూతుభిత మగునయ్యరణ్యక్షోణిన్. 192
వ. సీతారామలక్ష్మణులు నివసించి రంత నక్కడ. 193
ఉ. ధైర్యరసాశ్రయాననుఁ డధైర్యుఁడు నైనసుమంత్రుఁ డంతయున్
శూన్యరథంబుఁ గొంచుఁ బురిఁజొచ్చిన వచ్చినవాఁడు లోకస
న్మాన్యుఁడు రామచంద్రుఁ డని నాగరికు ల్గనుఁ జుట్టుముట్టి రా
జన్యునిలేమిఁ గాంచి సవిషాదము నొందుచుఁ దన్నుఁ దూఱుచున్.
క. వగపున రామునివార్తలు,డిగినం బ్రత్యుత్తరము లుడిగి తేయ వడిం
డిగి చెక్కులు గన్నీటఁగ,డిగి పౌరలెను రాజుఁ గని కడిందియలంతన్. 195
చ. దశరథమేదినీరమణ తావకపుత్త్రులు రామలక్ష్మణు
ల్విశదమనస్కులై విపినవీధి ధరాతనుజాసహాయు లై
కుశలత నున్నవారు నృపకుంజర వారు వనంబునం జతు
ర్దశసమయాబ్దముల్ ద్రుటివిధంబునఁ బుత్తురు వత్తు రొప్పుగన్. 196
వ. వారిం దలంచి విషాదంబు నొందం బనిలేదు. సుఖంబున నున్నవారని పల్కె వెండియు.
క. అవనీశ వినుము పదినాల్గవది యైనయేటికడపల న్నిజముగ ని
న్నవలోకించెద మనుచున్, భవదీయతనూజు లనినపల్కులు వింటే. 198
చ. అనవుడు గుండె జల్లుమన నన్నరనాయకుఁ డగ్రపుత్రుఁ జే
రోకని తరుణీసహోదరులఁ గూడి వనంబు మనంబునన్ ఘనం

బనితలపోసి తండ్రి మృతుఁ డయ్యెడు నాదెసనైన శోకవే
దననని చింతసేయవుగదా తగదా దయ దానవాంతకా. 199

క. విను తనయ మునివినుతనయా, నినుఁ గనుభాగ్యంబ కాని నిరతము నుదగ
న్నినుఁ గనుభాగ్యము నోఁచను, మునుఁ గను పాతైతి దుఃఖమున మునుఁగంగన్.

చ. నను విడనాడ నీకుఁ దగునా తగు నాదగు నాత్రి దీక్ష నే
యనువునకైన విన్ము తనయా తనయా తనయాత్మజన్మచే
తనరుచు దంద్రి నేరుప సదాపసదాపసదాసకోటుల
న్వనిగనబోదు వీవు. సుమనస్సుమనస్సుమనర్తనాళివై. 201

వ. అని మఱియు ననేకవిధంబులం బలవించి వెండియు రామలక్ష్మణులం దలంచి.

చ. నిమునయు తాళఁజాలఁగలనే కలనేనియుఁ గానరాయదై
న్యమున వనిం జరింపనవునా నవునానను లౌచుఁ గన్నదో
యిముడ మొనర్పకున్న మెయి నేమెయి నేధరియింతుఁ బ్రాణమో
కమలదళాక్షులార మిముఁ గన్గొనకుండఁగరాదు నామదిన్. 203

క. పాపాత్ముఁడ నిక్కముగాఁడు, గాపురుషుఁడు ననుచు నగు మొగంబులు నాకుం
జూపరు చూపఱు, నాపదలకు నోర్చి యడవి కరుగం జనునే. 204

వ. తదనంతరంబునం గోడలిఁ దలఁచి. 205

క. తరణికరతప్త మగువన,ధరణి స్నడువంగలేక తాపము మిగులం
దరుణీ తరునీడలఁ గా,తరునింతియుఁ బోలె మెలఁగదవె విధిచెయిదిన్. 206

వ. అని పలవించి వెండియు. 207

ఉ. డాయనురా రిదేమిచెప్పరా యనుఁ గానమె కాలు మీకుఁ దో
డా యను నొంట మీకుఁ బురుడా యను నావెతఁ దీర్చువాఁడు లేఁ
డా యను రామ నీకయిన నక్కటికం బొకయింత లేదు నా
డా యనుఁ దమ్ముఁ డాయను మహాటవి కేగితె పుత్రుఁడా యటన్. 208

క. అని మఱియుఁ జెక్కుభంగులఁ, దనయులఁ గోడలిఁ దలంచి దశరథుఁ డతిశో
కనిమగ్నుఁ డైనఁ గనుఁగొని, యనియెం గౌసల్య శోకసామగ్నమునన్. 209

ఉ. నీకు విచారమేల ధరణీవర మేలతలంచి నాఁడ వ
కైకకు మనంబు నొచ్చ మముఁ గన్గొన నీవిపు డిందువచ్చుట
న్నీకు విచార మీకరణి నీరుగఁ జేసెఁ గులంబు నెల్ల నా
హా! కరుణంబు దక్కి భవదగ్రసుతుం బెడబాయు టర్హమే. 210

వ. కని శీతలజలంబులం దన్నయనముఖప్రక్షాళనంబు గావించుటయును. 223

చ. ననుఁ గనువిచ్చి చూచి నరనాథ యొకింగమిఁ దప్పుచేసితి
ప్పని మదిలో గ్రహించినఁ గృపారహితాత్ముఁడవై రయంబున
న్ననుఁ బొలియ న్మదీయజననీజనకు ల్విపియింతు రిప్డు నే
ర్పునఁ జని నీవు దెప్పుము తపోమహితవ్రతు లైనవారలన్. 224

వ. అని యిట్లు. 225

క. తనతలిదండ్రుల సంప్రార్థన మొనరింపు మని చెప్పి తత్తనయుఁడు వేఁ
దనువు విడచి చనియెఁ బురాతనజన్మకృతంబు లెట్లు తప్పింపనగున్. 226

వ. అంత. 227

క. వచ్చెగు నాయుభయమ్ము ధృతి వమ్మను వెనుచింతతో జవమ్మున మద్ధ్యా
హ్నమ్మున సుకుకుచు శిశు కళవమ్ముగ గొనిపోవఁ బదగనమ్మ విని వెసన్. 228

క. అమ్మునివృద్ధులు సుతుఁ డని, నెమ్మనములఁ దలఁచి పుత్ర నీవిటుఁ దడయం
గ్రమ్మన వగపెల్లన మా, యమ్మయు నేనును భయంబు నందితిమి గదా. 229

చ. కడుమదుసళ్ళనుం గనులు గాననివారము నైనమమ్ము ని
య్యడవి విడిచి విన్మతవయో సలిలార్థము వోయి తెంతయు
న్నడువగలేనివారల వనంబున నొక్కటడించి వచ్చితిం
దడయఁగ రాదటంచును మనంబు చలింపక ధైర్య మొందెనే. 230

క. మాకన్నులు గర్ణంబులు, మాకరచరణములు బుత్రి మాప్రాణంబు
ల్మాకుఁ గలసమస్తము నీ, వేకద నీవిట్లు మసలుదే నకు రేయిన్. 231

ఉ. పాపఁడ దూపవాపుమని పల్కిన నుల్కి దయాత్ములార మీ
పాపఁడ గాను పాపినగు పఙ్క్తిరథుండను పేరి క్షత్త్రగో
త్రాపకశుండ దుష్టమృగయావ్యసనోగ్రుఁడ దగ్ధుఁ జేయుఁడీ
శాపశరాగ్ని నిద్భవశాపాలబ్ధి మీర లర్హులే. 232

క. తమతమపూర్వకృతము లు, త్తమతములకు మాన వెట్లు తమకులకునుఁగున్
తమసానదియొడ్డున సం, భ్రమసంబున వేఁటలాడ తటి మీసుతుఁడున్. 233

గీ. దృఢనియమంలార మీ తృష దీర్చుటకును, గట్టికి చీఁకటి నెక్కటి నిటకు వచ్చి
యల్లనల్లన సంతస మగ్గలింప, మొనసి కలశంబు నీరిలో ముంచుటయును. 234

క. బుడబుడ యను చప్పుడు చె, ప్పుడు వెడలిన సామజ మను బుద్ధిం గరుణం
బుడిగి శరముఁ దొడిగి పడ, గ్రుడుచడి చేసితిని నియతి గడువ న్వశమే. 235

చ. అని యిడె మీకుమాకొసఁగ మానయుఁ డే నపరాధి నంచుఁ దె
ల్పిన వదనంబు లెత్తి విలపించుచు హా సుత పల్కుమంచుఁ బు
త్రునిమృతదేహ మంటికొని తోఁచెడుశోకభరంబు పేర్మిఁ జ
చ్చిన క్రియ మూర్ఛనొందిరి కృశించి సధైర్యమున న్మహావ్రతుల్. 236

ఉ. ఎచ్చటికైన మోసికొని యేగెడు నట్టికుమారుఁ డొక్కఁడుం
జచ్చిన నట్టి వార్ధకదశ న్నయనంబులు లేనివారికిన్
హెచ్చదె శోక మాక్రియ మహింబడి కొండొకమూర్ఛ దేఱి న
న్నెచ్చక క్రోధశోకములు మిక్కుటమై తము హెచ్చరింపఁగన్. 237

వ. నన్నుం గనుంగొని 238

క. అపరాధరహితు మత్సుతుఁ, గృప యింతయు లేక యిట్లు గీటడఁచితి వి
య్యపరాధంబునకు న్ని,న్నపగతజీవునిఁగఁ జేయ నర్హమ యౌనే. 239

ఉ. కానమిఁ దప్పుచేసితివి కాన మితం బగుశాపవహ్నికి
న్మానవనాథ యర్హుఁడవు మానవనాథుల నేచుపాపము
ల్మానినొనర్పఁ గాని యహహా! నినుఁ జూడఁగరాదు పుత్రశో
కానలతప్తులై వినుము కానలఁ దాపసు లైనసాధువుల్. 240

క. అని కనలి పుత్రశోక,మ్మున మృత్యువుఁ జెందు మనుచుఁ బొల్పఱఁగ శపిం
చి నితాంతపుత్రవిరహ,మ్మునఁ జచ్చిరి వృద్ధమునియు మునిమానినియున్. 241

వ. ఇట్లు శపించుటయు. 242

చ. అవికులవార్ధిచంద్రు లగు నాత్మజు లుద్భవమొందు రింతెచా
లు విధి దయాత్ముఁ డంచు మదిలో ముదమందుచు నుంటిఁ గాని పు
త్రవిరహమూర్తిఁ గూర్చునని తత్సమయంబునఁ దోఁపదయ్యె నిం
తవిషమమంచుఁ దోఁచినఁ బదంపడి ప్రాణము లడ్డ వీడనే. 241

వ. అని తనకుఁ బూర్వంబునం గలమునిశాపంబు తెఱంగెఱింగించి, 244

క. రామాభిరామ భార్గవ,రామమహామదవిరామ రవివంశమహో
ద్దామ సుగుణధామా శ్రీ,రామా రామా యటంచుఁ బ్రాణము వీడెన్. 245

క. వసుధేశున కసుగతత ని,ట్లనుగతి వెడలుటయుఁ దన్నిరాలాపతఁ గాం
చి సుదంతి కోసలాత్మజ,యును సుమిత్రయును నిద్ర గాఁగ నూహించి కడన్. 246

గీ. తామఁ బుత్రులఁ గోడలిఁ దలఁచి తలఁచి, నిండువేదనఁ గుత్తుక లెండ వెడ్చి
యుల్లములు దల్లడించుచు నుండ నపుడు, వెడవెడ నుషప్తి నొందిరి నేడ్క డక్కి. 247

వ. అంత. 248

మ. కరవారంబులఁ బద్మినీరమణి కుత్కంఠంబు దీపింపఁ జె
న్స్వైరవారం గడుఁ గౌఁగిలించికొని పృథ్వీధ్వాంతవిచ్ఛేదమై
పురివారిం దగ మేలుకొల్పికొనుచుం బూషోదయం బైన నా
ర్తరవారంభక వైరిమాగధసుతా కౌసల్య లొక్కుమ్మడిన్. 249

వ. ఇట్లు మహారోదనంబు గావించుచు. 250

ఉ. అంగవికార మారయుచు నంగన లంతిఁ భయాంతరంగ లై
పొంగెడు పుత్త్రశోకమున భూమివిభుండు శరీరవాయువి
స్సంగతి నిట్లు దేవపరిపన్నివసత్త్వముఁ గాంచె దిక్కు మా
కుం గలదే యటంచు నృపకుంజరుపైఁ బడి యార్తనాదలై. 251

చ. ఇటు విను మొక్కవింత విపులేశ్వరపుత్త్రవియోగశోక ము
త్కటమగుడున్ శరీరమునఁ బాల్పడు ప్రాణము లీవు మేము ని
ష్కటమగు పుత్త్రశోకమునఁ గూరియు భర్తృవియోగ మొందియుం
బటుగతి నున్నవారలము పాపము రూపములొందెనో యనన్. 252

క. వసుధాసుధాశనులు గొల్వఁ, గ సుధర్మసభానివాసి వరవిబుధపనీ
వసుధారణశక్తిం గడుఁ, గసరద్ధుఁడ వైతి విట్టు లాశ్చర్యముగన్. 253

వ. అని మఱియుం బెక్కుభంగుల విలపించి రందుఁ గౌసల్య. 254

సీ. జననాథ నినుఁ బరుసంబులు పలికిన, ఫల మిప్పు డనుభవింపంగఁ గలిగెఁ
గఠినని ర్ఘాతప్రఘాతంబునఁ దపించు, జననకుఁ గొఱవి మోఁదినవిధమునఁ
బుత్త్రవియోగతఁ బొరయుచునుండఁగ, భర్తృవియోగసంప్రాప్త మయ్యె
వనవాసమున కేగుతనయునిఁ గాంచిన, మందభాగ్య నటంచు మదిఁ జనించుఁ

ఆ. గోపమో మదీయ పాపశేషమో, యెట్టినోముఫలమొ యే నెఱుంగ
నాగుణంబుఁ బిన్ననాఁటనుండియు నెఱుంగియును బలుక వేమి కృపవలిర్ప. 255

వ. అని మఱియుం బరిచారికాసహస్రంబులుం దానును బలవించు నెలుంగులు నింగి
ముట్టె నయ్యవసరంబున. 256

ఆ. పుత్త్రుఁ గుఱిచి భూమివిభుండు లోకాంతరగ, వాసి యగుట విని సువాసినీత్వ
హాని కోర్వలేక నడలుచుఁ జనుదెంచె, భరితదురితజాత భరతమాత. 257

ఉ. నెవ్వగ నిట్లు వచ్చి ధరణీపతిఁ గాంచి మనంబు నొవ్వఁగా
నెవ్వరు దన్ను దూఱిన సహించి విలాసము సేయఁ జొచ్చె నా
జవ్వని హా దినేంద్రకులసాగరచంద్రమహేంద్రతుల్య నీ
కివ్విధి నవ్విధాత లిఖియించెనె పాపపుఁజావు జావఁగన్. 258

ఉ. కోరినకోర్కు లెల్ల నొసఁగూర్చెద విప్రుకు మాటలాడఁగాఁ
గోరిన నూరకున్కి నృపకుంజర ధర్మము గాదు కైక పా
పోయచరిత్రి గానఁ గృప యుల్లమునం జనియింప దాప్తులౌ
వారలతోడనైన గరువంబుగఁ బల్కకయుండఁ జెల్లునే. 259

వ. అని యిట్లనేకవిధవినాలాపంబుల నారాజశవంబుఁ గౌఁగిలించుకొని దుఃఖించు
చున్న యవసరంబున. 260

క. విప్రప్రతిమానుఁడు వి,ప్రప్రభుఁ డప్రతిహతప్రభావుఁడు ప్రతిన
త్నప్రముదవానలుఁడు య,తిప్రవరప్రభుఁ డరుంధతీప్రియుఁ డంతన్. 261

ఉ. కాలవిధిజ్ఞత న్సదయకంప మొకింతయు లేమిఁ బెక్కుచం
దాలఁ బరిభ్రమించు నృపదారలఁ గాంచి సుమంతు వల్కని
ట్లేల విలాపముల్సలుప నిన్నరనాథుని కీక్రమంబునం
గా వశంబు నొంద మును గల్గినకర్మఫలంబు దప్పునే. 262

గీ. జన్నములనేకము లొనర్చి సత్సుతులను, గన్నవాఁ డురుకాలము మన్నవాఁడు
నహితరాజన్యసైన్యవనాగ్నిహోత్రుఁ, డవని యీతనిమృతికి నింతవిలపింప 263

క. వగవకుఁ డేలవగ చెదరు, వగచిన మృతులైనవారు వత్తురె యనుచుం
దగుసంభాషణముల న,మ్మగువల నూరార్చి బోధమహితుఁడు మఱియున్. 264

గీ. తనయు లిద్దఱు లేమి నిద్ధాత్రిపునకు, దహనకర్మము నడుపుట ధర్మ మగుట
భరతశత్రుఘ్నులనుఁ బిలువంగ నిపుడ, పంపవలయును బాహ్లికప్రవరభటుల. 265

వ. అని పలికి సచివస్వజనానుమతంబు వడసి దశరథుకళేబరంబుఁ దైలపక్వంబు సుగు
ప్తంబునుం గావించి. 266

సీ. పటుజవసత్త్వసంపన్నుల భటులఁ గన్గొని వసిష్ఠుం డిట్టులనియె మీరు
కృతమతి కేకయక్షితిపతిపురి నున్న, భరతశత్రుఘ్నులఁ భరితయశులఁ
గాంచి మిమ్మొకపనికార్యంబు గల్గి తోడ్కొని రం డటంచు మీకులగురుండు
మముఁ బంపె నని వానిమాట యూఱడి నొంది, వారును మీరును వడిగ నిటకుఁ

గీ. గదలిరం డనిపలుక నాక్షణము వారు, వసిష్ఠునకు మ్రొక్కి వీడ్కొని చేరఁజనిరి
సప్తరాత్రంబులకు సుచక్షుప్రధాని, రమణమగు దానిఁ గేకయరాజధాని. 267

క. ఈకరణిఁ జేగి లోపలి,శోకము వెలిఁ దోఁపనీక సుయశోధను న
క్కేకయభూపతిఁ గని మఱి, కైకాసుతుసోదరయుతుఁ గని నతులగుచున్. 268

క. చెడుకలలు గాంచి చింతిం,చెడుభరతుఁడు వారిముఖకుశేశయములఁ దోఁ
చెడు దైన్యముఁ గనుఁగొని నొ,చ్చెడుచిత్తముతోడ మిగులఁ జడిమునడివడుచున్. 269

వ. ఉన్నంత నబ్భటపుంగవులు 270

ఉ. హృదయవికారము ల్దెలియనీయక వాతనిఁ గాంచి గూఢగా
ద్గదిక నెలుంగు లొప్పుసెడఁగా ధరణీశతనూజ మీగురుం
డు దహనతేజుఁ డాఖ్యఁడు గడు న్వెసఁ దోడ్కొని రండు శాత్రవో
న్మదహృతిచారుకీర్తిపరిణాహరతుష్కరతు న్సహోదరుక్. 271

క. అని చెప్పి వాఁడు పని యిడి, యని చెప్పం దవ్వసిష్ఠుఁ డనిన వివి భయం
బున రాముని కెవ్వా రె, గ్గారించిరొ తండ్రి యెట్టులుండెనో యనుచుక్. 272

శా. మేను వడంక సోదరసమేతుఁడు కేకయరాజపుత్రికా
సూనుఁడు దివ్యనూ జనకచోపరిశోభితకీర్తిసూనుఁ డా
స్థానము సొచ్చి మామఁ గని తద్విధమంతయుఁ దెల్పి బంధుసం
తానము సంభ్రమింప విశదస్థితి నిట్లనియె న్ప్రియంబునక్. 273

క. నామనవి పాలకింపుము, నామనము గలంగె నీక్షణంబ యయోధ్యా
నామనగరి కేగక తగు, నా మనవారలను జూడ సరిగెద ననఘా. 274

క. అని తనమామ యుధాజి జ్జననాయకు వీడుకొని లసద్వపనసుత
స్త్రోత్రాయ మాతఁ డొసఁగినఁ, గొని భరతుం డనుజుఁగూడికొని సరయుముగక్. 2 5

క. సముచితపరివారసమేతముగా సాకేతరాజధానికిఁ బురుషో
త్తముఁ డబ్జాతుఁడు సనియె, ప్రమితహృదయుఁ డగుచు వేగిరపుబయనములక్ 276

వ. ఇట్లు చని. 277

గీ. రమణి లేనిగృహము నంబరమణి లేని, యాహము శూన్యము నిస్తేజ మైనభంగి
నన్నపురి గాంచి విప్రలక్షణ్ణహృదయుఁ, డగుచు నిట్లని తలపోసె నాత్మలోన. 278

చ. తనపతి లేని మానినిపిధంబునఁ జాలనమంగళంబునొం
దినయది యిప్పురంబు గడు దీనమనస్కులు పౌరు లెవ్వరిం
గనినను మేలువల్కరనఘుం బగు వేదనినాద మింతయు
న్వినఁబడ దేమిమొక్కొ పృథివీపతి మేనుఁ దొఱంగ నేమొకో. 279

వ. అని వితర్కించుచుం జని చని. 280

శా. సత్రాసస్థితిసార్త్రి మూర్తి నిఫరించంబోలునా నొప్పి ధై
ర్యత్రాతావశహ్యాత్తప్రవృత్తి యయి దైన్యస్తోమసంస్థాయి యై
శత్రుఘ్నుం డగులక్ష్మణానుజుఁడు పశ్చాద్భాగసంవర్తిగా
మాత్రాగారముఁ జేరఁబోయె భరతక్ష్మాపాలుఁ డత్యార్తిక్. 281

ఉ. కేకయరాజనందన కకృత్రిమభంగి నమస్కరించి యా
క్కేకయరాజుసేమ మెఱుఁగించి యొకించుక తాల్మి లేమి న
శ్శోకకర మాత్రిశోకరము గాఁ గత మేమి పురంబు నామదిన్
శోకము సేయఁజొచ్చెఁ గలదొప్ప సమస్త మెఱుంగఁజెప్పుమా. 282

క. వనమున భయసంభ్రమములు, వెనఁగొన నిట్లడుగుచున్న ప్రియనందను మో
మునఁ జూడ్కి నిలిపి కేకయ, తనూజ యిట్లనియెఁ గాఢధైర్యస్ఫూర్తిన్. 283

ఉ. మీజనకుండు దొల్లి నను మెచ్చి వరద్వితయంబొసంగెఁ బు
త్త్రా జటిలాని యగ్రవనితాసుతుఁ డబ్దచతుర్దశంబు న
వ్యాజముఁ స్థితి స్వనవిహార మొనర్పఁగ నీవు సర్వధా
త్రీజనమాన్యత స్వసుమతీపరిపాలన మాచరింపఁగన్. 284

క. అగ్రసతీసుతు విభవో,దగ్రునిఁ గావింప నాత్మఁ దలఁచు దురాశా
పగ్రహనిబద్ధబుద్ధి న్,పాగ్రణి నడిగితిని యోగ్యమగుసమయమునన్. 285

క. ఏ నర్థించిన వరయుగ, మీ నసమర్థుఁ డయి మానవేంద్రుఁడు మాకం
బూనినఁ దన ప్రజ్ఞ నెఱప, బూనినదచె రాముఁ డడవిపాలసములఁ దిరుగన్. 286

చ. తపిప్రియపుత్త్రుఁ డగ్రవనితాభవుఁ డాత్మసతీసహోదరు
ల్వెనుకొన బ్రహ్మచర్యమునివృత్తము లూని చతుర్దశాబ్దము
ల్వని నివసింపఁబోయిన భవజ్జనకుం డిటుఁ దద్వియోగసం
జనితపృథుక్వ్యథావ్యధికసన్నుఁ డై మృతినొందెఁ గావునన్. 287

క. విక్రమసమృద్ధి ధరణీ, చక్రవన మాచరింప జనకుని పిత్రృలో
కక్రియ లుపక్రమింప శ,తక్రతునిభతేజ నీకుఁ దగుపను లనిన్. 288

వ. భరతుండు మహింబడి మూర్ఛిల్లి కొండొకవడి కించుక తెలిసి. 289

క. రాముని సద్గుణయుతసుత్రాముని లోకత్రయాభిరాముని నాత్మా
రాముని వనములఁ దిరుగఁగ, నేమని పొమ్మంటి బుద్ధిహీనతఁ దల్లీ. 290

క. క్షితిపతిఁ జంపితివి వన,క్షితి కంపితి సుతుని రాముని గాక యని
దితి కేకయాస్వవాయో,దిత యను నతి కింతదుర్మతిత్వము గలదే. 291

శా. చేతోజాతసమాను రాము వనవాసిం జేయు దుశ్చింత త్వ
చ్చేతోజాత మొ రాక్షసీకులితదాసీశిక్షాతమో కాక వా
క్షేత్రప్రేరిత మో మదీయసుయశోనిర్వాపణాయాత మో
మాతా మత్పితృమృత్యుహేతు విది సామాన్యంబు గా దార్తమున్. 292

సీ. నను రాజ్యకాంక్షిఁగాఁ దనమనంబున నవ్వ, సిష్ఠుఁడు గనునూహ సేయుకొరకొ
యతివ నీగర్భమం దావిర్భవించుట, కకట నాపూర్వజన్మకృత మొకొ
మద్దులుగుల్కు రాముని ముఖాంభోజంబుఁ, గనుఁగొన నాకింకఁ గలుగదొకొ
మాత నీకపటంబు మనమున నిడికొని, కౌసల్య ననుఁగని కనలునొకొ
ఆ. యొక్కయడుగు నడువ నోపదు జానకి, యెట్టు లడవి సంచరించునొకొ
జనులు భరతుఁ డమితసౌజన్యనిధి యని, పొగడుదురుగదు లింక నెఁడవొకొ 293

వ అని పలికి కినుకవొడమి. 294

ఆ నిన్నుఁ జూడరాదు నీతోడ భాషింప, రాదు నిన్నుఁ జంపరాదు నాదు
నిచట నుండరా దహీనపాపవతీ యంటంచు వెడలి భరతుఁ డనుజుఁగూడి. 29.

వ. అత్యంతచింతాక్రాంతాంతఃకరణుండై దీనమనస్కులగు కౌసల్యాసుమిత్రాదేవుల కడ
కుం జని నమస్కరించి కన్నీరుమున్నీరుగా నేడ్చుచున్నం గనుంగొని. 296

క. చిత్తంబుల నుత్తలములు, క్రొత్తలుగుదు నత్తఱిలు గొడుకుల దుఃఖా
యత్తుల నెత్తి పదంపడి యొత్తంబుఁ నేడ్చి వొక్క మొగి నభమద్రువన్. 297

వ. మఱియు ననేకవిధంబులఁ బలవించునెడఁ గౌసల్య. 298

చ. భరతుఁడె రాముఁ డుగ్రవనవాసము సేయఁగఁ బోయె నద్యశో
భరతుఁడు రాజముఖ్యుఁడు భవజ్జనకుం డమరత్వ మొందె దు
ర్భరతరపుత్రశోకమునఁ బట్టణ మౌనె యరాజకంబు సం
భరితమనఃప్రమోది నిరపాయితఁ దాల్పుము పూజ్యరాజ్యమున్. 299

వ. అనుటయు సహింపక. 300

చ. చేతనన్నాప్తుఁడై పురుషసత్తముఁ డబ్జహితుండు వెచ్చనూ
ర్చి కినుకఁదిక్కు నిన్ను తెగఁ జెప్పెద నామది రాజ్యవాంఛ తే
మికి ఘనసాదభూతములు మిత్రశశాంకులు సాక్షు లీవెలుఁ
గకీటుల నొవ్వఁబల్కు దనుకంపఁ దలంపవు కోసలాత్మజా. 301

క. అన నితఁడు రామభక్తుఁ, డనూనపుణ్యాత్ముఁ డిమ్మహాత్ముఁడు భరతుం
డనిన యది తథ్య మనుమఁ గగనవాణి వచించెఁ దగ సకలజనులు వినన్. 302

వ. ఇట్లు వచించుటయు నెల్లజనంబులు నచ్చెరువొంది భరతుం బ్రశంసించి రంత. 303

క. భరతుని గాఢానంత త్వరతం గౌసల్య మెడలు వట్టుకొని విశే
షరవంబున నేడ్చెం దత్పరిచారిక లధికశోకభరమున నేడ్వన్. 304

వ. తదనంతరంబున భరతుం డనుజసహితుండై తైలద్రోణి నిమ్ముగా సంగ్రహించియున్న

ధనఘృతమధ్యసౌరభపదార్థచయంబులు గూర్చి తండ్రికిం
దనరఁగ నగ్ని యిచ్చె విదితంబుగ నబ్జహితుండు సద్విధిన్. 316

వ. ఇట్లు పితృమేధంబు యథావిధిక్రియాకలాపంబుగా నిర్వర్తించి. 317

క. భూదానంబులు బహుకన్యాదానంబులును గోసహస్రంబులను
ర్వీదేవతలకుఁ గడు నే, కాదశదివసంబునందు ఘనుఁ డతఁ డొసఁగెన్. 318

వ. మఱియు నద్దశరథున కమరలోకనివాసప్రాప్తికరంబులుం దమకు నశుచిత్వనిరాసకంబులు నగు క్రియాకలాపంబు లెన్నియేని నడపి సమస్తజనంబులన్ భోజనదానంబునం దృప్తులం గావించి సుహృద్బాంధవామాత్యబ్రాహ్మణపౌరజనపదనికరపరివృతుం డగుభరతుం గనుంగొని యరుంధతీప్రాణవల్లభుం డిట్లనియె 319

ఆ. సమయరతుఁడు రామచంద్రుఁ డిచ్చట లేమిఁ, బూజ్యరాజ్యభరముఁ బూను మిఁకఁ
గువలయంబు వేడ్కఁ గూరునే రాజు లేకున్న భరత సూనృతోక్తినిరత. 320

వ. అనుటయు సవిషాదమనస్కుండై. 321

క. నీ వఖిలమెఱిఁగియు న, న్నీవిధమున ననుట యెల్ల నే నెఱుఁగుదు మ
ద్భావము సమస్తజనసం, భావితముగ నిప్పు డెఱుక పఱుపఁ గానే. 322

మ. ఫలమూలాశనుఁడై కుశాసనుఁడనై పర్ణోటజావాసినై
బలవద్దైవవశానుం డయి మహాపాషాణపర్యంకవ
ల్కలచేలాన్వితుఁడై మదగ్రజుఁడు వల్కానం దపంబూన ను
జ్జ్వలభోగాస్పదపట్టణంబునను నిల్వన్నాకు సద్ధర్మమే. 323

చ. పలుకులు వేయు నేల మహిపాలన మే నొనరింపఁజాలఁ బె
న్ములుకులమీఁదఁ బోలెఁ బదము ల్దగ నిల్వవు నేల నామనం
బులుకుచుఁ దత్తరించెడు ద్విజోత్తమ యిప్పుడ పోయి మేనఁ గ్రొం
బులకలు గ్రమ్మ శ్రీర రఘుపుంగవుఁ జూడకయుండ నేర్తునే. 324

క. అవనీశత్వమునకై రాఘవునిం బ్రార్థింతు నతఁడు గా దను నేని
బ్రవివంశాచార్య మహో, గ్రవనీవిహరణము నాకుఁ గర్తవ్యమగున్. 325

చ. అని తననిశ్చయంబుఁ దగ నందఱకున్ వినిపించి వారలె
ల్లనుఁ దనుఁ జుట్టిరా నపుడ లక్ష్మణపూర్వజుఁ డవ్వసిష్ఠుఁడుం
జననులు ముబ్వురు న్సచివసత్తములు న్హితులు న్మహోరక్షే
భనిఖిలసద్భటోద్భటజనప్రబలాశ్వములు న్వెనుంబడన్. 326

వ. సహోదరుండై యయోధ్యాపురంబు వెలువడి వేగిరంబు బయనంబులం జని చని. 327

ఉ. సాధునికాయసేవ్యుఁ డమసాధునిఁ గాయము వొంగఁ గాంచి త
ద్రోధవిభాస్వదాతపనిరోధవిశాలరసాలభూరుహా
శ్లేషము వేడ్కఁ గూర్చ నృపశేఖరుఁ డా భరతుండు మానసీ
వ్యాధినిరాసకంబులు పదంబులం గొనియాడి మ్రొక్కుచున్. 328

క. అన్నది సద్భక్తిక్రతువిద్యాన్నది నటఁ గడచి భరతుఁ డతిరయమునఁ దా
నన్నదిశకు గుహుతోఁ దా, నన్నది మదినూది నడచె ననుజసహితుఁడై. 329

వ. ఇవ్విధంబునం జని యెడనెడ వినోదంబులగు నదీనదంబులు తుంగంబులగు గిరిశృంగం
బులు విశాలంబులగు సాలంబులు నాలోకించుచు సరయూగంగాసంగంబు నుత్త
రించి గంగాతీరంబునకుం జని యందు. 330

ఉత్సాహవృత్తము.

సాధునీతిఁ గనియె రాజసత్తముండు సత్తతో, సాధునీనిదఘనఘనుత్షాళితాత్మవాదుని
వ్యాసమునిస్థు. దీనసత్త్వసాధునిద్ధసన్మనీ, సాధుగంధమున్ గుహాల్ని పాహునిర్వ్వాహమునిన్.

వ. ఇట్లు గాంచుటయు నగ్గుహుం డవాదరపూర్వకంబుగా భరతున కిట్లనియె. 332

క. ఇలు వెలువరించి రాముని, కలిమిం గొని యంత నిలువక కలుషవర్తివై
బలిమి చెయి నతనిఁ దలపడఁ, దలఁచి యరిగెదిట్లు కుత్సితంపుఁ దలఁపున్. 333

చ. అన నతఁ డోనిషాద వినుమట్టులు గాదు మదగ్రజన్ము న
జ్జనకసుతాసమేతు నృపసత్తము రాముని లక్ష్మణున్ జగ
జ్జనుతకీర్తిసై ద్విపదసాధ్య కయోధ్యకుఁ దోడితే ముదం
బున నిటుపోక నీకగునె పోకడమాలినపల్కు వల్కఁగన్. 334

చ. అనుటయు సంతసించి యతఁ డాతనికిన్ విహితార్ఘ్యపాద్యము
ల్పనుపడఁగా నొసంగఁ దగుభంగిఁగ గంగఁ దరంగిణీమణిం
బొనరఁగ నుత్తరించి గుహుఁ బోవిడిరించి విరించికృత్య మె
వ్వరికి నలంఘనీయ మనివార్యము నంచుఁ దలంచుచున్ వెసన్. 335

వ. భరద్వాజాశ్రమంబునకుం జని. 336

క. అమ్మునిపతికి నమస్కా, రమ్మొనరించుటయు నాదరమ్మున నిటు రా
రమ్మని భరతునికరముఁ గ, రమ్మున గీలించి ముని కరమ్ముదర్తికిన్. 337

క. మనమున నెందుకుము న్నిజనకుఁడు స్మృతినొంద విధివశమ్మున నిటు రా
మునిఁ గానఁ బోవు టెంతయు, ననుకూలం బయినకార్యమని సెలవొసఁగన్. 338

క. నలనొప్పు రాముఁ డరిగిన, వలను భరద్వాజమౌనివలనఁ దెలిసి య
వ్వలఁ జనియె భరతుఁ డెంతయు, వలనుదగుల్వాడినపులుఁగు వలె నతిభయుఁడై. 339

వ. ఇట్లరిగి విచిత్రకూటం బగుచిత్రకూటంబు సమీపంబునకుం జనునవసరమున 340

ఉ. ఎప్పుడు రామచంద్రముఖ మేర్పడఁ జూతుము కన్నులార ని
న్నెప్పుడు రామభాషణము లింపుగ విందుము వీనులారఁ దా
నెప్పు డయోధ్యకు న్మనల నేలఁగ వచ్చుట మిత్రులార యం
చప్పుడు వేడ్కఁ బౌరజను లారని రావము లుప్పతిల్లఁగన్. 341

క. పలికెడు పలుకులు తురగ,మ్ముల హేషలు మత్తనాగముల బృంహితము
ల్గలసి బలిసి సుకోకస, గశకునంబులకు భీతి గలిగించుటయున్. 342

క. భద్రవముం బక్షిమృగో,పద్రవము న్లక్ష్మణుండు పరికించి యెదు
గద్రుమము నెక్కి కనియెన్, భద్రంబుగ వచ్చుచున్న భరతుని సేనన్. 343

వ. కని ససంభ్రముండై రాముం గనుఁగొని. 344

క. రామ విను భరతుఁ డేమిటి, కో మనకడ కిపుడు వచ్చుచున్నాఁ డనిన
న్సౌమిత్రి మనలఁ దోడ్కొని, పో మనమునఁ దలఁచి రాక బుద్ధి నెఱుఁగుమీ. 345

వ. అనిపలికె నయ్యవసరంబున. 346

చ. సరభసవృత్తి మోహుల విచారము వేడ్కయుఁ దోఁప నేగి య
బ్భరతుఁడుఁ దత్సహోదరుఁడు బ్రీతిగఁ గాంచిరి మానవేంద్రుని
న్నిరతశమాశ్రితైణఫణినిర్వ్యసనోగ్రమహోఖగేంద్రునిం
బరమపవిత్రతాపసకృపాగసనాంద్రుని రామచంద్రునిన్. 347

వ. ఇవ్విధంబున సందర్శించి. 348

క. పౌరిఁబౌరిఁ బులకాంకురములు, శరీరమునఁ గ్రమ్మ దేర సరిమ్రొక్కిరి స
త్కారచరణలలాటంబు లుదరములు భుజములును భూమితలమునఁ బొరయన్. 349

మ. అటు తన్మ్రొక్కినముద్దుతమ్ములను సమ్యగ్భక్తిపత్తమ్ములం
బటువార్గంబున రామచంద్రుఁ డవనీపశ్రేష్ఠుఁ డాసక్తిఁ గాఁ
గిట నాశీర్వచనాళిపూర్వకముగాఁ గీలించియుం బేర్చి ము
త్కటుల వాచుండఁ దదీయమస్తకము లాఘ్రాణించి భావించియున్. 350

క. తనకరములఁ దమ్ములమృదు,తనువులు నిమిరియు నతం డతనుమోదమునం
దనియుఁడు రాముఁడు ఘనచం,దనచర్చలు గావె సహజదర్శనము లిలన్. 351

వ. అయ్యవసరంబున. 352

క. భూమ్యాత్మజకును ఫణిపతి,సౌమ్యుం డగులక్ష్మణునకు సముచితముగ స
త్కామ్యత మ్రొక్కెను రామ,స్వామ్యనుజుండు లక్ష్మణానుజన్మసహితుఁడై. 353

క. అనుజప్రియాసహితుండై, మనుజప్రవరుండు దవంబు మగ్నాత్ముండై
జనకునకుఁ దిలోదకవిధు, లొనరిచి కృతకృత్యుఁ డగుచు నటుజను సేరెన్. 364

ఆ. ఇట్లు వచ్చి రాముఁ డెరియ మనంబున, ననుజవరులఁ బట్టికొన్న మహాత్ము
గాకుగహాతి వ్రాలె నాకుగహాతిఁ గూలు, నగమునట్లు పుణ్యనగమునందు. 365

వ. ఇవ్విధంబునం బితృమరణశోకవ్యాకులితమానసుండైన రామచంద్రుండు భరతుం డూ
ఱార్చుచున్న యవసరంబున గురుండు కౌసల్యా కైకా సుమిత్రలం దోడ్కొనివచ్చి
సముచితంబుగాఁ దత్సమాగమంబు నడపుటయు రాముండు సీతాలక్ష్మణసహి
తుండై కన్నీరు నలుఁ దదంఘ్రిపురోభాగంబులఁ బడుటయు నక్కాంత లక్కొడు
కులం గౌగిలం దీనించుచు నక్కులం గదియించి వెక్కి వెక్కి యొక్కగుక్కఁ ది
క్కులు పిక్కటిల్ల నేడ్చిరి మఱియును. 366

ఉ. ఎల్లజనంబులున్ వినఁగ నీల్గినపట్టిఁ దుఃఖం దలంచుచుం
దల్లికి తోరసద్గుణవితానము నప్పుడు పేరుకొంచు నా
తల్లులు ముప్వురు న్మతులు దారుణశోకభరంబు నొంది వెం
దల్లడ మంది యేడ్చినవిధం బది యెచ్చటనైనఁ గల్గునే. 367

క. తత్రిజకాంతలు కోసలపుత్రియుఁ గైకయును మగధపుత్రియు నంతోఁ
బుత్రులధైర్యము ధాత్రీపుత్రీదైన్యంబు గాంచి పొగిలిరి మిగులన్. 368

క. అప్పుడు. 369

ఉ. నాకెడఁ బ్రోలి కేగినజనప్రభు మామఁ దలంచి చింతతో
నాకులపాలికాతిలక యైనధరాసుత యేడ్చె నేడ్వఁగా
నాకులపాటుఁ జెందెఁ గుసుమాక్షులఁ బుప్పొసాత్రి లొల్కుచు
న్నాకులు తద్విలాపవచనమాను గాదె వడిం దలంపఁగన్. 370

వ. తదనంతరంబున వసిష్ఠభరతప్రయత్నంబునం గొంతవడికిం గౌసల్యానందనుండు దె
లివి నొందుటయుం దక్కినవారు నుపశమిల్లి రంతఁ బౌరజానపదబ్రాహ్మణగురు
బంధుభృత్యామాత్యప్రియానుజప్రయాసము పేతుండై పవిత్రసమస్థలసుఖాసీనుండై
రాముం డుచితవచనంబుల నానందంబు గావించుచు నాఁడి కొండొకసేపునకు భ
రతు నాననంబునం బ్రసాదమహితం బగు మాడ్కి నిగిడించి పితృనిర్దిష్టదిష్టం బిట్టం
బుగ వనంబునం గడపి పురంబునకే మగుడివచ్చువంతకుం గరుణ గలిగి ప్రజాపరిపా
లనం బొనర్ప నయోగ్య కరుగు మన్నా యని సప్రేమసాదరబహుళంబుగా నాడు
టయు నతండు విషాదంబు నొంది యున్నం గనుంగొని. 371

ఉ. భూతలనాథనాథ రఘుపుంగవ క్రోధము దక్కి నన్ను నీ
శీతలదృష్టిఁ జూచుచు వచించెద రాజ్యభరంబు సర్వము
న్నాతలఁ బెట్టఁజూచెదవు నాతలఁ బట్టులు గాదు నీవు ధా
త్రీతల మేలఁ గావలవదే జగమెల్ల నుతించుచుండఁగన్. 372

క. ఇనవంశ్యోదయంబునఁ జక్రినికాయము రాజు కరుణఁగని కువలయమున్
జనవర పాలింపుము జ్యేష్ఠున రాజ్యము సేయుమనుటె నరుదె మ్మకఘా. 373

గీ. కేకయాత్మజ నడపిన కృత్రిమంబు, నించుకయు నెంచకుము భవద్హృదయమందు
సత్యసంగ్రామమూర్తి వీ వఖిలభూభృ,దగ్ర్య మహిమ యింప రమ్మా వరమ్ము నిమ్ము. 374

క. వర్ణత్వాద్యాశ్రమములు, వర్ణాశ్రమధర్మములును వసమరుజనదు
ర్వర్ణసువర్ణము లడఁగు, స్వర్ణితుఁ డగు రాజు లేని వసుమతిలోనన్. 375

ఉ. కావున నాదుప్రార్థనముఁ గైకొని నీవు జగజ్జనంబులం
గావు నరాళిసత్కరుణఁ గాచినధర్మపుకో సమానముల్
గావు నరేంద్రధర్మములు కారుణికత్వధురీణ సేవనా
గా వనభూమి నీకుఁ దిరుగం దగునే మఱియుండ నీక్రియన్. 376

శా. క్షోణీభారము నిర్వహింప నహితక్షోభంబుఁ గావింప న
క్షీణానందము భూజనాళి కొసఁగ న్శ్రీరామ రమ్మా నవ
క్షోణి న్నిల్చెద దాను పొమ్మనుచు నాకు న్నీవు దెల్పంగ మ
త్ప్రాణంబు ల్విడువందలంచితి సుమీ ప్రాయోపవేశంబునన్. 377

క. చాల న్వగపున వనమున, నేల నివాసంబు నేల నేల నరిమ్మేఁ
జాల భూపాలనము నీ,పాలన వసియింతు నగన్నృపాలకమౌళీ. 378

వ. అనుటయు రాముండు మందస్మితసుందరవదనారవిందుండై. 379

ఉ. తమ్ముఁడ వెఱ్ఱివాఁడవు గదా తెలిసె స్వకీయధైర్య మే
నెమ్మి రాజ్యపాలనకు నిత్యకొనంగఁ దండ్రిపంపు భా
వమ్మున నిల్పి కానల నవశ్యము గుర్తిమ్మటి వత్తు నీవు హ
ర్షమ్మున నాచరింపుము ప్రజాపరిపాలన మప్రమాదివై 380

క. మనబోటి వార జనకుని, పనుపున వర్తింపకునికి పాడియె గుణమం
డన నీ వెఱుఁగవె ధర్మము, ననుఁ గావింపకుము రాజనందన యింకన్. 381

క. పితృభక్తి నేయుఱక దైవతపూజాపరుఁడ వగుచు వసుమతిజులరన్
ధృతిమంతుఁడవై వత్సర,చతుర్దశము బ్రోవుమీ ప్రజలఁ బ్రజలక్రియన్. 382

చ. అనుట యుం జేమి యుం దియఁగ నాడక యుబ్బరతుం తు రామచం
ద్రి నిఖిలభూధరంబు ముకరంబుగఁ దాల్చుట యింక నాకుఁ ద
ప్పనిపనియౌ నీచరణపాదుక లొసఁగి యిమ్ము తన్ముఖం
బున సుపరాజ్యతంత్రము ప్రవర్తనమున స్త్వలయింతు నే త్రయంబుగన్. 383

క. అని తనుఁ బ్రార్థించెడు తన్మనుజుం బాదుకల నొసంగి మోదంబున రా
మనరేంద్రుఁడు కౌఁగిట నిడికొని సంభావించె నతఁడుఁ గుతుకము నొందన్. 384

గీ. భరతశత్రుఘ్ను లంత సంభరితసత్త్వహర్షమగ్నాంగు లగుచుఁ దదంఘ్రియుగము
మస్తకంబులు సోఁక నమస్కరించి, యపుడు వీడ్కొని రతని ననంతరమున. 385

వ. శ్రీరాముండు దమదెస నమ్మలించు నమ్మువ్వురమ్మలకుం దాపోపశోషణంబు లగు
భాషణంబుల నానందంబు నొందించి మ్రొక్కి వీడ్కొల్పి పౌరబ్రాహ్మణభృత్యా
మాత్యజనంబులకు ననుగ్రహప్రణామాదరసంభావనాపూర్వకంబుగా సెల వొసంగి
వసిష్ఠానుజ్ఞాతుండై సీతాలక్ష్మణసమేతుండై మగిడి పర్ణశాలకుం జనుటయు. 386

గీ పాదుకలు భద్రకుంభికుంభస్థలమునఁ, బాదుకొల్పి ముదంబున భరితయశులు
భరతశత్రుఘ్ను లుభయపార్శ్వముల వినుత, చామరచ్ఛత్త్రములు పట్టి చనిరి నగర.

వ. ఇవ్విధంబున సమస్తబంధుజనపరిజనగురుపరివృతుండై చిత్రకూటంబు విడిచి భర
ద్వాజాశ్రమంబుఁ గడచి గంగాతీరంబునకు నరిగి యట్టియెడ. 388

క. తత్కాలలతాపాలస,ముత్కరకలికాసురభిస ముత్కటసుమసం
పత్కలిత మగుచుఁ దన కత్యుత్కలికమయత్కశోఁ ముత్పాదింపన్. 389

క దర్శనమాత్రముననఘా,దర్శన మొసరింపఁజాలు తన్నదియైన
స్స్పర్శనగంగాపూత,స్పర్శనమునఁ బ్రీతులైన సమయమునందున్. 390

గీ. ఎదురువచ్చిన గుహునకు నిష్ట మెసఁగఁ, దాము వోయినకార్యమంతయును వినిచి
యతనితోడ సహాయత నపుడు దాఁటి, రంగముగ వోఁగఁ దుంగతరంగగంగ. 391

వ. ఇట్లు సమస్తజనసమేతులై గంగానదీసముత్తరణం బాచరించి గుహుండు వనుప ను
చితప్రయాణంబులం జని తమసాప్రవాహం గడచి సాకేతసామీప్యంబునకుం జని. 392

క. వెల్లివిరియు తల్లడమునఁ, దల్లుల నందునిటి యాద్యశ్రుముగాలబలం
బెల్లను గా పురిచి మనం, బొల్లమి నప్పురముఁ జొరక యుచితంపు మెయిన్. 393

క. స్వాగ్రిమను నజ్జ్వలన్ముత్సర్గ్రామము విడలి కడు యశఃపుంజంబుల్
దిగ్గ్రామల గప్పఁగ నందిగ్రామమున న్వసించి నిష్ఠాపరులై. 394

వ. ఉచితపరివారసమేతులై యుండి రంత నబ్బరతుండు. 395

చ. సుఖమున ధారుణీజనులు సొంపు వహింప లసన్ముఖక్రియా
న్ముఖమున ధారుణీసురసమూహము పెంపు దలిర్పఁ బాదుకా
ముఖమున రాజ్యకృత్యము ప్రమోదమున న్నడు వంగ రాజధ
ర్మఖని యన న్వసించె మతిమంతుఁడు రామునిరాక వార్చుచున్. 396

వ. ఇట్లయోధ్యాపురసమీపంబున నొక్క యలఁతిపల్లియు నుచితవస్త్రంబుల నుండె
నని చెప్పి ప్రమదాతిరేకంబున. 397

శా. వైతేయప్రకటాటవీవహన భక్తత్రాణపారీణ సు
జ్ఞాతానాగతవర్తమాన గతిదిష్టప్రక్రియాసన్నుత
ఖ్యాతాఖ్యాతకృపారసప్రసవశాలాక్షాంతిసంభావితా
జ్ఞాతావాస మునీంద్రమానసనివాసా పీతవాసాంచితా. 398

క. పంకజలోచన మునిజనపంకవిమోచన విశేషభాసుర శ్రీవ
త్సాంకకరుణాంబుసేచన పంకజభవకామినీపరిభావితవచనా. 399

మత్తకోకిల. పాలితాఖిలలోకనాయక భక్తసౌఖ్యవిధాయకా
కాలభీకరసాంపరాయక కాలకాలనుసాయకా
కాలనీరదకామనీయక కాయజిత్స్వరసాయకా
శీలయుక్తఫలప్రదాయక శీలవేంకటనాయకా. 400

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యాన పరాయణ భూమధైర్యవినయ
రామనార్యతనయ పండితసేవాసముచ్చయ క్రొత్తపల్లి లచ్చయ ప్రణీతం
బైన దాశరథివిలాసంబను మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః

# దాశరథివిలాసము.

## చతుర్థాశ్వాసము.



శాంతాపరముఖశా

శ్రీకాంతరమహితపుష్పలిట్కృతవీక్షా

శాకావాసా సహసమ

హాకరిహాగ్యతతు వేంకటాద్ర్యధ్యక్షా. 1

వ. దేవా తదనంతరకథావిధానం బవధరింపు మట్లు భరతుండు ధర్మనిరతుండై నందిగ్రా
మంబున నివసించెనని చెప్పి యప్పుణ్యపుట్టువుండపసి వెండియు నిట్లనియె. 2

ఉ. తమ్మునిఁ గాంచి రాముఁడు సుధారసతుల్యము లైనవాఙ్నికా
యమ్ముల నిట్లు వల్కె మన మత్యవనంబున కేగ కీసిశా
లమ్మగు పర్ణవేశ్మమున లక్ష్మణ నిల్చితిమేనిఁ దా నసిమా
పమ్మగు టాత్మనెంచి మనపజ్జకు వచ్చుచుండు గ్రమ్మఱన్. 3

క. వచ్చెదముఁ బోవుచు నున్న, న్వచ్చును విఘ్నంబు విపినవాసంబున కే
నచ్చుపడం దెల్పితి నిఁక, నిచ్చో నుండఁ జన దవలి కేగిన యొప్పన్. 4

వ. అని పలికి సీతాలక్ష్మణసమేతుండై చిత్రకూటంబు వదలి చని ముందట. 5

సీ. ఘనలతాతన్వులు కౌఁగిలించికొన మి, న్నందియొప్పెడు పటుపావలియును
పాషాణకంటకబహుళంబు లై ఘోరభయంకరము లైన వర్త్మములును
జీర్ణపర్ణములలోఁ జిటుచిటుధ్వనులతోఁ, గున్కుఁబర్వులు వాలుగోధికలును
దరుకోటరాంతరస్థఫణిఫణామణివ్రాతఘృణ్యల్కకాజాతములును

గీ. పామజవ్యాఘ్రభల్లుకశరభములును, గలిగి భీకరమగు దానిఁ గనె నసురశ
రణ్యమగు నొక్కదుర్గమారణ్యమంత, సర్వజనమూర్తి రామరాజన్యమూర్తి. 6

వ. ఇట్లు కనుంగొని. 7

శా. వన్యేభోగ్రకులాయసింహశరభవ్యాఘ్రోచ్చభల్లాదికా
ధ్వన్యాభీలమృగావలీభయదకృద్ధ్వన్యాధికాకంపితా
వన్యాత్యుద్భవసాధ్వసాపనయనవ్యాసంగుఁడై యాత్మశిం
జిన్యారావ మొనర్చె రాముఁడు పలాశిస్తోమభీమంబుగన్. 8

వ. నిజధనుష్టంకారఘోషంబున వనమృగంబులెవ్వియుం దమ్ముఁ జేరక పాఱునట్లుగా
వించుచు వివిధఫలమధురమధురసంబుల నవనిజకుం దృప్తి చేయుచు నయ్యయిలతా
కుంజపుంజంబులం జూపుచుం జనునవసరమ్మున లక్ష్మణుం డన్నం గనుంగొని. 9

ఉ. సారము లోననూఁదికొని చంచలభావ మొకింతలేక వి
స్తారశిఖాచ్ఛటల్ జటలచందము నొందఁగ వల్కలంబులం
జీరలుగాఁగ నాకులు విశీర్ణతనొందఁగ రామచంద్ర దు
ర్వారతపోభరం బిటు లరణ్యము నీక్రియఁ దాల్చెఁ జూచితే. 10

వ. అనుటయు మహానందంబు నొందుచుం జనిచని. 11

సీ. ఆఖుశాబకలేలిహానసామాజికా,వర్తితపటుతరగర్తములును
వాతాయమానవ్రాతఘోరవ్యాఘ్ర,కులసమాకీర్ణనికుంజములును
మృగరిపుప్రకరగంధగజేంద్రసంఘాత,దంతురితగిరిగుహాంతరములు
భీతికృదోతువారాతతశుకశారి,కాటదంచితతరుకోటరములు
గీ. శ్యేనజాలకపోతసంశ్రితమహావి,శాలమహనీయబాలరసాలములును
కలిగి విదళితఘనపథికనియజన,తాశ్రమం బగునొక తాపసాశ్రమంబు. 12

వ. కనుంగొని యప్పుణ్యాశ్రమంబుఁ బ్రవేశించి యందు. 13

క. అనసూయాహృదయేశ్వరు, ననసూయాహృదయకమలు నత్రిమునీంద్రుం
గని తత్పదంబులకు వం,దన మొనరించుటయు నద్భుతప్రమదమునన్. 14

క. దీవించి రాముఁగని ముని,భావం బలరార నర్ఘ్యపాద్యంబుల సం
భావించి యనంతరమున, భావభవనిభు న్సుమిత్రపట్టిని మిగులన్. 15

వ. సముచితసత్కారంబుల మనఃప్రియంబు గావించి రామలక్ష్మణులం బవిత్రకుశాస్త
రణంబుల నాసీనులం జేసి కుశలంబడిగి తాను సముచితాసీనుండై మధురసంభాష
ణమ్ములం దేల్చుచున్న యవసరంబున. 16

మ. అనసూయాచరణారవిందముల కత్యంతానురాగంబుగాఁ
దనసీమంతగతోల్లసద్ఘుసృణముం దాకించి చేదోయి నొ
య్యనజోడించి నమస్కరించుటయు నయ్యాత్రేయి ధాత్రీసుతా
వనజాతాయతనేత్ర నెత్తికొనియె న్వాత్సల్యసంపూర్ణయై. 17

వ. ఇట్లాశీర్వచనపూర్వకంబుగా నెత్తికొని నిజవిశాలపర్ణశాలామధ్యంబున సుఖాసీన సజ్జానకి నుద్దేశించి. 18

చ. సుఖములరోసి కాననవసుంధరకుంబతియాజ్ఞ నేగుదెం
చి ఖరకరాతపంబునఁ గృశించెదు భర్తపిఱుందనవ్వన
న్సుఖముదలిర్ప నుండెదవు ముక్తభయస్థితి నైపతివ్రతా
త్వఖనివినీవునీకుసరివత్తురె యుత్తమమత్తకాశినుల్. 19

వ. అని మఱియు ననేకవిధంబులం బొగడి. 20

గీ. అభిరామకమనీయసుభగతాభివృద్ధి, యగు నిదిధరించువారల కని వచించి
కంబుకంఠికినంగరాగం బొసంగె, న త్తపస్విని యనురాగ మతిశయిల్ల. 21

ఉ. ఈకరణిన్మునీంద్రసతి యిచ్చినరంగగు నంగరాగముం
బ్రాకటలీలఁదాల్చి కడుఁ బ్రార్థనసేయఁగ నామెతోడ ని
ర్భీకుఁడు రామమూర్తి దను బెండిలియైన చరిత్రమెల్ల సీ
తాకులకామినీమణి ముదంబునఁ దెల్పి యనంతరంబునన్. 22

సీ. అత్రిభార్యకు వినయంబునఁ బ్రణమిల్లి, కులసతీధర్మము లోర్కిమిగుల
వినవాసచేసెద వినిపింపు మనవుడు, నయ్యవనీజాత కాదరమున
భర్తమాటకు మాఱుపల్కకుంట తలవాకిటను నిలుగుటయుఁ బాయసము నొకర్తు
సేవించుటయును నిషిద్ధమౌభర్తకుఁ గురూపిరైన వారిస్వరూపిగాఁగ
గీ. మదిఁదలంపమి కడుదుర్మార్గమగు మహత్తరంబుగ నాత్మభయార్తయగుట
యుత్తమ వదరుట యశుచియై యుత్తమిల్లుటయును గూడనికార్యము లయనియనిచె
న త్తపస్విని సత్కృపాయత్తయగుచు. 23

క. భూసురపూజావిషయా, నాసక్తికలగుటయొప్ప దనిమఱియును సా
ధ్వీసాధుచరిత్రంబుల, భూసుత కెఱిఁగించె న త్తపోహితకరుణన్. 24

గీ. అట్లు దెల్పినసీత ప్రహర్షయయ్యె, నంత శ్రీరామలక్ష్మణు లత్రిమౌని
కథితపుణ్యకథాసమాకర్ణనమున, దృప్తులై మోదవారాశిఁ దేలుచుండి. 25

ఉ. ఆత్రిపురాంతకప్రతిముఁ డత్రిమునీశ్వరుఁ డాదరింపనా
రాత్రివసించి వేగినఁ గరంబులు మోడ్చి తదాజ్ఞనొంది సా
త్రిసమేతుఁ డత్రిసతి మెల్లనవీడ్కొనివచ్చియున్న భూ
త్రినిగూడియేగె నృపపుంగవుఁ డారఘురాముఁ డాదటన్. 26

సునవసరమ్మున లక్ష్మణుఁ డన్నఁగనుంగొని. 27

చ. ఒకగణి కామతల్లి సుమనోజ్జ్వలయై మృగపల్లవాళిఁ బా
యకవిటపోపగూహనను నైయిదె సాఁగెను రామచూడు మా
నొకగణి కామతల్లి సుమనోజ్జ్వలయై మృగపల్లవాళిఁ బా
యకవిటపోపగూహనను నైయిటు సాగెటు యుక్త మే మునీ. 28

వ. అనిపలికి. 29

క. ఆధరణీశ్వరుఁ డనుజ స్సహోదరముఁ గాంచి మునుల నరిగి కనియెం బ
ర్ణాదుల మునివరుల నప, ర్ణావయుతోపముల నయ్యగణ్యము నందున్. 30

క. కని వారి యాశ్రమములకుఁ, జని వారలొసంగు ఫలరసంబులుఁ దేనె
ల్గొని యమ్మునీశ్వరుల వీ, డ్కొని రాముఁడు దీవలల్లి కొనినవన మునన్. 31

వ. జానకీలక్ష్మణ సమేతుండై పాషాణకంటక సంస్పృశ్యంబులై పాదంబులు గంద
చుం దొట్రుపడ మందగమనంబునం జనునెడ. 32

ఉ. నిక్కి విరాధనామ రజనీచరుఁ డొక్కఁడు వచ్చి జానకిం
గ్రక్కునఁ బట్టి మూఁపునఁ దగంగ వహించి విశేషరోషుఁడై
మెక్కఁగఁ గొంచుఁ బోయిన నమేయబలాఢ్యుఁడు రాముఁ డంతఁ బే
రుక్కున వాని కడ్డపడి యుద్ధతుఁడై యనుజుండు తోడుగన్. 33

వ. ఇట్లు రామలక్ష్మణులిరువురు నెదిరించి. 34

శా. క్రోధోద్రేక మనస్కులై రఘువరుల్ ఘోరాస్త్రజాలంబుల
న్వేధింపం దనుజాధముం డతిమహావేశుండు విస్తారమా
యాధారేయుఁడు సీతఁ డించి వెసతో నా రాముని న్లక్ష్మణు
న్సాధింపన్నమకట్టి పట్టుకొని యంసద్వంద్వముం జేర్చినన్. 35

ఉ. వారలఁ గాంచి సీత వగవన్ జనకాత్మజఁ గాంచి వారలు
న్వారని దీనతం బొరయ వాఁడు రయంబునఁ బోఁదలంచుతున్
శ్రీరఘురాముఁడుం బురుషసింహుఁడు లక్ష్మణుఁడుం బలాఢ్యు నే
పారఁగఁ బాహునీ కదిమిపట్టిరి కంఠము రెండుప్రక్కలన్. 36

ఆ. అదిమిపట్టి వాని నల్పసత్త్వునిఁ గ నె, ఱింగి బుధులకందఱికి హితంబు
లైనవాక్యయముల నాఖులుబోధించి, వికమి కమితరోష వేసలను మ. 37

చ. తులువ భయంకరాస్త్రములఁ ద్రుంచుట యొంతయు నొప్పుఁ గాక నీ
తులు వలుకంగ నేలయని దుర్మతి నీఁ లచేతికిచ్చి గం
తులవునె పోకపోవుమదె త్రుళ్ళఁడగించెద మంచు వానిచే
తు లవనిఁ గూల్చి కొక్కెమొగిఁ దోయజమిత్రకులాబ్ధిచంద్రముల్. 38

వ. తదనంతరంబున. 39

క. కంఠమునఁ దెగనడిచెను, కుంఠితుఁడై వాఁడు నేలఁగూలెను నెడసో
ల్కొంతులుగుచు నిలువఁజికిరి, కంఠీరవములిరిన్ డిగ్గుటు సకరణిశ్. 40

వ. ఇట్లు లంఘించి జానకిభయంబు వాపి యుల్లసిల్లి రంత. 41

గీ. రామబాణనిహతిఁ గంధరంబు ద్రెస్సి, యక్షణమ రామలక్ష్మణు లబ్బురపడ
శాపమోక్షంబుఁ గాంచి నిశాచరుండ, గర్వుఁడగు కుంబురాఖ్యగంధర్వుఁడగుచు. 42

ఉ. చెంతకువచ్చి రామనృపశేఖరుఁ గాంచి నుతించుచు న్నిజో
దంతమునంతయుం దెలిపి తత్పతివీడ్కొని యాక్షణంబని
శ్చింతమనస్కుఁడై ఖచరసింహుఁడు వోయిన మానవేంద్రుఁడ
త్యంత సవిస్మయాత్ములగు నట్టిధరాతనజానుజాత్తుఁడై. 45 43

క. అరిగిభయంకర వనములఁ, దిరిగితిరిగి యమితకీర్తి దిక్కృతగంగా
శరభంగుని శరభంగుని, శరభంగరహితుఁడు రామచంద్రుఁడు గనియెన్. 44

క. కని తచ్ఛరభంగపవా, బ్జనికటుకలఘుచిత్రితఫాల భాగుండైయ
మ్మునిపతి నతిపనతుఁడ, మ్మనుజేశ్వరు నెత్తిమిగుల మన్ననయొసఁగన్. 40

వ. గాఢాదరపూర్వకంబుగాఁ గౌఁగిలించికొని యనంతరంబ మెచ్చికొనిలిచియున్న
ధరిత్రీపుత్రీ సుమిత్రాపుత్రులం దగుభంగి సంభావించి యమ్మహామహులకు నర్ఘ్య
పాద్యంబు లొసంగి మధురంబులగు గందమూలఫలంబుల నాతిథ్యంబు నడిపి సుఖో
పవిష్టుండగు శ్రీరాముంగనుంగొని శరభంగుండు. 56

చ. నను బలభేది నాకభువనంబునకుం బిలువంగవచ్చిన
న్నిను మటు వోకనిన్నుఁ గను వేడుకనిల్చితిఁ జూడఁగాంచితి
న్మనుజవరేణ్య నీ వలరమాపతి వార్యజనాదనుండవుక
ఘనతనొసంగు నీకరుణ గాంచినవారికిఁ బ్రాతె సౌఖ్యముల్. 47

క. త్రిదశజగన్నివసనరుజ, పదవాసంబును ద్వదీయపదదర్శనసం
పదకు సదృశంబులె తల, పదశరథతనూజభూమిపదయామూర్తి. 48

వ. అని మఱియుం బ్రస్తుతించి. 

క. అలయుదేనెల ఫలముల, నలరుల నజినో త్తరీయకాదుల నలకా
నలరుచిరములగు తలిరుల, నలరుల సద్గృదయుఁడగుచు నమ్మునియొసఁగన్. 49

వ. పరితుష్టుండై యమ్మహాత్ము వీడ్కొని. 50

క. సాలంబులు వరుణరుచికి, సాలంబులుఁ గీరసంతసాలంబులు నా
ఖాలమ్ముల్లస్తపికమ్ముల, జాలమ్ములఁగలిగి కనుపిశాలమ్మగు మున్. 51

క. కాంతారమ్ముల నుఱుతఱ, గాంతారమ్ములఁ జరింపఁగా నోపుదె స
త్కాంతారమ్ముల నలికెను, కాంతా రమ్మనుచు విభుఁడు గౌఁగిటఁ జేర్చెన్. 62

వ. ఇట్లు బహువిధోపలాలనంబుల నలరించుచుఁ గొంతనంత నయ్యన్నదమ్ములు దుర్గమారణ్య మార్గంబుల నప్రమాదులై చని చని యొక్కనాఁడు. 63

ఉ. రాసుతు లగ్రవంశవనరాశిసుధాకరు లెంతయేని సం
త్రాసము నగ్రవంశవనరాశిసుధాకరమైన కోన ధా
త్రీసుతఁగూడి చొచ్చి విహరించిరి రాముఁడు లక్ష్మణుండు న
బ్జాసనకృత్య మేరితెర మౌను గడంగి తొలంగఁబెట్టఁగన్. 64

వ. అది మతియును బ్రసిద్ధాశ్వత్థప్రవృద్ధ కపిత్థవటాశోక దాడిమీతరు సంభృతంబును పారిజాతకామ్రాతకశ్లేష్మాతకపిండీతవిభీతక కేతకీభల్లాతకీ జంబూ జంబీరౌదుంబర నింబ భూనింబకదంబ కదంబ భూమిజంబు కావ్యడంబక కాకోదుంబరి కాంబుజ భూమిజంబు కాముఖానోకహ సంకులంబును శితిసారక హాయమారక కుమారక కలికారక వనమయూరక సాల రసాల తమాల కృతమాల తూల తాలహింతాల నారికేలభండీలాంకోలమద్దాలన క్తమాల సాలవిశాలంబును గలిగి త్రివిష్టపంబు విధంబున రంభాసురభ్యైరావత మందారేంద్ర సురసాన్వితంబై ప్రథిత ధరాక్రమంబున కుంభీస్యందనవీరతగుధనుర్బాణాంచితంబయి నభోమార్గంబు చందంబునఁ దరణివసుమనోహరంబయి యధోభువనంబుకైవడి ననంతాశ్రయంబయి సత్యలోకంబు ప్రకారంబునఁ బ్రహ్మణ్యశారదా గాయత్రీసముపేతంబయి జటీసమూహంబువసువునఁ జటీకౌశిక శాండిల్యలోమశ కపిలానుకూలంబయి కైలాసంబు పోలిక పాశుపత హైమవతీ శివాధికంబయి, బలిసద్మంబునునువుక, కితవపలాశరాక్షసీ సంయుతంబయి యభయాధికంబయ్యును గురుక్రూరా లగ్రభయానకంబయి ఋక్షపున్నాగ మయూరారిష్ట వ్యాఘ్రానఖ సమన్వితంబయ్యును ఋక్ష పున్నాగమయూరారిష్ట వ్యాఘ్రనఖ సమన్వితంబయి నాగవల్లీలవలీలతా బహుసుతాత్రివృతా ద్రాక్షాదిలతా బహులతాభిరామంబయి యొప్పునయ్యరణ్యంబునం దట్లు ప్రవేశించి పెంటుల నెదుటఁ బెట్టికొని మెట్టుకొట్టుకొనలం బుసులువిప్పి యాడుట్టె నట్టువపిట్టతిట్టులం గాంచి హర్షోత్కర్షంబునొందుచు నొక్కొక్కపట్టునం బుట్టల నిక్కినిక్కి దిక్కులు చూచు గాధేరంబులం బట్టికొన నుంకించు శబరశాబకులం జుట్టికొని ప్రోవులై పోవు సారమేయంబులకు దూరంబుగాఁ దొలంగుచు, బండి గురివిందతీవచప్పరంబులనీడలం బండి విశ్రమించుచుం బండినకంటకఫలంబు లుపయోగించుచు, ఫలాంధ్రాంబుగను మున్నగసి తదనంతరంబున న్నిసువులకు నిజలాంగూలదండంబు

లూఁతలుగా నొసంగి యెక్కించుకొని శాఖాగ్రంబులం దుముకు శాఖామృగంబుల సహాయం బపేక్షించుచు, నకులంబులు లేలిహానకులంబుల విదళించు నేర్పునకుం బొంగుచు, భుజంగసమాలింగితమ్ములగు ద్రుమమ్ముల కొమ్మలు భుజంగాలింగితలగు కొమ్మలం బోల్పఁ బట్టగు ప్రదేశంబులం దిరుగుచు, ననేకవిధ మార్జాలజాలంబుల నాలోకించుచు, సారంబులగు కృష్ణసారంబులవారంబు తీరంబులం బాఱు నారవంబు లాలించి, ఘోర క్రూర మృగంబులుగా శంకించి పరికించుచు, కమలాకర తీర మహీరుహాగ్రశకున నిపతితంబులగు ఫలంబులు జలంబుల బుడుంగు బుడుంగు మనుచుం బడుచప్పుళ్ళు మెప్పొదవ నాలకించుచు, సత్తుంగంబులగు పర్వతశృంగంబులనుండి వెలువడి జలజలం బ్రవహించు సెలయేళ్ళననుకరించు పూఁదేనె వాఁకల సమీపంబుల నిలుచుచు, వింతలగు కమ్మతావులు వెదచల్లు కపురంపుటనంటి బోదియల నారసికొనిపోవుచు, రేపకడం మేల్కాంచి యొరలు వెట్టి పిల్లల నెఱకల నిఱికికొని యొదిఁగి నిదురించు కారుకోడిపిట్టలం బిట్టులికించుచు, సర్పవృశ్చికంబులకు వెఱవక వెరవున వెలుతురుకై వత్తి నోటం గఱచి పట్టికొని యల్పవిశాలంబులగు గిరిబిలంబులం దూఱి చని యందు నిదురించు సేదుపందులం గడకాళ్ళు పట్టికొని వెనుక కీడ్చికొనివచ్చు నిషాదుల సాహసంబున కచ్చెరువునొందుచుం బథమ్మునం దమ్ముం గాంచి భయమ్ము గ్రమ్మికొన రయమ్మునం బాఱుతై పాఱు శశకాది క్షుద్రజంతునికరమ్ముఁ గరమ్ముఁగ నికరమ్మునం బోవిడుచుచు, మృగయాపరిక్షిప్తప్రసక్త పృషత్కంబులు మనంబోతులం గ్రుచ్చికొని యుచ్చి చనిన వేగంబునం గాఁడినవాడిన జోకలగు మావిమోకల నాలోకించి యాకులంబు నొందుచు మఱియుం గొన్ని సంకటస్థలంబులం బాదంబులం దీవల్లల్లికొనినం బోఁజాలక మిట్టిమిట్టిపడు కణుతుల సమీపంబునకుం బోయి బంధమోక్షంబు గావించుచు నాశ్రమంబులగు తాపసాశ్రమంబుల చెంతం గాసారంబుల తీరంబులం బర్ణశాలలు విశాలంబులుగా నిర్మించికొని వసించుచు, వల్మీకబిలంబులు వెలువడి దీర్ఘజిహ్వాపల్లవంబులు సాఁచి చిఱుచీమలం జవిచూచుచు నలుకువోడమినం జుట్టచుట్టికొని వెలికింజిప్పల ప్రోవుగనుపట్టఁ గొంతవడికి భయంబుదీఱిన నెప్పటియట్లు తిరుగ నారంభించు నాలువల నాలోకించుచు, వివిధమధుమధుర ఫలపలంబుల నాఁకలిప్రుచ్చుచుఁ, బువురాల్చిన తరుషండంబు తారకారహితంబగు నాకాశంబు చందంబుగా వితర్కించుచుం గంఠీరవంబులకుంతితోత్కంఠం గుంభికుంభస్థలంబులు వగిలించిన నందలి క్రొమ్ముత్తియంబులు రాలుటగా నెఱుంగక బదరీఫలభ్రమ దట్టంబులగు పత్రపుట్టికలం బెట్టుచు, విటపాగ్రంబుల నమాంసమ్ములగు నెమ్ములు గనుంగొని చిఱుతపులు లల్పమృగంబులం బట్టి

యచటఁ బెట్టికొని భక్షించుటగా నూహించుచుఁ దరుశిఖరములాయపరినిక్షిప్త
నిజాండ గ్రసనోద్ధితకృష్ణసర్ప సమాలోకన జనిత మహాశోకరోష వేగ పరిభ్రమిత
పక్షికులార్త నాదంబులకుం గనికరించుచు, మచ్చికలచ్చుపడం బెచ్చు సెఱఁగి పచ్చి
కపట్టులకువచ్చి మెచ్చివిచ్చలవిడి మేయుచున్న సారంగంబుల చరణాంగంబు లధి
ష్ఠించి తత్ఖుర స్పర్శనంబున నీర్వదికొనయు శలభవిసరంబుల సరభసంబునం బట్టికొని
మ్రింగి క్రమ్మఱ నెప్పటియట్ల తేళ్ళ మూఁపులఁ బాదంబులు మోపి యుల్లసిల్లు
భరద్వాజంబుల నభివీక్షించుచు, నిలువెల్లం జలిచీమలు గఱచి పట్టినం గాళ్ఁజాలక
తరులతాగుల్మంబులు సాల్వడఁ గొట్టికొను పెట్టుపొట్టుపింజరుల యుపద్రవంబులు ద
ప్పించికొని పోవుచు నార్ద్రప్రదేశంబుల విహరించియుఁ బుష్పరసంబులు పుక్కిళు
లంబట్టియు వచ్చుచుంబోవుచున్న జంటీఁగలఁ జెనువెంటందప్పకచని [illegible]దపటులని
ష్కృహమ్ములగు వనోకహమ్ములం గనుంగొని తన్నిమిత్త సమాయాతభల్లూక వ్రాతం
బులందోలి తద్గర్భమ్ములఁ గరమ్ముఁ జొనుపుటకుఁ గరమ్ము నిఱుకటమ్మైనశమ్మగా
కున్నం గొనగోళ్ళవవియించి కాఱుమధుధారలం దోయిళులంబట్టి క్రోలియుండనివి
సనకజాతిసెటియలం జేతులు వఱపి మధుకోశంబులు దీసియొసంగినం బొట్లంబులు
గట్టునెడ నెఱుఁగక చిన్నిపూఁదేనె పోరలం బురువుల తుట్టెలని పాఱవైచు చిన్న
వారలంజూచి నగుచు మరల నేరించు చెంచునాయకుల వింతమాటలకు సంతోసం
బునొందుచు ఫణిఫణామణి తోరణ విశాలసాలసౌధాంతర జ్యోతిరింగణ దీపికాదీపి
తమృదుగుళుచ్ఛ సుమలతాకాయమానమధ్యప్రదేశ మకరందపరిక్షాళిత శిలాతలా
సీనభిల్లపల్లవాధరీ వినోదమధుర వేణునాదంబులకుఁ గరంగుచు నిజశకుంత సంతా
నంబుల గుల్మాంతరమ్ములు నిరంతరమ్ములుగాఁ గర్పటాకారంబున నేర్పున నల్లి దా
నిం దగుల్కొని చిక్కిన కీటకంబుల దంశంబు లుపదంశంబులుగా భక్షించు నూర్ణ
నాభంబుల యాలోచనంబులకుఁ దలయూఁచుచు మేఁపుల నందడిం జెదరిపోయిన
సమయంబునఁ బొంచి చని క్రోల్పులులు సలుఁగులంబట్టికొని పాఱునెడ నిజశాబకం
బు లూరించు నార్తింధెలువు ఘీంకారంబు లాలించి గ్రక్కునం గలసికొని వ్యాఘ్రం
బులని గ్రహించి పిల్లగుమింగఁబిసికొని పొదల సంతసంబునం బొదలుచు ఘుర్ఘుర
ధ్వానంబులం బుడమి వ్రక్కలించుకొని యొక్కఁ బ్రోవుగా నిదురఁ జొక్కియున్న
ఖర్బరోమంబులం దెలుపుచు శుష్కవంశనోత్య సంఘట్టనోద్భూత ప్రభూతవన
ఘూతాశనజ్వాలాకలాపంబునకు నహోరాత్రంబైన మధ్యాహ్నసమయోష్ణ కిరణోష్ణ
నహిష్ణువులై మడువులఁ జొడిపోరలు సైరిభంబుల నిధంబులుగా నభివీక్షించుచు,
మృతమృగకళేబర దుర్గంధ గర్తవర్తన ఘూర్తమృగ ఘూర్ణమాఘాతంబులకు

రోయుచు, చమరీమృగ వాలవ్యజనవీజనోజ్జనిత మరుచ్చలల్లతాలతాంతడోలికా సంస్థితంబులగు మిళిందబృందఝుంకారంబులకు వినోదంబు నొందుచు, శశశావకంబులు వెనుకొనం గనుకనిం బాఱి యుబ్బారిం దోలంగఁ దమ్ముం జేరిన రురువారంబులం గటాక్షించి తద్విరోధంబులగు జంతువుల నదలించుచు, మనోహరవిపరీత భయానకంబులకుఁ దానకంబులగు ఖగమృగస్వనంబు లాకర్ణించుచు, నిరోధిత తరణికిరణ ప్రసరణతరులతాశిఖర పరిపక్వఫలప్రతిబింబిత తారకాకోరక ప్రకరంబునుం బోని ఫణిఫణామణిప్రభాపటలి ధగద్ధగితంబున కచ్చెరువందుచు, వనేందిరాకిసలయహస్త పరిస్రస్త ముక్తాఫలక్రమాభివీక్షిత బాలతృణాంకురాగ్రమాలికా ప్రతిభాసిత హిమానీ బిందుసందోహంబుఁ గొనియాడుచు నిండారం బండిన దొండపండులదండం దండిగఁ జెక్కున జిగురుం గండెలం దండోపతండంబులుగా బెండువడి పడిన పీలిపిట్టలం బట్టికొని మెచ్చువచ్చు కుచ్చులం బుచ్చుకొను శకునాంతకుల చెంతకుం బోవుచు దివాచర నిశాచర మృగపక్షి ప్రచరణంబువలనను గమల కైరవ వికసనోన్మీలనంబు వలనను ప్రభాకరోదయ కలాస్తమయ కాలనిరూపణంబు గావించుచు మెట్ట యుడుతపిల్లలం బట్టి విడుచుచు శార్దూలంబులం దోలుచు తరక్షువుల శిక్షించుచు శరభంబుల సరిపెట్టుచు గవయంబులం గడతేర్చుచుఁ గణుఁజురులకుం దొలంగుచు వాఁడిగల ముండ్లుగాఁడినం దూఁగాడుచు నన్యోన్యద్వైధ సంశోషణంబు లగు సంభాషణంబులాడుచు వర్షాతపహిమానీ నివారణంబుగా గుజ్జుమావులపజ్జకుం బోవుచు గుసుమవిసరంబు లేఱుచు నీరంబులం దూఱుచుఁ గొంతదూరంబు చనిచని యొక్క నాఁ డొక్క పుణ్యాశ్రమంబుఁ గనుంగొని యందు. 65

మ. భవనారణ్య భవప్రతీతు సుగుణ భ్రాజిష్ణు వింధ్యారిసు
ర్భవనాగారిఖగాధిపున్నియమిసంభావ్యప్రభావాఢ్యునిన్
భువనారాధ్యుని మాత్రవచ్చులికితాంభోరాశి నక్కుంభసం
భవనామున్ జగదేకవంద్యఘనులోపాముద్రప్రాణేశ్వరున్.

క. కని మ్రొక్కిన సీతారాముని గ్రక్కునఁ గౌఁగిచ్చె నత్తి మునిమక్కువ నె
క్కొక్కన నక్కున నక్కఁగదియ, నును జెక్కు లనొక్క కడు మనోమోదమునన్. 67

ఉ. అంబుజమిత్రగోత్రకలశాంబుధిసోముని రాముని ప్రమో
దంబునఁ గన్న పుత్త్రునివిధంబున నెంతయు నాదరమ్ము రూ
పంబు వహించెనో యనఁ గృపన్మనిదేల్చె సుఖాసనార్ఘ్యపా
ద్యంబుల నిష్టవాక్యనిచయమ్ముల నిట్లలరించి వెండియున్. 68

క. లక్ష్మణుఁ గృతలక్షణు ఘన, లక్ష్మణు మన్నించి తనరులసతి ననిచెనా
లక్ష్మీసమానయగు జనక, క్ష్మాధీశసుతఁ బూజఁ గావింపంగన్. 69

వ. నియోగించి రామలక్ష్మణుల నుచితాసనసమాసీనులం గావించి మధురవచనరచనల నలరించి రాముం గనుంగొని. 70

ఉ. కాయము వొంగ నిన్నుఁ బొడఁగాంచితి ధన్యుఁడనైతి నాదినా
రాయణమూర్తి వీవు మునిరక్షణకై యిటు లుద్భవించినా
వాయననీతనూజభవదంగనపంకరుహాక్షి లక్ష్మి నా
నీయనుజుండు లక్ష్మణుఁడు నిక్కము శేషఫణీంద్రుఁ డారయన్. 71

చ. త్రిదశవిపద్దశాప్తి గుఱించి విరించి స్మరించినన్ ధరి
త్రి దశరథోర్వరావరసతీత్రయమందుఁ జతుర్వరాకృతు
ల్ముదమునఁ దాల్చి పుట్టితివ మోఘము విష్ణుఁడ వీవు తావక
ప్రదరనిపాతితంబులగు రాక్షససైన్యములొక్క క్రేల్మిడిన్. 72

వ. అని యభినందించి మఱియుం బుణ్యకథావిశేషంబు లుపన్యసించుచు నిట్లుండ నగస్త్యుం డొక్కనాఁడు రఘుపుంగవుం గనుంగొని నీ వింక నిందుండవలవదు గౌతమీతటంబున నుత్కృష్టంబగు పంచవటంబు గలదచట నుటజంబు నిర్మించికొని జానకీలక్ష్మణసమేతుండవై యప్రమాదంబున నుండునది యని చెప్పి రాఘవున కమోఘశిలీముఖంబు లొసంగి యాదరాతిశయంబున. 73

క. హస్త్యయుతతరుని నరణాగ, భస్త్య్వాద్యవరుని రామభద్రునిఁ గరుణ
న్నస్వాస్త్యధికంబగు నటుల నగస్త్యుఁడు దీవించెఁ గౌతుకం బలరారన్. 74

వ. దీవించిన నంబరమానందంబునొంది రామచంద్రుండు మునిచంద్రుం గనుంగొని. 75

క. వింధ్యము నణఁచితి బలపరి, పంథ్యభ్యర్థితుఁడవగుచుఁ బాణితలమునం
గంధ్యుదకమ్ముం ద్రావితి, వంధ్యతపోవిభవ పొగడ వశమే నిన్నున్. 76

వ. అని యిట్లు ప్రత్యభినందనపూర్వకంబుగా వీడ్కొని. 77

క. సాలసురసాలపనసత, మాలవకుళపూగనక్తమాలసదమిసీ
తాలమగు వనంబున సీ, తాలక్ష్మణసహితుఁడై ముదంబున నరిగెన్. 78

గీ. ఇవ్విధంబున నరిగి మదేభసింహ, శరభశార్దూలభల్లూకసైరిభతతి
గలిగి కాకఘూకారవాక్రాంతమగుమ, హావనంబుల విహరించు నవసరమున. 79

సీ. వటముఖతరుశిఖాచ్ఛటలు గనుంగొని, యిది క్రూరసర్పంబు లేయటంచు
గున్కుఁబర్వులువాలు క్రోడంబులను గనుఁగొని యిభగజములో కో యటంచు

వావిరి మెఱుఁగు శిఖావళులఁ గని, యివి పెనుభూతంబులే యటంచు
వీచికాసదృశమరీచికల్గనుఁగొని, యివిదీర్ఘదీర్ఘికలే యటంచుఁ

గీ. దఱల ద్రాక్షాదివల్లీవితానసంచ, లల్లలితపీ ధమ్మిల్ల భిల్లపల్ల
వాధరులఁ గాంచి మునికన్యలా యటంచు నడుగునడుగగ్గుకుఁ దన్నుఁ బుడమిజాత.

వ. వెండియు. 81

చ. వికచసరోజగంధి పృథివీసుత రాముని కేలుపట్టి కం
టకతరుదుష్టసత్త్వనికటం బిచ్చటం జరియింప నేలయొం
డొకభయశూన్యమైనయెడ కొయ్యన నేగుట యుక్తమంచు నా
రమఁ దరపత్త్రికాపుంగవరమ్యములంచుఁ దలంచి ముగ్ధయై. 82

వ. ఇట్లెఱుఁగక పల్కు జానకిం గనుంగొని కొండొకవిషాదంబు గదిరిన న్మొగంబునం దోఁపనీక మఱుమాటల నిట్లనియె. 83

క. కాలవశతనివురించిన, గాలవశతములను వేడ్కఁ గనుఁగొను వైదే
హీలతలువోలిచె వైదేహీలలితలతాంగి చూడుమిం పొందంగన్. 84

ఉత్సాహ.
కొమ్మకొమ్మటంచు నేర్చి కొమ్మకొమ్మపంతులుం
గుమ్మరించు రుచులమించు కొండచఱులజున్నులు
న్నెమ్మిమీఱ నెమ్మి గులుకు నెమ్మిపురులకన్నులు
న్నమ్మతిగ నొసంగు రామచంద్రుఁ డవ్వనంబునన్. 85

వ. ఇట్లొసంగుచు వనవాసం బనాయాసంబగు నట్లు సేయుచున్న యన్నం గనుంగొని లక్ష్మణుండు తనమనంబున. 86

సీ. స్యందనంబు శతాంగమయ్యె భూజానికి, జిహ్వ్యరుఁ బున్నాగ మయ్యెఁ బొన్న
జగతీశునకు నుటజంబు భవనమయ్యె, నవనీపతికిఁ జూర్ణమయ్యె రజము
అధిపమకాళికి మావులశ్వరత్నములయ్యెఁ, బాట్లయ్యె నృపునకు భల్లుకమ్ము
లధిపతికి ధనంబులయ్యెఁ బత్రింబులు, దరులయ్యె నిగమములు నరవరునకు

గీ. భద్రకలశంబులయ్యెఁ గుంభములు ప్రభున, కఖిలజనమాన్యునకు గోతులయ్యెఁ గపులు
ధరణిపాలవంతమైన విధాత్రకృత్య, మెవ్విధంబునఁ దలఁగుదు రెట్టివారు 87

క. మేలగు వీణారవముల, మేలుకనెడు రామవిభుఁడు మృదువిగ్రహుఁడీ
కాలమున నృగాలంబుల, యూళల మేలుకొనెఁ జొచ్చె నుగ్రాటవులన్. 88

వ. అని వగచి, జానకిం గనుంగొని. 89

గీ. కఠినపాషాణకంటకాక్రాంత మిద్వ, నాతి యెటు సంచరింపఁగా నకట యెట్టు
లోర్చు మెత్తని మెత్తల నోర్వదరుణ, కిసల యవిభ్రమంబు జనకజాంఘ్రిద్వయంబు. 90

క. ధాత కిడితగునె కితవను, ధాతయనసుధాతలములఁ దపిలిచరింప
న్నీత కిటులైనె మిగులం, బాతకియై కీన నేమిఫలమగుఁ దనకున్. 91

క. అని ఘనదుఃఖంబున మునిఁగి, గిర మనమున గ్రిప్పికొని యక్కృత్తివధ క్తిం
దనుగొలిచి రామచంద్రుండు, జనకసుతాసహితుఁ డగుచుఁ జనిచని యంతన్. 92

క. ఆచటవిస్థలమునఁ సీతాయువతిప్రియుండు భక్షితక్రూరఫణి
స్నాయువు జటాయువు న్నఖరాయుధహత్యాతఖలనిశాచరాయువుఁ గనియెన్. 93

వ. కనుంగొని. 94

క. చిక్కనపురుక్కుఁజునియాల, ముక్కలుగావింపఁజాలు ముక్కునెవరికిం
జిక్కనిదిక్కనిచక్కని, రెక్కలుఁగల యిప్పులుంగుత్రెఁ దేవఁడోకో. 95

మ. అని చర్చించుచుఁ దత్సమీపమున కయ్యార్యుఁ డవ్యాధ్యతుఁ డో
య్యనఁ జేరంజని యాతఁ డాత్మవిధమాద్యంతంబునుం దెల్ప ప్రమో
క్కన నతుల్సేసిన దీవనల్సలుగఁ బక్షిశ్రేష్ఠు వీడ్కొల్పి చ
య్యన ధాత్రీకనయానుజుల్ గడ సత్యంతానుమోదంబునన్. 96

వ. పృథులతారుంజపుంజంబులం జెలంగు పథుల నీక్షించుచుం జనిచని. 97

క. శ్రీమంతుఁడు రాముఁ డనుజసతీయుతుఁ డటఁ గనియెఁ బరమధృతియుతమునిపా
దేయము శబరకరములగా, దేయముఁ బంపావటసమభిధేయము నెదుటన్. 98

వ. కనుంగొని లక్ష్మణుం గనుంగొని. 99

మ. తపనుల్సేసెడు సంయమీంద్రులకు శీతచ్ఛాయలం గూర్చునా
తపము ల్పంవారణం బొనర్చుఫలసంతానంబులం గూర్చుఁ బా
దపముల్ దావితె ధర్మమెల్లను వనస్థానాయ్యెనిచోఁ బరం
తపముఖ్యంబుగఁ గొన్ని వాసరము లుద్యల్లీల వర్తింతమే. 100

వ. అని మఱియును. 101

క. తమ్ములిఁ గనుఁగొని నాచిత్తమ్మధిక ప్రమదసంయుతమ్మయ్యెఁ బవి
త్రమ్ముగనొనరింత్రము పత్రమ్ముల నొకభవనమిచట రమ్యము గాఁగన్. 102

సీ. అనుటయుఁ దత్క్షణం డాకుటిల్లొనరించి, చూపిన నెంతయుఁ జోద్యమంది
యుచితవిశాలంబు నుజ్జ్వలతత్పత్రల, తాకల్పితంబు నాతపతుషార
వర్షభయాపేతవాసంబు సమతలం, బగుటను మోదించి యాదరమునఁ
దమ్ముని గాఢరాగమ్మునఁ గౌఁగిటఁ, లాలించి తత్కౌశలతను మెచ్చి

గీ. సీతతోఁ గూడ నందు వసించెఁ దక్ష, మీఁద నొక్కచోట సౌమిత్రి యుల్ల
మల్లసిల్లుచునుండ నలోప్పటజంబుఁ, గట్టికొని యుండె రామభూకాంతుఁ డలర. 103

వ. ఇవ్విధంబున నివసించి సమస్తోపచారంబులు లక్ష్మణుండొనరింప సుఖంబుండి సమయ
సమంబులు పండ్రెండుఁ గడపి యల్పావశిష్టంబగు నత్త్రియోదశవత్సరంబునం దొక్క
నాఁడు. 104

మ. ధరణీనందనకుస్థలంబులు సుమిత్రానందనా తెమ్ము పా
మ్మగయుం బారఁగ రమ్మటంచుఁ బనుప నోమ్మదంబు న్లక్ష్మణుం
డు రహింబూవులుఁ గాయలాకులును బండ్లుం గోయ నక్కాననాం
తరసీమన్విహరించుచుండ నతివిస్తారాద్భుతాపాదియై. 105

క. క్రతుభుగ్రిపునాశకును,గ్రతనసితోద్వేల మొక్క కరవాల మవ
క్రతరంబై తోఁచె శత,క్రతు మాయాకలితమగుచు గగనతలమునన్. 106

వ. అంతరిక్షంబునం బఱతెంచి సమక్షంబున నిలిచిన యలక్షితకాంక్షేయకంబు నభివీక్షిం
చి లక్ష్మణుండు దక్షిణహస్తంబునం బరిగ్రహించి తత్తీక్ష్ణ పరీక్షార్థంబు గా నప్పుడు.

క. ధారాధరనిభములగు మ,హీరుహముల నఱక మానులేతెంచి ధరి
త్రీరమణపుత్త్రి భరదసి,ధారాదళితములు సేయుఁ దగునే తరులన్. 108

వ. అనిపలికి వారించి యమ్మను లా రాజనందను నుద్దేశించి. 109

మ. ఫలసంఘంబులు లేవు రావు ఖగము ల్పత్త్రంబులున్ భక్షణా
ర్హలసత్కాంతులు గావు కావున మహావ్యాళ్యాళికిన్ దావు బూ
వులగుత్తుల్గరావు మాత్రమునఁ దావు ల్లేవు రాజేంద్రనీ
వు లసద్బాహుబలుండవై వ్రేయుదుఁ బోవుం గన్మి తూటాడుమీ. 110

చ. అనవుడు రాజనందనుఁ డహర్పతితేజుఁడు లక్ష్మణుండు చ
య్యనఁ దను హెచ్చరించెడు మహాత్ములకున్ మ్రొక్కి మొప్ప వాళవ
ర్ధన మొనరించి యందు రుధిరప్రవిలిప్తకపోలునిం గృపా
ణనిహతసత్కపాలుని ఘనవ్రతశీలుని దైత్యబాలునిన్. 111

క. కని మునిపుత్త్రకుఁ జంపితి, నని భయకంపితశరీరుఁడై కడు వేగం
జని తన యన్నం గనుఁగొని, వినిపించెం దనదు సర్వవృత్తాంతంబున్. 112

వ. వెండియు. 113

క. నరవర యెఱుఁగక గుల్మాంతరితుండై తపము సేయు తాపసవంశో
త్తరు నొకబాలకు భయదక్షురికాహతుఁ జేసినాఁడఁ జుమ్మని పలుకన్. 114

ఉ. విన్ము సహోదరా దనుజవీరులఁ జంపి మునీంద్రరక్షసే
యా న్నవమింపు వచ్చి దురితాత్ములఁ జంపక యిట్లు సాధువృ
త్తి న్మునినై సమాధినిరతి న్మద మొందుచునున్న మౌనిబా
లు న్మెడ ద్రెవ్వ నేసి కడు లోపితకర్ములమైతి మక్కటా. 115

వ. అని యనేకవిధంబుల ననుజసహితుండై విచారంబు నొందుచున్న యన్నరేంద్ర చంద్రు సమీపంబునకు మునీంద్రు లరుగుదెంచి భవదనుజభుజాసిధారాదళితమస్తకుం డగు నతండు దనుజుండు వీనిం దునుమాడుట యనఘంబని యతనికి మనస్తాపోపశమనంబు లగు వాక్యంబులు దగుభంగి నుపన్యసించి యనంతరంబ సౌమిత్రిం జేరొక్కని యి ద్దురాత్ముండు విద్యుజ్జిహ్వునకు రావణసహోదరి యగు శూర్పణఖయం దుద్భవించినవాఁడని తదీయజన్మప్రకారంబుఁ దేటబడం బలికి మఱియును.

ఉ. జంబుకుమారుఁ జంపితి నిజంబు కుమారక దీన నీకు దో
సంబు తలంచిచూడ యవసంబును లేదు ముదంబునొందు మా
త్రింబడ నేల యీతని వధించితివంచుఁ దపీయవృత్తి స
ర్వంబును నీకెఱుంగఁగ ధ్రువంబుగ నిప్పుడు విన్నవింపమే. 117

క. అనిన మిషము సేయఁగఁ దన, జనకునిఁ జంపిన విరోధి సమయింపఁగ ని
ట్లొనరించెదు తప మితనిం, దునుమాడిన దీన నీకు దోసము గలదే 118

వ. అదియునుంగాక మదీయప్రేరితుండవై యొనరించుటం జేసి పాపంబునకు సంశయింపం బని గలదే యని వాచంయమిప్రకరంబు నిజాశ్రమంబులకుం జనియె నిట్లు మహామునిప్రబోధితులై రామలక్ష్మణులు నిర్విచారులై యుండిరంత నొక్కదినంబున.

క. శూర్పణఖ వచ్చి యటు పరిమార్పఁబడిన కొడుకుఁ జూచి యాఱనిపగ త
న్నేర్పఁగ గద్గదస్వనమద్రువ, వాయ్పులు బొబ్బలు సెలంగ నాక్రందించెన్. 120

వ. ఇట్లు గణ్యారోదనంబు సేయుచు మృతుండగు సుతుం దలంచి. 121

శా. తండ్రిం జంపినవానిఁ జంపుటకు నుద్యన్నిష్ఠ నిచ్చో గడు
న్నుగ్రంబైన తపంబు సేయు నిను నేవీరుండు హింసించెనో
తండ్రీ నామది శోకమాఱునె మహాదౌష్ట్యంబు సంధిల్లఁ బై
క్కాంద్రం జంపకయుంచు నుద్వృత్తవక్త్రప్రోల్లసద్దంష్ట్రియై. 122

ఉ. మానులఁ గాంచి నాసుతు నమానుమతేజు వధించినట్టి దు
ర్మానినిఁ జూపకున్న మిము ద్రుందఁగ మోఁదెద నన్న వారల
మ్మానినిఁ గాంచి భీతియుతమానసులై తగ నిట్లు పల్కి ర
మ్మా నిజమాలింపు మొక మర్త్యవరేణ్యుఁడు ద్రుంచె నాపుకున్. 123

ఉ. అంగన వానిఁబట్టి పరిమార్పఁదలంచి కడంగి ఘోరకా
లాంగనవోలె రోయుచు మహాటవి నొక్కెడఁ గాంచె సాధ్వి నా
త్మాంగనఁగూడి సోదర సహాయయునం దగురీతిఁ బర్ణశా
లాంగన మొప్పఁజేయు మహితాత్ముని రాముని గీర్తికాముని౯. 124

వ. ఇట్లు గాంచి. 125

ఉ. వామతరోల్లసద్ధనవారవిభా చపలాంశుజాలము౯
శ్యామలవర్ణముం బటుదయారసవృష్టియుఁగల్గి కానలో
నీ మెయినున్న వాఁడు ఘనుఁడీతఁడు సంశయమింతలేదు నా
కీమహనీయతేజు నెడ నెంతయు నగ్గలమయ్యెఁ గామము౯. 126

వ. అని మఱియు నతనిం దనివిసనక కనుంగొని. 127

సీ. ఇతనిమోమరవింద మితనికన్నులు కుంద, మిందీవరంబుల పొందుఁ దెగడు
నితనికటులు తిన్నె లితనిమాటలు చిన్నె, లలసుధాధారానయంబుఁ దెగడు
నితనిపొక్కిలి బావి యితని చెక్కులతీవి, యలదర్పణముల సోయగముఁ దెగడు
నితని మోవి పగడం బితనికంఠము డంబు, కంబుమానిత సుందరంబుఁ దెగడు
గీ. నితనిహస్తము లస్తము లితనివెడఁద, యురము మురమిత్తు మహాత్ము పొందొప్పఁగాంచి
యెలమినొందని జన్మంబు వృథయటంచుఁ, జేరఁ జనుదెంచె రాక్షసస్త్రీ రయమున.

క. మునివర్యులకు నొమ్మహము, జరియింపఁగఁజేయు రామచంద్రుంగని కా
మినిదోషాచరి మోహించిన దనుటకు ధరణినేమి చిత్రముతలఁప౯. 129

క. కని రిపువంశ్యులు జేరం, జనుదెంచెను దానిఁ గుసుమసాయకబాణ
ప్రనిహతవనోబ్జజనఖ, డన పటుతరతీక్ష్ణశూర్పణఖ శూర్పణఖ౯. 130

వ. అయ్యవసరంబున లక్ష్మణుండు నీ వెవ్వరిదాన విచ్చ్వలనికిరాఁ బ్రయోజనంబు నీకుం
గలుగ దేమి దశరథరాజనందనుల మిర్వురంబునను విహారార్థంబు చనుదెంచితి మెడ
గలిగి పొమ్మనుడు నతని నాదరింపక యన్నిశాచరి రామచంద్రుం గనుంగొని. 131

ఉ. ఆతతకీర్తి పూర్వవిబుధాధిప శేఖరుఁడైన రావణా
ఖ్యాతునితోడఁబుట్టువ నకంపిక చిత్తముల స్వవశసం
జాతను నిన్నుఁగాంచి సుమసాయకసాయకపీడితాంగనై
తీతను వేలరాదు వసుధేశ్వర నిన్ను వరింపనుండెద౯. 132

వ. అదియునుం గాక విను మేను గామరూప ననేకవిధ సుందరాకారంబులు వహించి
ప్రీతుఁ జేయను కలసి చోటికి సిన్నెత్తికొని పోవను నేర్తు మదీయ నామధేయంబు

శూర్పణఖ నన్నుం గలసి భవత్ప్రియానుజప్రియాసహాయుం బపేక్షింపక కామోప
భోగంబు లనుభవింపు మని పల్కిన నవ్వుచు నతం డారక్కసిం గనుంగొని. 133

క. కుమతీ చంపక విడిచినఁ, బ్రమదంబునఁ బొంగి చనక ప్రత్యుక్తులఁ గూ
టముఁగోరెదు నాతో రాముమటున్నం జంక నెత్తికొనుమను భంగిన్. 134

క. అని పలుకునంత దానిం, గనితద్వికృతాకృతియును ఖరనిస్వనముం
దన కద్భుతమగుటకు ధరాత్మజ నగియె నగినఁ గ్రోధతామ్రాననయై. 135

ఉ. ఆదనుజాంగనాధము ధరాత్మజఁ గన్గొని నిన్ను మ్రింగినం
గాదనువారు లేరు నను గర్వముఁ దక్కుమటంచు డాసి వ్యా
ద్భేదనవాక్యసంతతులు ప్రేలిన రాముఁడు కర్ణనాసికా
చ్ఛేదన మాచరింపుమనఁ జెచ్చెరలక్ష్మణుఁ డట్లొనర్చినన్. 136

క. ముక్కుఁ జెవులుఁ దెగిపోవుట, నక్కటిరక్కసులు వెగడనురరవమున నా
టుక్కరి మిక్కిలియేడ్చుచు, నిక్కరణి న్నేయధర్మవే మీకనుచున్. 137

చ. వాలమున్ద్రొక్కినం గినియు వాయుభుగంగనభంగి నింగి వా
తూలరయంబునం బఱచి దుర్మతి యప్పిశితాశి యన్న పే
రోలగమున్న చోట రుధిరోద్గమవైకృతకర్ణనాసికా
మూలము లెత్తయి న్నలుప ముందఱ వ్రాలెఁ గరంబు దీనతన్. 138

వ. వ్రాలి మహారోదనంబు సేయుచు నన్నుం గనుంగొని. 139

ఉ. ఒక్కనయందు దారయు సహోదరుఁడుం దనుఁగొల్వ రాజసం
బెక్క వనక్షితిం దిరుగ నెక్కడివారలు వీరటంచు నే
నక్కడకేగి వారివిధ మారయఁగోరినఁ గర్ణయుగ్మము
న్ముక్కును గోసి చేనిడిరి మోసముగాఁగ ఖరాసురాగ్రణీ. 139

శా. నాసాకర్ణవిహీననైతి నని చింతం బొంద నింతేనియు
న్నీసామర్థ్యము లెక్కసేయక స్మయాంధీభూతులై కావను
ల్లాసాధిక్యత నున్నవారని గడున్ లజ్జింతు నన్నీచులం
గ్రాసాసిక్షురికాదిసాధనముల న్భంగింపు మెచ్చంగనన్. 141

చ. వారని కిన్క నిష్టపరివారపలాశసమన్వితుండవై
వారణహస్తసన్నిభభవద్భుజవిక్రమ మెక్క నేగి య
వ్వారని సేయఁజాలక జవంబటిపాటినఁ బాఱనీక వే
వారలఁ జంపకున్న మనవారలకుం గడుఁ గీడు మీఁదటన్. 142

చ. విను మను నవ్వెవారి వెనువెంటఁ వచ్చెను కాంత దానిచే
తనయిటులయ్యెనాక విక్రుతాత్మ్యము గావునఁ గన్నుఁగూర్చి య
మ్మనుజుల తేజమేని సురమర్దన దానిగుఱించి యింక ని
ర్దనుజులగోత్రమేని ఘనుఁ డర్ధము సన్నిజమింత తెల్పితిన్. 143

చ. అనుటయు దండతాడితమహాహిగతిన్ ఖరుఁ డల్గి సోదరిం
గనుఁగొని చింతదక్కు మిదె కావన యున్నిఖిలేశ్వభంగి న
మ్మనుజులఁ గాల్చి శత్రు సముమానముదక్కఁగఁ జూతు మస్మదీ
యనిబిడకోపము త్కవివిధాద్భుతబాణము లెల్లు సేయునో. 144

వ. అని ప్రగల్భవచనంబులాడి. 145

చ. అశనినిభోగ్రవాక్యనిచయంబులఁ జెంగట నున్న దూషణ
త్రిశిరులఁ గాంచి వేగఁ బటితెండు బలంబులఁ గూర్చి సత్కృపా
ణశరముఖాహవోపకరణంబులు దండనిరంగ కడంగి య
ప్పిశితభుగీశ్వరు ల్గడలు బీటలువాఱఁగ నార్చుచుం గడున్. 146

వ. సమరసన్నాహ సముత్సాహంబునం బొలిచి నిలిచినం గాంచి, 147

క. స్వస్థమరేంద్రదమనుం, గ్భస్థాన్భకకోటి మిగుల బద్దలు గాఁగం
బ్రస్థానభేరి చెలఁగ జ,నస్థానము వెడలి ఖరుఁడు నడిచెఁ గలంకన్. 148

క. ఖరుఁడు నిశాచరకులశే,ఖరుఁడు ఖరాండివ్యూహమున ఖరకరవంశో
త్తరు ధామమ్మజనమహా; త్తరు రాముం దోడనరిగెఁ దత్తఱపడుచున్. 149

వ. అమ్మహీపాలుం డనుజన్మునాలోకించి. 150

మ. అవనీభాగము సంచలింపఁగ భటాహంపూర్వికారావసైం
ధవహేషారవ మత్తసింధుర మహోద్యద్బృంహితధ్వానమే
ఘనిధూతాతతగంధవాహాకపతాకస్యందనాభీల నే
మిచిరావంబులు మించె నెక్కడఁగ సౌమిత్రీకనుంగొంటివే. 151

చ. అదియెయగాక భూమిరజ మద్దెస మిక్కుటమయ్యె నెవ్వరో
కదనమొనర్ప రాక్షసనికాయముతోఁ జనుదెంచు చున్నలుగా
మదిఁగనవచ్చె నాఖిలుల మార్కొని కండలు చెక్కువైతు మీ
వదినను గాచి యుండు మొకవైపున భద్రముగాఁగఁ బుత్త్రికా. 152

క. కుసుమశరవిద్ధయగు రాక్షసి జానకి మ్రింగఁబోవ సమయింప నుపే
క్షసలిపి వికృతాకృతిఁ జేసి సారిదివిమువంగ నింతఁ జేసె న్సహాజా. 153

ఉ. కావున సంశయింపఁ బనిగాదు ధరాసుత భీతినొందు నే
న్యావలిఁ గాంచి యట్లు కుటి నద్రిగుహాన్నివసింపఁజేసి య
చ్చోవిశిఖాసనాస్త్రపరిశోభితహస్తుఁడనై ముదంబునం
గావలియుండు మేను పురకంటకులం బరిమార్చునంతకున్. 154

వ. అని సీతారక్షణంబునకు లక్ష్మణుం బదిలపఱిచి. 155

మ. కలభాలోకనచారుచంక్రమణవక్త్రశ్రీవనూష్త్రిభూ
తలయోద్ధత్యమహాట్టమూర్తి క్రియ రౌద్రప్రస్ఫురన్మూర్తియై
విలునమ్ముల్దగుల్లఁ దాల్చికసి నవ్వీరుండు రాముండు ని
శ్చలనైశాచరమాన్యము న్వనమువాంచాశూన్యము న్సైన్యమున్. 156

వ. అంత నబ్బలంబులు గంతుమిగిలి. 157

ఉ. చేరఁగవచ్చి శూర్పణఖ చెప్పినవీరుఁ డితండొయంచుఁ గ
న్నారఁగఁజూచి లేశము వయుఃబువలంపక యుద్ధ క్రోధమే
పారఁగఁ జుట్టుముట్టిన మహాబలుఁ డాతఁడు గన్నుదోయి కెం
పారఁగ నబ్బలాటవి బయల్పడఁజేయుఁదలంచి యుగ్రుఁడై. 158

శా. మధ్యాహ్నోష్ణసహస్రభాను క్రియ రామక్ష్మాధినాథుండు వా
ర్నిధ్యారావముతోఁ జయూవిపర మూర్వీభాగము న్నిండి సా
న్నిధ్యాపాతము గాఁగనుంగొని మహోన్నిద్రస్ఫురన్మూర్తియై
పథ్యాహీనము గాఁగ నించెనిషువు ల్ప్రాబల్యపాదస్థుఁడై 159

శా. శ్లాఘాలంఘ్యపునశ్ఛవేద్ధరుచి సత్సౌదామినీజాలమున్
జ్యాఘాతస్తనితంబు దీర్ఘవిలసచ్చాపైంద్రచాపంబు న
వ్యాఘాతాంబకవృష్టియుం గలుగు రామాభ్రంబు రక్తప్రవా
హౌఘుంబు ల్గురిగించె భూతవితతుల్ హర్షింప నైన్యాటవిన్. 160

వ. వెండియు రఘువరుండు కోపోద్దీపితుండై. 161

ఉ. కొందఱఁ గుత్తుకల్దునిమి కొందఱఁ జెక్కులుచెక్కి కొందఱం
గొందలమందఁజేసి పటికొందఱ మేనులు సించి కొందఱం
జెందఱవందలై పఱవఁ జేసి విశేషరయంబు పేర్మి న
య్యొందఱఁ గూలనేసె నరుణాస్వయుఁ డందఱ కన్నిరూపులై. 162

ఉ. ఒక్కెడ నేయుఁగుల్చెదియు నొక్కెడ నశ్వము లుక్కడంగు వే
ఱొక్కెడఁ గేతువుల్ వ్రీలుగు నొక్కెడఁ గాలుబలంబుగూలు నిం

కొక్కెడ రథ్యములల్లలుఁగు నొక్కెడ వ్రాలు శతాంగపఙ్క్తిఁ దా
నొక్కెడ రాముఁ డెవ్విధినొకో తొలగించెను బాణకోటులన్. 163

క. అని తను సురలగ్గింపఁగ, ననితరసామాన్యవిక్రమాధికుఁడై రా
మనరేంద్రుఁ డివ్విధంబున, ఘనతరశస్త్రప్రహతి రిపుల గాసియొనర్చెన్. 164

ఉ. జన్యము సేయఁజాలక నిశాచరసైన్యము దైన్యమంది రా
జన్యుని దేఱిచూడక వెసం బఱవన్ ఖరుఁ డడ్డమేగి యి
ట్లన్యశరణ్యశూన్యులక్రియం జుణుఁగం దగ దేనుగల్గ మే
దిన్యధినాథుఁ గూల్తునని త్రిప్పె నిశాచరకోటిఁ గ్రమ్మఱన్. 165

ఉ. క్రమ్మినవిక్రమమ్మున సగర్వుని శాత్రవుఁ జుట్టుముట్టి వా
లమ్ములు గ్రుమ్మరించు నకలంకమనస్కుఁడనౌచు నంచు సై
న్యమ్ములఁ గ్రమ్మరించి ఖరనాముఁడు రాము నెదిర్చి తత్సమ
తుమ్మున నిల్చియిట్లనియెఁ గన్నుల నెఱ్ఱఁదనంబు తోఁపఁగన్. 166

ఉ. మక్కువ నిన్నుఁ జూడఁగ సమక్షముఁ జేసిన మత్సహోదరి
న్ముక్కును గర్ణము ల్చిదిమి మోసమొనర్చితి వంతఁబోక నీ
ముక్కడిమూఁకఁ ద్రుంచి కడు మోదమునొందెదు నీవు నీవ పే
రుక్కును దేజముంగల మహోద్ధతుఁడైన నరేంద్రుచాడ్పునన్. 167

వ. అని పలికి మఱియు. 168

క. స్వేచ్ఛావిహారపరుఁడ వి, శాచ్ఛాదితయశుఁడఁ జూడు మఱిమఱిఁ జేతు
న్మచ్ఛితశరముల నీ కంఠచ్ఛేదము ఖరుఁ డన న్వెడఁగ నను వినవే. 169

వ. అనిన విని రామచంద్రుండు మందస్మితసుందరముఖారవిందుండై యద్దనుజాధముం గని.

క. తనుదాన పొగడికొను టొప్పని పని యని యార్యజనులు పలుకుదు రిపుడీ
పని సేయక మాటలచే, తన జరగఁ దలఁచి తవ్విధంబుఁ దెలిసితిన్. 171

వ. అదియునుంగాక. 172

ఉ. భీరుల ముందుఁ జెట్టికొని బింకములాడెదు వెన్క నఖ్యమేఁ
గోరిన నస్మదీయకటు ఘోరతరాద్భుతమార్గణాగ్నికిం
బోరన నొక్కు నీరుధిరపూరము నాజ్యముగా ఘటించి వెం
పారెడు ప్రాణవాయువుల నాహుతులీయమి ధార్మికత్వమే. 173

చ. అన ఖరుఁ డల్గి దూషణుఁడు నత్రిశిరుండును దోడుగా నరేం
ద్రుని బటుబాణజాలములతో నెదిరించిన రామభద్రుఁడుం

బనుపడి వానితోడఁ దలపడ్డఁ గరంబును బోరు ఘోరమ
య్యెను గులపర్వతాళి నవియించెడు కార్ముకభీకరార్భటిన్. 174

వ. అట్టియెడ. 175

సీ. నక్తంచరధనుర్విముక్తనారాచపరంపరాసారంబు రాఘవాద్రి
ముంచిముంచినఁ బెనుమంచుఁదుంపురుల నణంచు నగ్రాంశుచంద్రముననుగ్ర
మూర్తియై రాముఁ డమోఘ శిలీముఖ, వ్యాపారమున వానితూపులడఁపి
నిశితబాణంబు లన్నిశిచరపతిమేనఁ, గ్రుచ్చిన నొచ్చి ఖరుండు బీరు
గీ. వోనితాల్మి నరేంద్రునిపై ననేక, పరశుపట్టిసముద్గరప్రాసముసల
శూలకరవాల పటుభిండిపాలవితతి, విసర నడుమన నఱికె యవ్వీరవరుఁడు. 176

క. కేతనము విఱిచి తురగ, వ్రాతంబులఁ గూల్చి యర్కవంశ్యుఁడు వెసఁ ద
త్సూతుఁ దునుమ విరథుండగు, నాతనికెడ సొచ్చె దూషణాఖ్యుఁడు గడిమిన్. 177

వ. అన్నకుందలకడచి కోపాటోపంబున. 178

చ. రయ మధికంబుగాఁ జని విరాధవిరోధి నెదిర్చి ఘోరదు
ర్ణయపథవర్తులైన త్రిశిరప్రముఖు ల్దగు తోడుగా మహా
భయదరణంబు సేయఁ గని పార్థివుఁ డుం గడుఁ బోరుచుండ నొ
క్కయరద మెక్కివచ్చి విశిఖంబుల ముంచె ఖరుండు రామునిన్. 179

ఉ. దూషణము ల్సెలంగ ఖరదూషణముఖ్యులు వెల్లురేఁగి య
ప్పూషవంశ్యునిం దొడరి పోరుటఁ గాంచి బలంబులెల్ల సం
తోషము నొందియుక్క మిగిఁ దోఁచినఁ గోపమునొంది రాక్షస
ద్వేషణుఁ డాతఁ డప్డు పరివేషగతుండగు భానుచాడ్పునన్. 180

వ. మండలీకృతకోదండుండై. 181

క. తుంగమద వుసొచ్చిన మాతంగవిభుని బోలి రామధరణీశ్వరుఁ డు
ప్పొంగుచుఁ జెచ్చెఱఁ దత్సేనాంగంబుల రూపుమాపి యలుక మలఁగమిన్. 182

సీ. శుష్కవంశాటవీశోభంబు గావింప, సవకోన్న వనహుతాశనునిభంగిఁ
పృథుబుభుక్షాపరిపీడితంబయి మృగవ్రజము గన్గొనిన సివంగిభంగిఁ
గన్నులఁ గప్పిన గవిసెనల్విడి గువ్వపదుపుఁ జూచిన పెనుపత్రిభంగి
సంవర్తసమయప్రజానాశమొనరింప, వర్తించు నాసమవర్తిభంగి
గీ. వెఱసి యాదైత్యకోటి నక్కఱఖరుఁడ, కాండకాండాహతులఁ ద్రుంచుచుండఁ జూడ
భానువంశవార్ధివిభుఁ గాంచి, యొక్కరొక్కఁడ దధికాగ్రహోగ్రుఁ డగుచు.

ఉ. కేవలశూలుఁడై యనఁగఁ గేలఁ గృపాణము గ్రాలఁగాఁ బృథు
గ్రీవము మీఁదికెత్తికొని కేకలు వేయుచుఁ దాఁకినం బృథు
గ్రీవుని ఫాలభాగమున శ్రీరఘురాముఁడు నించె నుజ్జ్వల
త్పావకసన్నిభంబులగు బాణములాతఁడుఁ గూలె నేలకున్. 184

గీ. ఇవ్విధమునఁ బృథుగ్రీవు నేపడంచి, యజ్ఞశత్రునిఁ బరిమార్చి యంతఁబోక
శ్యేనగామిని దునుమాడి వానితోడి, వారల ననేకదైత్యుల నీరుచేసి. 185

వ. అవష్టంభవిజృంభితుండగు రాముని సహింపక. 186

ఉ. ఎక్కడఁబోదు నాయెదుర నీవని దూషణుఁ డారఘూత్తముం
గ్రక్కునఁ దాఁకి తీక్ష్ణనిశిఖంబులు నాటిన వానినన్నిటిం
జెక్కలుసేసి రాజకులసింహుఁడు రంహుఁడు మేను వ్రచ్చి తా
నక్కఱినాత్మ విల్లునిమి ఘాతనిఁగూల్చె రథంబు మున్నుగన్. 187

క. దూషణుఁడు పడుటఁ గనుఁగొని, శేషించిన దైత్యబలము చెదరిపఱచినఁ
గ్రోధావేశంబున నద్, దోషాచరుల న్మరల్చి దుర్ధమలీలన్. 188

క. అశనినిభబాణవిద్యా, కుశలుండగు రామవిభుని గోపమున నిరం
కుశవృత్తినడచి యప్పుడు, త్రిశృంగగిరివోలెఁ దాఁకెఁ ద్రిశిరుం డంతన్. 189

వ. ఇట్లు తలపడి. 190

మ. ఖరుఁ డానందము నొందఁ భూతచయమాకర్ణింప నారాజశే
ఖరుఁ డాయాఁజని యస్మదుద్ధతి నెఱుంగన్ జాల వారాజశే
ఖరుఁ డాజి న్ననుమార్కొనన్ వెఱచు శక్యంబౌనె నీకింక మ
త్ఖరనారాచపరంపరాప్రణిహతిం గష్టంబువచ్చుం గటా. 191

వ. అనిపలికి. 192

గీ. వీఁకమెఱయఁ దాఁకి మాయ లనేకములు ఘటించి నదు లబ్ధిఁ జేరి నశించుభంగి
మాయ లాతనిఁ జేరక మాయమైనఁ, గ్రోధమానసుఁడై రక్షసాధముండు. 193

ఆ. కనలి కనకపుంఖకనదంబకంబులు, రయము మెఱయనైన రాఘవుండు
వాని నడుమఁ దునిమి వానివతుమునఁ గ్రొవ్వాఁడిశరములేయ వాఁడు గనలి. 194

క. ఈడఁబోక పెనఁగిన, వాఁడిమగఁడు రామవిభుఁడు వాలికతూపుం
గాఁడఁగ నేయ నతఁడు తూఁగాడుచు నిలఁగూలె దూషణాంతకుఁ డార్వన్. 195

వ. త్రిశిరుండు గళితశిరుండైనం గాంచి తక్కిన రక్కసిమూఁక లొక్కమొగిం జుట్టుము
ట్టుటయు. 196

క. కార్చిచ్చు పేర్చినిటికి, సార్చుల వన మేర్చుపగిది సద్దనుజులఁ బో
కార్చి యనంతరమునఁ గృప, గూర్చిన మది ఖరునిగాంచి క్రూరరహితుఁడై. 197

చ. చెలియలిముక్కు వోయె ననుసిగ్గున కోర్వనివాఁడ విప్లుత
మ్ముల తల లూడఁ గాంచితివి మోసముగుం దురహంక్రియాభిమా
నుల కిటు సైన్యహీనుని నిహం గనఁగొన్నఁ గరంబు జాలివు
ట్టె లఘుత కోర్చి యీచలము డింపుము నీ బ్రదు కేను గోరితిన్. 198

క. పలుకంగ వమ్ముఁ బలికిన, పలుకులు సెల్లింప నెట్టి ప్రాజ్ఞుఁ డైనం
దలమే చలమేటికి నీ, తలమీఁదను వచ్చెఁ జావు దప్పఁ దొలఁగినన్. 199

వ. అనినం గనలుగదుర ఖరుండు. 200

క. నిను నస్మదీయబాణ, ప్రణిహతుఁ గావింపకున్నఁ బ్రజలు ననుఖరుం
డని పిలుతురె నను బరిమార్చిన దైవము నీవె కావె సిద్ధము జగతిన్. 201

గీ. అని పెలుచనాడి నిజరథ మధికచిత్రగతులను జరింప రాము నప్రతిహత ప్ర
భావు మార్కొని ఖరుఁ డిషుప్రకరముల దిగంతరముఁ గప్పి యార్చె బ్రహ్మాండమదర

ఉ. ఆర్చిన రామచంద్రుఁడు దయామహితాత్ముఁడయ్యు వీనిఁ బో
కార్చినఁగాని కాదని దురాత్ముఁడు వైచెడుబాణకోటిఁ జ
ల్లార్చి నరాద నిన్నుఁ గని యక్కటికంబు జనించి యిట్టులా
రార్చినఁ గాన విజ్ఞుఁడు మహాత్ముల పల్కులు లెక్క సేయునే. 203

చ. అని విలుఁ ద్రుంచినం గనలి యాఖరుఁ డొండొకచాప మెత్తిన
న్మనుజవరుండు వెండి తునుమాడిన నవ్యశరాసనంబు న
ద్దనుజుఁడు దాల్ప రాముఁడు పటంపడి దానిని ద్రుంచి వానితా
ల్చిన విశిఖాసనంబు లవలీల నరేంద్రుఁడు రూపుమాపుడున్. 204

ఉ. అన్యధనుర్లాభము రయంబునఁ బూని ఖరాసురుండు రా
జన్యుని పేరురమ్మునఁ బ్రవత్కశరమ్ములు దూర్చి సిగ్గరం
దైన్యము నొందఁజేసెదను దారుణకర్ముఁడ నే నటన్న న
మ్మాన్యుఁడు రాముఁ డుగ్రతరమార్గణవారము నించె మేనునన్. 205

వ. వెండియు. 206

క. మాయావి ఖరుఁడు బహువిధ, మాయలు గావింప దైత్యమాయాఘ్నులస
త్సాయకములు నలుపు చురఘు, నాయకుఁ డాతని శరాసనంబున ఱికినన్. 207

క. మండిపడి శక్తి వైచిన, ఖండించిన రాముఁ గాంచి ఘనభయదగదా
దండము వైచి నఱికను, ద్దండుఁ డతఁ డొండువిల్లు ధరియించు నెడన్. 208

క. వెన్నెలయనఁగ వగు నతికి, వెన్నెలవగుఁ గప్పుఁ గొప్పు గేల్గవయొప్పుం
దిన్నెలఁ దేఁకడపిఱుఁదులు న, వెన్నెలఁ దక యొప్పుఁగాక యన్యల కగునే. 240

సీ. కవరాత్రులందు జక్కవలఁ బాపినయట్టు, పసిఁడికి దావిఁ గూర్చినయవసడి
పవలు వికసనముఁ దోఁచకే నీదిసంతు, చివురుల నివురంగఁ జేసినసడి
నెల నొకతీరుగా నిలువనీయనిరవ్వ, లేదూండ్ల నసటుఁ గూల్చినకొలంత
వెన్నెలఁ జుక్కల వెలుఁగనీని ఉగడా, రినుకతిన్నెల నెగయించుచరోయి

గీ. పాపికొనఁబోలు నీతికుబ్బలను మేనుఁ, గన్గవయుఁ గేలుఁదోయిఁ జొక్కుంపుమోము
బుజములును గోఁపలును నిద్దపుంబిఱుఁదులు, దనకొనగ్వఁగఁ జాలి నెత్తమ్మిమాలి.

క. శయమా పరిస్ఫుటరుచిశ్రీ, శయమా లసదలిపులాతిశయమా సుబిలే
శయమా జన్మానాభిజలా, శయమా సతికీనులేమి సరిసంశయమా. 242

వ. అని యివ్విధంబున సీతాసతిసౌందర్యంబు సంక్షేపరూపంబున. 243

క. నీచచరిత్ర యగు నా రజనీచరి తెల్పుటయుఁ దగవిని మనమలరఁగా
నాచెనఁట్రికక్కసుండా, లోచనఁ గావించెఁ బద్మలోచనఁ బట్టన్. 244

గీ. రమణిఁ దేనిట్టు లూహించి రాముఁ డలఘు, రాదులనరాదులను బట్టి కానసుక్కు
డంచె నను మాట నిజహృదయంబుఁ గలఁప, గపటమానసుఁ డగు దశకంఠుఁ డంత

క. ఏచినవిరహానలమునఁ, దోఁచక నొక్కరుఁడ వెడలి త్రోచినతాల్మి
న్నొచన నోంబుజుఁ డరుమా, రీచుం దనపూర్వమంత్రి బుధభయదకరున్. 246

వ. చూచి వనోభీష్టంబు తెలుంగు సమస్తంబు నెఱిఁగించి లోకవిద్రావణుం డగు
రావణుం డిట్లనియె. 247

ఉ. కొంచక మాయలేడి వయి గొబ్బున రాముని లక్ష్మణుం దొలం
గించుము పర్ణశాలకు నొకించుకదూరము నంతలోనఁ బె
న్వంచన రామదేవిఁ గొనివచ్చెద మెచ్చెద నీప్రతాప మ
గ్గించెద నెల్లకాలము సఖిత్వనిధీ యటు సేయు మింపునన్. 248

చ. అనవుడు దీని కియ్యకొన కడ్డపలుక్కునఁ బ్రాణగొడ్డపుం
బని యగు నీచేత నొడఁబడ్డ నరేంద్రునిదొడ్డనారసం
బునిగుడు మీఁదబడ్డ శరము న్మడిఁబడ్డశరంబు వోవునే
యని యడలెబడ్డపల్కు క్రియ నాతని కిట్లనియె న్నయంబునన్. 249

ఉ. దీపము గాంచి మిడఁగబఱతెంచి నశించినపుర్వుభంగి ను
ద్దీపితవిక్రమాఢ్యుని సతీహరణంబునఁ జావువచ్చుఁగా

దీపని రాఘువేంద్రునిపయి నమ్రత మేగుట మీలు గ్రొవ్వి దా
మేపున నేటిగట్టుపయి కెక్కినయట్లుగ దా తలంపఁగన్. 250

ఆ. చిన్ననాఁ డతండు నన్ను లుంగున నెత్తి, నూఱుయోజనములు వాఱ దవ్వ
జలధివిసరివైవ వెలలితిఁ జావక, నతనిదివ్యలీల లద్భుతములు. 251

క. శైశవమున నతఁడు ధనుః, కౌశలి కామండియును విఖండనఁ జేసెం
గౌశికునాజ్ఞ సుబాహులు, గౌశికనిర్లక్ష్యతాటక న్మరు గాఁగన్. 252

క. అని రామునిబల మెఱిఁగి ,చిన నాతఁడు విఁక కినుకఁ జెందుట మదిలోఁ
గని మారీచుఁడు శ్రీరాముని చేఁ జచ్చుటయు పరమమోక్షం బనుచున్. 253

ఉ. క్రూరుఁడు తాటకాత్మజుఁడు కోమలకైతవకృష్ణసారసా
కారత నెంతయు న్నొనబగుగం దనరె న్వెలిచుక్కచాలుచే
ధారుణిసంచరింపఁగ సుధాసిధిలాంఛనమైనయిట్టి త
చ్చారుసుధాసుబిందువిలసద్వపువొప్పఁగ వచ్చెనోయనన్. 254

క. అంగము బంగారముఁ గన్నుంగవ పృథునీలతరమణులుఁ బోడవగుస
చ్ఛృంగములుఁ గులుచవాలము,నుఁగల్గి కురంగమై మనోవేగమునన్. 255

ఉ. రాముఁడుఁ లక్ష్మణుండును ధరాసుతయుం దలిరాకుట్రింటఁ జే
తోముద మొప్ప నుండి తిదదూరమునం బరిఫుల్లమల్లికా
క్రామితగుల్మమధ్యలతికాప్తఘుభాసితపుష్పడోలికా
ప్రాయ్యనీలభౌకలితబంభరనాదము లాలకించుచున్. 256

క. ఉన్నయెడ వాయుమువ్వురు, నున్నయెడకు నేగి జిహ్వ కుద్దియగునో కా
కున్నో యని చూచుగతి నన, లన్నాలుక సాఁచి తినుచు లంఘన మొప్పన్. 257

వ. కురంగంబు కుఱంగట మెలంగుటఁ గనుఁగొని కురంగలోచనయగుసీతాంగన రాముని
కరాంగుళిఁ బట్టికొని. 258

చ. కనుఁగొను మింతచక్కని మృగంబు జనించుట యద్భుతంబు నా
మనమున దీనిఁ బెంచుటకు మక్కువ మిక్కుటమయ్యెఁ బట్టితె
మ్మనఘుఁడు దత్పరిగ్రహాసమాహితవర్తనుఁడై కడంగె రా
మనరవరేణ్యుఁ డంగనలమాటలకుం బతు లుత్సహింపరే. 259

వ. ఉత్సహించి సౌమిత్రి నాలోకించి. 260

క. ఈ వచ్చెకుసారంగము, నేవిధమున నైనఁ బట్టి యిచ్చటికు న్నే
వేవచ్చెదునంతదనుక, మీవది నెను గాచియుండుమిా నీవనుడున్. 261

చ. కపటమృగాకృతిం జనులఁ గాఱియవెట్టఁ దలంచి మానవా
ధిప దనుజాధమాధములు త్రిమ్మరుచుందురు కాననంబుల
న్వ్యపగతనీతు లావిధమువాఁడ యితం డిది మాయలేడి, కా
దిపుడు చన రఘూత్తమ మదీయవచస్సరణిం గ్రహింపుమా. 262

వ. అని పలికి వెండియు. 263

క. ఈకసుమతి నీవ సుమతి, వీవెఱుఁగని దొకటిగలుగునే మారీచుం
డీవచ్చెడు రాజీవా, బీ వచ్చెడుగు వెనువెంట నేగందగునే. 264

క. హితమతి నీగతి నతిమా, నితదివ్యజ్ఞానబోధనిధి లక్ష్మణుఁ డం
చితముగఁ దెలిపిన మాయా, వృతుఁ డా రాఘవుఁడు సర్వవిదుఁ డిట్లనియెన్. 265

క. ఇది నిక్కపుసారంగపుఁ, గొదమ యయిన వేగఁ బట్టికొని వచ్చెదఁ గా
కది మాయలేడియేనిం, బ్రదరంబుల దానియురము వ్రక్కలుసేతున్. 266

క. వదలక భక్తిమెయి న్మ్రపదసేవను గాచికొనియుండు వాతాయువుఁ దె
చ్చెదనని యుటజంబునఁ దన, ముదిత నునిచి రాఘవుం డమోఘాంబకుఁడై. 267

ఉ. ఆజిసమారసుం డనఘుఁ డంబకము ద్ధరియించి పర్ణశా
లాజిరవర్తి గాఁగఁ దనయంగము పొంగ నరేంద్రుఁ డేగ ఘో
రాజినయోనిఁ బట్టుటకు నట్టియెడం గగనంబు మూసె ఘో
రాజినయో నిశాచరులయన్వయ మీగతి మాయనోయనన్. 268

క. వడియు నదుశ్శకునములు, వెఱవక నట్లేగి పరమపురుషుఁడు గనియెం
దెఱకను మఃప్రియంబుగ, మెఱయుచు విహరించునట్టిమృగమున్ సరగన్. 269

వ. అవలోకించి. 270

క. ఇంచుకయు సద్దు సేయక, వంచనకాయంబుతోడ వసుధేశుఁడు దాఁ
బొంచి చని పట్టఁబోఁ గుప్పించియెగసి మాయలేడి బెదరినకరణిన్. 271

చ. ముఖ మెగయించిచూచుఁ దృణముం దగమూర్కొను మస్తకంబు గోఁ
కు ఖురపుటంబులం బ్వ్యథునిరుంజముల న్వడిఁ దూఱి డాఁగు నా
మఖ న మొప్పఁజేయుఁ బలుగొమ్మల నిట్టటుఁ గొట్టుఁ బొట్టిత్రోఁ
క ఖురకరాగ్రయుండు సరగం దనుఁబట్టఁదలంచి వెంబడిన్. 272

చ. రవికులవార్ధిచంద్రుఁడు కురంగముఁబట్టఁగ నెద్దియన్ననో
జవమునఁ బుట్టలుం బొదలు జంగునఁ దాఁటుచుఁ బాఱు లేడియుం
దవిలి దూప వృతుసవిశంబుల రాముఁడు దేరనిల్చినం
జవమతిఁట్లు నాలుకను సాఁచి వగర్చుచు నిల్చి నిట్టియున్. 273

క. సారంగధరుఁడు మున్నీతు, సారంగము వెనుదవిలినచందంబున నా
సారంగసదృశదృష్టుఁ, సారంగము వెనుక రామచంద్రుఁ డరుగుచున్. 274

చ. శిరమున మేనునన్ నలుచిక్కఁగఁ జేర్చికొను న్లతాగ్రహం
తిరములఁ బొంచి పొంచినను దారికి నడ్డముపోయి దట్టపుం
దరువులమాటునన్ నిలుచుఁ దత్పరతం దృణముష్టిఁ జూపు భూ
వరకులనాథుఁ డాహరిణసర్యయుఁ జట్టునపాయశాలియై. 275

వ. అత్యవసరంబునన్. 276

గీ. తృణము గఱచుట వంచలదృష్టి గనుట, భయము నొందుట వెన్నిచ్చి పాఱుటయును
జూడఁగా నప్పు డమ్మాయలేడి సమర,భూరమున కోడి పాఱెడిపందవోలె. 277

వ. మఱియును. 278

సీ. దాఁటుచోఁ బూర్వపాదద్వంద్వ మొక్కెడఁ, గదియించు టుంజలిక్రమముగాఁగ
లలిఁబాఱుచో ఖురంబులు నెఱియలఁ బడి, మ్రొగ్గుట యొప్పగు మ్రొక్కుగాఁగ
నురుతరక్రమమున నుఱుగక వెడలు నిద్రాఘోషకంబు పాద్యంబుగాఁగ
దిశ నెడ రాలిన తృణలేశ మతిపవిత్ర మ్మగు దర్భాసనమ్ముగాఁగ

గీ. జేరి యెదురేగు టాత్మోపహారముగను, రాము నొప్పించె మాయాకురంగ మపుడు
పరమపురుషుఁడు హరిసమర్పణముగఁ, ముక్తిఁ గోరి యొసంగెడు మునియుఁబోలె.

వ. వెండియు నక్కురంగశాబకంబు ఖగంబులనక నగంబులనక రయంబునం బాఱుచు మా
యావిగాన రామునిపై శరక్రాకర్షంబుఁ గురిసెడు దానిం బోలె జరమఖురపుటా
గ్రంబుల ధరణీపరాగంబు మీటుచు రాత్రించరశక్తియం బగు నుల్కాపాతంబునుం
బోలె మింటికెగసిపడుచు మృత్యుముఖగహ్వరంబునుం జొరంబాఱుకరణి గుహా
ముఖంబులం దూఱుచు ప్రాణాత్యయావసరంబునం బోలె భ్రమించుచుఁ బూరుషుని
సంపదయుంబోలెఁ దనంత దోఁచి యదృశ్యం బగుచు దరిద్రునిం బోలె దీనాన
నంబుఁ జూపుచు సమీరంబుపగిది నలక్షితవేగంబై గరుడనిభంబునఁ గర్వరాం
గభాసురంబై యాపురుషునికడువునం కుటిలమార్గగామియై నరకంబున కోర్వనిదా
నిం బోలె నసిపత్రవనంబులకుఁ దోలంగుచు ఘోరదుర్గమారణ్యమార్గంబున బహుదూ
రంబుగా నెలయించికొని చనుటయు రాఘవుండు నిజాంతర్గతంబునన్. 280

క. తమ్ముఁ డిదిమాయలేడి మ్మనుమ్మనన నమ్మఁదగ దన వినకవచ్చితి మో
సమ్మయ్యె దీని నగ్రజ,గమ్మనఁ గూల్తు నని భయదరంహస్తుఁడై. 281

ఉ. తూణములోనిబాణ మతితూర్ణముగాఁ గొని నారిఁగూర్చి య
క్షీణమదంబున న్నృపతిసింహుఁడు రాముఁడు తూఱనేసె ని

స్త్రాణము దుర్విషాణము విరాజితశోణము సత్కృపాలయా
ఘ్రాణము ఘోసఖాణ మఘకర్మధురీణముఁ గైతవైణమున్. 282

వ. తచ్ఛరం బురంబు నాటుటయు. 283

చ. స్మయరహితుండు నిర్దళితసత్త్వుఁడు నైతన తోంటిరూపు వి
స్మయముగఁ దాల్చి రాక్షసుఁడు చచ్చె నెడ న్వెస లక్ష్మణా హతో
స్మి యనుచుఁ బేరెలుంగున వచించి ముఖంబున నెత్తుఁ గ్రొల్క న
వ్యయుఁ డగురాముబాణహతి నాతఁడు ప్రాణము వీడె ధన్యుఁడై. 284

క. ఇవ్విధమున మారీచుని, క్రొవ్వు చెఱచి యుల్కుచును రఘుప్రవరుఁడు పెం
దవ్వరుదెంచితి నని వెస, నవ్వనముం బాసి వచ్చె నంతటిలోనన్. 285

మ. అనుజా లక్ష్మణ చేరరావె యనుదీనాలాప ఘోరాముఁ డా
డిక చందంబునఁ దాటకాత్మజుఁడు నూటింబల్కు టాలించి హా
యని ధాత్రీసుత వెచ్చనూర్చి పెనదైన్యం బాకృతిం దాల్చి నో
యన సౌమిత్రిముఖంబుఁ గాంచి యిటు రమ్మా యంచు భీతాత్మయై 286

క. ఓయన్న సుమిత్రాసుత, మాయన్న వనంబులోన మిగిలి నవగ రా
వో యన్నఁ బలుక వేమిట్రి, కో యెన్నఁడు లేనిభీతిఁ గూరె మనంబున్. 287

గీ. అసురవరులును సురలుఁ దన్నాఁగి రెవ్వి, భయముఁ జెందనిశూరుఁ డిప్పగిదిఁ దమ్మఁ
డా యనుచుఁ జేఁ బిల్చెను డాయఁబోఁగ, దయ్య తడవేలనయ్య ప్రణ్యముగ దయ్య.

ఉ. అంజలిసేతు రాముని రయంబున నిప్పుడ కూడఁబోయి నా
సెంజెలి దీర్పుమంచు ధరణీసుత వేఁడిన లక్ష్మణుండు బ
ద్ధాంజలియై తదీయచరణంబుల మస్తము మోపి యేల భీ
తిం జలనంబు నొందఁగ సతీమకుటంకుమసూల్లసత్పదా. 289

క. లలన పదునాల్గుభువన, మ్ములభారము మీఁదఁబడిన మోయవలఁతి త
ద్బల మీవు నే నెఱుంగమె, చలింపవల దింక రామచంద్రునికొఱకున్. 290

క. క్రించుఁదనంబున రాముని, వంచింపం బెట్టేఁగి దనుజవంశాధము లూ
హించి వెడమాయలను ప్రచ,రించి చెడుదు రగ్గిఁబడిన క్రిములవడువునన్. 291

వ. అనిపలికి మఱియును మదగ్రజుండు హరిణపరిగ్రహార్థం బరుగునవసరంబున. 292

క. వదలక భక్తిమెయి న్నీ, వదినెను గాచికొనియుండు వాతాయువుఁ బ
ట్టైద ననియరిగెం జెప్పుచుఁ, దదీయవచనంబు లెట్లు దాఁటుదుఁ జెప్రమా. 293

చ. అనవుడు రామచంద్రుఁడు మహాపద నొంది సహోదరా రయ
మ్మునఁ జనుదెమ్మటంచుఁ గడుఁ బొక్కుచుఁ జీరిన నంచుఁబోక న

న్నను చితమార్గవర్తన దయాపరిహీనమనస్కుఁ గాంచియు
న్నను ఫలమేమి యన్నను వెసం గనిఁ బోవఁగదన్న ముక్కుఁడన్. 294

క. అనుటయు నధోముఖుండును, ఘనచింతాక్రాంతుఁడును విగళితాశ్రుఁడు ద
త్తనిరుత్తరుండు నగు నా,తని గన్గొని సీత క్రోధతామ్రాస్యయై. 295

మ. ఇదె మీ యన్న మహార్తుఁడై పిలిచెఁ బోమీ యన్నఁ బో వేమి నీ
మదినూహింపఁ దలో కాక కాన నొగుల న్మాత్మలోడ నేతేరఁ బూ
ర్ణదయామూర్తివె యంచు నిష్ఠురము లన్యాయంబుగా లక్ష్మణు
న్సతీరత్నము దూఱెనాడె సదసద్వ్యాపార దుఃఖితల్. 296

వ. ఇట్లాడి దుఃఖాతిరేకంబున. 297

క. నాచిత్తము నిను బోఁటులకు, గోచరమే యన్న చావుఁ గోరి నను మది
న్వేచితివగు టిప్పుడెఱిఁగితి, నీచ సుమిత్రాసుత దురాత్మ నిహతవివేకా. 298

క. వాటుం బగునస్మదుటజ, వాటము కడ నిలువ నీకు వల దనవుకు న
మ్మాటలు తనహృదయంబున, కీఁటెలపోటులయి నాట నిట్లని పలికెన్. 299

ఉ. ఆరఘురాముఁ డార్తివడఁ డక్కట యివ్విధి నుగ్రగాత్రుల
క్రూరము నిన్నుఁ బాసి చనఁగూడదు నాకని యొత్తిచెప్పని
ష్ఠూరణ నిష్ఠురోక్తుల నఘుం బనిమాడఁ బలికె డిట్లు నీ
వారయ నన్న మత్సహృదయస్థితి రాముఁ డెఱుంగకుండునే 300

క. అని పలికి రామచంద్రుఁడు, చనినపథముఁ బట్టి చనియె సౌమిత్రియు నొ
ప్పనివ్యాపదయంబున రావణుఁ, డనుకూలంబైనసమయ మని ముదమొందవన్. 3 1

క. అన్యాయుఁడు ఖలుఁడు విఫలి,తాన్యాయుఁడు ఘోరరూపుఁ డంతట మాయా
సన్న్యాసి యయ్యె నారా,జన్యునిసతిఁ బట్టు దుర్విచారముతోడన్. 302

గీ. ఇట్లు కర్మందియై తనువెల్లఁ బూది, పూఁతఁ దనరార నొకజలపూర్ణకలశ
మమరఁ ధరియించి హరహరా యనుచు వచ్చి, పర్ణశాలకుఁ గడుసమీపమున నిలిచి.

క. దేహీభవుఁడు దాఁతఁడు వై,దేహీ భరితమదవయఁ గాంచి దేవి భిక్షాం
దేహి యనుడు జానకి సం,దేహింపక యెదురువోయి ధృతిదక్కెత్తన్. 304

వ. అర్ఘ్యపాద్యంబు లొసంగి నిర్భీతయై యిట్లనియె. 305

ఉ. ఇంచుక విశ్రమింపుము యతీశ్వర మత్పతి వచ్చి మిమ్ముఁ బూ
జించు నతండు పోన్నొడలి జింక తటాలున నింపువచ్చిన
రించిన దానిఁ బట్టికొని తెమ్మని వేఁడుకమీఱ నేను ప్రా
ర్థించినఁ దన్నిమిత్తమున దివ్యధనుర్ధరుఁడై సహోదరున్. 306

క. పుత్రసహాయ సుమిత్రా,పుత్రక సహాయ సుగుణభూషణ ఘన స
న్మిత్రాణపరాయణుఁడై, ధాత్రీపతి కాఁపు వెట్టె దానిపిఋుఁ దకన్. 307

గీ. అరిగి తడవయ్యె హా లక్ష్మణా యటంచు, దైన్యమునఁ జీర నాతనితమ్ముఁ డతఁడు
సతినిఁ గనంబోయె నల్కుచు నడవి నొంటి, నున్న దానఁ బరివ్రాజకోత్తముండు.

వ అని చెప్పి. 309

క. కుశలంబె వసుధ నేలిన దశరథుకోడలను రామధరణిపు భార్యన్
దశదిశల న్విశదం బగు,యశమునఁ జెన్నొందుజనకు నాత్మజ ననినన్. 310

క. అతివా నీ నామచరిత్ర,ప్రతివాక్యంబులకు నాదుహృదయము వలరె నీ
గతి వానల నెండల నీ,యతివామాంగంబు వసటు కాపన యయ్యెన్. 311

చ నెలఁ బురుడించు మోము మహనీయతరం బగుచున్న దోయి వె
న్నెలవడ దాఁకు దేహము నణీయసరం బగుమధ్యభాగముం
గలుగఁగఁ జేసి భాగ్యనిధి కాంత నొనర్పక నిన్నుఁ బేదకు
న్నెలఁతగఁ జేసె నేరనిగ నేర్తు విధాత్రుఁడు దుర్విదగ్ధుఁడై. 312

క. నవనీరజగంధివి కదా, నవని రజోగంధి వగుట యన్యాయము దే
వవిలాసినీకదంబము, నవధీరణఁ జేయఁజాలునందము గలుగన్. 313

గీ. అని మఱియు దుర్గాత్ముఁ డయ్యవనిజాత, వర్ణనముఁ జేసి నీదుసౌందర్యమునకు
సర్వభువనంబు లేలెడుసార్వభౌము,పత్ని వగు టెంతయును లెస్స పద్మగంధి. 314

చ. అనుటయు వానిఁ గాంచి వినయం బొకయించుక లేక సీత న
న్నుచితరీతి నీతి విడి యాడెదు దుష్టనికృష్టపద్ధతిన్
మనమున నన్గలాంగనలు మానక సన్నుతి సేతు రిట్లు వ
చ్చునె బరికించిచూడఁ బరిశుద్ధులనోట నశుద్ధవాక్యముల్. 315

క. నానాథు శౌర్య మెఱిఁగిత,నా నాథుని శౌర్య మీవనాథుని గా హీ
నా నాతోఁ బల్కెదు తగు,నా నానాలోకవాళనముఁ గోరి కటా. 316

క. పితృవాక్యతిఁ బురముఁ దృణ,ప్రతిమానముఁ గాఁ దలంచి భరతుఁదఘనవన
స్థితి కోర్చెఁ గాక లోక,త్రితయము నేలంగ వలఁతి దృఢభుజశక్తిన్. 317

వ. అనిన నయ్యతివ్యాజపరివ్రాజకుం డయ్యవనిజ కిట్లనియె. 318

క. నిన్నను నీనాథుం గదా, నెన్నికొనెదు గాని నిర్జరేశ్వరుఁ జెఱసా
ల న్నిలిపి రాక్షసులచే, సన్నుతిఁ గనినట్టి నన్నుఁ జర్చింప వయో. 319

ఉ. నీ విటు విన్మ సీత నుహనీయుఁడు తాత పులస్త్యుఁ డప్ప వి
శ్వావసుఁ డన్న యక్షపతి వానిజయించి తదీయపుష్పక

శ్రీవిభవంబు లెల్లఁ గొని జీవముతోడుతఁ బోవనిచ్చితి
రావణనాయకుఁడవై భయదరాక్షసనాథుఁడ లంక నేలుదువై. 320

క. లోకములెల్ల జయించిన, లోకభయదవిక్రముఁడఁ దలోదరి భవనా
లోకమ్ములఁ జిక్కితి నను, గైకొను మిష్టోపభోగగతి వడయుదువై. 321

వ. అని వెండియు. 322

ఉ. ప్రాయముకల్మి నింపెసఁగి రాక్షసనాథుఁడనైన నాకు భి
ప్రాయముఁ దీర్పుమా యనుచు రావణుఁ డాడిన నాఖలుం దృణ
ప్రాయముగాఁగఁ జూచి నృపభామిని జానకి వల్కె ధర్మవి
ప్రాయముఁ జూడ నీవు మదిఁ బట్టెనె నెమ్మనినుండఁ గీర్తికై. 323

ఉ. సారపుబ్రహ్మవంశమున జన్మము నొందితివంట్రి నీవు గా
చారపుమాట లాడుట యసంగత మేను పతివ్రతనై వృథా
నీరయిపోఁ దలంచితివి నిశ్చయ మింతకు నిన్ను నాతత
క్రూరము లాఘవోత్తమనిరోపము లిప్పుడు రూపుమాపవే. 324

గీ. రామలక్ష్మణు లిద్దోట లేమి వెఱిఁగి, వచ్చుటన తెల్లమయ్యె నీవారి విజిత
విక్రమము నీమనసత్కీర్తి విశదమయ్యె, నన్ను నున్న జయించితి నన్న విన్న. 325

క. చెడుగ చెడుకాలమైనన్, వెడఁగుమనుగు లాడె దిట్టు వేయేటికి నీ
వెడఁగలిగిపొమ్ము నృపుఁడే, మ్యోడసం జనదేక మున్న యెయ్యెడకైనన్. 326

చ. అనవుడు నంగజాతశరానలతాపవిభిన్నచిత్తుఁ డ
వ్వనజదళాక్షి వేగమ భవద్వచనామృతవృష్టిఁ దేల్పకు
న్నను మరణంబు నీకతన నాకగు నిశ్చయ మంత నన్నుఁ బో
లిన మగవార లెవ్వరును లేమిఁ గాంతలు వంత నొందఁగన్ 327

క. గోభూభుజగజస్థిత,భూభృత్పుచ్ఛెల్ల వలసి పొందుదురు నినున్
గోభూభూసద్రోహుండ, నీభాగ్యము గాదె పొలఁతి నిన్నుఁ దలచితిన్. 328

ఉ. ఎక్కడి నాముఁ డింక నతఁ డిక్కడ కెక్కడవచ్చుఁ గానలో
నెక్కడవోయెనో యనుజుఁ డెక్కడవోయెనొ రాక్షసాలి చే
నెక్కడఁ ద్రుంచెనో మృగము లెక్కడఁ ద్రుంచెనొ వానిమీఁద నీ
కెక్కడిప్రేమ రమ్మ నన మేలుద మిద్దఱము న్రయంబునన్. 329

సీ. అప్సరోవనితల నవధీరణము సేయు, రాక్షసాంగనలు పరిరతు లొసంగఁ
గ్రీడాభవనకుడ్యకీలితవిమలని,శ్చలదీప్తిమణిదీపికలు వెలుంగ

ఘనశైత్యకారకఘనసారమిశ్రిత, పృథులచందనచర్చ హృదయ మలర
నత్యంతవివిధమనోహ్లాదకల్పిత, పరిమళాగరుసుధూపములు మలయ
గీ. మెచ్చి బలమున నేఁ జెఱదెచ్చినట్టి, ఖచరకాంతలు తగునూడిగములు సేయ
బాల కైలాసమును శమీపత్రముగను, జేసి యాదేవుదశకంఠుఁ జేరఁదగదె. 330
వ. అనిపలికి యాక్షణంబ. 331
కం. శశధరఖగఖబర్హిర్ముఖ, శతసహస్రేక్షణుల బందెసాలల నిడు న
ద్భుతవీక్షింపు మనుము విం, శతికరములు దశశిరములు సమబాహ్వాకృతియుఙ్. 332
గీ. మెఱయు నూడలు గలమత్తితెఱఁగుఁ దోఁప, నెదురనిల్చిన జానకి హృదయ మదర
శమిసేయుచు నిటకు మాయామృగం బ, దేల చనుదెంచెఁ బొమ్మంటి నేల విభుని.
వ. అని తలంచి నిగుడుభయాతిరేకంబున. 334
కం. ధరణీసుత ధర్షణింబడి, పరమం బగుమూర్ఛ మునుఁగఁ బట్టుకొని నిజే
ద్ధరథంబున నిడికొని సుస్వరుఁడై రావణుఁడు పోవఁ దదవసరమునఙ్. 335
ఉ. ఇంచుక తేఱిమూర్ఛ మొగమెత్తి దిశల్ పరికించి తన్ను నొ
క్కించుకభీతి లేక కొనియేగెడు దానవనాయకుం బ్రతీ
క్షించి కరంబు బెగ్గడిలి చిత్తము తత్తఱ మంద సీత దుః
ఖించెఁ దదీయశోక మెఱిఁగింపఁగ బ్రహ్మకునైనఁ దీఱునే. 336
వ. దుఃఖించుచుఁ దనమనంబున. 337
కం. పుణ్యమతి మఱఁదిమాటలు, గణ్యములు గణింపనైతిఁ గల్గునె ఘోరా
రణ్యమున నింక నాకు శ, రణ్యమనుచుఁ జింతమిగుల రాముఁ దలఁచుచుఙ్. 338
కం. క్రోధాత్ముండై తొల్లివి, రాధుం డెత్తికొనిపోవ రక్షించితి త
ద్బాధయుడిపి యిప్పుడు రఘు, నాథ వెస న్రావిదేమి నను జెఱఁ దలఁగఙ్. 339
ఉ. వే యనుజన్ముఁ గూడి రఘువీర దురాత్మకు వీనిఁ ద్రుంపరా
వే యను లక్ష్మణాకమ వివేకవిహీనత నిన్నుఁ గొన్నియ
న్యాయము లాడి తత్ఫలము నందితి నిప్పుడ యన్నఁ దోడితే
వే యను వీనిఁబట్టి పడవేయగ వేయననేల మ్రొక్కెదఙ్. 340
కం. రావణుఁడు నన్నుఁ జెఱఁగొని, పోవుచునున్నాఁడు వీనిఁ బోకార్చి నను
గావఁగ నియ్యెడ రఘువర, వేవచ్చినఁగాక కీర్తివికలత గాదే. 341
వ. అని మఱియు ననేకవిధంబులం బలవించుచు. 342
చ. ఎక్కడఁజొత్తు నేదితెరు వెవ్వరిది క్కిఁక నేమిబుద్ధి న
న్నిక్కడినాత్ముఁ డెత్తికొని యేగెడు నిప్పుడ దుట్టుముట్టి మ

త్రెక్కి నవీనికంఠముల నెంతయు మేదినిఁ గూలఁ దాఁచి నక్
జక్కఁగఁ బ్రోవరయ్య సురసాధ్యవియచ్చరకిన్నరోత్తముల్. 343

క. పరమపతివ్రతసీత, న్నరగుణఁ గొనిపోక రాక్షసాధముని వీనిం
దెరువున నాఁగరు మీరుం, దరుగుల్మలతాదులార దయలేమిఁ గటా. 344

సీ. దనుజుండు నన్నుఁ బట్టి వినువీధిఁ గొనిపోవఁ, గానరా పదియేమి గంధవాహ
వాసవు నాఁగి నింతయు నర్పుఁ డనివేఁడ, మాటలాడ రిదేమి మౌనులార
యరసి రక్షింపుమా యమ్మ యనుచుఁ బిల్వ, కను యిట్టు తగునె వసుమతి నీకుఁ
గనలి యాతనిశిరఃకాంతార మేర్పక, తరులఁ దాఁగెద వేమి దావవహ్ని

గీ. కరుణ నన్నుఁ గాచుటకు నిజకాండములను, రావణుని బట్టి ముంచు గోదావరి యాన
వడిగఁ బారెడు పదియేమి జడత నొందె, యనుచుఁ బలవించు నలుదిక్కు లాలకించు.

క. అవనిజ యిట్లు పొగిలెడు, నవసరమున సంచలించె నగములు దా
మవనీజము లగుటఁ దలఁప, నవని న్పహాజకుణ మెట్టులెడ విడుచు నే. 346

వ. అయ్యవసరంబున. 347

మ. మనయాకారముఁ దాల్చి రాఘవుల నర్మ్మరీమఁ డావంచనం
గొనిపోవక్ దనుజాధముం డిచట నీక్షోణీసుతం బట్టె నే
మని యానిందఁ దొలంగఁ ద్రోతు మిఁక నాహా చచ్చినం గాని పో
దనియో లేశలు జేరెనుం గురవకాంతంబుల్ దవాగ్నిభ్రమన్. 348

గీ. ధరణిజాక్రందనోద్గతధ్వానఘూర్ణమాన కానన మృగపక్షిమండలంబు
పఱచు నెంతయుఁ దవరారెఁ బత్రికలను, మాయ శ్రీరామునకుఁ దెల్పనో యనంగ.

సీ. కన్ను లెఱ్ఱఁగఁ జేసెఁ గలకంఠబృందంబు, బుసకొట్టుచును ఫణుల్ వ్రేసముఁ జిలికెఁ
గటము లదర నిల్చె గంధసింధురములు, ప్లవగజాలంబులు పండ్లు గొఱికె
మొగములు జేవుఱించెఁ గ శుకంబులు గూసె, నోలిఁ గపోతము ల్హుంకరించె
ఘూకము ల్గిఱగిఱఁ గ్రుడ్లు ద్రిప్పఁగఁ జొచ్చెఁ, గేకిసంఘంబులు కేక లిడియె

గీ. నఖిలభూతహితుం డగు నట్టి రాము, వనిత బలవంతమునఁ జెఱ పట్టి గగన
వీథి వడిఁ గొనిపోయెడు వేళ దుష్ట, దనుజుఁ గన్గొని కినుకఁ జెందిన విధంగ. 350

వ. అంత నజ్జనకనందన. 351

ఉ. ఏ మిథిలాధినాథసుత నిర్దయుఁ డగు రాము భార్యఁ బొం
డోమునులార యక్షవిహగోత్తములార ఫణీంద్రులార వే
నామొఱ యాలకించి కులనాథున కీగతల న్వహించి పో
రే మహనీయులార మదధీశునకున్ మిమ్ముఁ గరంబు మెచ్చఁగన్. 352

క. అని ఘోరగృధ్ర మురువడిఁ, గొనిపోయెడుసర్వవనితకు న్నమ మగుచున్
జనకజ యేడ్చుటయుం దద్ధ్వని విని కరుణారసప్రధానుం డగుచున్. 353

క. నాకపతికి వెఱవక మై, నాకము రావణు నెదుర్ప నలిరేఁగుచుఁ దా
నాకడలి వెడలి కడువడి, నాకపథంబునను వచ్చె నని సుర లెంచన్. 354

ఉ. పాతితశాత్రవుండు నురుపక్షబలుండు జటాయు వల్లసం
పాతిసహోదరుండు నృపభామిని శోకము సత్వరానుకం
పాతిశయంబునన్ విని మహాబలు రావణు నాఁగె మున్న శం
పాతతదేహదీప్తిఁ గులపాంసను దృష్టిపథంబు నాఁగఁగన్. 355

వ. అమ్మహాబలుం డడ్డుపడి 356

క. కంఠీరవమధ్యను దశ, కంఠ విడువవేని నీదుకంఠములు మహో
త్కంఠతఁ దునిమి సమవర్త్యుప, కంఠమునకు ననుతు గరళకంఠు నెయిదిన్. 357

క. అనవ్రదు నతఁ డాతని కి, ట్లనుఁ బులుఁగా నన్ను గెలువనగునే నిన్నె
ట్లును జంపు దేటివగ నీ, కను నచుఁ దలపడిరఁ బోరు ఘోరం బయ్యెన్. 358

చ. ఖగదనుజాన్వయోత్తము లప్రతిమానులు కామరూపు ల
త్యగణితసత్త్వ లూర్జితజయాన్వయు లాశుగవేదు లుగ్రప
న్నగమనజాశనుల్ మిథిలనాథసుతాప్రియతాపకారకుల్
దగినఖరాస్త్రసాధనలు దార్కొని వీఁక జటాయురావణుల్. 359

వ. ఒండొరుల నఖవిశిఖంబుల వ్రేటులాడుసమయంబున. 360

గీ. అక్షిగతుఁ డగురాక్షసాధ్యక్షుఁ డుగ్ర, పక్షినాథునఖక్షతవక్షుఁ డయ్యె
నాక్షణంబున రాక్షసాధ్యక్షుచేతఁ, బక్షినాథుండును విశీర్ణపక్షుఁ డయ్యె 361

ఉ. నొచ్చియు నీడఁబోవక వనోద్ధృతి రావణుఁ గాంచి వంచనం
దెచ్చితి రాఘవేంద్రసతిన్ మగపంతము గాదు నీకుఁ బా
టచ్చగవృత్తి గాని యిఁక దక్కులు సెల్లవు మన్నఖాహతిం
జచ్చిన మేలు నీ కనుచు సాహసవృత్తిఁ గడంగి యాతనిన్. 362

గీ. వదనములు చీలఁ గంఠముల్ చిదుమఁ గోరు, సెనసి వడిఁ బోరు నభమున కెగసిపాటుఁ
గ్రమ్మఱను జేరుఁ జాల్కొఁ గాంచి వగలఁ, గూరుఁ బలుమారు మీఱు నూరుసుతుండు.

వ. మఱియు నద్దండుఁ డద్దయు నద్దులేనికడిమిం గ్రద్దరించుచు గ్రద్దతోడఁ బెద్దయుం
బ్రొద్దు ప్రొద్దుకొలఁది సావియుద్ధియయలర నద్దనుజుం దాఁకి పోరి పోరి పెద్దవాఁడు
గావున. 364

క. పక్షములు దనుజకరవాలక్షతులం దెగుడుఁ గడఁక జలంబటి పడియెం
బక్షిశ్రేష్ఠుఁడు పవిభగ్నక్షోణీభృచ్ఛిఖరమునకరణిన్ ధరణిన్. 365

క. సీతం గైకొని నభమునఁ, బాతకుఁ డగురక్కసుండు పఱచెడునని దుః
ఖాతిశయంబున వ్రాలిన, రీతిం గూలుటయు నతివ ప్రిదిలినతాల్మిన్. 366

వ. కంఠగతప్రాణవాయు వగుజటాయువు నుద్దేశించి. 367

చ. అసురవిరోధి ద్రుంచి నను నారసి ప్రోవఁదలంచి భీమవా
సమర మొనర్చి వైరిశితసాయకభగ్నగరుద్వయుండ వై
శ్రమమున నివ్విధంబున ధరంబడఁ జూడఁగనైతి నీవుఁ బు
ణ్యమునకుఁ బోవఁ బాప మెదు రయ్యెఁగదయ్య ఖగప్రభూత్తమా. 368

గీ. అసురవరుఁడును ఖలుఁడు నన్యాయపరుఁ డధముఁ, డైన రావణునకు జయ మమరనోపఁగ
పరమపుణ్యాత్ము నిన్నిట్లు పడఁగఁ జేసె, ధాత నీయెడఁ గడుఁ బక్షపాతి యగుచు

వ. అని మఱియు నన్యశరణ్య యగు నవనీకన్య తనమనంబున. 370

చ. అరయఁ బరోపకారపరుఁ డైయితఁ డీగ్గె బుణ్యలోకసు
స్థిరుఁ డగుఁగాక యంచు వగఁ జెందుధరాసుతఁ గొంచు రావణుం
డరిగె నరిత్సరోవనమహావనపావనయోగిశాశ్రమో
త్కరగళబరాలయాదులను దాఁటుచు లోకభయంకరాకృతిన్. 371

క. తటతట వ్రాదయా మదర నం,తట జనకజ యొక్కశైలతటమునఁ గనియెం
దిటముగ విహరించెడుమ,ర్కటవర్యుల నివ్విధమునఁ గాంచి వెనుకగన్. 372

క. పార్థివునకు వార్తాకథ,నార్థం బర్థం బొసంగి యగచరులను సం
ప్రార్థన సేసెడుగతి వస్త్రార్థంబున నగలు ముడిచి యవనిన్ విడిచెన్. 373

గీ. ఎట్టకాలంబునకుఁ బుట్టినింటి కేగు, తాను మునుగొన్నసొమ్ములఁ దగఁగనెరవు
దీర్చుగతి నొప్పె రాఘవుదేవి సుమణి,ఖచితభూషణములు రత్నగర్భ నిడిన. 374

క. నగమున నివ్విధమునఁ దన,నగలు మిగులఁ బైటచెఱఁగునను ముడిచి వడి
న్నగచరులయొద్ద విడువగ,నగన యనుచు మొఱయుచును ఘనధ్వనిఁ బడియెన్. 375

వ. ఇవ్విధంబున నాక్రాంతప్రస్తయు సంతప్తయు నగుజానకీపరిక్షిప్తప్తకాంచనమయ
భూషణంబుల నయ్యగచరశ్రేష్ఠం డగుసప్తాశ్వనందనుం డాప్తులం బనిచి సుగుప్తం
బుఁ గావించె నంత. 376

సీ. మానినీఘనశిరోమణిఁ గాక రత్నక,లాపకలాపము ల్భాపతితముఁ
గావించి హా నాథ కావరావే యంచు, దిగు లొందుజానకివగపుఁ గాంచి

కనలి లోనుదుఃఖముఁ గలఁగుచునకూపార,తీరంబుఁ జేరి యత్రిదశవైరి
మాయావిహారి దుర్మార్గుండగు రావణుఁడు, దంభ సన్మార్గుఁడై యుద్భటతఁ తి

గీ. వంశవంశాటవికిఁ దెచ్చువహ్ని యనఁగ, జలధి గని భీతినొందురసాతనూజ
సీత నకలంకఁ గొని కడు శీఘ్రముగను, లంక సకలంకఁ జేరె నిశ్శంకుఁ డగుచు. 377

వ. లంకకుం జని జనకనందనం దనయుపవనాశోకవనమధ్యంబునం బదిలపఱిచి యద్దుష్టుం డిచ్చో ధరణీపరాగపరిచ్ఛన్నశరీర వై నవయ నేల మదీయాంతఃపురప్రవేశంబుఁ గావించి కామోపభోగంబులం బొందు మనుటయు జగన్మాత యగుసీత యిట్లనియె. 378

మ. గతితప్పన్ రవి సంచరించినను లోకాలోక మూటాడినం
గతి శ్రీరాముఁడె నాకు సాధ్విని జగత్కల్యాణ నే నన్యసం
గతి కాసింతునె హంసి కాకము నెనం గామించునే ఘోరదు
ర్గతిపాలై చెడ నిట్టులాడెదు నినుం గాలంబు చేరం గరా. 379

వ. అనుటయు. 380

క. కను లెఱ్ఱవార మిగులం, గనలుచు రావణుఁడు వలుకఁ గఠినత దనుజాం
గనలార వేచియుండుం, డని జానకిఁ జూపి చనియె నంతట నిచటన్. 381

క. ఒకమృగముఁ జంపి నిజకా,ర్ముకాగ్రమునఁ దగఁదగిల్చి మోదమ్మునఁ బ
ర్ణకుటీరమునకు వచ్చెడు, నకుటిలుఁ దారాముఁ డెదుర ననుజుం గనియెన్. 382

చ. కనుఁగొని గుండె జల్లుమనఁగా శుభగాననఁ గానలోన సీ
త నొకత డించివచ్చితికదా మదదానవదానవత్కరిం
ద్రనిబిడ మియ్యరణ్య మిటు రానవురా దవురా పదద్వయం
బనయము సంచలించెను సుమా లసమానసమానసస్థితీ. 383

ఉ. ఈమృగశాబముం జనకజేచ్ఛకునై తగఁ బట్టితెత్తు మా
యామృగమేనిఁ గూలిచి రయంబున నిష్వడ వత్తుఁ గానలో
నీమృగనేత్ర నేమరకు మీ వని యెంతయు నొత్తిచెప్ప నా
నామృగసంకులం బగువనంబున నొక్కతె డించి వత్తురే. 384

వ. అదియునుంగాక. 385

చ. విను మిది మాయలేడి వెనువెంటఁ జనన్వల దంచుఁ దొల్లి నీ
వనుపమబుద్ధివై తెలియ నాడితి విప్పు డరణ్యభూమి సీ
త నొకత డించివచ్చితి పదంపడి రాక్షసబాధ నొందునో
యని కలపోయవైతి వకటా వికటంబు బుధాత్రప్పునన్. 386

వ. అనిన విని యుల్కిపడి సవినయంబుగా లక్ష్మణుం డన్న కిట్లనియె. 387

క. నీ వాడినచందంబున, నావారిజనేత్ర సీత నారసి యుండ
న్నీ వాడినచందంబున, రావే లక్ష్మణ యటంచు రాక్షసుఁ డనినన్. 388

ఉ. సారసనేత్ర నన్నుఁ గని చయ్యన నిన్నుఁ బొమ్మటంచు వి
స్తారకుగార్తయై పలుక సమ్మతి నయ్యసుతోఁ త రాముఁడే
వారికి లోను గాఁ డని భవన్నిజ క్రమ మే నెఱిఁగి నీ
ప్రాణము నుంచఁ దెల్పిన మహోగ్రదవానలతీక్ష్ణనేత్రయై. 389

క. వినరానిమాట లాడినఁ, జనుదెంచితి వాఁడఁ దప్పు సైఁపు మనుడు మ
న్ననము బలము నెఱిఁగియు నన్నిననాఁడవటంచు రాజశేఖరుఁ డనుజున్. 390

క. పద పద పోవుద మేమ్మా, పద వొందెనొ జనకతనయ భయమున ననుచుం
బదములు తొట్రిల దీనా, స్యుఁడై రాముఁడు నివాసపదమున కార్తిన్. 391

వ. నానావిధంబు లగుదుర్నిమిత్తంబులవలనఁ జిత్తంబు తల్లడపడ వచ్చి సోదరున కభి
ముఖుండై. 392

సీ. రాజీవనేత్ర నారాక తా నాలించి, యెదురుగా వచ్చునే నేఁ డేలరాదు
హరిణశాబకముఁ బట్టి ద్వారి దెచ్చితి, నా కని యిపు డేల యడుగరాదు
కొమ్మను జేరి పల్కులు నేర్చుకొనుకీర, పఠనంబు నేఁ డేల పాటించనియె
నావిక సితవల్లికాభిరామం బగు, నుటజంబు నేఁ డేల యొప్పుదతిగఁ

గీ. గలికికరచరణాక్ష్యంగకములఁ గలుగు, శాలిభూషణశింజితం బేల వినఁగఁ
బడదు నేఁ డుగ్రరాక్షసాపహృత యయ్యె, సీత నిశ్చయ మిది సుమిత్రాతనూజ.

క. అని పలికి పర్ణశాలం, గని జానకి లేకయున్నఁ గడువడి హా చం
ద్రనిభానన యెందుఁ బోయితి, వని మూర్ఛాపరవశాత్ముఁడై మహిఁ బడియెన్. 394

ఆ. పడిన యన్న నెత్తిపట్టి యేడ్చుచు సుమిత్రాసుతుండు వల్కెఁ దగునె యిట్లు
ధైర్యముండ రామధరణీశ వెదకుద, మిప్వనాంతరమున నిందు నందు. 395

క. అని కటకటఁబడి శ్రీరా, మునిఁ గడు నూరార్చి యందు మునమిషి వెతకెన్
జనకజనుఁ బల్లవాగ్ర, రసికటకుల్యాంతములఁ గామసహితుఁడై 396

సీ. ఈరీతి శోధించి యెందును గనరాక, యన్న శ్రీరాముఁ డోహో యటంచు
గొంతెత్తి పిల్చును గొమ్మ డాఁగితె యంచు, మెకములు మ్రింగెనా యని యటంచుఁ
బర్ణశాలాసమీపంబున రోయుచుఁ, బూవులు గోయంగఁ బోయె ననుచు
వనజాక్షి రోసి కన్గొనుట కష్టంబంచు, హా యేమి సేతుఁ గాంతా యటంచుఁ

గీ. గాన మనకింకఁ దోడేరు గలరటంచు, డాయరా వేమి ననుఁ దమ్ముఁడా యటంచు
బాల కారగ్గిపాలు గాఁబోలు ననుచుఁ, బాములు గ్రసించెనో యంచుఁ బలవరించు.

సీ. ఇందీవరాక్షి నన్నిందు రమ్మనిపిల్చె, నని కోకిలస్వరం బాలకించు
నదె చంపకామోదహస్తశాఖం బని, వామలతాపల్లవంబు గాంచు
నదె గంధగజయానయరుణాధరం బను, నిండఁ బండినదొండపండుఁ గాంచు
నదె తప్తకనకాంగిహొంవల్లు లంచుఁ, గమనీయతరకోరకములఁ గాంచు

గీ. దంబు మీఱు మృగాక్షిదంతంబు లనుచు, దాడిమీమృదుబీజసంతతులు గాంచుఁ
గొమ్మ పాల్ఫారచెక్కుటద్దమ్ము లంచు, లలితసాంద్రకలవలీదళములఁ గాంచు.

వ. మఱియును. 399

చ. గజములఁ గాంచి గంధకరిగామిని యంచుఁ గలంగు మించు నం
బుజములఁ గాంచి పద్మముఖి పోయితె యంచుఁ దలంచు బంభర
వ్రజముల గాంచి భృంగచికురా యని చేడ్పడు నాకుజోపము
ల్కుజములఁ గాంచి పల్లవసుకోమలహస్త యటంచు వంతగన్. 400

వ. వెండియుఁ బ్రేయసి నుద్దేశించి. 401

క. రమ్మా యను బల్కవు మా,రమ్మా యను డాఁగు టేది వరమ్మా యను వై
రమ్మా యను విడకుట భా,రమ్మా చెలు గడు నవాదరమ్మా యనుచున్. 402

ఉ. మాయను జెందనేల చెపుమా యనుఁ బల్కవి దేమి ముద్దుగు
మ్మా యనుఁ దాళఁజాల వినుమా యను నావెత దీర్పఁబొమ్మికో
మ్మా యనుఁ గష్టమాయెను జుమా యను నాపయి నింతనిష్ఠుర
మ్మా యనుఁ బంతమా యను సమానగమా యను దైవమా యనున్. 403

క. బాల విప్రలాభ్రకణజం,బాల సదాచరదురోజబాహ్లిక వసుచం
బాలశశివదన వగవం, బాలయితివె ధాత మిగులఁ బాలసుఁ డగుటన్. 404

సీ. వనిత నీ వావఱించిన కందమూలంబు, లనుపమానసుభక్ష్యములు నాకు
భక్తి నీ వొసఁగిన ఫలరసంబులు లసదమృతోపమానంబు లతివ నాకుఁ
బటుప్రీతముగ నీవు పఱచిన కుశములు, రమణీయతూలతల్పములు నాకు
నబల నీ వేటికినయెడనిచ్చుల్లెలు కల్ప,కప్రసూనంబులు కలికి నాకుఁ

గీ. దివిరి నామేన నీ వలందిన పరాగ, మమితశీతలఘుసృణరజము నాకు
రమణి నీవున్న పొదలు సౌధములు నాకు, సుదతి నీతోడి గహనమయోధ్య నాకు.

వ. అని యిట్లనేకవిధవిలాపంబులు పలుకుచు వగచుచున్న యన్నం గనుంగొని
యవిరళబాష్పకణపరిపూరితనిజకపోలయుగళుండగుచు సుమిత్రాపుత్త్రుండు తగు
రీతి నూరార్చుచుండె నంత నయ్యన్నదమ్ములు. 406

సీ. సారసారససారసారసమధురసా,సారంబు లైన కాసారములను
అంగీకృతాభంగభృంగీసుసంగీత,సంగతరంగత్కుడుంగములను
సంతతాక్రాంతాప్రకాంతగాఢధ్వాంత,దంతురితాద్రిగృహాంతరముల
నాగతుండపరాగభోగిభోగాభోగ,భాగత్యుపత్యకాభోగములను
గీ. *భ్రాంతరంబుల నాశ్రమోపాంతములను, గోటివిధఖచరాంగనాకూటకూట
కూటకోటుల మసలక కొమ్మ వెదకి, సీతఁ గనరామి కెంతయుఁ జింత నొంది. 407
క. ధూర్తమృగధూర్తపటుతర,గర్తంబులఁ బర్వతముల గహనంబుల న
త్యార్తు లయి వెదకి రొక్కము,హూర్తంబును నున్నచోట నుండక సీతన్. 408
వ. ఇట్లు పరిశోధించి మగుడం బర్ణశాలాసమీపంబున కరుగుదెంచి యెందునుం జనక
నందన సందర్శింపనేరకున్న యవసరమ్మున రాముండు సహజన్ము నాలోకించి.
సీ. కొమ్మ యీకొమ్మఁ జేకొని నిల్చెఁగాఁబోలు, నిచట నీక్రొమ్మావి యింపు నొందెఁ
జిలుకల కిచటఁ బల్కులు నేర్పెఁగాఁబోలుఁ,జుమ్మ యీకర్ణికారమ్ము ప్రబలె
దిగులున దీని సడలఁబట్టెఁగాఁబోలుఁ, నిచట నీకురవకం బిగురు లెత్తెఁ
దిలకినీతిలకంబుఁ జేతిచూడ్కిఁగఁబోలు, నిచట నీతిలకమి ట్లెలమి గాంచె
గీ. నిచటఁ గడువేడినిట్టూర్పు లిడ్యెఁబోలు, నింతి యీసిందువార మత్యంత మమరె
నాతి యిచ్చోట వెదనవ్వు నవ్వెఁబోలు, మిగులఁ బువ్వులతో నీనమేరు వొప్పె.
వ. అని పలికి. 411
క. తనకరముల నమృతం బిడి, విను లతలం బెనుచుచుపాలవెల్లినినువునాఁ
జనుజనకనయనఫల మిపు, డనయముఁ గృశియించఁబడె యినారాద్ధత యై. 412
చ. కరులు మయూరపింగదృష్టు లురగంబులు గోకము లచ్ఛభల్లము
ల్పరభములు సృగాలములు సైరిభము ల్పులు లీతరక్షువు
ల్సరసిజనేత్ర నేఁచుటకు సంశయమే శుకపుండరీకబం
భరపికశారికాదు లిటు మానక నీగతి నన్నుఁ నేఁచఁగన్. 413
సీ. బిసబాహు వని వాసపిండు వేధించెనో, వేధించునే మేఘసాధు శేణిఁ
గవలానన యటంచుఁ గరియూథ మేఁచెనో, యేఁచునే ఘనపింగదృష్టి మధ్యఁ
గిసపాణి యటంచుఁ గోకిల లెంతయఁ బెనో, యలమునే మీ లురమాభిరామ
సువకోవలి యటంచు భ్రమరముల్ మూఁగెనో, మూఁగునే చంపకామోదదేహ
గీ. కటిఫల ధరి యని శకపుజ వ దెట్లు, మించి సికించెనో ఐసికించు నెట్లు
వాసనల నొప్పగలుగు జహరిపూఁత, సనుచు నెంతయు భ్రమ నెందు నాత్మయందు.

వ. మఱియును. 415

సీ. జనకజాతఁ గజాతసమనేత్రఁ గానరే, జంబూవిశాలభూజంబులార
మధుపరాగపరాగమృదుగంధిఁ గానరే, లలితరసాలసాలంబులార
జలదమాలతమాలసమవాలఁ గానరే, మహితమాలూరభూరుహములార
ఘనలతాంతలతాంత కమనీయఁ గానరే, పటుజటోత్కట వటకుటములార
గీ. మధురబంధూకబంధుకమ్రాధరోష్ఠిఁ, గానరే గురుకుచ మీరు కానరేఁగు
లార యని విభ్రమాద్భ్రముఁడై నరేంద్రుఁ, డచట నచ్చటఁ దిరుగుచు నడలి యడలి. 416

క. గములార వఱలుఘనవా,గములారా ఘోరపన్నగములారా సిం
గములార మృగములార న,గములారా నగములార కానరె సీతన్. 417

వ. అని యివ్విధంబున యుక్తాయుక్తవివేకవిహీనునిం బోలె దృగ్గోచరంబు లగుపదా
ర్థంబుల నెల్ల జనకనందన నడుగుచుం జని చని లక్ష్మణుం గనుంగొని. 418

క. అనుజా మనమిరువురము, న్నీను జానకియొద్ద లేనివేళఁ గుపితుఁడై
దనుజాధముఁ డొకఁడు ధరా,తనుజాతం గొనుట నిశ్చితం బూహింపన్. 419

క. జనకజ నిమ్మ్యోడఁ గాంచితి, మనితెల్పెడుభంగి భల్లుకావలి మొఱసె
న్నీను పవనిజ వెదకెడుగతి, ఘనవృక్షాగ్రములఁ గపినికరమును మెఱసెన్. 420

వ. అని పలికి శోకాతిరేకంబున నొడ లెఱుంగక లక్ష్మణుం గనుంగొని. 421

ఉ. ఎవ్వఁడ నేను రాముఁడ వహీనబలాఢ్యుఁడ కా నెఱుంగు దీ
వెవ్వఁడ వీవు లక్ష్మణుఁడ వేటికి వచ్చితి మిట్టికానకుం
జవ్వని సీత రోయటువు జానకి యెక్కడ వోయె లక్ష్మణుం
డెవ్విధినున్న వాఁ డనుచు నేడ్చుఁ బరిభ్రమితాంతరంగుఁడై. 422

చ. జనకజ నిందుఁ గాన ముటజం బిది కాదొకొ రామచంద్రుఁ డా
జనకజఁ బాసి యొక్కనిముసంబునుఁ దాళఁగఁజాలఁ డేనురా
మనరవరుండఁ గానొ యనుమానము గల్గెడు నంచుఁ గ్రమ్మఱిం
జని యుటజంబు న్వెదకి జానకిఁ గానక వంత గ్రమ్మఁగన్. 423

చ. మనము వనమ్మునన్వెదకి మానిని సీతనుఁ గానకున్న నె
మ్మనము గలంగె నాకు వినుమా విసుమానిక మీఁద చిచ్చు వె
న్ను నెడమకన్ను మున్ననుఁ గనుంగొనఁజాలుదు రెందునున్నఁ జ
య్యన సతి నాకుఁ జూపరు దయాపరివర్జితచిత్తవృత్తులై. 424

వ. అని విరాళిఁ జాలిమితూలిం దాళఁజాలక యాలిం దలంచి. 425

ఉ. పాంథమనోధనాపహృతిఁ బ్రాభవుఁ డై చను కాముఁ డిప్డు పు
ష్పాంథయశింజినీకలితసారబలం బగుతుంటవింట ద
ర్పాంధత నూఁతమార్గణచయంబుల నొడకఁ గ్రుచ్చి నాదుహృ
ద్గ్రంథి నలంచె గావున సుకంఠి భవద్వచనామృతంబునన్. 426

వ. అని వగచి. 427

క. క్రమ్మఱ నిట్లను బృథుశోకమ్మున హా జనకతనయ కడువడి నన్నుం
గ్రమ్మినతాపము దీఱునె, కమ్మని కెమ్మోవిపానక మ్మీకున్నన్. 428

వ. అని పలికి యలుక వొడమ సమ్మహీసుతాప్రియుండు. 429

క. సాధుచరిత్ర యనందగు, మైథిలి నొప్పింపనున్న మహి నిప్పుడ సం
బాధింతు నస్మదీయక్రోధోద్రేకంబు వెలయఁ గ్రూరాస్త్రములన్. 430

క. నను రాజమాత్రుఁ గాఁ దలఁచిన సురగంధర్వయక్షసిద్ధాదులఁ ద్రుం
చినఁ గాని తీఱ దిదె కన్గొను మనరామునకు లక్ష్మణుం డిట్లనియెన్. 431

గీ. అంబుజాసననిర్మితం బైన కరంబుఁ, బొలుపు నొందుజరాచరభూతకోటి
నీవు గాపాడువాఁడవు నీఱుసేయు, నుగ్రకర్మము తలపోయ నుడుకుదక్కి. 432

గీ. ఏల తాలిమిఁ దూల సీతాలతాంగి, నిచ్చోట నచ్చోట వెదకుద మెట్టులైన
నేను గొనివత్తు సంశయ మింతవలవ, దగ్గిలో నున్న నబ్ధిమధ్యమున నున్న. 433

వ. అని పలుకుటయు రామచంద్రుం డుపశమితపరితాపుం డై క్రోశమాత్రంబు ధరణీ
కుమారిక నరయుచుం జని మార్గమధ్యంబున. 434

ఉ. ఖండితపక్షుఁ డై మిగులఁ గాఱునసృక్పరిషిక్తవక్షుఁ డై
తుండము ధాత్రి నూఁదికొని తోరపుమూర్ఛ మునింగి జేవుఱుం
గొండవిధంబునం ధరణిఁ గూలినపక్షివరేణ్యుఁ గాంచి మా
ర్తాండవరాన్వవాయకలశాంబుధిసోముఁడు రాముఁ డుగ్రుఁ డై. 435

వ. రాక్షసుం డనుతలంపున. 436

క. నీ చమతి సీత నీరజనీచరుఁడు గ్రసించి యిట్లు నిష్కపటస్థితుం
జూచితె లక్ష్మణ యనలం, జూచి తెరువులోన నిలిచి స్రుక్కక యుం బడియెన్.

క. కావునఁ గడుఘోరం బగు, నీవనమున సంచరించు నిక్కపటాత్ముం
జీవనము గొనెద వెస విల్లీవన యనునంతలోన నిట్లనె నతఁడున్. 438

సీ. ఘనులార రామలక్ష్మణులార యేను రాక్షసుఁడను గాను మీజనకుఁ డగుద
శరథభూమీధవసఖుఁడ జటాయువ, న్వాఁడ రావణుఁడు దానవవిభుండు

జానకిఁ గొని యాకసంబునఁ బఱచుచో, నా పెదవి నాలాప మాలకించి
వాని నెదిర్చి దుర్వారతదీ చూసి, పాతంబునఁ బ్రభగ్నపక్షయుగ్మ
గీ. ఖండనై సీతవార్త మీకుం దెలుపఁగ, వలసి నిలిపితిఁ బ్రాణము ల్నిలువ విభుఁడ
తొఱఁగెద నటంచుఁ దనతలఁ దోర్చికొనుచు, విహగవిభుఁ డంతఁ బ్రాణంబు
విడుచుటయును. 439

ఉ. పక్షికులాబ్ధిపూర్ణహిమభానుఁడ మా యెడఁ గూర్మి మీఱ మా
పక్షము వచ్చి నీవిటులు ప్రాణము వీడితి విప్పు నిన్నుఁ బ్ర
త్యక్షముగాఁగఁ జూచి కడు నారనిశోకము మించె మానవా
ధ్యక్షుఁడు తండ్రి పఙ్క్తిరథుఁ డంతమునొందు టెఱుంగ మీక్రియన్. 440
ఉ. ఏట్రికి రాముదేవిఁ గొని యేగెదు రాక్షస నీ వటంచు మి
న్నేఁటికి నడ్డ మేగిన మహీధ్రనధీశునిభంగి నాఁగి త
త్పాటితపక్షఖండ వయి ప్రాణము వీడితివయ్యొ దైవ మె
చ్చోటు నదృష్టహీనుఁ గృపఁ జూచినవానిక చేటు గూర్చెడిన్. 441
క. అని వగచి వగచి తగునిం, ధనములు సొద వేర్చి పక్షినాయకుఁ బయిఁ జే
ర్చి నిబిడశోకు లగుచు వ, హ్నిఁ నొసఁగి రయ్యన్నదమ్ము లిరువురు సువిధిన్. 442
వ. తదనంతరంబున. 443
క. నరనాథులు ఖగనాథున, కఱచేలిడ పుణ్యలోక మనుచుం గోదా
వరి నాడి మృగామిషమున, నురుపిండముఁ బెట్టి రొగిఁ దిలోదక మొప్పన్. 444
వ. ఇట్లు జటాయుం బుణ్యలోకచిరనివాసిం గావించి. 445
సీ. ఓషధీశ్వరుని బీయూషరసంబు ప్రార్థింపఁ బోయినభంగిఁ జీవ లోక
సంబు ముట్టిన యరణ్యంబున రామలక్ష్మణులు దురంతశోకప్రభగ్న
హృద్వృత్తు లగుచు మహీసుత నరయుచుఁ, జని చని మించు క్రౌంచవతిఁ గ్రౌంచ
వతిఁ బ్రవేశించి యావలఁ దమసానదిఁ, గన్గొని తత్తీరకాననమున
గీ. నతనుబాణాతనుప్రణిహాతమనోంబుజాతయై లక్ష్మణునిఁ జెయి సాఁచి పట్టి
కొనినదాని నయోముఖిఁ గ్రూరఁ గామరూపిణి రక్కసిని వే విరూపిఁ జేసి 446
సీ. పటుదీర్ఘబాహులబ్ధప్రాణిసంఘుఁ గ, పనశీలి యగుకబంధుని భుజాంత
రంబునఁ జిక్కి ఘోరం బగుతద్వాక్య, తాకార మీక్షించి యద్భుతాంత
రంగులై వానికరంబులు ఖండించి, రామలక్ష్మణు లుగ్రరాహుముఖని
ర్గతచంద్రాబ్జినీనాథుల ననొప్పి, రాక్షణంబున శాపమోక్షు మంది

గీ. వారలకుఁ దనవృత్తి సర్వంబు నెఱుఁగఁ, జెప్పి చేదోయి నంత మోడ్చి వినయమున
నాకబంధుఁడు దాను దివ్యపురుషుండు, గానఁ దనతొంటిరూపంబుఁ గలుగ నిలిచి.

క. భూపవరులార యిదె మ,చ్ఛాపవిమోక్షంబుఁ బూర్వజన్మకృతమహా
పాపవినాశము నయ్యెన్, మీపదదర్శనముకతన మిగుల వెలిఁగితిన్. 448

చ. అని వినుతించి వారు జనకాత్మజయున్నెడ వేఁడినన్ మహీ
జనవరులార మీరలు వెసం జని మంత్రులఁగూడి ఋశ్యమూ
కనగనగంబులం దిరుగు కంజహితాత్మతనూజు వాలియ
న్వనచరనాథుసోదరు నవశ్యముఁ జూడఁగఁ బొందు ధీరులై. 449

క. ఆసుగ్రీవునితో సహ,వాసము గావింపుఁ డతఁడు వనచరుల మహో
ల్లాసమునఁ బిలువనంపి ధ,రాసుత వెదకింపఁజాలు రభసత ననుచున్. 450

క. ఈవిధమున దనునాముఁ డ,నావిలమతి నెఱుఁగఁ జెప్పి యరిగిన హరివి
శ్వావిద్భల్లుకహరిశర,భావనవనభాగమందు నరుగుచు నెదురన్. 451

ఉ. ఆశ్రమ మల్లతాంతసులతాంతముఁ గూజితశౌకపైకభృం
గాశ్రయము న్రసాలవకుళార్జునతిందుకనింబువారస
మిశ్రము స్వస్థపేతభయమేదురగుల్మయుతంబు నొక్కపు
ణ్యాశ్రమముం గనుంగొని రహస్పతితేజులు రామలక్ష్మణుల్. 452

వ. కనుంగొని. 453

క. వెసఁ జొచ్చి యందుఁ గన్గొని, రసమానవ్రతసమాగతాయాసభరి
న్నసరిత్ప్రసూనపిశం, గసటాపటలప్రకలితకబరి న్శబరిన్. 54

క. కని తచ్ఛబరాంగన భ,క్తిని వేనర్ఘ్యాదివిహితకృత్యము లొనరిం
చిన సంతసించి నరవరు, లనవద్యులు ఘనులు దశశతాంగతనూజుల్. 455

వ. పరమపవిత్రకుశాస్తరణంబుల సుఖాసీను లైరంత. 456

చ. ప్రాసఁగినభక్తిఁ దచ్ఛబరి భూనుతకీర్తికి రామమూర్తికి
న్బ్రాసఁగినకందమూలమధురోరుఫలంబులు తృప్తిదీరఁగా
మెసఁగి నరేశ్వరుండు హితమేదురవాక్ప్రకరంబు దానితో
నెసఁగ నచించుచు న్మిగుల హృన్ముద మొప్ప వసించె నయ్యెడన్. 457

చ. తనదుహితప్రవృత్తి విదితంబుగ రామునకు న్వచించి యా
తని వినుతించి రాఘవుపదంబుల నొద్దల మోపి మ్రొక్కి వే

తనువుఁ దొఱంగి తత్క్షణమ తచ్ఛబరాంగన వొందె సత్తపో
ధనులకు నంద రానిసుపదంబులు భక్తికి యోగ మెక్కుడే. 458

క. తనివిసనక యీవిధి నా,తనివినుతు లొనర్చి శబరి తనువుఁ దొఱఁగినం
గని యబ్బురపడుసోదరుఁ, గని యప్పుడు పలికెఁ గౌతుకస్ఫురణ మెయిన్. 459

ఉ. సూక్ష్మము భక్తియోగము విశుద్ధమనస్కులు కానిపూరుషు
ల్లక్ష్మ నెసంగువారు పదిలక్షులు వెట్టిన సంతసించు నే
లక్ష్మికి బాహ్యు లయ్యును ఫలప్రము నన్ను నెఱింగి మావు
ల్లక్ష్మణ భక్తి నెంగిలిఫలంబులు వెట్టిన నుల్లసిల్లుదున్. 460

గీ. అని పలికి రాముఁ డనుజసహాయుఁ డగుచు, నాశ్రమంబున కవ్వల నరిగి కాంచె
నధికతరవారికేళీసమాగతాప్స,రోవరం బగు పంపాసరోవరంబు. 461

వ. చూచి మంజులతామంజపుంజరంజితం బగు తత్తీరంబుఁ జేరం బోవు నవసరమ్మున.

చ. అరవిలయుండు లక్ష్మణుఁ డహర్పతితేజుఁ గన్న కిట్లనున్
నరవర చూచితే యిది మృణాలముఖంబునఁ దాము గొన్న శం
బరముల సన్మరందము నెపంబునఁ గ్రమ్మఱ నొల్కెడున్ మనో
హరతరపంకజాతనిచయంబులు ప్రత్యుపకార మొప్పదే. 463

ఉ. సారసగంధియు న్విచలశైవలవాలయు నుత్పలాక్షియుం
జారురథాంగపీవరకుచద్వయయుం గలహంసయానయు
న్వారమృణాళబాహువుఁ గుశభ్రమనాభియు నైశవర్చెడి
న్శ్రీరఘురామ చూడు సరసీమణి దాసరసీమణి క్రియన్. 464

క. తీరస్థితంబు లగుధా,త్రీరుహములు ప్రతిఫలించెఁ దెలియుము నదిను
ర్వీరమణ వనాంబుజహ,స్తారమణీయప్రకల్పితముకుర మొకో. 465

చ. నరవర తన్నుఁ జూడఁ జనునంబుజపంక్తి మధూకతంబు నే
యురుచిరమూర్తి యున్నది పయోరుహజాత పరాగయోగని
ర్హారిత మదద్విరేఫ మవనాధిక యొంటఁ దలంపఁ జిత్రమే
యరయ గజప్రదాత యగునాతఁడు తోత్ర మొసంగకుండునే. 466

క. అని పలుక రాముఁ డానది, గనుఁగొని తన్మధ్యకమలకైరవవిచర
ద్ఘనభృంగములం గని క్రన్నన సీతావిరహావేదనాహతమతియై. 467

వ. తమ్ముని వీక్షించి. 468

చ. వనమున రాక్షసాపహృతభార్యుఁడనై వగ నొందు నన్నుఁ గ
న్గొని తనయింతి దానవులు కోరిహరించెద రంచు భీతిచే
ననిశముఁ బెంట్రిఁ బాయదురథాంగము చూచితివే వనాంతర
మ్మున గజపర్ణశాల ననుఁబోలునభాగ్యులు లేరు చూడఁగన్. 469

క. మరుఁ డైదవశరమున న, న్నురవడి నేసెడిని గాక యున్న న్సరసీ
వరతీరంబున నాకు, న్స్మరదశమావస్థ నిట్లు కలుగఁగ నేలా. 470

మ. తగ నిన్నద్యుదకస్ఫురత్కుముదపద్మస్తోమగంధంబుఁ దీ
రగతాశోకరసాలకుందసుమసౌరభ్యంబునుం గ్రోలి యా
శుగ ముగ్రత్వము దాల్చి నాకు హృదయక్షోభంబు వెంచె న్స్మరా
శుగపంచాహతి వోలె లక్ష్మణ బుధస్తుత్యోల్లసల్లక్షణా. 471

ఆ. తాపహారియున్న దీపవనంబు సం, తాపకారి యయ్యెఁ దరుణిఁ బాసి
యున్నవాఁడ నగుట నురుభుజ నాకు సీ, తాపహారిఁ జూపు మే పడంతు. 472

వ. అని రోషావేశుండై పలుకుటయు సహోదరుండు సాంత్వనవచనంబుల ననునయిం
చె నంత. 473

ఉ. శోకముఁ దక్కి రాముఁడు విశుద్ధమతిం జని కాంచెఁ బుష్పితా
శోకముఖద్రుమాగ్రపరిశోభితబర్హిశిఖండినీకులా
స్తోకముఁ గూటకోటిపరిశుద్ధనిశాపతికాంతవేదికా
నేకము సానుసంచరదహీనచమూకము ఋశ్యమూకమున్. 474

కని తదుపాంతకాంతారాంతరంబున ననుజసహితుండై రాముండు ధనుర్బాణతూ
ణంబులు సహాయంబులుగా నుండె నని చెప్పి మహానందంబున. 475

## ఆశ్వాసాంతము.

మిత్రామిత్రవిభేదశూన్య బుధసన్మిత్రాఖిలామిత్రభ
క్తత్రాణైకపరాయణా నిరతవృత్రఘ్నార్చితాంఘ్రిద్వయా
పత్ర్యధ్యక్షమహామోదయా సుహృదయాబ్జా వేంకటాఖ్యోల్లస
ద్గోత్రాభృన్నిలయా సుగాహిమలయా క్రూరోగ్రయామ్యాలయా. 476

అధివ్యాధిహరణ భ, క్తాధీనాంతఃకరణకంజారుణచరణా
సాధుజనావనచణ భవ, పాథోనిధ్యుత్తరణ కృపాప్రాభరణా. 477

కవిరాజవిరాజితము.

సరసిరుహోదర సన్నుతపాదరజఃపరిపూతరసావలయా
పరమకృపాకర పామరభీకర భానుసుధాకరకోటివిభా
తరుణశుభాంగ మహీహృదయంగమతార్క్ష్యతురంగమ దీనదయా
పర మధుసూదన ప్రణుతసుధోదన భవ్యవినోద నరాదహరీ. 478

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణ భూమధైర్య
వినయ రామనార్యతనయ పండితసేవాసముచ్చయ కొత్తపల్లి
లచ్చయ ప్రణీతంబైన దాశరథివిలాసం బను మహా
ప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



క. వీరలుశితారివారలు, వీరలు మహనీయు లిట్టివీరల నోరు లె
వ్వారలు పంపఁగఁ జాలెదు,వారలు తముదామ యిటకు స్వచ్ఛందగతిన్. 7

వ. వచ్చినవార లని తలంతు నని పలికి మఱియు నిట్లనియె. 8

మ. హితవాచంయమివేషధారులుఁ గృపాదృగ్జాలురున్ క్షత్రియా
కృతు లీవీరలు వాలి నేపడఁచి కిష్కింధాధిపత్యంబు స
మ్మతి నీ కీయరుమేను లొప్పఁగ రమామానిన్యధీశుండు స
ద్గతి నేతెంచె ననందనర్చిరి జగత్కల్యాణచారిత్రరుల్. 9

ఉ. వారివిధంబు సర్వము ధ్రువంబుగ నారసి వచ్చితి వేడుక
న్వారికి నీకు సఖ్యము నవశ్యముఁ గూర్చెద నట్టులైన నే
వారికి లోనుగాని బలవంతుఁడ వయ్యెద వెట్టివైరులం
జీరికిఁగొందువే ప్లవగసింహుని వాలిని గీలి నేర్పవే. 10

క. అని వారిసమీపమునకుఁ, జని మాయాభిక్షుకత్వసంభృతుఁ డగుచు
న్ననమెల్లఁ ద త్తనూనూ,త్నవినయము మొప్పఁజేయఁ దిగియెడునిభృతిన్. 11

ఉ. చేతులు దోయిలించి కపిసింహుఁడు వాయుసుతుండు మ్రొక్కి ని
ర్భీతులు సద్వినీతులు నపేతకునీతులుఁ బూతులుం జగ
త్త్రాతలు మీరు మానులకిధంబున ఘోరవనాంతసీమ
యాతులు గాఁగ నేటికి దయామతులార యెఱుంగఁజెప్పరే. 12

వ. అని యడిగి వెండియు. 13

క. చక్రీశసదృశబాహులుఁ, జక్రధరోపములుఁ జక్రచక్రాననులుం
జక్రహితరిపుఃఖులు సువ,చక్రమపేశలులు సుకటిచక్రులు మీరల్. 14

క. మహి నెవ్వారలు వీరలు, బహుసుగుణావహులు నియమిభారవహు లనా
గ్రహులు మహామహు లియ్యెడ, సహితశయనునిద్వాశ్రకృతు లన నలరెద రనినన్. 15

ఉ. ప్రాణసతీసువార్తఁ గొని రాఁగఁదీరునిగా నెఱింగియో
స్థాణువరంబునం బరమసాధ్వికి నందనుం డగం జగ
త్త్రాణునిచేఁ బ్రజాతుఁ డగుధార్మికుఁ డంచుఁ దలంచియో సరి
క్షీణవిచారుఁడై ముదముఁ జెందెను రాముఁడు తన్మహోక్తులన్. 16

వ. ఇట్లు సంతసించి సహోదరుం గనుంగొని. 19

క. మనవృత్తము సర్వము లక్ష్మణ యితని కెఱుంగఁ జెప్పుమా యనవుడు స
జ్జనమణి సౌమిత్రి నరేంద్రుని యానతి మిగుల నతనితో నిట్లనియెన్. 18

## పంచమాశ్వాసము.

ఉ. భానుకులాబ్ధిపూర్ణహిమభానుఁడు పఙ్క్తిరథాధిపుండు త
త్సూనుల మీఁద నగ్రజుఁడు సువ్రతచర్యుఁడు రామనాముఁ డా
త్మానుజు నన్న లక్ష్మణసమాఖ్యుని గూడి కడంగి భార్యయుం
దానును వేడ్కఁ బంచవటిఁ దాత వచస్స్థితి నున్న యంతటన్. 19

క. ఈసుశ్లోకునిసతి సీ,తాసతి యేమఱుపుగను దొదవ్వల సం
త్రాసవనస్థితి మెలఁగెడు, నాసమయమునందు రాక్షసాహ్వాత య్యైన్. 20

క. తత్కాంతారత్నము నే,తత్కాంతారస్థలమునఁ గంపు మను చరీ
ణోత్కలిక వెదకి విపులా,పత్కలితుల మొక్కచోఁ గబంధు మనాంధున్. 21

క. కని వాని వానిశాపం,బును దగ్ధముగా నొనర్చి పొలుపుగ నపు డా
ధనునామునిచే సుగ్రీ,వుని విని తత్సఖ్యమున నవుం బను లెల్లన్. 22

మ. అని తన్మర్కటనాథదర్శనసమీహాబద్ధహృద్గ్రంథిరై
విను మిచ్చో నివసించినాఁ డురుజగద్విఖ్యాతమూర్ధన్యమా
ర్గఘ్ననితాంతస్ఫుటదీప్తివికాళిఘాటనాత్యంతప్రశస్తాంఘ్రిప
ద్మున కీరాముని కబ్జజుం డగచరేంద్రుం గొల్వ వానిం గటా. 23

వ. అని పలికి యున్న దెసకు విన్నవై కన్నీరు మున్నీరుగా వగచుచున్న యన్నరవరుఁ
క త్తరుచరవరుం డిట్లనియె. 24

క. ఏపగిది నవార్యము లగు, నాపదలకు న బోగల రార్యులు శోక
స్థాపితహృద్వ్రతులకుఁ, బైపయి నాప వొదముఁ బలముఁ దొలంగున్. 25

వ. కావున సుస్థిరుండ వగు మని యనునయించి నంతరంబున రామలక్ష్మణులం గని 26

క. బంటు నిటు వినుఁడు శోకం, బంటనిహ్వాయములతోడ సజ్జనకసుతం
బంటువెలఁదిమోములు దగు, పంటు వెదకి కాంచునట్టిపని నాగిమఁజీ 27

వ. అని యిట్లు. 28

క. తగఁగ నవినులుల నవికలు, లగుఁజని లగుపరిబిడ మగు త్రిదీక్షు తగం
బగువాలముఁ ద్రిప్పుదు న,య్యగచరుఁ డిట్లనియె సైబ మగుగతిఁ దెలియన్. 29

క. అంజనకుఁ బ్రభంజనునిద,యం జననము నొందినాఁడ హనుమద్విఖ్యా
తిం జను లెన్నన్ ఖలులఁ బ్ర,భంజన మొనరించుసత్ప్రభం జనువాఁడన్. 30

క. సుగ్రీవాగ్రసచివుఁడ న,దగ్రగ్రావాగ్రవాసినైయు మిముఁ గని భూ
పాగ్రణులు భవత్సఖ్యసు,మగ్రావాప్తి సెదఁ గోరి యతఁ డిటకు నమున్. 31

ఉత్సాహ. పంప వచ్చి వాఁడ నతనిపం పలంఘనీయ మా
పంప దాఁటి మీర లిందు బాణతూణధారులై
తెంపునం జరింపఁ గాంచి తెంపు లేనిభీతిచేఁ
ద్రెంపి కొనియె ధైర్యవల్లిఁ దిగ్మభానుసూనుఁడున్. 32

చ. వినఁ దతఁ డన్న దప్పరిభవించి సతీవిభవంబు లెల్లఁ గై
కొనుఁడుఁ దదీయసత్తమునకుం బ్రతిసత్తము లేమి నాతనిం
జెనకఁ దలంకి యగ్గిరి వసించినవాఁ డగుట న్భవత్సహా
యనిశితఖడ్గధార నురమాడఁ దలంచె విరోధిసాలమున్. 33

క. ఘనులార యతనిమిత్రత, కనుకూలత నొందుఁ డనుచు నట్లేరిఁ దగ
న్వాయు మాడఁ బోవృతీశ్వము, చనుదెంచినయట్లు కాదె చయ్యన మాకున్. 34

క. స్వయరహిత నీవు చని నిశ్చయముగ సుగ్రీవుతోడిసఖ్యము మాకున్
దయఁ గూర్చిన నన్యోన్యప్రియకార్యుల మగుదు మనఁ గపిప్రభుఁ డాత్మన్. 35

గీ. పొంగి తగుభంగి నాప్లవపుంగవులను, బూర్ణకరుణాంతరంగులఁ బూర్ణముగను
దోడుకొని ఋశ్యమూకంబుఁ దొలుతఁ గడచి, యధికసౌరభమనిలయము మలయము.

క. కని రాముని రాముని రామునితమ్ముని నందు నిల్పి ముదమున సుగ్రీ
వుః సుగ్రీవునిఁ గని యిట్లని యెన్నఁగ రానిహర్షమై యిట్లనియెన్. 37

మ. రవి సన్నం దనఋశ్యమూకవసుధరప్రాంతార కాంతారవా
రవిహారస్థితు లైనగాకొమరులం బ్రావీణ్యము న్వాలి వై
రవిధాయాగతు లంచు నెంచుచు భయభ్రాంతుండ వైతిట్లువా
రవివంశప్రభవు ల్జగత్ప్రభువు లత్యంతప్రసన్నాత్ములున్. 38

వ. తదీయమహానుభావం బభివర్ణనీయం బని పలికె మఱియు నిట్లనియె.

క. విఖ్యాతిమీఱ నీదగు, సఖ్యాతిశయంబుఁ గోరి చనుదెంచిరి ప్ర
త్యాఖ్యాతవైరులత్యమ,లాఖ్యాతులు వారిఁ బొగడ నలవియె నాకున్. 40

తే. అనుచు వారియొడంత మాద్యంత మగచ, రేంద్రుఁ డెఱుఁ దెల్పి వెండియు నిట్టు లనియె
నీఁదపాపఁడు వెలిచి గన్నెక్కనేల, యిపుడ నీకష్టమెల్లఁ గట్టెక్కనమను. 41

ఉ. ఆచలినట్టుపట్టి నెరరారఁ గవుంగిటఁ బట్టి చిన్నవాఁ
డాచలికంటుఁ బం డనుచు నాఁకట మ్రింగఁగఁ బోయినట్టి నీ
వాచలిగట్టుఁ బిట్టువడఁ కాడఁగ మెట్టెకుఁ దిట్ట విట్టివో
నాచెలి కాఁడవైతి విఁక నాకుఁ గొఱంత ఘటిల్ల దొక్కఁడున్, 42

వ. అని ప్రశంసించి. 43

క. వ్యాప్తమతిం బురుషార్థచతుష్టయ మనఁదగుసచివచతుష్టయ మొప్పం
దుష్టయము భువనపూర్ణోత్కృష్టయశు ద్రాముఁ జూడఁ దివిరెను మదిలోన్. 44

క. నిటలతటఘటితాంజలిపుటుఁడై మర్కటవిభుండు పులకపటలము
ల్పటుగతి మేన నలమికొన, నటు చని రాము న్మహాత్ము ననుజాన్వితున్. 45

సీ. కని పేద పెన్నిధిఁ గనినచందంబున, నత్యంతసంతోషి యై తదీయ
చరణారవిందసంస్పర్శితనిజఫాల, భాగుఁడై యానందబాష్పసలిల
పూరితాక్షుం డగుసారి సమీక్షించి, రాముండు గరుణాభిరాముఁ డగుచు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొనియె ననంతరంబున సుమిత్రానందనునకు మ్రొక్కి
గీ. యగనిమన్నన వడసె నయ్యవసరమున, రాముఁ డనుజన్ముఁ గూడి తోరమగునొక్క
చోట నాసీనుఁ డయ్యె నచ్చోటుఁ డొక్క, వలనఁ గూర్చుండెఁ దనసచివవరు లలర.

క. తగ నెల్లవారుఁ దనుఁ గొలు,వఁగఁ గొలువలరించురామవల్లభుఁ డపు
డయ్యగచరులు గొలువ నగమున, నగపునఁ గూర్చుండె దైవవంచన నకటా. 47

వ. అట్లున్న యవసరంబున సామీరి నుద్దేశించి రాముండు సౌరి కిట్లనియె.

క. ఈతనికతమున భవదీ,యాతతవర్తనము తెల్ల మయ్యెను మాకుం
బూతాస్మచ్చరితంబును, వీతాఘుం డితనివలన వింటివి నీవున్. 49

వ. కావున. 50

గీ. మిత్రసత్పుత్రఖండితామిత్ర నీదు,మైత్రి యనియెడుఘనయానపాత్రమునను
నిశ్చయంబుగ విపదంబునిధిఁ దరింపఁ, గోరినారము దగ నియ్యకొనుము దీని. 51

చ. అనవుడు సంతసించి తగ నట్టులసేయుద మీరు నేను స
ఖ్యనిరతి నున్నవారము ప్రియంబునఁ బొందొడఁగూడునేఁ జ
క్కనగు సమస్తకార్యములుఁ గంజహితాన్వయులార వేఱ వే
యనఁ బని యేల రాల నుదకాగ్రముల న్నిలుపంగఁజాలమే. 52

వ. అని పలికి మహానందుం డై రామచంద్రుం గనుంగొని. 53

క. తనుజాతబుద్ధియై భూ,తనుజాతహరించి మూర్ఖతను జరగినయ
ద్దనుజాతతజవసైన్యా,తనుజాత మడంచి మహీసుత న్వెసఁ దెత్తున్.

క. అని సుగ్రీవుఁడు పలికిన, విని సుగ్రీవుండు రామవిభుఁ డప్పుడ యా
తనిచేఁ దనచే నిడ నా,తనిచేఁ దనచే నిడె న్మోదం బలరారన్. 55

వ. ఇట్లన్యోన్యంబును జేతం జేయి వెట్టి సఖ్యంబు గావించి మఱియు నగ్నిసాక్షికంబుగా నక్కార్యసాక్షివందనుతోడ సర్వసాక్షి యగు శ్రీరాముండు మిత్రత్వంబు సంఘటించె నంత. 56

క. లీనగతిం దొల్లి నీయూ, లీనగ లీనగమున రుచు లీనంగ వైచె
న్భానునిభా యని జనకసుతానిక్షిప్తాలంకృతంబులు నూపక్ 57

క. ఆపోవని చూడ్కులనప్పు, డాపూషాన్వయవరుండు నాభూషణము
ల్చేపట్టి లక్ష్మణునకుం, జూపెట్టుచు రాముం డధికశోకాతురుండై. 58

వ. మహీతలంబునం బరమమూర్ఛాపరవశుండై పడి కొంతవడికిం గొండొక తెలిసి నిజ చరణసమీపంబున దుఃఖాతిశయంబునం బొరలుచున్న సౌమిత్రిం గనుంగొని. 59

క. ధరణీతనయామధురా, ధరసంపర్కగతఘన సుధాబిందులు నాం
గరయుం దనరారె నీయుం, గఱుముత్తియములను జూడంగా సౌమిత్రీ. 60

క. వనగజకుంభంబులం బుట్టిన సతికుచకుంభముల నటించిన నీహా
రని కాయంబున కిటు వల, సెను జిక్కు వడంగ నెలవుం జెడ ఘన మగునే. 61

గీ. తగి తాటంకములధగద్ధగలు మాసెం, గాంచికాకింకిణీక్వణక్వణన మడంగె
లలితమంజీరపటుఝుళంఝుళలు డొంకెం, దరుణి నెడంబాసియున్న కతమునం గాదె.

క. ధృతి నగ లేంతిం దాల్తుం, బతిం బాసితి ననుచు భూమిపతితనయ సేయుం
గతిమాలి భూష లిడె నా, గతి వైరాగ్యంబుం దాల్చెం గాంచితె వత్సా. 63

వ. అని యనేకవిధంబుల వగచి వగచి పురమిఘట్టి నప్పుడ యెడంబాసినట్టులం జిత్తంబుల నుత్తలంబు గ్రొత్తసేయం బవనసుతుండు ప్రియవచనంబుల ననునయింప నూఱడిల్లె నిట్లు సుగ్రీవునితోడం బద్ధసఖ్యుండై యవ్వానరేశ్వరు నుద్దేశించి ప్రమదాతిరేకంబున. 64

ఉ. మిత్రతనూజ పాత్ర మగుమిత్రుండవైతి వమిత్రగోత్రగో
త్రత్రుటకాస్వప్రకటితప్రబలాస్మదమోఘపత్రుల
స్పత్రులు నీకుం గల్గిన వెసం దునుమాడెద నన్నుం బుణ్యచా
రిత్రుని రాముం గన్గొని హరిప్రియపుత్రుం డనంతతోషియై. 65

వ. సకరుణంబుగా నిట్లనియె. 66

క. నా కగ్రజుండు వాలి య, నాకోగ్రేసరుండు బలిమి నాయాలి రుమం
గైకొని వెడలంగనడిచిన, నా కీ గ్రావమున వేదనం బడవలసెన్. 67

క. నయ మొక్కింతయుఁ దలఁప క, నయముం బాధింప రామ నరవర యిచ్చో
నయమునుం జెడి తిరిగెద వే, న యముం జూడంగ వాలి ననుపుము శక్తిన్. 68

వ. అని పలికి యంత నిలువక. 69

శా. నిష్కారణ్యుఁ డగారిదారకుఁ డుర న్నిశ్శేషశుష్కద్రుమో
చ్ఛిష్కండ వనం దనర్చి వెస భస్మీభూతుఁ గావించి ధా
నుష్కాగ్రేసర పుష్కరాక్షులను నన్నుం బ్రీతి వీక్షించినం
గిష్కింధాధిపతిత్వ మొందెదఁ గడుం గీర్తి ప్రశంసింపఁగన్. 70

క. తనయాలి విడుచునతఁడుం, దనయాలి న్విడుచునతఁడు దశరథభూభృ
త్తనయా లేశంబును వే, తన యాలిక నుందురు గదా తలపోయన్. 71

వ. అని పలికి మఱియు నవ్వాలి ధైర్యస్థైర్యాదిగుణంబు లగ్గింపం దలంచి యిట్లనియె 72

స్రగ్ధరావృత్తము

మాయావిం దన్ని చీఱి న్మదవదుఁ బ్రబలోన్మాదుఁడై తన్నుఁ జీర
న్మాయావిం దుందుభి న్నామమడఁచి మడిసె న్మానకన్న న్నిత్య
మ్మాయానిశ్వ భరాభృద్వ్యసననిరతుఁ గా మాక్రియం దోఁచె శ్రీరా
మా యావీరాధివీరు న్మఘువసుతుని సామర్థ్యమెన్న న్వశంబే. 73

వ. మఱియు నబ్బలాధికుండు. 74

క. దుందుభి నడంచి దివి సుర, దుందుభులు సెలంగ శక్తితో నప్పుడ త
న్మందరనిభకుణపంబు న, మందరభసుఁ డగుచు వీచె మహామాధికుఁ డై. 75

వ. ఇట్లు ఋశ్యమూకాచలాగ్రంబునకు. 76

క. జోటుజోటు నెత్తు రురుల వ్రీ,చుటయుం దప మాచరించుచుఁ జట్రిలుఁ డోళఁ డ
చ్చోటునుండి కటకు లదరం, బటుపటు వికటుగతిఁ ద తపటలి గోలుకుదుముళ్. 77

ఉ. క్రొవ్వున నిన్నగాగ్రమున కుం గుణపం బిటువట్టి వైచె నేఁ
డెవ్వఁ డతండు వారిజభవేశ్వరు లడ్డ మైనఁ జచ్చుఁ బో
యిన్వృథులాధరాగ్రమున నెక్కినయంతన యంచు శాపవి
న్నిపులోగ్రవాక్యనిచయంబులు వింటిమి నేను వాలియున్. 78

వ. ఇవ్విధంబున మతంగమహామునీంద్రుండు శపించుటం జేసి యిన్నగంబున నున్న నన్ను మాయన్న వెన్నడింప వెఱచియున్నవాఁ డని పలికి యతనికిం దనకుం గలపూర్వవైరకారణంబు సవిస్తరంబుగా నెఱిఁగించి విషాదఖేదసాదోదూయమానమానసుం డగు భానుసూను ననునయించి మేఘగర్జితసంకాశంబులగు భాషణంబులఁ బూషకులభూషణుం డిట్లనియె. 79

క. ఆలింపుము రవిసుత నీ, వాలిం గూడెదవు నిశ్చయంబుగ నిఁక తే
దాలస్యము జవవచ్ఛర:కీలిం గీలించి వాలి గీలిం గాల్తున్. 80
క. నేలఁ బడఁగూల్తు వారిసుతు, నేలఁ బడంజాలి వానరేశ్వర నీచే
నేలఁబడుం దత్పద మిఁక, నేలపడఁతికూఁతు వెదక నీపని సుమ్మా. 81
వ. అని సమ్మదోపపాదుఁడయు సుగ్రీవుండు జడస్వభావంబుగా నిట్లనియె. 82
క. మాయన్న మున్ను దుందుభి,మాయన్ నశియింపఁజేసి మడపిన కాయం
బోయన్న కదల్చినఁ జుమ్మా యెన్నఁగవచ్చు వాలి సరిఁ జెద వనుచున్. 83
చ. అన విని నవ్వి రాముఁడు మహామహుఁ డందఱఁగూడి వాసవి
ప్రణిహతదుందుభిప్రకటరాక్షసకాయము హేయముం గనం
గొని చరణాంగుళిన్మెఱయుఁగోటన మీటినఁ దచ్ఛవంబు యో
జన మగుదూరదేశమున శైలమన న్వడిఁ గూలెఁ గూలినన్. 84
క. కని విస్మయంబు మనమునఁ, బెనఁగొన వానరులు రాముఁ బృహుహర్షముఖం
గొనియాడి రంత నారవితనయుం డిట్లనియె సద్భక్తిప్రమదమునన్. 85
ఉ. వాలి జవంబున న్విసరివైచిన కాయ మితండు గాలి పె
న్వ్రేలునఁ దూలమీటెఁ గడువింత యుంజన దిప్పు డెందుఁటుం
దేలిక యయ్యె నాతని వధింప సమర్థుఁడవేని పూని యీ
తాళము లొక్కకోల వసుధన్బడఁ గూల్చినఁ జాల నమ్ముదున్. 85
క. అని తాళసప్తకముఁ జూపిన దశరథనామకాశ్యపీనాథసుతా
గ్రణియుఁ గపీశుఁడుఁ దను మెచ్చ సకల బాణంబు వింట సంధించి కడున్. 87
చ. లలి విడువం గలంబ మవిలంబగతిం దృణరాజసప్తకం
బిలనొకవెట్టఁ గూలి పడనేసి ధర న్వెస దూసి ధారుణీ
తలమును దాసి భోగుల పదంబు క్షణంబున డాసి రాముని
మ్ముల పొదిఁ జొచ్చె నెల్లరుఁ బ్రభూతభయాస్పదులై కనుంగొనన్. 88
క. తాళములఁ గూల్చి వెసఁ బా,తాళముఁ గని బాణ మత్యుదగ్రత వెడలం
దాళక భూతంబులు బే,తాళంబులు భీతి నొందెఁ దక్షణమాత్రన్. 89
క. తాళ్ళు దెగె నింక దనుజుల,యాళ్ళయొడళ్ళఁ గల మంగళాభరణములం
ద్రాళ్ళు మనకాళ్ళసంకెల,త్రాళ్ళును దెగు ననుచు దివిజతతి దివి నలరన్. 90
క. అప్పుడు తాళము లొఱఁగెడు,చప్పుడు కకుభముల నిండ సకలకుభంబు
లొప్పడువాలిం దునుమక, తప్పఁ డితం డనుచుఁ దరణితనయుఁడు వొంగెన్.

వ. మఱియు దద్గమనంబున నపరిమితానందంబు నొందె నయ్యవసరంబున. 92

శా. బంధూకారుణభానుసూనుఁ గని భూపాలుండు సుగ్రీవ కిం
ష్కింధాద్వారముఁ జేరి వాలి ననికిం గీల్కొల్పు మే నంతట
న్స ధాభార్గవుఁ డీతఁ డంచు జను లెంచ న్మించుబాణంబున
న్స్కంధాంతర్విహితవ్యథ న్వాలి నెగుతుం గ్రౌర్యం బవార్యంబుగన్. 93

క. అని సుగ్రీవుం బురికొల్పి నరేశ్వరుఁ డనుజుఁడును గలీముఖముఖ్యు
ల్దనుఁ గొలువ నేగి తత్సవిధనగాంతరమున వసించె ధానుష్కుండై. 94

ఉ. వాలి నెదిర్చి పోరుబలవంతులు లే రనుచుం గడంగి దే
వాలినుతు ల్సెలంగఁ గడు నర్హతవప్రముఖోజ్జ్వలద్యశ
శ్శాలి నొనర్పనో తరులచాటున డాఁగెను వాలిఁ గూల్పఁగా
కాలములోన రామునకు నడ్డమె వాలియుఁ గూలి గిలియుఁగన్. 95

వ. అంత ననంతసంతోషితస్వాంతుం డగుచు ననంతమణిసంతతి కిష్కింధానగరద్వారంబుఁ
జేరి మీఱి. 96

ఉ. ఏ సుగ్రీవుఁడ నాహవోన్ముఖుఁడ నై యేతెంచితి న్నిన్ను నీ
తా సుగ్రీవునొనర్తు నంచు భయదాహ్వానంబుఁ గావింపఁ దా
రాసౌందర్యవతీమనోహరవచఃప్రాగల్భ్యతాకర్ణన
వ్యాసంగుం డమరేంద్రనందనుఁడు దుర్వారుండు దర్పోద్ధతిన్. 97

గీ. క్రాలి విలయకాలకాలశాలుఁడు కేలి,శూల మొక్క మూలశాలం జేసి
వాలివచ్చుచున్న వాఁ డన నవ్వాలి, తాఁకెఁ దనయమిత్రుఁ దరణిపుత్రు. 98

వ ఇట్లు. 99

క. తలపడ నినతనయుఁడు ను,త్తలపడనిమనంబుతోడఁ దాఁకెఁ గరుణామున్
దలఁపఁ డనివార్యుఁ డీతని,తలఁ బడ నేయుము వెస దశరథసుతుం డనుమన్. 100

క. అబ్బలియును లబ్బరంబుగఁ, బొబ్బలిడుచు బొబ్బసొకయు బొబ్బసొకంబున్
బెబ్బులియున్ బెబ్బులియున్, గుబ్బలి గుబ్బలియుఁ జలముకొని కవియుఁగతిన్. 101

క. దంతంబులఁ గఱచుచు నఖ,కుంతంబులఁ జీఱుచుం బ్రకోపు లగుచుఁ బ
ల్వంతంబులు వలుకుచుఁ దదు,పాంతంబులశిలలు నలఁగఁ బదహతి లెసఁగన్. 102

ఉ. ఫాలము లెఱ్ఱవాఱ దిగిభశ్రుతిదారణకారణాహవా
స్ఫాలితబాహు లై రిపువిఫాలనతత్పరు లై కరంబుల
న్వాలము లెత్తి త్రిప్పుచు నవారణవారణయుగ్మకంబు నాఁ
బోలి పెనంగి రాప్లవగపుంగవు లింద్రదినేంద్రనందనుల్. 103

వ. మఱియు నన్యోన్యమర్మవిదారణకారణంబు లగుసంభాషణంబు లాడుచుం బోరా
డుచున్న సమయంబున. 104

క. అద్రిగరుద్భిత్సూనుఁ, డద్రికసూజునకు భేద మారయ లేమి
న్నిద్రావితారివారుఁడు, భద్రాయితమూర్తి రామభద్రుఁడు శంకన్. 105

క. వదనంబులు రదనంబులు, బదము లుదరములు నురములు బాహులు నఖము
ల్పెదవు లొకరూప వాలికిఁ, దదనుజుఁ డైట్టితరణితనయున కరయన్. 106

గీ. కానలెస్సగ సుగ్రీవు వానవాలు, వట్టియ నిరర్థకం బగునట్టియస్మ
దీయబాణంబునను వాలి నేయవలయు, ననుచు నెంతయుఁ దలపోయునవసరమున.

శా. శౌనాసీరికి సౌరి పాఱి రఘువంశ్యస్వామినిం జేరి యి
ట్లౌనా వాలి నెదిర్చి పోరు మని నన్నాజ్ఞాపితుం జేసి వే
వానిం దుంౘ కుపేక్ష సల్పితివి విశ్వాసంబుఁ బోఁద్రోఁచి నా
దేనిం గూల్పవె చూడు జర్జరిత మయ్యెం గాయమెల్లం గడున్. 108

క. వాలి నను జంపఁ జిదప, న్వాలిం జంప ఫల మేమి వసుధేశ్వర న
న్నాలిం గొనఁజేసెదె జనులాలిగొనం జేసితివి మహాత్ముఁడ వయ్యున్. 109

మ. అన నారాముఁడు నొచ్చి యిట్లనియె నీకా వాలికి న్రూపయౌ
వనసత్త్వాదుల వేఱు లేమిఁ గని దుర్వారాస్మదీయాస్త్రమో
చనముం జేయనితప్పు సైఁపు మెడఁద న్సందేహమున్మాను మి
ప్పుని కే నొప్పరికించిచూచెద నె ప్రభ్రష్టప్రతిజ్ఞుండ నై. 110

క. సమరూపాతిశయులు ఘోరసమరము మీ రాచరించుసమయంబున మో
స మగు నెర మిం దెవ్వరి, సమయించునొ యనుచు విడువఁజాలఁగ నైతిన్. 111

వ. కావున సాభిజ్ఞానుండ వై రణంబు సేయుము మన్నైన. 112

క. కంఠికి తెప్ప యగుచు ముక్కంటి యరుగుదెంచి వాలిఁ గాచిన వినుమీ
కంబెల్లఁ దీఱ నీవాల్గంటిఁ గొనినవానిఁ బట్టి కండలూడ్తున్. 118

వ. అని పలికి పవనపుత్త్రుం గనుంగొని. 114

గీ. వాలితోఁ బోరునెడ నానవాలితండు, మాలి యైనను నీవంకమాలితనయు
నలుత నొకరయెత్తుఁ దగులుపు మరుగు పట్టు,లేని రిపుఁ గూల్తు నే నడ్డులేనికడిమి.

వ. అనంతరయంబ దక్షిణంబున. 116

ఉ. జ్ఞానినుతుండు సంగరవిశారదుఁడు న్మహనీయకీర్తి ప్ర
జ్ఞానిధి రామమూర్తిసముఖంబున వాయుతనూభవుం డభి-

జ్ఞానము గాఁగ నెంతయుఁ బ్రయత్నముఁ స్మరించి తెచ్చి స
న్మానముతోడ నుంచె సుమమాలిక నేలికకు దయాళికన్. 117

వ. అంత. 118

క. కంధరధృతమాలికు ఘన,కంధరనిభదేహు రవిజుఁ గని రాముఁడు ద
ర్పాంధు భవదగ్రజన్ము ను,ద్ధాంధఃపతిపుత్త్రు విల్వు మాహవమునకున్. 119

చ. అనవుడు సంశయంబు హృదయంబునఁ దోఁప నడంచికొంచు వే
చని విబుధేంద్రనందనుని సాహస మొప్పఁగఁ జీరెఁ బేరెలుం
గున సమరంబు సేయ నిదిగోఁ జనుదెంచినవాఁడ నంచు ద
ధ్వని విని వాలి పంకజహితప్రభవు న్వయించ నుగ్రుఁడై. 120

వ. చనుదెంచునెడ నెదుర్వచ్చి నఖనిజితతార యగుతార యిట్లనియె. 121

క. ఏను బలవంతుని నెను బ్రాఁ,పున వచ్చినవాఁడు తపనపుత్త్రుఁడు కాఁడు
న్నను బోరి పాతి మరలం, జనుదెంచునె కలని కిది విచారించు మెదన్. 122

క. హృదయేశ నామదిం గడు, బెదరొందిన దదియుఁ గాక ప్రియ కుడివెస నా
కదరుచున్నది పోఁగూడ దశుభ దుర్వచనములు పెదవులఁ బెట్టెన్. 123

వ. ఇట్లనాదరించి హితోపదేశిని యగునమ్మత్తకాశినిం గనుంగొని. 124

క. తరుణి నను జయింపఁగ న,త్తరణిసుతుఁడ వాఁడు నిశ్చితంబుగ విను మి
ద్ధరణిఁ బ్రయత్నంబున నవ,శరణము నొందఁగ వలదె పైనం బైనన్. 125

క. బోటీ నీమాటలు నా,బోఁటిమహావీరు నెడలఁ బొసఁగ వనుచుఁ గో
పాటోపమానసుండు వ,నాటవిభుం డరుగుదెంచె నర్కజుఁ డాఁకన్. 126

వ. ఇట్లు వచ్చి. 127

క. కోపరసం బొడ లూనెనొ,కో పరికింపంగ ననఁగఁ గుసుమదరిపుజుత్తో
నోపంద మద్భుజాహతి, నోపం దర వానె తలఁగు మోటమి వచ్చెన్. 128

చ. అని వెస వాడి సౌరి నొకహస్తమునం గుదియించి రొయ్యఁ గే
ల నతనిమస్తకంబునఁ బలం బెసలారఁగ గ్రుద్దినం గడుం
దనరెను వాఁ డెటేఁగి తనతమ్ముని గౌఁగిటఁ జేర్చి స్వాధికా
రనిఖిలభార మాతనిశిరంబునఁ బెట్టె నొకో మునుం బడల్. 129

వ. ఇవ్విధంబున. 130

క. గ్రుద్దిన నీడంబోవక, ప్రొద్దునిసుపు వాలియురముఁ బొడుచు నిరవుగుం
దద్దయు నద్దవిడిం బెన్నుద్దు లగుచు ప్రేటు లాడుచున్నట్టితఱిన్. 131

క. సుగ్రీవుఁడు మాలాస్యగ్రీవుఁ డగుట వాలి యపుడు దెలిసి భూ
పాగ్రణి సముగ్రదోఃప్రబలోగ్రుఁ డగుచు వాలిఁ జునుమ నూహించె మదిన్. 132

ఉ. రాముఁడు ధార్మికుం డురుశరంబు గుణంబునఁ గూర్చి భానుజుం
డీ మొనరించి యాతని వడిం గొనివచ్చినయట్టివాలి శా
ఖామృగశాలి పేరురముఁ గాఁడఁగ నేసెఁ గలంబముం దరు
స్తోమముచాటున న్నిలిచి నూట్రిదలిర్పఁగఁ గాలవేదితన్. 133

వ. ఇట్లు దృష్టిముష్టిసౌష్ఠవంబు వెలయం దెగవాపుటయు. 134

ఉ. తాళము లేకుఁ గూల్చి వసుధాధరముం జెకలించి మించి పా
తాళముఁ జొచ్చి వచ్చినకదంబము వాలియురంబు దూసిపోఁ
గాలక నిల్చెబెంతయును జానెసఁగె న్వెస వాలిప్రాణవా
తూలము బీల్చుచున్న దనఁ దోయజమిత్రతనూజుఁ డార్వఁగన్. 135

వ అంత. 136

చ. సరభసవృత్తి రామునిప్పువత్కముతంబున గాఁడినం దివి
శ్వరతనయుండు హా యని దివాకరనందను వీడి ధాయణీ
ధర మురుభీకరస్వనహితం బయి కూలినభంగి వాలి గం
హారిదిగఁ గ్రుంగ వాలి తదనంతర మాస్వపుఁ గాంచి దీనుఁడై. 137

ఉ. తార హితంబుఁ దెల్ప నతిధార్మికుఁ డారఘురామమూర్తి ని
ష్కారణ మేల నాపయిఁ బృషత్కము నేయు నటంచుఁ దద్వచ
స్సారము నీస చేసి పరుషక్రియ వచ్చి త్వదీయకైతవ
స్ఫారత నిట్లు పాలయితిఁ జావఁగ నీ కిది పౌరుషం బొకో. 138

క. మించినధార్మికుఁడవు కడు,వంచన గావించి వృక్షవారమునడుమం
బొంచి నను గూలిచితి వెఱ్ఱించి నమం గెల్వ నవ్విరించికి వశమే. 139

వ. అది యట్లుండనిమ్ము. 140

సీ. ననుఁ జేరఁబిల్చి తమ్మునిరాజ్యము కేఁ, పాపి వాఁడ వటంచుఁ బల్కవైతి
వతనికి నీకుఁ బోరిత మెట్టు లయ్యె ము, న్నని తెలియంగ నన్నడుగవైతి
వతని కీహరిరాజ్య మంతయు నొసఁగిపొ, మ్మవలి కీ వనుచు న న్నాడవైతి
వినజునితో వైర మేల నీ కని సమ్మతింప సఖ్యము సంఘటింపవైతి

గీ వింతయేటికి న న్నెదిరించి పోరఁ, గ్రూరనారాచమునఁ బడఁగూల్పవైతి
వకట రామ సమగ్రుఁడ వయ్యుఁ బొంచి, ప్రమందఁ జేసితి విష్ఠ డేమందు నిన్ను. 141

క. అంధునకుఁ జాత్యంధుఁడు, పంథానము సూపలేనిపగిది ఖ్యాతసతీ
బంధుఁ డగుపట్టి వారిజబంధుసుతుం డెట్లు నీకు భార్యం గూర్చున్. 142

క. పసుల కహితం బొనర్పక, తరుల గిరులఁ దిరుగుకపి వృథాపాలియుంప
న్నరవర నీ కర్మమె న, న్నవలలుగఁ జేసినాఁడ వన్యాయముగన్. 143

క. విను సత్త్వహీనుచందం, బునఁ దరునికరంబునడుమఁ బొంచి మదమున
న్నను గపటంబునఁ బరిమార్చినవాఁడవు నీవు మానిసివె తలపోయక. 144

వ. అని యిట్లు. 145

చ. అలసత వాలి రోషపరుషాక్షరగుంభితవాక్యసంతతు
ల్పలుక రఘూత్తముం డవనిపాలశిఖామణి రామభద్రుఁ డ
వ్వలిముఖుతోడ నీకిటులఁ బ్రాణము వీడఁగ ధాత్రప్రాంతముం
గలుగఁగఁ దప్పు నెట్టు తెలుఁగన్వళ మానె పురాకృతంబులన్. 146

వ. అదియునుంగాక. 147

క. నిను నెవ్విధమునఁ బరిమార్చిన నాకుం బాతకంబు సిద్ధింపగు త
మ్ముని భార్య రుమం జెఱపిన పెరదోసివి సిగ్గు లేక ప్రేలెద వనుచున్. 148

క. వాలి దనుదూఱినుడువుల, కోలి సదుత్తరము లిచ్చుచున్నయెడలఁ దా
నాలించి కపికులాధిపు, నాలించుక తాల్మి లేక యవశతఁ గొంచున్. 149

మ. గళదశ్రూదకధార లై విగతముక్తాహారవిస్తార లై
చలదక్ష్యల్పవనావలగ్న లయి విస్రస్తాసితాభుగ్నకుం
తల లై హస్తతలప్రతాడనవిధూతప్రోల్లసత్ఫాలభా
గలసత్కుంకుమచిత్రకప్రరుచి లై యత్యంతదీనాక్షి లై 150

క. చనుదెంచి జీవితేశుం, గనఁ బోయెడుజీవితేశుఁ గని తార మహా
ధ్వని రామచంద్రునకు న, య్యినజునకుం గరుణ మానహింపఁగ నేడ్చెన్. 151

వ. ఏడ్చి రామరాజన్యకశరావళిలీముఖవిభిన్నుం డగు [illegible] గనుం
గొని 152

క. వానరనాయక యిపుడీ, వానరనాయకునిబాణహతి నీగతి నె
మ్మేనయఁ బొరల నగు, మ్మేనవలోకింపవలసె నే మనస్సున్. 153

క. శైలశరానునివాసము, కైలాసముఁ ద్రొల్లి బంతిగా నెత్తియ
ప్పౌలస్త్యుని వాలమునఁ, గీలించినదిట్ట విట్టు గిట్టితె కట్టా. 154

క. దారం దారను విభవో, దారకు దారకుని హరిపదంబు విడిచి బృం
దారకలోకమునకు బృం, దారకరాజసుత పోవఁ దలఁచితివె మదిన్. 155

వ. అని మఱియు నతని సాహసాదిగుణంబు లగ్గించి విలపించుచు. 156

క. ధరణిం బడి పొరలెడు తరు,చరవరుశిర మంకసీమ సంధించి తదీ
యరమణి నిజాశ్రుకణసం,భరితానను జేసి మిగులఁ బరితాపమునన్. 157

చ. నను గనువిచ్చి యొప్పరగ నాథ కనుంగొను మేను దార బే
రను ననుఁ జూడ నీకు మదిరాదు వి ష్టసుభాగ్య నాట నీ
తనయు ననంగదర్పవిజితస్ఫురదంగవిలాసు శత్రుసై
న్యనికరభంగదు న్మణిమయాంగదు నంగదుఁ జూడు మర్మిలిన్ 158

క. కను విచ్చి ననుఁ గనుంగొను, మని యఱచుచు నంగదుఁడు పదాంతికభూమి
న్నీను పొరలుట యువరాజ్యం,బునకు ననుం బూన్పు మనుచు మ్రొక్కుటయె పతీ.

క. ఇనజుఁడు సుగ్రీవుఁడు నా, యనుజుఁ డనక యతని వైభవాప్తి సేయ
న్మనుజునిచేఁ జావలసెఁ, జను నే యెవ్వరికి సహజశత్రుత్వంబుల్. 160

వ. అని ధర్మంబుఁదోఁప నాడి. 161

గీ. మఱియు శోకాంబురాశినిర్మగ్న యగుచు, హస్తయుగ్మకమున నిజమస్తకంబు
మోఁదికొనుచునుదనతోడమీఁద నున్న, ధవునితల డించి తార రాఘవునిఁ గాంచి.

క. ఒకతోఁ బోరెడునావరు, నురుతరుషండంబులోన నొదిఁగి యొదిఁగి సం
గరధర్మకోవిదుండవు, ధరణింబడఁగూల్చితివి విధాత్రునిచె యుదిన్. 163

ఉ. నీసతి సీత నెత్తికొని నింగిఁ జెలంగుచు నేగ రావణుం
డానురవృత్తి నాసురగణారి వధింపక నీవు నావిభుం
జేసితి కాలగోచరుఁగఁ జెప్పెడి దేమి యొకండు నేరమిం
జేసినఁ గతు వేఱొకనిఁ జేసితి సామ్యము చెప్పినట్టుగన్. 164

క. మిత్రతనూజన్ ఘనుఁ డగు, మిత్రునిఁగా నెంచికొని యమిత్రత్వంబుం
గోత్రరిపుసుతునిపై నో, ధాత్రీశ్వర చూపుటది ధర్మముగాదే. 165

వ. అని పలికి యంత నిలువక. 166

క. పాలనునిరీతి నో భూ,పాలక భార్యాసుతులకుఁ బాపితి విపు డీ
వాలినిఁ జెప్పెడి దేమీ, వాలిని బిడ్డలను గూడి యచటదె కుశిపై. 167

వ. అని పలికి వెండియు ననేకవిధంబులం బలవించుచుండె నయ్యవసరంబున. 168

చ. అదరుచు వాలి యాలిఁ బ్లరగావలి మేదిని వ్రాలి యున్న యం
గదుని మనోహరాంగదుని గన్గొని వేదనపేర్మి గాఢగ
ద్గదిక నెలుంగు రాలుపడఁగా ననియె న్నినుఁ జేల చాలనం
గదమురపిల్ల నెల్లరకుఁ గాలముమూఁడినఁ గేటు తప్పునే. 169

క. ఇఁకఁ బుత్త్రసత్కళత్త్రాదికబంధుసహోదరప్రవృద్ధతర మగుప్రేం
దిక నాకుఁ గడచనియెఁ గుం,దక ధైర్యము నూఁదుఁడీ మనమ్ముల మీరల్. 170

వ. అని పలికి తనవారి నెల్లం గలయం గనుంగొని. 171

ఆ. మున్ను నన్నుఁ గొల్చి యున్నచందంబున, దపనపుత్త్రుఁ గొల్చి తదనువర్తు
లగుచు మెలఁగుఁ డతఁడు దగవరి యతనిని ,దించి కాదె చావుఁ దెచ్చికొంటి 172

వ. అని పశ్చాత్తాపపరవశుండై. 173

క. దారం దారను నఖజిత,తార స్మితకాంతిదంతతార న్మణిమం
జీరం జేరంజీరి గ,భీరోక్తుల వగపు మాన్చి ప్రియ మిగురొత్తన్. 174

మ. కొడుకుం గౌఁగిట జేర్చి మోహమునఁ జెక్కుల్ నొక్కి మూర్ధాది యా
ఘ్రూడు మోహంబున వాలి యిట్లనియె నీకు న్వేతుకం దంక్రిపెం
దొడ్డవై వాడుట తీఱె నిన్నుఁ గనుసంతోషంబు నా కింతటం
గడ తేఱెం గలకాల మెవ్వరికి నేకాకారతం జెల్లునే. 175

క. అని మఱియుఁ దనయుం బుచితవ,చనముల నూరార్చి బాష్పసలిలోద్గముఁడై
తనయుదుర మిగుల వగ నొం,దునలి హితసుతున కంగదుం జూపి దయన్. 176

చ. అనుజుఁడ చింతఁదక్కి పరమాదరణంబున నామవాక్యము
ల్విను మును దుర్వివేకి నయి వేయువిధంబుల నిన్ను బాధప
ట్టినఫల మీవిధంబున ఘటించె నటుంచును దాని వీని నా
తనయునిఁ బూర్వమత్కృతవిధంబుఁ దలంపక ప్రోవుమీ దయన్. 177

వ. అని తనయునకుం దగినవచనంబులు వెండియు నుపన్యసించి యొప్పగించి తమ్ముఁ
డా నీకు సర్వంబునకు రాముండ కలం డని నిశ్చలాంతఃకరణంబున రామచంద్రున
కభిముఖుం డై. 178

క కలలో నెవ్వనిపదములు, దలఁచిన నఱచేతి వగుచుఁ దనరుచు నుండుం
గలలోకము లప్పదములు, గలలోకైకనుతు నిన్నుఁ గంటి న్కంటికన్. 179

మ. అని తద్దివ్యపదాంబుజద్వయమరందాసక్తహృద్భృంగవ
ర్తనుఁడై తృష్ణ నిరాకరించి భవహర్తా రామ శ్రీరామ రా
మ యను న్సత్కరుణాకటాక్షమున సన్మానింపు మంచుం దొరం
గ నొగిం బ్రాణములేనఁ బొర్లుచును సుగ్రీవాగ్రజుం డొక్కటన్. 180

వ. ఇవ్విధంబున సకలసద్గుణశరధి యగు దాశరథిశరపాతపాతితపాతకుం డగునతండు.

గీ. ఫలము లాకులు దిని దిగంబరతఁ దిరుగు, నట్టివనచారు లేగడునట్టిగతికి
ఫలము లాకులు దిని దిగంబరతఁ దిరుగు, వట్టివనచారి యయ్యుఁ దా నపుడు చనియె.

వ. ఇట్లు దినరాజనందనుండు దివిజరాజరాజధానిం బ్రవేశించుటయుం బ్లవంగాం
గనలు నింగి వగుల వగలం బొగిలి రందుఁ దార శతారాయుధనందనుం దలఁచి. 183

క. భిదురనిభం బగు రామప్రదరం బుదరంబుఁ గాడి పడిపోయితివా
పద రవిసుతుఁ డార్వఁగ న్యామది నపగతశూర భూరమణి యని తలఁతున్. 184

క. ఆహార మెడలి కడు మున్ముక్తాహారత నివ్విధమున నలఁగితె యిచ్చో
నాహా నాబాహాబల, మాహవమున నగపటుఁ జిత మయ్యె నని కటా. 185

వ. అని వగచియు నతనిగుణంబు లగ్గించి పొవయుచున్న సమయంబున. 186

ఉ. రామునియాజ్ఞ లక్ష్మణుఁ డరాతిభయంకరు నాంజనేయు ను
ద్దాముఁ బురస్కరించుకొని తారను దారకుమారకుం గపి
స్తోమము నర్కనందనుని సొంపగుమాటల నూఱడింప సు
త్రామజనూభవుకున్ హితవిధానమునం దహియించుపూనికన్. 187

వ. సుగ్రీవుం డంగదుం బురస్కరించికొని సమస్తవానరచమూసమేతుం డై సము
త్పాటితరామసాయకుం డగువానరనాయకుం డగ్గలి డగ్గుత్తికఁ బెట్టి యేడ్చుచు
నొకింతసేపునకు ధైర్యంబు జిక్కంబట్టి యక్కుణపంబుఁ బవిత్రజలపరిప్లుతంబుఁ
గావించి గంధమాల్యాద్యలంకరణశోభితంబుఁగా నుచితవాహనంబున నిడి బల
వంతు లగు బలీముఖప్రకరంబు మోచికొనిరాఁ బ్రేతభూపరిసరకాననంబునకుం జని
యుక్తక్రమంబున శిబిక డించి చందనాదికసౌరభపదార్థసంచయంబుఁ గూర్చి
పేర్చి నశోకంబునం జితి పేర్చి యప్పాడపై వాలికళేబరంబుఁ జేర్చి యప్రదక్షిణం
బుఁగాఁ దిరిగివచ్చి శిరఃప్రదేశంబున నంగదప్రయుక్తయుక్తం బగు నప్పార్చఁ బ్రవృ
ద్ధార్చిఁ గావించి విరక్తియుక్తు లాడుచు నుచితక్రమంబున నగ్నికార్యంబు డపె
నంత వానరవధూవిలాపంబు లాకసమొగిం దిక్కుఁ బ్రువం బిక్కటిల్లె నందుఁ దార
వనోవల్లభు నుద్దేశించి. 188

ఆ. అతులసుందరాంగయుతుఁడ వగుచుఁ దార, రతిఁ గరంచి సంగరంబునందు
హరికుమార భస్మ మయిపోయితివె యక్క, టకట రాజమాళియుంబ కాన్న. 189

క. అని వగచియుఁ బెక్కుఁదెఱఁగుల, నగమిపపతి సుతునిఁగూర్చి యార్చెడుతారం
గొని పంపాతీరమునకుఁ, జని సుస్నాతు లయి గ్రిచరవరు లెల్లన్. 190

వ. ఇట్లు పవిత్రస్నానంబులు గావించి. 191

క. వలయుఁదిలోదకములు నిశ్చలభక్తి నొసంగి షోడశమహాదానం
బుల నన్నదానములఁ దృప్తులఁ జేసిరి బ్రాహ్మణులఁ గవులఁ దగురీతిన్. 192

వ. మఱియు నవ్వానరేంద్రుండు కపురేంద్రలోక స్థితినివాసకరంబు లగు కరణీయంబు
లెన్నియేని నడిపి యతం డిత్యాపన్నోద్ధారం బప్పుణ్యనదీతీరంబునఁ గొన్ని దినంబు
లున్న యనంతరంబున రవినందనుండు రఘునందన చరణారవింద సందర్శన కందళిత
హృదయానందుండై చని. 193

క. అంగదునింగూర్చి ప్లవంగాంగనలం బురికి ననిపి యంగము పొంగా
రం గుముదరిపుసుతుండు సర్వాంగాలింగితవసుంధరావలయుండై. 194

భుజంగప్రయాతము. ప్రణామంబుఁ గావింప రాముండు జూచి
ద్ఘృణామందహాస ప్రకీర్ణాననుండై
గుణాఢ్యుం బవిత్రాత్ము నా భానుసూనున్
మృణాళోరుబాహుద్వయిం గ్రుచ్చి మెత్తెన్. 195

వ. ఇట్లు గాఢాదరపూర్వకంబుగా గారవించి కరుణారససముద్రుం డగు రామభద్రుండు
పవనతనయానుజులం గనుంగొని. 196

ఆ. వాలిచేతమున్న పాలితంబగు కపి, రాజ్యమునకు నిను బూజ్యలీల
నాచరింపు డాభిషేచనశోభనం, బిక దడవు సేయనేల మనకు. 197

క. అనవిని సౌమిత్రిపవన, తనయులు రఘుతిలకు లజానితనయుండును ద
క్కినకపియూథపులుం జయ్యన నాతనిం జుట్టుముట్టి యతులితలీలన్. 198

ఉ. బాంధవ మొప్పఁ గూడికొని బంధురతూర్యరవంబు లొప్పఁ ది
క్సింధురకర్ణగోళములఁ జిందఱవందఱ సేయ సిద్ధగ
ర్వాంధత వానరుల్ నడువ నల్లనఁ దోడ్కొనివచ్చి రప్పుడు గి
ష్కింధకు దేహశోభలరుచిప్రతిభానుని భానుసూనునిన్. 199

వ. ఇట్లు దోడ్కొనివచ్చి.

క. శ్రద్ధం బ్లవంగాంగనలు సమిద్ధగతి నివాళులీయ నినజుండు సొచ్చె
న్నుద్ధాంతఃకరణుం డగుచు, శుద్ధాంతారుద్ధసిద్ధశుద్ధాంతంబున్. 200

వ. ఇట్లంతఃపురప్రవేశంబు గావించె నంతకమున్న పౌరులు. 201

ఉ. కట్టిరి తోరణంబు లెసఁగ న్నిమ్మను ముట్టినతోరణంబులం
బెట్టిరి పూర్ణకుంభములు మేదురలీల మృదంగకాహళ
ల్గొట్టిరి పుష్పమాలికలు గుమ్మనఁ దావులు గ్రుమ్మరింపఁగాఁ
జుట్టిరి ద్వారదేశముల సూర్యతనూభవుఁ డుల్లసిల్లఁగన్. 202

క. ఫలయుతరంభాక్రముకంబుల నెల్లెడఁ బొందుపఱిచి పునుఁగు జవాదిం
గలయంపిఁ జిలికి కస్తురి, నలికి యుడిరి యాణిముత్తియపు నన్రముగ్గుల్. 203

వ. వేదియుం బరమశోభనంబుఁ గావించి రప్పురవరంబు సమస్తసంభారసంభరితంబును వారాంగనానృత్తగీతవిచిత్రంబును మంగళతూర్యరవసంగతంబును సకలజననయనానందకరంబునై కరంబు విలసిల్లుటయు. 204

ఉ. అంతననంతసంతసమ్మాదంబుజు నంబుజమిత్రపుత్త్రి న
త్యంతమనోహరాంబరనవాభరణాన్వితుఁ బుష్పమాలికా
క్రాంతగళప్రదేశు నొడికంబుగఁ దోడ్కొనివచ్చి తత్సభా
భ్యంతరసింహపీఠమున నాతనిఁ గూర్చి రమాత్యులొప్పుగన్. 205

క. చామరము లిడిరి వేల్పుఁ, జామల కెనవచ్చు ప్లవగచంద్రముఖులు ని
స్సీమాభిరామభూషా, స్తోమఝుళఝుళలు సన్నుతులు సేయంగన్. 206

గీ. తిమిరారాఘవుఁడు కృతప్రతిజ్ఞుఁడయ్యెఁ, గాన నీవును బ్రత్యుపకారపరుఁడ
వగుమనుచుఁ బుత్త్రినకుఁ దెల్ప నరుగుదెంచె, మిత్రుఁడనఁ నొప్పెసంగె సితచ్ఛత్రమంత.

వ. పట్టాభిషేకసమయం బాసన్నం బగుడు మానవజ్ఞానవాదు లవనీసురసమూహము
లై పుణ్యాహవాచనపూర్వకంబుగా హోమవిధి యథావిధి నిర్వర్తితంబు గావించి.

చ. కలుషహరంబు లంబువులు గల్గినభూరిసువర్ణకాంచనో
జ్జ్వలకలశంబు లందికొని వానరరాజ్యవరాభిషేచనం
బలకడ నాచరించిరి మహాగుణశాలికిఁ బ్రొద్దుమాలిక
యత్యఘులు రామచంద్రుని దయామృతముం జిలికించునట్లుగన్. 209

క. అమరనగరావతికి నయ్యమరు లమరనాథునిఁ గ్రమాధికృతికి న
ర్యము మున్నభిషేకించిన, క్రమమున సుగ్రీవు నఖిలకపిపదమునకున్. 210

క. అభిషేకం బొనరింపఁగ, నభిషిక్తుఁడయ్యె భాస్కరాత్మజుఁడు కపి
ప్రభుఁడగుచుఁ దారకామధ్యభాగభాగమృతకిరణు నాకృతి నంతన్. 211

గీ. సకలవానరులకు రామచంద్రుఁడు ప్రమోదముగాఁగ నప్పుడ యంగదునకు
విదితమగు యౌవరాజ్యసంపదకు నర్హుఁ, జేసి పట్టాభిషేకంబు సేసెఁ గరుణ. 212

వ. ఇవ్విధంబునం గోత్రభిత్పుత్రునకుం బూజ్యయౌవరాజ్యపట్టాభిషేచనం బాచరించి ప్రాజ్యసామ్రాజ్యంబు వడసి మార్తాండనందనుండు రెండవ చండకిరణుం డనం బ్రజ్వరిల్లె. 213

ఉ. అత్తఱి వానరాంగనలు హారతులీ సచివప్రయుక్తుఁడై
పత్తనమెల్ల మెల్లన సభార్యుఁడై ప్రచరించి రాజ్యసం
పత్తిఁ గరంబు రాగిలి నృపాలతనూభవదివ్యదర్శనా
యత్తమహాద్భుతుఁ డబ్జహితాత్మతనూభవుఁ డుల్లసంబునన్. 214

క. చనిబద్ధాంజలిపుటితాననుఁ దున్నయవినయభయవినమితశిరస్కుం
డును నగుచు రామచంద్రుం గని మ్రొక్కి యతండు ప్రీతిఁ గౌఁగిటఁ జేర్చెన్.

వ. అపరిమితానందభరితాంతఃకరణుం డగుచు నతని కిట్లనియె. 216

క. ప్రతిన నెఱపితివి నీవు, ప్రతిహతబలశాలివగుట బ్రతికితిఁ గృపనన్
బ్రతిపీక్షింపుము ప్లవగ, ప్రతతిం దప్పింతు నీదు ప్రమదనెదకన్. 217

చ. అనవిని సంతసించి నలినాప్తతనూభవుఁ గాంచి రాముఁ డి
ట్లను బురికిప్డు పొమ్ము శరదాగమ మయ్యెను వమ్ము ధారుణీ
తనయసువార్తఁ దెమ్ము విదితమ్ముగ నిప్పను వానకాలమం
దనఘ వసింతు సోదరసహాయత నిగ్గిరిగహ్వరంబులన్. 218

క. కర్ణకజనదయనయనో, త్కర్ణ మువర్ణ బుకువరుఁ గాఁ గపిసేనా
ఘూర్ణితభూభాగుఁడవై, హర్షమ్మువరమ్ము కార్తికాగమనమునన్. 219

చ. అనుడుఁ దదాజ్ఞ వానరసహస్రసమేతము గా మహాముదం
బునఁ బురికేఁగుదెంచి కపిముఖ్యుఁడు భాస్కరనందనుండు త
జ్జనకసుతాగవేషణకుఁ జాలినమర్కటకోటి. బిల్వఁ బం
చి నిఖిలసుత్రిప్రుంగవవిశిష్టసహాయము పెర్మె నంతయున్. 220

క. రమణీమణియగు తారా, రమణిప్రియుఁడగుచు భాస్కరసుతుఁడు మెఱసె
న్నుమ నధికభూషణ మనోరమఁ గూడి ప్లవంగరాజ్యరమ కధికృతుఁడై. 221

వ. ఇట్లు సంప్రాప్తమనోరథుండై మహాసుఖంబు లనుభవించుచుండె నంత నక్కడ
రాముండు సౌమిత్రిద్వితీయుండయి ప్రవర్షణగిరిబిలంబుల సీతావియోగసాగరం
బు నిస్తరింప నుపాయంబు గానక సంతప్తచిత్తుండై యుండునంత. 222

క. కాలమునఁ దోఁచెఁ దొలకరి, కాలము నిబిరీసకాళికాకాలము భే
కాల మతిరిక్తశైత్యకు, నాలయు పాంథజనములకు శూలంబగుచున్. 223

క. ప్రాఙ్మార్గగతబహుళాబు జలముఙ్మాలాపిహిత మగుత మోమయము చతు
ర్దిఙ్మాలిన్యము దరదహి, భుఙ్మార్గ్యము వర్షబుకువు పొలుపు వహించెన్. 224

చ. ప్రబలివలాహకంబులు నభంబున ఘూర్ణిలుచుం దటిల్లతా
ప్రబలత లోకమెల్లఁ దిమిరస్థగితంబుగఁ బర్చిచుప్రదే
శబలభిదుగ్రచాపవిలసత్స్థితి యొప్పఁగ వృష్టిఁ గల్గఁజే
సె బహుళభూతకోటులఁ గృశింపఁగఁ జేసిన తాప మాఱఁగన్. 225

క. వెనుమిత్త్రిది పల్లంబిసె, యనిజనముల కేప్పరి ప నవళంబుగ వృ
ష్టి నిరంతర ధారాప్రాతమున భువనంబు భూమ్యనకమయముయ్యెన్. 226

గీ. పాంథకలహంసహృదయనిర్బంధకంబు, సమితనాగకుమారభయప్రదంబుఁ
గాఁగ నెంతయుఁ గేకికేకారవంబు, గల్గె నెల్లెడఁ బర్వతాగ్రంబులందు. 227

వ. అయ్యవసరంబున.

చ. అతులితరీతి గోత్రికి వర్షము వృద్ధి నొసంగుచుండఁగా
నతిరమణీయబాలతృణమంతట నెంతయు నొప్పుమీఱె సం
తతకనకాభ్రవర్గవితతస్ఫురదంబులసత్ప్రవాహసం
గతమున భూతధాత్రి కురుగత్రికిఁ బ్రాఁకుడు వట్టెనో యనన్. 228

క. కమలాకరములు నిండియుఁ, గనలంబులు దెలివిఁదూలి కమలెఁ గమలినీ
రమణుండు తిమిరపిహితుండై, సముదంబెడలి వోకోయనం దద్వేళన్. 229

గీ. వనము లెల్లను ఝిల్లికావనములయ్యె, భువనమెల్లను సంపూర్ణభువనమయ్యె
నభ్ర మభ్రమయంబయ్యె బ్రమగన, నిబిడవారిదప్రావృడనేహమునను. 230

శా. ప్రోదిన్ త్ర్యంబకదీప్తి నర్జితరథాంగారావముం బ్రస్ఫుర
ద్యాదశ్శోణిత మింద్రగోపభయదోద్యన్మాంసఖండంబు నస
చ్ఛాదోమేదము వర్షబిందు లసదస్త్రం బభ్రమాతంగము
న్నోర్మీభూత సమస్తభూతముఁ బతన్ముక్తాసిలేశంబునై
శోధింపఁబడె వానకాలము రణక్షోణీతలప్రక్రియన్. 231

ఆ. అఖిలభూతకోటి కాహ్యాయనంబగు, నట్టివానకాల మగుడఁ బుడమి
పట్టియగుడు రామభద్రుండు జలదాలి, దగుపిరాలిఁదూలి తాల్మిమాలి. 232

వ. తమ్మునిఁ గనుఁగొని.

గీ. లక్ష్మణ తటిత్ప్రభాప్రభాలక్షితంబు, మేఘనిర్ఘోషఘోషసమ్మిశ్రితంబు
నతులఝంఝాసమీరసమావృతంబు, నైన యీకాల మధికభయంబు గాదె. 233

క. పసిపిడుగులజడికంటెఁ, గడు బెడిదము లిమ్మయూరకంఠధ్వను లె
క్కుడు విసదారుల మెసవిన, వడిశిరమదిసెకునె యెట్టిక్రంతలఁ బడినన్. 234

క. అని మఱియు న్విను మనుజుఁడ, పెనుగతిఁ బ్రావృట్పయోదపిహితములగుని
ద్దినములు దుర్దినములుగా, కనఘా సుదినంబులెట్టులగుఁ బాంథులకున్. 235

క. అనుగము నాకు స్మరపుం, జానుగనిహాతతివలెఁ బాపమధికముఁ జేసెం
గ్లేశవినాశని జనక, క్ష్మేశసుతం బాసియున్నకృపణుఁడ నగుటన్. 236

వ. అని మఱియుం దద్వియోగకృశానుయోగసంతప్యమానంబగు మానసంబున సౌమి
త్రి హితవచనరచనామృతంబునం దనుపుచుండునంతం గతిపయదినంబులకు. 237

సీ. ద్యోధునీనిర్మల పాథోంతరపరిస్ఫుటత్పుండరీకషండంబులనఁగ
వ్యోమకేశునిజటావ్యూహభాగంబునఁబూసిన వెలిబూది పూఁతలనఁగ
ఖచరులు దడివోవఁగా నాకసంబున నాఱఁగట్టిన తెలిచీరలనఁగఁ
దొలుకరిఁ జెడిన నలమానసముఁ బాసి పఱతెంచు రాయంచ బారులనఁగ
గీ. మఱచుపగవాని గర్భీకరించినట్టి, నింగిజవరాలిగండపాండిమములనఁగఁ
జకితచాతకజాతసంజాతపాండు, రాభ్రములు మించెఁ దచ్ఛరదాగమమున. 238
గీ. భూసతీ స్తనగిరుల మున్పూసికొన్న, లలితకస్తూరికాదంబు దొలఁచి ఘనసి
తాభ్రయోజితచంద్రకం బలఁదెనఁగ, నలరెను సితాభ్రము లవ్యోమాభ్రములను. 239
క. అడఁగె న్నేకంబుల రొద, లడఁగె న్నేనుంబు లంచ లబ్జవనములం
గడఁగె న్విధుండు శరములఁ, గడఁగె స్మరుఁడేచి విరహిగణముల నెఱవన్. 240
చ. కలుషతఁ దొల్లి తీరములఁ గాచిన భూరుహకోటిఁ గూల్చి త
త్ఫలములు మతినిట్టులయ్యె ననఁగా నదు లెంతయు నిర్జలంబులై
వెలవెలఁబాఱెఁ జొచ్చె నది చింతయు నంజన దెట్లుఁ గాంచనో
ర్ములుఁగలవారికిన్ ఘనతయబ్బునటు లొయ్యఁ బాడియే. 241
వ. అంత. 242
ఉ. దక్షిణగాములైన జలదంబుల శోకమ్ముధరాసురుండు ప్ర
త్యక్షముగాఁగ స్రుక్కుచుఁ బ్రయాణము మానినవో యనంగఁ బ్రా
గ్దక్షిణభాగమందున నగస్త్యమహోదయమైన మేఘమా
లాక్షయమయ్యె నంబర మహార్ణిశ మొప్పె శరత్సమాద్యతిన్. 243
సీ. మఱియుఁ దచ్ఛరదాగమంబున నంతరిక్షము వోలె రాజహంసలఁ బెనంగి
పక్షిరాడ్ధ్వజధూరితవక్షస్స్థలము వోలె లాలితకమలాననములనగుచు
ధర్మాభిరతుసభాస్థలంబు వోలె నలక్షితపంకకలంకమగుచుఁ
బ్రమథనాయకునిశిరఃప్రదేశము వోలె విమలభాసురనదీవిహితమగుచు
గీ. డంబుమీఱెడు చంద్రమండలము వోలె, నధికతరచారుకువలయవార్ధమగుచు
నట్టిజలదాంతసమయసమాగతప్ర, చిత్రతిరపాత్ర శారదరాత్రులందు 244
క. వెగవరి లోకేశుఁడు త, స్కరజారవ్రజములనెఱి చలిచీకులనై
నురుగతిఁ జల్లినమ్రుగ్గను, కరణిఁ గువలయాను మోది కౌముది ప్రబలెన్. 245
ఉ. అట్టిశరన్నిశన్ హిమకరాతప మాత్మకు నార్తిఁ గూర్పఁ దోఁ
బుట్టువు కేలుపట్టి రఘుపుంగవుఁ డాలి విరాళిఁ దూలి వ

స్ఫుట్టులిఖింపఁ జొచ్చిరతిభీకర లీస్మరవారిజారులీ
పట్టుచుఁ బ్రాణములొడఁబుతుఁ బ్రాణములేటికి సీతఁ బాసితిక్. 246

వ. అనిపలికి చంద్రోపాలంభనపరుండయి లక్ష్మణుం గనుంగొని 247

క. ఇతఁ డమృతకిరణుఁడే కాఁ, డతివిషముఁడు గాకయున్న ననుజుఁడ దారా
యుతుఁగానినన్నుఁ దారా, న్వితుఁ డేఁచందగునె యామినీచరవృత్తిక్. 248

క. తగనెందుం గువలయహితుఁ,డగు రాజుకళాప్రపూర్ణుఁడగుఁగాక కడుం
దెగనిక్రూరత్వ మ్మిల విబుధగురుద్వేషి కగుఁగ నితక్కునె చెపుమా. 249

క. అకలంకుఁడ సన్మార్గుఁడ నకుటిలుఁడనటంచుఁ బొంగు నమవసఁ గ్రుంగు
న్సకలంకుఁ డసన్మార్గుఁడు, సకుటిలుఁడుం గార్యమ్ముఁ డితనిచంద మెఱుఁగమే. 250

వ. వీనిరాకపోకలు జనంబులెఱుఁగరే యని వెండియు. 251

ఉ. ఈతఁడు చోరకోటికి ననిష్టుఁడటందురు కొంద ఱీతఁడే
ఘాతయొనర్పఁ బాంథుల నకారణ మిమ్మిహిరాంశుఁ డెంతయు
ద్యోతితుఁడంచు లోకములు దూఱఁగ నించుక సిగ్గునొందఁడా
పాతలపోయఁగార్యుఁడగు నాతఁడు లజ్జ నెఱుంగఁడేకదా. 252

వ అని యివ్విధంబున. 253

క. వనజారిదూఱి మిఱిన, జనకసుతావిరహవహ్ని సమసిన ధృతి న
మ్మనజేంద్రుఁ డంతఁ గంద,ర్పునిఁగూర్చి విశేషరోషపూరితముఖుఁడై. 254

క తుంటరిలఁ జిలుకతేజియు, నంటినఁ గసుగందుపూవుటమ్ము లెవరికిం
గంటఁబడని సచివుఁడు మా,ర్కొంటి నుసుటికంటిమంటఁ గ్రాఁగినసిక్. 255

క. అట్టివిలు కాఁడ వీవే, నట్టుల విరహిజనహృదయపాటనమునకుం
దిట్టవయితి వూహింపఁగ, నిట్టివిగా వే విధాతృకృతచిత్రంబుల్. 256

చ. కటకటపూవుబాణములఁ గమ్మని విల్లునఁదాల్చి చిక్కి తే
రటునిటుఁ ద్రిప్పుచు న్హరిసహాయతనెంతయు దర్పయుండవై
యటుచుఁ దపం బొనర్చుచు పురత్మజుఁ బాసిన రాజమౌళిపైఁ
బటుగతి నేలపోయెదవు భస్మముగాఁగల కంబకాగ్నిచేక్. 257

వ. అని పలికి నిట్టూర్పునిగుడించి. 258

క. తమ్ముల శోకమ్ములఁ గుం, దమ్ములు నందమ్ములగుచుఁ దనరారెడుచూ
తమ్ములనేయను ననుఁ గుసు, దమ్ములనేయుం మటులైనఁ దనువుఁ దొఱఁగునుక్.

క. అనిమఱియు నిర్వేదంబున, వనజారిక్ దూఱిదూఱి వసుధేశుఁడు మె
ల్లనిచల్లనిగాడుపుఁ బి, ల్లతెఱఁగున కోపవకఁ జలంబఱిపలుకక్. 260

ఉ. తావులు గ్రుమ్మరించెడు లతాభవనంబులఁ దూఱివచ్చు గ్రొ
మ్మావుల నీడకేఁగు నట మానికొలంకులఁ జేరఁబోవు న
చ్చోవెడలుం బరిస్ఫురితసూనరజంబు నలందు మేన సీ
తావిరహార్తి రాముఁ డొక తావునఁ గాల్నిలువంగ నేరఁడున్. 270

వ. పరితాపంబునొందుచుం బరిభ్రమించుచుఁ బరవశత్వంబునొందుచుండ నుచితవచన
శిశిరోపచారంబులం గొంతసేదదేర్చి లక్ష్మణుండు. 271

ఉ. ఏలపరిభ్రమించెదు మహీశ మహాశనికల్పతావకా
భీలశరావళీజ్వలనభీషణశిఖోష్ణసహిష్ణు లిట్టి
క్ష్మాపులు సత్యరాజ్యగిరిపాలురు గారటులైన సాధ్విఁ
బ్బాలలనాకుమారి నృపపుంగవ ముందటఁ దెచ్చియుంచరే. 272

ఆ. అంతయేల యినజుఁ డాంజనేయాంగద, జాంబవత్ప్రముఖశాఖాచర
భల్లుకోత్తములను బటుగతిఁ బిలిపించి, సీతవెదుక నాజ్ఞసేయుమన్న. 273

చ. అనుటయుఁ గ్రోధశోకపరవశాత్ముఁడు రాముఁడు లక్ష్మణుం గనుం
గొని కనుఁగొంటివే ప్లవగకుంజరు వాలి నడంచి తన్మహా
ఘనవిభవంబు లిచ్చుటయుఁ గైకొని దుర్మదమెక్కి యింతయున్
మనమునఁ దలంపఁడయ్యెను రమాపతి గోతుల నమ్మఁజెల్లునే. 274

క. అనిపలికి మఱియు నతఁ డిట్లనుఁ గిష్కింధాపురమున కరిగి యతఁడు భూ
తనయానరయఁ బూనుట మదిఁ, గని సైఁపము కాకయున్న ఖండింపవా. 275

మ. అని యిట్లానతియీ రయంబున సుమిత్రాత్మోద్భవుం డేగి కాం
చె నభోల్లేఖితశాఖికాఫలరసస్వీకారసమ్మోదన
ర్తనశాఖామృగశాబకోత్కరయుతాక్రాంతోరుకాంతారము
న్ఘృణివిస్తారజితాంధకారమును గిష్కింధాపురీద్వారమున్. 276

వ. కని చేరంబోవు నవసరమ్మున నచ్చటి ప్లవంగపుంగవులు తమలోన. 277

మ. అహిమాంశుండు మహానురాగమునఁ బుత్రాలోకనాపేక్ష ని
మ్మహిఁ గేతెంచెననంగ నొప్పెడు జగన్మాన్యుం డనంతాభరో
ద్వహశౌర్యప్రసమర్థుఁ డీతఁడని తత్సౌందర్యగాంభీర్యస
న్మహిమాలోకనదర్శనంబులను సంభ్రాంతాత్ములై చెచ్చెరన్. 278

క. చని సుగ్రీవుం దారా, వనితాప్రియుఁ గాంచి మ్రొక్కి వానరవరు లి
ట్లని రోదననాయకసుత, విను మొకవిన్నపము విన్నవింతుము తెలియన్. 279

ఉ. వాసవతుల్యుఁడు న్విబుధవంద్యుఁడు శక్రధనుఃప్రకాశబా
ణాసనపాణి గోపురసమాగతు నొక్కనిఁ గాంచి యెంతయుం
ద్రాసము నొంది యాతనివిధంబు సమస్తము నీకుఁ దెల్ప వి
చ్చేసినవార మాతఁడుఁ బ్రసిద్ధప్రతాపతనూజుఁడా యనన్. 280

వ. అని పలికి రందుఁ గొందఱు. 281

క. విను మును మనవాలిం దునుమినమనుజేంద్రునను నీ సుమిత్రాసుతభ్రా
సనమాత్రికి వేఁబులుగ, దశరథసుతునికంటెఁ గ్రోధ మధిక మితనికిన్. 282

క. అన విని సుగ్రీవుఁడు కను, మనుజుఁడు లక్ష్మణుఁ డతఁడు మనుజేంద్రుఁడు పం
పిన రానోపున్నను నే మనునో యనుచు న్ససంభ్రమాయత్తుండై. 283

వ. తారాసమేతంబుగా నెదురువోయి భయభక్తియుక్తిం బ్రణామంబుఁ గావించి యుచితరీతి సమకట్టిన యర్ఘ్యపాద్యంబులం బరిగ్రహింప నొల్లక రఘునందనుండు రవినందనున కిట్లనియె. 284

చ. అడవి మెకంబు లెల్లను సహాయము గాఁగ రఘుప్రవీరుఁ డ
య్యెడ విపులార్తిభారము వహించుటఁ దాలిమి దూలియుండ ని
య్యెడ విభవాతిరేకమున నీవు దలంపఁగ వైతి చుమ్ము నె
య్యెడ విపినాటు మూఁక దమ కిష్టుఁడు నాఁ జనదెట్టు లేకికెన్. 285

క. మా యన్న దుర్మతుం డగు, మీ యన్న వధించి రాజ్య మీఁగొని జడత
న్మా యన్నఁ దలఁపవైతివి, మీ యన్నం జూడ బుద్ధి మిగిలెనె నీకున్. 286

క. అని బెట్టు పలికి తారావనితాప్రియవచనరచన వత్సలుఁ డగు న
మ్మనుజేంద్రనందను కిట్లనియె న్సుగ్రీవుఁ డుచితమగు వినయమునన్. 288

ఉ. ఇంతకుమున్న వానరుల కెల్లను నాజ్ఞ యొసర్చినాఁడ వా
రింతకు నంతకుం బుడమి యీనినకైవడి నేఁడెదె తుర
త్యంతకుతూహలంబు మనకయ్యెడు నూరక చూచుచుండఁగా
నంతకృతఘ్నవర్తనుఁడ నయ్యెఁ దలంపుము డింపు ముగ్రతన్. 289

క. ఏ వచ్చి మిమ్ముఁ జూడం, గా వేఁకనందుచుండఁగా నియ్యెడను
న్నీవ యరుదెంచినాఁడవు, కావునఁ బోవుదము నృపునికడ కిరువురమున్. 290

వ. అని తత్తఱంబుగా నుత్తరం బిచ్చి యత్తరణికులాభరణు చిత్తంబు మెత్తపడం జేసి యుత్తలంబు దక్కి యత్తరుచరోత్తముండు వెండియు. 291

క. ఏనైన వచ్చెదు పుణ్యము, గాన నటులఁ గాన నుచితగతి నెంతయు స
న్మానంబు దోఁప నాథు, న్మానవపతికి స్వమాగమంబు నడపుమీ. 292

చ. అని సచివాళిఁ దోడ్కొని యహర్పతినందనుఁ డాసమాయతోఁ
జనియెను రామునిం బ్రథితశాత్రవగోత్రవిరామునిం గనుం
గొనినటు లేగి రాఘవునకున్ హృదయంబునఁ గ్రోధశాంతికై
మును మును లక్ష్మణుం గనిచి మోదముతో నతఁ డట్లొనర్పఁగన్. 293

వ. మోడ్పుఁగేలు ఫాలంబునం గీలించి. 294

క. పదపడి తపనసుతుండు తత్పదపద్మంబులకు మ్రొక్కి ప్రస్తుతు లెసఁగన్
సమ్మది యదరుచుండ నప్పుడ, య్యదితేయసమానముఖుఁ డొయ్యనఁ బలికెన్. 295

క. శాంతగుణాకర చతురా, శాంతంబుల నున్న యద్రిచరముఖ్యుల నే
నింతకుమును పిలిపించితి, సంతోషము నొందు మిప్పుడ చనుదెంతు రనన్. 296

వ. దీనదయాళుం డగు రఘునందనుండు మహాసంతసంబునం దపననందనుం దదమాత్యులం
గనుంగొని కనుఁగొనలఁ గరుణారసంబు జాలువాఱ వారలం గలపికొనియుండె
నంతం గతిపయదినంబులకు. 297

శా. లాంగూలోచ్చలనోదితశ్వసనలీలాధూతధారాధరో
త్తుంగుల్లాంగలదీర్ఘదంష్ట్రి లధికోద్యుక్తుల్ మహీభృన్మహో
భీలాంగుల్నఖరాయుధోద్ధతులు నిర్భీతుల్చతుర్దిక్కునన్
లాంగూలోత్తము తేరఁ దెంచిరి మనోల్లాసంబు సంధిల్లఁగన్. 298

వ. మఱియును. 299

క. దాశరథులకుం గిష్కింధేశునకున్ సంతసం బహీనతనొందం
గీశులు సనుదెంచిరి నానాకేశసమూహంబు లవని యీనిన కరణిన్. 300

క. గిరినిభుఁడు గంధమాదనుఁ, డరిపంకజమత్తకుంభి యగు నగ్గజుఁడున్
హరివిక్రముండు కేసరి, యరుదెంచిరి ప్లవగసైన్యులై వేర్వేఱన్. 301

సీ. అపరిమితాద్రిచరానీకములు గొల్వ, నరుదెంచెఁ గుముదాఖ్యుఁ డనునతండు
కొలఁదివెట్టఁగరాని కోఁతిమూఁకలతోడ, నరుగుదెంచెఁ గవాక్షుఁ డనునతండు
గణుతింపరాని వృక్షచరభటాళిఁ దోడ్కొనివచ్చెను శరభుం డనునతండు
లెక్కయిడఁగఁజాలలేని వానరులతోఁ, జనుదెంచె వడిఁ దారుఁ డనునతండు
గీ. లలి నసంఖ్యాకకీశబలసహితముగ, నర్థి నేతెంచెఁ గుంజరుం డనునతండు
నరయ నంతింత యనరాని తరుచరాళి, తనరఁ గనుపట్టెను పనసుం డనునతండు. 302

క. వివిధవిపినాటసైన్యపరివృతులు నరిమథనులు నపరిమితబలులు వ
చ్చి విడిసిరి వినతమైంద,ద్వివిదులు నలనీలగవయదధిముఖప్రముఖుల్. 303

చ. అతిబలు లుగ్రవేగులు మహాశనికర్కశదీర్ఘబాహు లు
ద్ధతతను లన్యసైన్యవిపినశ్వసనాకృతు లిద్ధకేసరీ
శతబలు లైన వృక్షచరసైనికు లెంతయుఁ దన్నుఁ గొల్వఁగా
శతబలి వచ్చెఁ బద్మహితసంభవు పంపిన పంపొనర్పఁగన్. 304

క. నల్లనిమేనులు నెంతయుఁ, దెల్లనిమోరలును గల్గి దిశ లెల్లను భే
దిల్లఁగ బొబ్బలు వెట్టుచు, భల్లుకములతోడ జాంబవంతుఁడు దోఁచెన్. 305

క. మానవనాయక భాస్కర, సూనులకు నసంతసంబు సొంపువహింపం
గా నేగుదెంచెఁ దరుచర, సేనలు దనుఁజుట్టిరా సుషేణుఁడు కడిమిన్. 306

క. అద్రులఁ గనకాద్రిసురల, రుద్రుఁడు తారకల హిమకరుండును బోల
న్భద్రం బగుకపిసుభటస, ముద్రంబునఁ బవనసుతుఁడు ముఖ్యుం డయ్యెన్. 307

క. తతవర్షబిందుతారా, తతికిం బరమాణుసైకతలవంబులకు
న్మితివెట్టుఁగాక నక్కపి, వితతి న్లెక్కింప విధి యవధిఁబడదు న్నె. 308

వ. ఇవ్విధంబునం గట్టాయితం బగువనచరచమూసమూహంబు సముద్రజలంబులం బుడిసిలింపను, బ్రహ్మాండభాండంబు వగులింపను గులాచలంబులు విసరివేయనుం జాలి కయ్యంబునకుఁ గాలు ద్రవ్వుచుండె మఱియును. 309

క. అనుపమతరహరిసేనా, వననిధి ఘననీలగజగవయశరభనిశా
తనఖరకకేసరివేష్టనమునఁ బనసనుతరుక్షశ్రుతిఁ బొలిచెన్. 310

వ. భుజబలాంగదుం డగు నంగదుండును విపులకపిసేనాసమేతుండై సేనాముఖంబునకుఁ గన్నాకై నిలిచె నట్టియెడ. 311

ఉ. అక్షులకుం బ్రియం బొదవు నట్టిప్లవంగమసేనఁ గాంచి రా
మక్షితినాథుఁ డాదరసమగ్రుఁడు భాస్కరపుత్త్రుఁ గాంచి ప్రా
గ్దక్షిణపశ్చిమోత్తరపథంబుల జానకిఁ రోయ నెంతయుం
దక్షుల బుద్ధివాసరులఁ దప్పక యిప్పుడ పంపు మింపుగన్. 312

క. అనవుడు మహాప్రసాదం, బనఘ యటులచేయువాఁడ ననికపిసేనం
గని పొంగి జనకజావిచ, యనతత్పరచిత్తవృత్తి నర్కజుఁ డంతన్. 313

క. వినతు న్వినతాసుతజవ, వినుతుం గని నీవు నూఱువేల్ప్లవగులం
గొని నేర్పునఁ దూర్పునకుం, జని జనకజ వెదకి రమ్ము చయ్యన నెలకున్. 314

మ. అని తద్దిక్స్థితభూరిభూభృదురుగోష్ఠారామవల్లీగుహా
ఘనగంభీరసరిత్ప్రవాహములు వేడ్కం దేటతెల్లంబుగా

నిజముం దాశరథి యీ తెఱంగి వినుతుం డేగ న్వడిం బూర్వది
గ్వనితాకర్ణపుటప్రపాట విరావాపూర్ణసైన్యాఢ్యుఁడై. 315

వ. తదనంతరంబున. 316

చ. అనిలసమానవేగు ననిలాత్మజు నాత్మజసన్నిభుం గనుం
గొని రఘువంశశేఖరులకుం దగ నాతనిఁ జూపి వారి కి
ట్లనియె దృఢవ్రతుండు జతురాగమవేదియుఁ గామరూపకుం
డనిలసమానవిక్రమవిహారి మహారివిహారి యారయన్. 317

సీ. కనకాద్రి మెచ్చ దీతనిధైర్యరమ మించు జడదారిదొరకుఁ జేపడియె ననుచుఁ
దపనుని మెచ్చ దీతనితేజ మెక్కాల మొకరీతిగా నుండ నోఁపు ననుచు
నుదధిని సరకుసేయదు వీనిగాంభీర్య మలమంథనగముచేఁ గలఁగ ననుచు
నీమహామహుజవం బీడఁ గాదను నది యురుమనోరయమున కోప దనుచు

గీ. నీపటునితాల్మి భూతధాత్రీవనితను, గేలిఁ గావించుఁ జంతుప్రకృష్టభార
శమన మెదఁ గోరి యొక్కొకసారి బ్రహ్మ, విష్ణురుద్రాదులకు మొఱవెట్టుననుచు.

క. అంతియకా దీతఁడు తన్కాంతి మనంబుల జయించెఁ గంతుని గారి
కాంతున కె యగు నీవాన్యమంతుఁడు ధృతిమంతుఁ డంశుమంతుఁడు కాంతిన్. 319

ఉ. చాలు నితండొకండ కులశైలసిద్ధహనంబులుం దిశా
పాలపురంబులు న్వెదకి భామిని సీత నెఱిఁగి రా యశ
శ్శాలి మహాత్ము నీతని వెస న్నియమింతు నవాద్రిగర్భిస
త్త్వాలవహేంద్రభూరవానికుంజముల న్మహి పుత్త్రి రోయఁగన్. 320

వ. అని పలికి కరువలిగ దిలిపట్టిఁ గౌఁగిటం బట్టి సస్నేహంబును, సబాంధవంబును,
సగౌరవంబును, సవినయంబును సాదరంబును గా నతని కిట్లనియె. ఽ21

క. అతిబలకపిసేనా పరివృతుఁడ వగుచు యావ్యదిశకు వే చని తద్ది
క్క్షితధరణి వెదకిరమ్మా, హితనూజ నీవ పరమహితుఁడవు నాకున్. 322

చ. అనవుడుఁ బొంగి నింగి నొరయం దనవాలము వెంచి భానుజ
న్మనకు నరేంద్రసూనులకు మ్రొక్కి మహామతి యప్డు వారి కి
ట్లను ననిలాత్మజుండు జనకాత్మజఁ గన్గొని వచ్చువాఁడ నం
బునిధిఁ గడాచిరైనను జము న్విదళించియు నైనఁ జెచ్చెరన్. 3.3

వ. అని పలి". 324

గీ. దత్తుణమ దక్షిణముఁకకఁ దరలనున్న, వానవుఁ గన్గొని రాముఁ డత్యంతహృష్ట
చిత్తుఁడై నిజకార్యసంసిద్ధి యితని, కతన నగునని తలఁచి యాఘును నతించె. 325

క. మానక వెండియు నప్పవమానసుతుం బొగడి రామమహీనాథుఁడు ప్ర
జ్ఞానిధి జనకజకుం బ్రజ్ఞానార్థం బంగుళీయకం బొసఁగుటయున్. 326

వ. స్వామికార్యధురంధరుం డగు గంధవహనందనుండు గంధగజంబు తరుణకిసలయం
బుఁ బరిగ్రహించు చందంబున నయ్యంగరంబుఁ గరంబు రాగంబుమీఱం దత్క్ష
ణంబ దక్షిణకరంబు సాఁచి. 327

క. కొని హరివాక్యముల నూఁకొని వానరసమితిఁ గూడికొని వారల వీ
డ్కొని దక్షిణపథముం గైకొని యేగె సమ్మోద మలమికొని హెచ్చింపన్. 328

వ. ఇట్లనిలనందనుం డంతసత్త్వసంపన్నులగు నల నీల గజ గవయ గవాక్ష గంధమాదన
దధిముఖాంగదజాంబవదాదిమహావీరపరివృతుం డై యెల్లవిధంబులం బుడమిపట్టిం
గనిపట్టి వచ్చునట్టి ప్రతిన వట్టి చనియె నంత. 329

ఉ. ఆదశ నున్న యున్నతమహామహిభృత్సరసీవనంబు ల
త్యాదర మొప్పఁ దెల్లముగ నాతనికి న్వివరించి భీమసం
పాదిప్లవంగసైన్యము నపారముఁ దోడ్పడ నంపె నా ప్రతీ
చీదిశ సీతఁ జూడఁగ సుషేణుని వైరివనీకృశానునిన్. 330

క. అతనికి నొకమాసంబు, న్మితి వెట్టి యనంతరమున మిహిరసుతుఁడు ద
ద్గతపర్వతగహనాదులు, వితతమతిం దెలిపి రామవిభుఁడు నుతింపన్. 331

క. ఒక్కొకఁడ చాలి నాలుగు,దిక్కులు వెదకంగఁ జాలు ధీరులఁ గపులం
లెక్కుండ్రఁ దోడుచేసియు, దక్కకుభంబునకు నా శతబలిం బుచ్చెన్. 332

వ. ఆతండు నొక్కమాసంబునం జనకతనయాన్వేషణంబుఁ గావించి మరలువాఁడై
చనియె నిట్లు. 333

క. కాష్ఠామాత్రమునఁ జతుః,కాష్ఠావిచయనసమర్థగతులు కపివరుల్
స్పష్టాహంకృతు లెసఁగఁ గ,రిష్ఠాత్ములు చనిరి గహ్వరీసుత నరయన్. 334

వ. ఇట్లరిగి. 335

క. తరుచరవర్యులు మునుముగఁ, దరుణిం ధరణీతనూజఁ దడవిరి మిగులన్
దరుల న్నదీనదంబుల, దరులం దిమిరప్రగాఢతరులం జరులన్. 336

సర్వలఘుసీసము.

మఱియుఁ దరుచరులు మసలక యవనిజ వెదకఁగఁ దొడఁగిరి వివిధగతుల
బులుఁగులు మెకములు మెలఁగెడు సెలవులు బులుఁగులరుతములఁ బొదలుపొదలు
నుదువులఁ బొరువులు మలలును శిలలును బొలములఁ గొలఁకులఁ బులినములును
బురములు నుపవనములు నిఱుకటములు నహులవివరములు గహనములును

గీ. వనులు దవములు గలిగెడు వనములును శబరులయును ములఁ దలిరుఁ బరఁగు లతలు
నటజములు నవటములు బహుళశిఖరము, లపరిమితభయదకరము లగుతలములు. 337

వ. ఇట్లరయుచు వెండియు. 338

ఉ. భానుసహస్రచారుతరభానుపరిస్ఫుటధాత్రి నీఁగఁ గా
లూనిన యంతవట్టయిన నూనమునొందక యుండునట్లుగా
జానకి సర్వరాత్రయ జానుగ రోసి యెఱుంగలేక యా
వానరు లెల్లఁ గూడికొని వచ్చిరి క్రమ్మఱ దైన్యచిత్తులై. 339

వ. దక్షిణదిశాపరిశోధనార్థం బరిగిన యశోధనులగు హనుమదాదులు తక్కం దక్కిన యక్కపులెల్ల నొక్కమొగిం దిక్కులందుండి చనుదెంచి రాజపుత్రరవిపుత్రులం గాంచి నమస్కరించి తమపోయివచ్చిన చందం బెఱింగించువారై యిట్లనిరి. 340

మ. సితకీర్తి ప్రియులార యేమ ప్రతీచీప్రాగుదీచీదిశ
స్థితశృంగోన్నతపర్వతంబులఁ బయస్స్థితాపగాతీరవి
స్తృతకాంతారములం గుడుంగముల ధాత్రీపుత్రి శోధించిన
చ్చితి మెచ్చోటను వార్తయైన విన మాసీతానిమిత్తంబుగన్. 341

క. ఇఁక నెందు వెదకువారము, పెకలింతుమొ భూతధాత్రిఁ బెల్లగిల స
ప్తకులాద్రులఁ ద్రోతుమొ వా,సుకికోటల వెదకుదుమొ యశోధనులారా. 342

గీ. ఆజ్ఞ యొసఁగుఁడు మా కని రంత రామ,లక్ష్మణులు నినజుండును దక్షిణంబు
వెదకఁబోయిన యమ్మహావీరవరుల,మీఁదఁ బ్రాణంబు లిడియుండి రాదరమున.

వ. అంత నక్కడ దక్కినంబున నుం జనినవనచరు లాలస్యంబుఁ దక్కి యెక్కిన ప్రాఁకులు మరల నెక్కి వీక్షించుచుఁ, దడవిన ప్రదేశంబులు వెండియుం దడవుచు, నేమ మేమ జనకజం బొడగాంతుమని ప్రతినలు వట్టుచు రాఘవుండు మహానుభావుండు తదీయ కార్యనిర్వాహకుండ నర్వోత్కృష్టుం డని యాడుచు హనుమంతుం గొనియాడుచుం జని చని. 344

సీ. కొలఁకులు శోధించి కొలఁకుల లేకున్నఁ, గొలఁకులు బురదగాఁ గలఁచివైచి
పొదరిండ్లు పరికించి పొదరిండ్ల లేకున్నఁ, బొదరిండ్లు బయలుగాఁ జిదిమివైచి
తరువులు వీక్షించి తరువుల లేకున్నఁ, దరువులు వ్రేళ్ళతో నురులఁద్రోచి
నగములు గనుఁగొని నగముల లేకున్న, నగములు బిట్టు పెల్లగిలఁజేసి

గీ. గుహలు దగఁ గాంచి సీత కద్గుహల లేమి, గుహలు నగ్గోలుపఱిచి యక్కోఁతులిట్లు
తరులు గిరులును బొదలు బొదలు కొలఁకులు,గుహలు శోధించి యమ్మహామహులువటియు.

వ. సీతాన్వేషణంబు గావించుచు, 346

ఉ. ఫలములు గాంచిరేనిఁ దనుపార భుజింపరుఁ బుష్పదేనియ
న్గొలఁకులఁ గాంచి క్రోలఁ దమకింపరుఁ బెద్దచరించియేని నే
మలసత నొందినాక మన మాఁకలిదప్పియు లెక్కసేయరుం
గలఁగరు వాన కెండకును గాలికిఁ గార్యభరంబు పెంపునన్. 347

సీ. అచ్చోట జనకజ నరయుదు మనిపోవు, రచ్చోట లేకున్న దైన్యము వహింతు
రాకడ సీత నాలోకింతు మనిపోదు, రాకడ లేకున్న నలసు లగుదు
రాచక్కి మహిపుత్త్రిఁ జూచెద మనిపోదు, రాచక్కి లేకున్న నలఁగఁబడుదు
రందు రాఘవుదేవిఁ గందు మనుచుఁ బోదు, రందు లేకున్నను గుందుచుందు
గీ. రంతఁ దత్పతిఁ గన్గొందు మందు రకట, కడచనియె మాస మందురు కపులు మనకు
నార్తిఁ బడనేల తచ్ఛుభవార్త వినుదు, మంచు నొకకొందఱీకతి నందు మఱియు.

సీ. రాముని బల్కుకీరరమణి సీతఁ గా, నూహించి నిలిచెద రొక్కమాటు
దాతచ్ఛద యగులతాతన్వి జానకి, యోయని చూచెద రొక్కమాటు
ఘనకలాపశిఖిఁ గలకంఠి భూపుత్త్రి, యొక్కొయని తలంతు రొక్కమాటు
పటునిశాచరవిద్ధ పద్మిని రఘురాము, నువిదఁగా భావింతు రొక్కమాటు
గీ. పోతుఁ బాసితపించుకపోతి మహిజ, యున్నదని చేరఁబోవుదు రొక్కమాటు
శూన్యవృత్తుల మై రవిసూనుఁ జేరఁ, జంపు ననుభీతిఁ గొందఱు శైలచరులు. 349

ఆ. మఱియు వివిధగతుల వసలక జనకజ, యున్నచో టెఱుంగ కున్నతంబు
లైనపర్వతములు నగములు శోధించి, యలసి సొలసి యున్న యవసరమున. 350

ఉ. అభయగతిం బిలంబునొకఁ డారసి తారసిలంగ దగ్స్వయం
ప్రభగుహఁ జొచ్చి గాఢతిమిరంబుఁ గ్రమించుచుఁ బోయి యాత్మకీ
ర్తిభరితసన్నికృష్ట నొకతెం గని భక్తి నమస్కరించి త
చ్ఛుభకరుణార్ద్రదృష్టి గుహ సొంపుగ వెల్వడి రొక్కపెట్టునన్. 351

వ. ఇట్లు మహాయాసంబునం బెక్కుదినంబులు సొచ్చిన యాబిలం బనాయాసంబున
నొక్కక్షణంబున వెల్వడి ప్రభావతీప్రభావంబున కచ్చెరువు నందుచు నిరాకృత
క్షుత్పిపాసార్తను లై యుండి యన్యోన్యముఖావలోకనంబు సేయుచు నిట్లనిరి. 352

మ. ఇఁక సేయంగల కార్య మెద్ది మన కయ్యిక్ష్వాకువంశోత్తరుం
డకలంకుండగు రామభార్యఁ గన నెట్లో యెల్లచోట్లింత ద
క్కక శోధించితి మెందునుం గనము శోకధ్వాంతవిచ్ఛేదకం
బకటా చంద్రముఖీసువార్తనగుఁ గా కన్యంబులం దీఱునే. 353

క. అని రంత నంగదుఁ డిట్లనియె న్వెనకఁగఁ జాల మననిజ నెటుకుం
బనిగలదే పోవఁగ మన, కనువగుఁ బ్రాయోపవేశ మందఱ కరయన్. 354

సీ. అనుచు గద్గదకంఠుఁడై యెల్లవారల నీక్షించి మఱియుఁ దా నిట్టులనియె
నవనిజఁ గనుఁగొన మని యటువోయినఁ జంపుఁ గాని యనుగ్రహింపఁ డర్క
నందనుం డౌట రా నందుల కిచ్చోటఁ బుచ్చెగ నసువులు పోవును మీర
లెల్ల మీమనముల కిష్టమగు తెరువుల కనుచు మోమున దైన్య మాక్రమింప
ఆ. నశ్రు లురులుచున్న యంగదుఁ గనుఁగొని, యఖిలవానరులు మహార్తిఁ దూలి
నిశ్చయముగ నేము నీతోడి వారము, గాక మాకుఁ బోవఁ గలదె మఱియు. 355

చ. సమరమున రామచంద్రునకు సమ్మతిగా నోసరించి పుణ్యలో
కములు జటాయు వెంతయు సుఖంబునఁ బొందినయట్లు రామకా
ర్యమున నసుప్రపంచముఁ దిరంబుగ వీడి తమేనిఁ బుణ్యలో
క మెమరు వచ్చువంచుఁ బ్లవగప్రభు లాతనిఁ జుట్టి యేడ్చిరన్. 356

వ. దైన్యహీనవంతుం డగుహనుమంతుండు వారల కిట్లనియె. 357

క. మనము పరమాత్ముఁ డగు రాఘవుని మనముం బడయలేమి మూర్ఖుల మని య
య్యనఘుఁడు నిజకారుణ్యం, బునఁ బిక్కలఁ జేయఁ జచ్చినం జాకున్నన్. 358

ఉ. కావున ధైర్యము న్విడి యకారణ మిగ్గిరిగహ్వరంబులం
జావఁగ నేల యప్పరమసాధ్వి నిలాసుతఁ గాంచి పోయి ధా
త్రీవరుమన్ననం బడసి తేజము నొందఁదలంపుఁ డిట్లు సం
భావితచిత్తవృత్తు లగుపాలసులట్లు తలంక నేటికిన్. 359

వ. అని వెండియు నుచితవచనంబులం దేర్చె. 360

క. కడఁగుండు సీతవెదకం, గడుఁగుండు ముఖంబు లశ్రుకలితంబులు న
న్నడుగుండు కార్య మనునెడ, నడగుండు పగిది విహంగనాథుఁ డొకఁ డొగిన్.

వ. సంపాతి యనువాఁడు. 362

ఉత్సాహము. అచటనుండి వారి క్రిందఁ గదియ గుహ దెంచువాఁడు త
ద్వచనసరణిఁ దనదు మద్దుఁడమ్మఁ డీల్గుటరసి వృ
త్తచరనాథ వరులఁ జేరఁ జనుదునపుడు కాంచి వా
నిచరితం బెఱుంగలేక నిఖిలకపులు భీతులై. 363

ఉ. కాలిపర్వంబు క్రియఁ గల్గిన మేనునఁ గూటువోయ నం
గ్రాలుగళంబు నెత్తికొని క్రచ్చఱవచ్చెను నొక్కభూత మ

శాఖాలుని ప్రేరణంబునఁ దగ న్మరణేచ్ఛ వహించియున్న కీ
శాలిఁ గ్రసింప దీనిపనినా మనకెల్ల మనోరథంబులున్. 364

క. అని మనల గ్రుంగుకును బ్రాహ్మని నిర్భీతాత్ములగుచు నఖిలకపులుఁ వా
నిన చూచుచుండఁ జేరంజనుదెంచి విషాదమెసఁగ సంపాతి యనున్. 365

క. ఎక్కడి జటాయువు వతఁ డే, చక్కటి సమరంబు సేసి సమసె, బిదప మీ
రక్కరణి నెఱ్ఱ్గితిరి, రక్కటు చెప్పుఁ డేను వానియగ్రజుఁడఁ జూఁడీ. 366

క. వానికిఁ గోపంబున నెవ్వారలతో రణము మొర్చె వానికిఁ బోరం
గారణము మీదురాకయుఁ, గారణముం జెప్పుఁ డీవు గారవమెసఁగన్. 367

వ. అని యడిగి చింతాపరిక్రాంతుండై. 368

క. కలుషలగోత్రంబు ఱెక్కలు గాలి విదిచ్చె వేయుఁగలఁడు కృపణుండై
కలనఁ బడవలసె మనము వికలుమయ్యెఁ జెప్పుఁడె తత్సకలవృత్తంబున్. 369

వ. అనిన నప్పతంగపుంగవుఁ గాప్లవంగపుంగవు లిట్లనిరి. 370

సీ. దశరథసుతుండు సీతానాథుఁ డనుజన్మసహితుఁడై పితృనాజ్ఞ సద్వ్రతంబుఁ
బూని పంచవటంబుపొంతఁ బర్ణకుటీర మొనరించి నియతి నుండఁ బత్త్రి
కంధరుండు రామలక్ష్మణులను వంచించి జానకిఁ గొనిపోవు సమయమున జ
టాయువు రావణునాఁగి మహాహవం బొనరించి యొనరించి యుక్కడక్కి

గీ. దనుజచంద్రహాసదళితపక్షుండై, ధరణిఁ దగిలెఁ గొంచు దైత్యనాథుఁ
డెక్కడేఁగె జని యెక్కడ రాఘవు, లవనిజను లేమి వలవరించి. 371

వ. తదన్వేషణార్థం బరణ్యంబునం బరిభ్రమించు వా రెదురం బర్వతోపమాకుండై పడి
యున్న జటాయువువలన నత్తవృత్తాంతంబు విని యనంతరంబునం బ్రాణపక్షి
ణుండగు నప్పక్షివరేణ్యు దశరథక్షితినాథునిఁబోలె దహించి తిలోదకంబు లొసం
గి శబర్యాశ్రమంబును బంపాతీరంబునుం గడచి ఋశ్యమూకంబున వనచరేశ్వరుం
డగు సుగ్రీవునితోడం బద్ధసఖ్యుండై తద్విరోధంబుగా వాలిందునిమి తత్పదంబొసంగి నం
గొని పుమమింగల ప్లవంగపుంగవుల రావించి సీతాన్వేషణనిమిత్తంబుగా నెల్ల
దిక్కులకుం బుచ్చిన నేమిద్దక్షిణం బునకుం జనుదెంచి యెందునుం జనకనందన
సందర్శింపనేరక యూరకపోఁ దీరక ప్రాయోపవేశంబునం బ్రాణంబులు విడువ
నున్నవార మని చెప్పి యప్పులుఁగుఱేనికి వెండియు నిట్లనిరి. 372

క. పక్షివర నీవు నీగతిఁ, బక్షవిహీనంబ వగుట విపక్షకృతమొ శా
పాక్షరసంకలితమొ మా, కీక్షణమునఁ దెలియఁ బలుక్కుమీ నీవనుచున్. 373

ఉ. దేవరయొలర్వ భానుమను జేరఁగ నోపుదు నేన నంచుం
దావిపులాద్రికాయుఁడు జటాయువు నేనునుఁ బన్నిదంబునం
బోవఁగ సూర్యరశ్ములను బో దిన నమ్మహనీయు వేగికి
గ్లావులలావులెల్ల వికలత్వము నొందుచువచ్చెఁ జెచ్చెరన్. 374
ఉ. తమ్ముని పక్షయుగ్మకము దగ్ధము గొంచుట కోర్వలేక శీ
ఘ్రమ్మున నెద్ది మూర్ఛిలి ధరాపతనోన్ముఖుఁ డైన వానిమా
ర్గమ్మున నాత్మపక్షములఁ గప్పిన నప్పుడు కాక నా పత
త్రమ్ములు గాలె వాతఁడు సురక్షితుఁ డయ్యె మదాత్మ వొంగఁగన్. 375
వ. ఇట్లు చండకిరణప్రచండకిరణదగ్ధగరుద్వయుండనై. 376
క. ఇక్కుధరంబునఁ బడి కడుఁ జిక్కినవాఁడ దగుసేవ సేయుచు నిచటం
బెక్కుదినములుండి యతం, డెక్కడకేని చనె యస్యధేచ్ఛాపరుఁడై. 377
వ. నాఁటంగోలె నాకుమారుండు సుపార్శ్వుండగు సుపార్శ్వుండు నిత్యంబు నాహార
వర్తనంబు నిర్వర్తించుచుండం బరంపడి జటాయువు ముని స్థానంబగు జస్థానంబు
సుస్థాయంబుగా నున్నవాఁడ నిట్టి యొక్క సమయంబున మదీయపూర్వసంపాదిత
పుణ్యకర్మ వశంబున బాలసఖుండగు నొక్క తపోధనుం గనుంగొని సభక్తిక
సాష్టాంగ దండప్రణామంబు లాచరించి ప్రార్థించిన నస్మదీయదశాకారణంబుఁ
దనదివ్యతపోమహానుభావంబున నెఱింగి నావలన వెండియుం దెలిసి యక్కరుణా
కరుండు నాకుం గరుణించి పత్రివరా ధరాసుతాన్వేషణంబు నెపంబుగ నగచరులు
రామాజ్ఞ నెన్నండే నివ్వంబునకు నరుగుదెంతు రమ్మహాత్ములకు సీతావృత్తాంతంబు
దేటపడం దెల్పి లబ్ధపక్షుండవు గమ్మని దీవించి వేంచేసెనటయు నాఁటంబట్టి మీ
రాకఁ గని పెట్టి ప్రాణంబులు చిక్కంబట్టియున్నవాఁడఁ గృతార్థుఁడ నైతినని పలికి
తమ్మునిం గూర్చి యార్చి పేర్చిన శోకంబు డిపికొని యవ్వానరోత్తముల సహాయంబు
నం బుణ్యనదీ స్నానంబు గావించి జటాయువునకుం దిలోదకపిండప్రదానంబు వెట్టి
పవిత్రుండై వారలం గనుంగొని. 378
చ. నగచరులార యింక మరణవ్యవసాయము మానుఁ డిప్డు సీ
తఁ గనువిధంబు మీకు విదితంబుగఁ దెల్పెద దూరదృష్టి మా
కుఁ గలదు లంకనున్నది యకుంఠితసద్వ్రత రామదేవి యి
మ్మగ శతయోజనంబులు సముద్రముఁ దాఁటుఁడు కానవచ్చెడున్. 379
క. అని మఱియుఁ బెక్కుభంగులు, వనచరులకుఁ దెల్పి పక్షివర్యుఁడు సంపా
తి నిజపత్త్రమ్ములు గల్గిన సంతసమంది వారికిం దగ ననియెన్. 380

ఉ. ఎక్కడలు వారు నత్తఱిసి యేనికృపం బ్రభవించె సత్త్వమిం
పెక్కు పతివ్రతామణి మహీసుత వీఁపునఁ బెట్టి లంకతో
నిక్కడఁ దెత్తునో కడు నహీనజవాఢ్యు మదీయపుత్రకుం
జక్కఁగఁ దోడ్కొనరుదునో ప్రశస్తగుణాస్పదులార చెప్పరే. 381

చ. అనవుడు సంతసించి శకునాధిప జానకియుండె లంకలో
నని తెలియంగఁ జెప్పితి సహాయము గాదొకొ నీవు నీసుతుం
డును జనుఁ డిట్టవర్తనఁ గడుంబలుపైన సముద్ర మెవ్విధం
బుననయినం దరించి మహిపుత్త్రిఁ గనుంగొన నేము చాలమే. 382

క. అని పులుఁగు తేనిఁ బోవం, బనిచి కపిప్రభులు నెఱుఁగుబంటి దొరలు ను
బ్బున నాడుచుఁ బాడుచుఁ జని, చని దక్షిణవారిధితీరశైలోత్తమమున్. 383

చ. మలయగిరిం బ్రదక్షిణనమస్కృతు లొప్పఁగ నెక్కి వానరా
వలి గనియె స్సముద్రము నభంగతరంగరవాతిరౌద్రము
న్నలితనిజోరుఫేనరుచిలజ్జితనిర్మలతప్తశూద్రము
న్జలచరభద్రము న్మహితసారప్రవాళలతావిసాంద్రమున్. 384

క. కని తత్తరంగశీకరజనితపరమశైత్యముం బ్రసన్నతలీలం
గొని మలయసమీర మెదుర్కొని తమమార్గశ్రమంబు కొంచెపఱుపఁగన్. 385

క. ననుఁ బ్లవగు లెట్లు కడచెద, రని నవ్వొనుభంగి ఫేనమడంపం బోని
త్తునె వీరల నాఁగక నను, ననువున భంగంబు లంతకంతకుఁ బెరుఁగన్. 386

వ. ఘూర్ణిల్లుచున్న వారాకరంబుఁ గనుంగొని భయభ్రాంతులగువారును మూర్ఛాపరవశత్వంబు నొందువారును మహానందంబు నొందువారును తరుగుల్మలతాగ్రంబులనుండి వీక్షించువారును విస్మితులగువారును, సరకుసేయక తత్తరంగంబుల నోలలాడువారునై రంత నంగదుండు తమవారిదెసఁ గలయం గనుంగొని. 387

క. ఎవ రెన్నియోజనంబులు, జవమున జలరాశి దాఁటఁ జాలుదు రనిన
న్నవదశయోజనముల దాఁకఁ వచించిరి ప్లవగభల్లుకప్రభుముఖ్యుల్. 388

గీ. ఇట్లు తమతమకొలఁదుల నేర్పఱించి, యఖిలవనచరులును దెల్ప నాలకించి
యింద్రనందననందనుం డిట్టు లనియె, వారలెల్లను సంతోషవననిధిఁ దేల. 389

చ. అసదృశవేగి వాలి కెన యానధికుండగుఁ గాని తక్కఁగాఁ
డసమున నీతఁ డంచుఁ గపులందఱు సంస్తుతిసేయ వారిరా
శి సరభసంబునం గడచి సీత గనుంగొని లంక నగ్రకే
లిసలిపి మామనంబు లమలీమసవృత్తిఁ దలిర్ప వచ్చెదన్. 390

వ. అని తాను శతయోజనంబు లవలీల దాఁటనోపుట యుగ్గడించి యొక్కింత విచారించి వెండియు నత్తరుచరులతో నతండు. 391

క. తరుచరు లానందింపఁగ, శరనిధి వెస నుత్తరించి జనకజఁ గని త
త్పురిఁ గాలఁ జమరి క్రమ్మఱి, యరుదెంచుట నాకు శక్య మౌనో కాదో. 392

వ. సంశయంబు గలదని పలికి ధైర్యాతిరిక్తంబున వెండియు. 393

చ. అది యటులుండనిండు ముదమారఁగ నియ్యెడ నుండుఁ డేను బో
యెద నిదె పల్వలాకృతి వహింపఁ బయోనిధి దాఁటి నాఁగ నం
గదుఁ గని వారలెల్లను సగౌరవ మొప్పఁగ నాడి రీవు చా
లు దుదధి దాఁటి యెల్లపనులు న్నెఱకూర్చి మమ్ముఁ బ్రోవఁగన్. 394

క. అయినను నీ వేగినఁ ద్రుటి, యయినను నే మోర్వఁ జాల మనయంబున మా
నయనములు చల్లఁగా నీ, దయినశుభాంగంబు గాంచి యలరుదు మెపుడున్. 395

క. ఈకడలి వెడలి తగనవ, నీకన్యం జూచి రాఁగ నీవోపుదు నీ
వోక కపివరులయసువుల, పోకసుమీ కలమె నిన్నుఁ బొమ్మని పలుకన్. 396

సీ. పసితనంబున ఫలభ్రాంతి నుక్కఱి బాలభానునెవ్వాఁడు చేపట్టవిడిచె
దుష్టవర్తనుల దైత్యులఁబట్టి పాలార్చి మునులచే నెవఁడు దీవనలువడసె
దివ్యాస్త్రముల కసాధితుఁడగా బ్రహ్మాదిసురలచే నెవ్వాఁడు వరములందె
నితనిచే మనపనియెల్లఁ దీరునటంచు మద్రి కెవ్వనికి రాముం డొసంగె
గీ. నెల్లవిధముల జానకి నే నకాంతుఁ, బ్రకటగతి నని యెవ్వాఁడు ప్రతినవట్టె
నట్టిహనుమంతుఁ డతిశాంతుఁ డరికృతాంతుఁ, డుండ మనకేల యోయఁగదుండ దనఁగ.

వ. అని యివ్విధంబున నాంజనేయుండు వినుచుండం బలికి వెండియు నమ్మహావీరు జన్మబలపరాక్రమప్రకారంబు లుగ్గడించి యయ్యంగదుం బురస్కరించికొని జాంబవదాదులు హనుమంతుం బ్రశంసావచనంబుల నగ్గించుచు దగ్గఱి. 398

శా. ఖద్యోతద్యుతినిర్జితాత్మరుచి లోకప్రాణసత్పుత్ర నీ
వుద్యచ్ఛ్రీఘనగతిం బయోధితరణోద్యోగంబు గావించి యా
పద్యుక్తంబగు వానరావళిఁ బ్రబద్ధప్రాణవాతంబుగా
విద్యాజీవ కడంగుమా జనకజాన్వేషార్థ మర్థించుచున్. 399

క. వనచరు లెవ్వనరాశిఁ, గని భీతిల్లెదరు తమకుఁ గడవఁ గొలఁదిగా
దని పురుషోత్తమ నీకి, వ్వననిధిపఱపుఁ దాఁటు టెంతభరమూహింపన్. 400

క. గురుఁడగు హరియము భవద్గురుఁడగు హరియముఁ బత్రిఘోటకుఁడు జగ
ద్గురుఁడగు హరియమునను నీగురురయమున కెట్టు లెనయగు నరవర్యా. 401

వ. అదియుండంగాక. 402

చ. ఒకనిముసంబునం బహుళయోజనము ల్లను బ్రౌఢతేరితో
నొకనిముసమ్ముఁ బాయక తదుష్ణము నోర్చి నభఃప్రచారియై
సకలకలావిభూతి రవిసత్కృప నేర్చినయట్టినీకుఁ జా
టుకడలి దాఁటు టేపని కటా యిటు లొప్పరికించి మాచెదే 403

వ. అని మఱియుం బెక్కుభంగులం బ్రార్థించి యగ్గించుటయు వానరేశ్వరుండు వారి
దైనదైన్యంబు వాయం బొంగుచు నిట్లనియె. 404

మ. రయతం బిచ్చుకగుండుఁ గేసరికిశోరం బెట్టులంఘించు నా
క్రియఁ బాథోధిఁగడాచి యందుఁ జని పక్త్రిగ్రీవు లంకాపురీ
తుయసౌధోపవనోపకంఠముల నాక్ష్మాపుత్రి నీక్షించి యా
ర యనన్యాద్రిక నిత్తుఁ దెత్తు ముదమారం బ్రత్యభిజ్ఞానముల్. 405

క. అని పలికి వారలెల్ల, దనమోమునఁ జూడ్కు లునిచి తద్దయు మోదం
బునఁ జూచుచుండ నప్పుడు ప్లవగుం డొప్పారె హైమవతసింహాగతిన్. 406

వ. మఱియును.

చ. అతులితపర్వతాగ్రమున నాహనుమంతుఁడు వొల్చెఁ బూర్వప
ర్వతశిఖరోదితోజ్జ్వలదివాకరబింబసదృశుఁడై సమా
వృతకపివక్త్రపద్మములు విస్ఫురితంబులు గా నిశాననో
ద్ధతరుచిభాను లొప్పఁగ మహీచరఖేచరకోటి యుబ్బఁగన్. 407

క. ఇప్పగిది నొప్పి యొల్లుఁక, దప్పక దీవింప నిజపదద్వంద్వంబుం
గుప్పించి యుప్పరంబున, కప్పుడెగసెఁ బర్వతాగ్ర మవని సమముగన్. 408

వ. ఇట్లు లీలావాలోచ్చాలనంబుఁ గావించి నిఖిలవానరమనోనయనానందకరుండును
రామకార్యపరాయత్తచిత్తుండును నప్పవనప్రియనందనుండు దక్షిణాభిముఖుండై
సముద్రలంఘనంబు గావించి. 409

క. గిరిచాపవినిర్గతమై, యురుజవమున నిగుడు శరమొకో యన లంకా
పురదహనార్థ మడరె నంబరచరులకు విస్మయంబు మల్లడిగొనఁగన్. 410

వ. వెండియు నత్తరుచరసత్తముండు. 411

క. ఖేటకసురీతి వాలముఁ, బాటవమునఁ ద్రిప్పికొనుచుఁ బటురభసమునన్
ఖేటములఁ బట్టికొన నా, ఖేటమునకుఁ జనినయట్లు కీర్తికుఁ డయ్యెన్. 412

వ. అంత. 413

గీ. ఘనమనోరయవాయువేగగరుడజవ,శరసరభసంబులను మించి చనుచున్న
హనుమఘనదేహ మంతయు నంత కక్షి,గోచరము గామిఁ బ్లవగులు చూచు టుడిగి. 414

వ. మోముల విన్నందనంబు గదుర నమ్మహాత్ము రాక వార్చి తత్తీరసికతాతలంబులం
బ్రాణంబులు చిక్కంబట్టియుండి రంత. 415

క. ఆ కార్యపరత్వము నిర్భీకత్వము దృఢరయంబు బీర మరసి య
ట్లాకాశంబున నేగుమహాకాయుం గాంచి పొగడి రంబరచరులున్. 416

గీ. ఇట్లు ఖచరాభినుతగతి నేగునమ్మ,హాత్ము కాయోద్ధితశ్వసనాహతాబ్ధి
పాయుయిచ్చుటయొప్పె సప్పరమసాధ్వి, నందు వెదకుచుఁ జనియెనో యనిన కరణి.

వ. ఇవ్విధంబునం బరమసాహసంబున నేకచరుండై ఖచరసంస్తూయమానగమనంబు
నం జను నయ్యగచరవర్యు నుద్దేశించి నిజకుక్షిసురక్షితంబగు మైనాకక్షితిధరంబున
కంబుధి యిట్లనియె. 418

ఉ. ఇమ్మహిరుట్చరోత్తముఁ డహీనజవాఢ్యుఁడయ్యెన నిట్టులో
ర్కుమ్మడి సాహసించి శతయోజనము ల్చన దప్పి వుట్టుఁబో
మ్మమ్మహనీయ వేగు భవదగ్రమున న్నిలుపంగ రామకా
ర్యమ్మున కెవ్వరేనియు సహాయము సేయక మాననేర్తురే. 419

క. ఈకడలి వెడలి మత్ప్రియు, మీకార్యముఁ దీర్ప నోపు దీ వెట్టును మే
నాకకుక్షిఁ బుట్టినాఁడవు, నాకుక్షి నవృద్ధిఁ బొందినాఁడవు గానన్. 420

ఆ. అనుడు నట్లొనర్తునని శింశుమారక,ర్కటకశాఖలొప్ప ఘనవిశుద్ధ
పాదశోభియగుచుఁ బాథోధిమిత్రత, బయలు మెఱయ వెడలెఁ బర్వతంబు. 421

వ. ఇట్లు కడలి వెడలి హనుమంతున కభిముఖుండై. 422

ఉ. ఓకపివంశసాగరపయోరుహశాత్రవ వాయుపుత్ర మై
నాకుఁడ వార్ధిపంపున ఘనత్వరితంబున వచ్చినాఁడ సౌ
మ్యాకృతి గొంతసేపు నిలు మస్మదుదూర్ణతకూటకోటి ని
శ్శ్లోకరయంబునం జనఁగ నేల శ్రమంబు జనింపఁ దెంపునన్. 423

వ. అని పలికి వెండియు. 424

క. హాలసదృశనఖర కోలా,హలబహుళం బిప్పయోధియం దునికి హాలా
హాలగళుఁడు బావ కోలా,హలుఁ డన్న హిమాద్రి కన్నయా తఁడు నాకున్. 425

చ. అనవుడు నమ్మి వానిపయి హస్తము సాఁచి ధరేంద్ర వార్ధిబం
పినఁ జనుదెంచితంటి కడుఁ బ్రీతమనస్కుఁడ నైతి జానకిం

గనుఁగొని కాక విశ్రమముఁ గాంచుట మేలె తలంప నూఱుయో
జనములమాత్ర దాఁటుట యసాధ్యమె పొమ్మని వీడుకొల్పుడున్. 426

వ. అగ్గిరిచుమ నచ్చెరువందుచు నమ్మైనాకుం డు సనుటయు మున్నిటు మిన్ను దఱిసి
పోవుచు నబ్బలిముఁడు. 417

క. సురఖేచరగంధర్వోత్కరవిస్మయకామరూపధగణము పేర్మిన్
సురసమ్మతి నేతెంచిన, సురస మ్మతివొంగ ననిచి సుస్థిరుఁ డవలన్. 428

శా. ఛాయాగ్రాహిణి తన్ను నాఁగిన నవష్టంభంబునం బేర్చి త
న్మాయాజాలము లెల్ల మాన్చి వెస నన్నక్తంచరీప్రోజ్జ్వల
త్కాయంబు న్నిజవాలపాశముచేఁ జిక్కంగట్టి యంభోధివి
స్ఫాయద్భంగనిమగ్నఁ జేసి విలపింపం జంపి తా నేగుచున్. 429

క. వే లవణాబ్ధిఁ గడచి యవ్వేలం బవనాత్మజుండు వీక్షించె మహో
ద్వేలశతయోజనాంబుధి, వేలఁ గుసుమసౌరభాతివేల సువేలన్. 430

క. దండిమగఁ డిట్లు కనియు, ద్దండగదాదండవాలదండ మెసఁగ న
క్కొండపయి న్వేఁ బోకనడ, గొండపగిది వ్రాలెఁ బిట్టు కుతలము గ్రుంగన్. 431

ఉ. హనుమంతుండు సువేలమీఁదడిగి శైత్యాపాదిమందానిలం
బనుకూలం బగుచుండఁ గన్గొని యెఁదుం గాంచద్వితుం కాకరి
న్ఘనసౌధస్థితదర్పణాంశులహరీఖద్యోతశం కాకరిన్
దనుజాహార్యనగజేంద్రదబృంహితమహాధ్వానోగ్రలంకాపురిన్. 432

వ. కనుంగొని నిజాంతర్గతంబున. 433

క. గోపుర వలరాజునకుం, గాఁపుర మల కాపురంబు గనుఁగొన నీలం
కాపురమున కెన యగునే, కాపురమయ్యె న్నిశాటగణభరితంబై. 434

క. ఈపీఠు సురభయంకర, రావణపాలిత మగుటఁ గరంబొప్పదు సౌ
మ్యాకృతియైన విభీషణు, చే వెలయు నటంచుఁ దలఁచెఁ జిత్తములోనన్. 435

ఉ. ఈగతి నెంచి తత్పురి మహీసుతరోయఁ దలంచి భూరిహే
మాగసదృత్తుకరకశనిజాంగముఁ గుంచి సమీరనందనుం
డాగిరి డిగ్గి డిగ్గియలనందములైన పురోపకంఠభూ
భాగములం దలిర్చువిరిపందిళులం గని యాత్మ మెచ్చుచున్. 436

సీ. నవరత్నఖచిత సుందరవేదికాహృద్య లసితంబులైన యాలయవరములఁ
గల్హారచక్రచక్రమరాళశైవల స్ఫారంబులైన కాసారములను

మకరందబిందు సమార్ద్రీకృతమేదినీ భాగంబులైన యుపవనములను
రత్నకంబళ మహారజతసింహాసన స్థానంబులైన యాస్థానములను
గీ. జవలనంటి వెలింగెడు సౌధములను, నతిపవిత్రతరమహేశ్వరాలయములఁ
గామరూపధరుండగు కపివరుండు, వెదకి జానకిఁ గనలేక విహ్వలించి. 437
గీ. మఱియు నర్తనశాలలు మందురలును, నాయుధాగారములఁ గృతకాచలములఁ
బ్రాకటశిరోగృహంబులఁ బ్రబలు ప్రపలు, నంతిపురములు నరసి యనంతరమున.
ఆ. అనిలసుతుఁడు రావణాంతఃపురంబున, నవనితనయ నరయ నరుగువాఁడు
లంక బింకమింక లంకిణి నిశ్శంకఁ, బిలుకుమార్చెఁ గడిఁది పీకమొప్ప. 439
ఉ. వంచనఁ దత్పురంబుఁ జొరవచ్చిన వారి నెఱింగిపట్టి బా
ధించు నిశాటి తన్ను నవధీరణసేయుచు వచ్చి చంపనూ
హించిన నిష్పథంబున మహింబడ మొట్టునఁ దాఁచుడుస్సిలా
పించుచుఁ గూలె లంక యరిబృందముచే పతనంచుఁ దెల్పుచున్. 440
క. లంకాస్వరూపయగు వా, లంకిణి గూలుటయు నిష్కళంకుండు నిరా
తంకుండు నగుచు మణిప, ల్యంకము సురపేటికానిలసితం బగుచున్ 441
వ. అశోకవిధాలంకరణ శోభితంబగు లంకాధ్యక్షు శుద్ధాంతంబున శుద్ధాంతఃకరణుం
డగు వృత్రుచరాధ్యక్షుండు మానవాధ్యక్షు శుద్ధాంతంబు నరయుచుం జని చని కాం
త విధు కాంత శిలాస్థగిత విశాలరమణీయతరంబగు నొక్క ప్రదేశంబున. 442
సీ. మణిమద్యపుత్రికా మహిత నిజప్రతిబింబభేదముఁ జలనంబు కతన
వీణావిరాజితస్వీయాక్షకర విభాగము దగు దాశమానము కతమున
రమణీయ దీపికా రత్నదీప ప్రభాన్యత్వ దము నొందు సామ్యము కతమున
చంద్రికాపాండురసౌధదీప్తిచ్ఛటాంతరము చకోరమోదంబు కతనఁ
గీ. దగనెఱిఁగి యహర్నిశాతారతమ్య, మళనిద్రా విహారభోగాదికములఁ
దెలిసి భావగతంబుఁ జూపులన తెలిసి, సకల కార్యంబులను నవసరము దెలిసి 443
క. స్వస్త్రీ సమానలగు ర, త్నస్త్రీ నివహంబులు పరిచర్యలొనర్పన్
వస్త్రాభరణంబులఁ గను, మాస్త్రశరప్రతిమ దేహయష్టి వెలుఁగన్. 444
క. ఈమేనిపద్దిగాఁ దగ, దామేలికడాని దీని కనుమానము లే
దేమేనిఁ బసిండికిఁగల, దేమేలగు తావి యనునతికిఁ బాత్రంబై. 445
వ. ఒప్పు మెఱయుచున్న 446
గీ. కాంచనామోద దేహ ముక్తాఫలప్రవాళరదన రదచ్ఛద వారణపతి
యాన లసమానయపమాన మానగుణభరితఁ గృశోదరి మందోదరీసమాఖ్య. 447

క. డబ్బాటునఁ గని జనకజ, నబ్బా గఁ గంటి నని మహోజ్జ్వలుఁ డెవలో
నబ్బా కీడు దలంచితి, నబ్బాలిక వేడ్క సల్పు నాయిక్ఛంగిన్ 448

క. పతిఁ బాసిన కతమున స, మ్మతిలేమిం దాల్మిఁ దూలి మగువ రఘువరు
స్మృతిఁ దలఁచుచు మేనున్ వసు, మతీరజము వర్వ వగల మఱుఁగక యున్నే. 449

వ. అని లెస్సతలంపు చేసి మఱియును రావణవిహారస్థానంబు లగు నయ్యాయి ప్రదేశం
బులఁ బరమపవిత్రచరిత్ర యగు జనకపుత్త్రీసమన్వేషణపరుం డై యెందునుం గా
ననూపమున్న హనుమంతుండు నిజాంతర్గతంబున 450

సీ. కడుఁ బ్రయత్నమున లంకాపురి శోధించి, కాంతాతిలకము గందునో కొ
కని రామచంద్రుఁ డిచ్చిన యభిజ్ఞానమే, ముద్రిక వేడ్క సీతచే నిడుదునో కొ
యిడి ప్రత్యభిజ్ఞాన మెలమిఁ గైకొని కపు, లొగ్గ రిపు వసధి లంఘింతునో కొ
లంఘించి శ్రీరామలక్ష్మణ సుగ్రీవులకు శుభవార్తఁ దెల్పఁగలనో కొ
గీ. తెల్పి జలరాశిఁ దాఁటి పృథ్వీవధూటి, పుత్త్రిఁ గని కపులు సబ్బొటిపాటి
మరల రాఘవులకుఁ దెల్పి మారుతియను, పొగడునకుఁ బాత్రభూతుఁడనగుదునో కొ

క. అని తలఁచి యనిలతనయుం, డనిలజవుం డంత నొక్క హర్మ్యము నెమరం
గనుఁగొని తదగ్రమున కొ, య్యన నగమున కెగయు హరిక్రియం దాటితగన్. 452

క. రామరమణియగు సీతా, రామామణి నరయునంత రహినచ్చెంత
న్బ్రామాద్ర పూగబహుళా, రామ మొకండు గాంచె సంతరంగము వొంగన్. 453

చ. ఫలదళబంధురప్రసవబంధనచారుశలాటుమంజరీ
లలితలతామహీరుహవిలక్షితనిష్కుటము మ్మలుగాంచి య
వ్వలనికిఁ జేరఁ బోయి హరివర్యుఁడు తన్మహితాంతరంబునం
గలయఁ జరించి భాగ్యమునఁ గామినినొక్కతె రాక్షసీవృతన్. 454

సీ. మంచుబొట్టులఁ బసమించని తమ్మికై వడి మోము కన్నీటు వాడుదోఁపఁ
దామరతూండ్లు బెండడి డిందువడు మాడ్కిఁ బుజములు చిక్కిన బ్రుంగుసువడ
నెండచే నొగిలిన యివురునా వేఁడి నిట్టూర్పుచే వాతెఱ యొప్పుఁదప్పఁ
బొగచుట్టికొనదివ్వె జిగిపట్టిన గతి మాపుమఁ బుట్టుమేని పొలుపుతూలఁ
గీ. దడి మకిలవొందినట్టి యుద్దముల కరణిఁ, జెక్కులుఁ గమ్మచెమటచేఁ జెన్ను దొరఁగ
మానినియలంత నొక పెనుమ్రానినీడ, నుల్లమును కిఁ బ్రలాపించుచున్న దాని. 455

సీ. అపయశంబునకుఁ జోటైతి నాహా యని, విన్నని మోముతో నున్న దాని
పతిభక్తి సతుల కాపద్దారియని రాము, నడుగడఁ దలఁచుచు నున్న దాని
మనుజాదులు గ్రసింతురని భీతి నంగంబు, చెన్నఱ వడఁకుచు నున్న దాని
నాథుఁ జూడంగల్గునా యను తలపోత, నుల్లంబు మఱుగుచు నున్న దాని

గీ. దుష్టచేష్టాసురీసమావేష్టనమునఁ, సిద్ధసఖకేసరిప్రతిరుద్ధబాల
మృగియనఁగ నెంతయుం దనహృదయమదర, నునుఱువిడువంగఁగమకించుచున్న దాని
క. అనశనతాంతం జింతా, వనతవదన పిహిత కృత్తవస్త్రాంత స్త్రీ
హనుమంతుఁ డంతనంతం, గనె దుఃఖాక్రాంత రాముకాంత భ్రాంతన్. 457
క. కని మునికన్నెయగుట భూతనయయగుటఁ దెల్పు నవ్విధంబున జడల
ల్లిన కేశపాశమున మన్ననఁ బొరలెడు జానకిం గనుంగొని యంతన్. 458
చ. తగునె విధాత కిట్టియిది దంబతిఁ బాయఁగఁ జేత సీతయు
ప్పగిది నెసంగుచున్న పతిభక్తి విశేషముచేత నొప్పెడుం
దగనియులంత మోము వెలిదమ్మి దుమారమున న్మసంగ హీ
నగతి మలీమసార్థవసుస్థితి నెంతయు నొప్పకుండియున్. 459
క. క్రిక్కిఱిసియు రక్కసులలో, నిక్కంజదళాక్షి యొప్పు దించుకయును బ
ల్రక్కసుల నాగవల్లిక, చిక్కు క్రియ యొప్పెనేమి సేయఁగవచ్చున్. 460
క. మతిచెడి రాక్షసుచేనవ, మతినొందితి నిట్లు దిక్కుమాలి మిగులదు
ర్మతినంచు దూఱుకొంచుం, బతివ్రతాతిలక మింత పడునె కటకటా. 461
గీ. మధుకరవ్యాప్తి సుపరాగ మహిత పంకజాతమునుఁబోలె నిమ్మహీజాతమోము
చూర్ణకుంతలభృంగసంకీర్ణమగుచు, భూపరాగపరాగసంపూర్ణమగుచు. 462
వ. అని వెండియు ననేకప్రకారంబుల శోకించుచు జానకీసమాశ్రయాశోకానోకహ
శాఖోపశాఖావిలీనుండై తదీయులక్షణంబు లిమ్ముగ విమర్శించుచుండె నంత. 463
చ. బలిమిఁ గుబేరునిం గెలిచి పంతమెలర్పఁగఁ దెచ్చికొన్నయు
జ్జ్వలరుచి పుష్పకం బసురవారిజనేత్రలు గొల్వనెక్కియ
క్కలనికివచ్చి సీత నతిఖిన్నఁ గనుంగొని మానినీ కరం
బలమట మాని నీసుహృదయంబున నన్గయికొన్నఁ గూడదే. 464
క. నినుఁ గానని వగ రాముఁడు, ననుజన్ముఁడు జాకయున్న నంబుధిఁ గడువం
జను నే కడచిన మనుజాదనుల గెలుచు టెట్లు వారిఁ దలఁచు టుడుగుమీ. 465
సీ. జగదీశ్వరుండగు శర్వవాసంబుఁ గైలాసంబు బంతిగాఁ జేసినాఁడ
శక్రునంతటివాని సాధించికట్టితే వలతిమా పుత్రుండు గలుగువాఁడ
నలకాధిపతి నన్న యనక మానంబుతోఁ గొఱలు విమానంబుఁ గొన్నవాఁడ
దేవతలకునైనఁ దేఱిచూడఁగ రాని పట్టణంబు జలధిఁ బడసినాఁడ
బ్రహ్మ చంపకుమని నను బ్రస్తుతించి, విడువు మన జము నుందల విడచినాఁడ
నట్టి నన్నొల్లి దొమ్ముసర్చి యధిక భోగ, భాగనుత్తమ పీఠమ వడుటమేలె, 466

క. పతిహీనయనుచు నన్నుఁ బశుపతియుఁ దివస్పతియుఁ బ్రేతపతియును సంభ
పతియును గొలువంగ మతిఁ బతి, పతి యని పలవింతువో యని భామను సయనిన్. 467

ఆ. పద్మహస్త కరుణఁ బట్టి కైకొనవు మన్మథుండె గాని జారనాయకులను
దలఁపు దీర్చి నన్ను దౌవారికునిఁ గాఁగఁ, జేసి యేలరాదె చెప్పనేల 468

వ. అని మఱియుం గామోపహతుండు గావున నవివేకభావంబు లాఁకుటయుం
జలించి. 469

క. పరపురుషులఁ జూడని యప్పరమపతివ్రత తృణంబు బరికించుచుఁ దాఁ
బరుషవచనుఁ డసురుం డిప్పరుసున నాడుటయు నొవ్వఁబడి యిట్లనియెన్. 470

శా. సారాచారవిదూర క్రొవ్విసమతిన్ శార్దూలి గామించునా
సారంగంబును బెంట్రిసింగమును వాంఛం జేర నూహించునా
సారంగంబును శాతతన్నఖరవిస్తారాహతింగూలు న
ట్లాయూడి న్నను సాధ్వి నాసపడి చా సంతఃకృతిం దోఁచెనే. 471

క. ప్రభుతిలకుండగు రామప్రభు భార్య న్నన్ను నాసపడియెదు వహ్ని
ప్రభఁ గాంచి చేఁబోవు శలభవృత్తి యుకాదె నీచలం బూహింపన్. 472

క. నను గారింపక దనుజాంగనలకు నాజ్ఞాపనంబుఁ గావింపుము భూ
తనయఁ గ్రసింపుఁడనుచు నీ, తనయుక్త నిష్ఠూరకము వృథావచనంబుల్. 473

క. భోగేచ్ఛ లేదు ప్రాణ, త్యాగేచ్ఛయె కాని నాకు దనుజాధమ ని
ర్భోగేచ్ఛ నన్నుఁ గోరక, భోగేచ్ఛుఁడ వైతి గానఁ బొమ్ము రఘుపతిన్. 474

వ. అని పలికి తన్ను నుద్దేశించి. 475

ఆ. కలుషమార్గఁ గామిఁ గామిఁ గామికి నీకు, నెట్లు తెలియవచ్చు నిపుడు రామ
చంద్రు సాంపరాయసాయసాయకముల, నవని నొఱిగిపొరలునపుడు గాక. 476

వ. అనియధోవదనయు నవిరళబాష్పజలపూరితకపోలయు నేకాకినియునై చెక్కిటఁ
జేయిఁ జేర్చి తలయూఁచుచు దైవంబుఁ దిట్టుచు నిట్టూర్పు నిగిడించుచు నూర
కుండుటయుఁ బఙ్క్తిగ్రీవుండు సీతం గాచికొనియున్న రాక్షసీనీరజేక్షణల నిరీ
క్షించి రూక్షాక్షరవచనంబుల నిట్లనియె. 477

క. ఈకరణిఁ దపింపక నా, స్వీకరణము రెండు నెలలకయినఁ గలుగు న
ట్లేకరణినైన దీనివశీకరణ మొనర్పుఁడనుచుఁ జెప్పుచుఁ జనినన్. 478

వ. పాలదిండిపాలంతులుం బుడమిపట్టిం జుట్టుముట్టి రావణుం జెట్టవట్టుమని బిట్టుబాధ
లం బెట్టి పట్టి యొక్క యవసరమ్మున. 479

క. కావలివారలు జనకజ, కావలిదెస నిద్రనొంద నపుడేతెంచి యశో
కావనిరుహంబు డిగి యొం, టావని ఖేదమున నుండ బరపుపావని జూడన్. 480

వ. ఇట్లు డిగి. 481

మ. వినయంబెల్లఁ గపిస్వరూపమున నావిర్భావమైనట్టి చా
ద్యున సామీరి నతోత్తమాంగుఁడయి మోడ్పుంగేలు ఫాలప్రదే
శనిబద్ధంబొనరించి భక్తి మెసఁగన్ క్ష్మాజాతపుం జేత ప్రే
క్షణవిభ్రాంతభయాంతరంగయగుచుం గీశున్ సమీక్షించుచున్. 482

క. ఇతఁ డెవ్వఁ డొకో ప్లవగా, కృతి నాయందొంచె రాక్షసేశ్వర మాయా
కృతి నేతెంచినయట్టి సుకృతియే నిం బట్టి భ్రమింగఁడే యేనలరన్. 483

వ. అని బహుప్రకార విచారంబులను జొచ్చి తలంచుచున్నంత శాంతస్వాంతుండు హనుమంతుండు సాంత్వనస్వరంబున నక్కాంతతో నిట్లనియె. 484

క. మాయమ్మ రాముదూత సు, మా యమ్మ లికంబు వాయు మాపద లెల్లన్
బాయుమమ్మ నీ మలుకసుమా, యమ్మగు నంక రావణాసురపతికిన్. 485

చ. అనఘుఁడు భానుసూనుఁడు మహాత్ముఁడు రాముఁడు సంతసింపఁగా
జనకజ నిన్నుఁ జూడఁగఁ బ్రశస్తుల వానరుల న్విధింప వా
రనరిగి రెల్లదిక్కులను రోయఁగ మత్సుకృతంబు పేర్మి ద
క్షిణమున కేను వచ్చి కృతకృత్యత నొందితి నిన్నుఁ గాంచితిన్. 486

క. హనుమంతుండనువాఁడఁ బవనపుత్రుఁడ నేకలోకవంద్యుఁడ జగతీ
తనయఁ బొడఁగంటి నని రామునకు న్వినుపింపఁగనుట ముదితాత్మలకా. 487

క. విను మారీచుని మాయ, న్మఱిఁగిన శ్రీరామలక్ష్మణులు నినుఁ గోల్పో
యినవారలగుట లజ్జావనతవదనులగుచు నగయువా రొక్కయెడన్. 488

ఉ. ఆయటవీస్థలంబున జటాయువుఁ గాంచి త్వదీయవర్తనం
బాయనఘుండు దెల్పి తదనంతర మాత్మఁ బరిత్యజింప శో
కాయత వృత్తిఁ బక్షిరఘునాథుఁడు న్విలపించి తత్పిత
న్యాయమునగ్ని సంస్కృతి నొనర్చిరి నాకజగన్నివాసిగాన్. 48

వ. తదనంతరంబున భవన్నిమిత్తంబుగా మహారణ్యపథంబులం బరిభ్రమించువారు. 490

గీ. బంధురహితానుబంధుఁ గబంధు శాప, మోక్షితునిఁగా నొనర్చి లోలాక్షి శబరి
శబరి భక్తినొసంగు పూజలు గ్రహించి, పంకపర్వతశంప నప్పంపఁగడచి. 491

వ. ఋక్షవానరచమూకంబగు ఋశ్యమూకంబునకు వచ్చి భక్తి నత్యగ్రీవుండగు సుగ్రీవుతోడ నగ్నిసాక్షికంబుగా మత్సన్నిధిం జెలిమిఁ గావించి. 492

క. తరణిసుతుఁ డోలి నాతని, ధరణిం గైకొన్న వాలిఁ దనుచరశాలిం
దరణికులుఁడు శ్రీరాముఁడు, ధరణింబడఁ గూల్చి తత్పదం బొసఁగెదనన్. 493

క. పేర్చినధృతి వాలిం బరిమార్చి యతనివైభవంబు లన్నియుఁ దన్నుం
జేర్చిన వానరుల న్సమ్మకూర్చి యనిచె నాల్గుదెసలకు న్నినుసుతోయన్. 494

వ. ఇవ్విధంబునం బ్రత్యుపకారపరాయత్తచిత్తుండగు మిత్రపుత్రుండు 495

ఉ. పంపినవానరోత్తము లపారబలాఢ్యులు మారుతత్వరం
బ్రంపులుగట్టి యుద్దెసలకుం జనఁ గొందఱు తేఁకు యామ్యది
క్సంపరిశీలనార్థము వెసం జనుదెంచి కనంగలేక వెం
దెంపున బ్రాణము ల్జలధితీరమున న్విడువందలంచుచున్. 496

క. చావఁ గలదె మీరు గడుం, జేవగలిగి జలధి దాఁటి సీతం గనుఁడు ల
జ్జావనతవదన యగుచుం, జావఁ దివిరియుండె లంక జానకి యనుచున్. 497

క. ఖగపతి యొకండు దెల్పిన, విగతప్రాయోపవేశవృత్తులమై వా
ర్థి గనుంగొని నముఁ బొమ్మని, నగచరు లనుపంగ దాఁటితి నేఁ బయోధిన్. 498

వ. ప్లవంగసంప్రార్థితుండనగు నేను బూర్ణశతయోజనవిస్తీర్ణఘూర్ణమానమహార్ణవావ
తీర్ణుండనై సమయానురూపరూపంబున లంకాపురంబు బాతెయుం బరిశోధించి రావ
ణుండు నీతోడ దుర్భాషణంబు లాడునప్పు డవసరజ్ఞుండనై వానిపాయుం దెంపు
సేయక యియ్యశోకానోకహాగ్రంబున నొదిఁగియుండి యద్దురాత్ముండు వోయినం
బొడకట్టితి నని పలికి యెల్లవానరుల నుద్దేశించి వర్ణియవ్వారవర్ణిని కిట్లనియె. 499

ఉ. ఆదటు భూవదైర్యకనకాచలు లందఱుఁ గామరూపు ల
య్యాదట సారవేగవాసితాశుగు లందఱు శూరులైనవా
రందఱు నిన్నుఁ గాంచి చరితార్థత నిమ్మెయి నొందియున్న వ
న్నందరు పుణ్యకీర్తుల వనం దరుచారికి బ్రహ్మచారికిన్. 500

ఉ. అన్నలినాక్షి యిట్లనియె నన్న భవద్వచనోద్గమత్సుధా
క్లిన్నమనస్కనయ్యు నిటుఁ గృత్రిమవానరరూపమూని మా
యన్ననుఁ గాఁతియాంబటుప నారయ రక్కసుఁ గాఁగ సంశయా
పన్నహృదబ్జనై యొకఁడు వల్కెద నేర్పడ విన్నవించెదే. 501

క. రాముని దూతననుచు నా,తో మొదలం బల్కితివి సుతుండవు నాకు
న్నీమోముఁ జూచుటం జే,తో మోదంబయ్యెఁ బల్కుఁడు నీతోడన్. 502

ఉ. రాముఁ డరణ్యభూములకు రాఁ బనియేమి తదీయ భీమసం
గ్రామము లోన నెవ్వరు పరాజితులై రతఁడే వ్రతంబునైఁ

ప్రేమవహించియుండు మహిభృద్వరుఁ డేక్రియ మేనివారికిఁ ద
త్స్వామియుఁ దమ్ముఁడుం గడుఁ బ్రసన్న మనస్థితు లున్నవారటే? 503

క. సౌమిత్రి యెట్టివాఁ డా, రామునకు నగ్రజునకుఁ జిరంబగు సఖ్యం
బే మెయిఁ గల్గె బయోనిధి, నే మెయి దాఁటితివి తెల్పు మేర్పడ నాకున్. 504

చ. అనవుడు నమ్మనిట్లనియె నమ్మ భవత్పతి కైక వాంఛకై
కనలక వచ్చెఁ గాననకుఁ గయ్యము నేయఁగ నోడె భార్గవుం
డనితరసాధ్యుఁ డా నృపతి కాతనిచే మృతినొంది ట్టి వా
రవయులు తాటకాదులు ఖరాదులు ఘోరవనాదు లంగనా. 505

వ. మఱియు నమ్మహాధనుర్ధరుచే మారీచాదు లనేకులు బంచత్వంబునొంది రది యట్లుం డనిమ్ము. 506

క. వాలమునఁ గ్రూరు రావణుఁ, గీలించి చతుఃపయోధికీలాలములం
దేలించిన యవ్వాలిం, గూలించె నరేంద్రుఁ డొక్కకోల న్లీలన్. 507

క. సువ్రత రామునకేది ప్రియవ్రతమని తొలుత నడిగి తాలింపుము స
త్యవ్రత మది యొకఁడేల ప్రతివ్రత ప్రియమేకపులసతీవ్రతముఁ గడున్. 508

క. రాముఁడు మేచకజలద, శ్యాముఁ డతఁడుఁ దమ్ముఁడుం బ్రసన్నహృదయులై
కామిని యెట్లుందురు నీ, లేమినిఁ గడు జిత్తములు చలించుచునుండన్. 509

తే. లక్ష్మణుఁడు లక్ష్మణుఁడు కృతలక్షణుండు, తప్తకాంచన భాసురధామదేహుఁ
డన్న యెడఁ భక్తిగలఁడు నిన్నాత్మఁ దలఁచి, తలఁచి వగనొందు హా తల్లి తల్లి యనుచు.

క. నీవు ధరాపతితల్పంబులు, గావించిన భూషణములు గాన్పించిన సు
గ్రీవునితో బద్ధస్నేహావేశితబుద్ధి యయ్యె నధిపతి మిగులన్. 511

వ. రామలక్ష్మణులకు నావిధంబునం గల యనుకంపావిశేషంబునను మజ్జనకుఁడగు జగత్ప్రాణుని ప్రసాదంబు కలిమిం గడలిఁ గడచి వచ్చితి మదీయాగమనంబున కెదురు చూచుచున్న కపినికరంబు కరంబు నానందంబునొంద న్భవదనుగ్రహంబునం బయోరాశి మరల నశ్రమంబునం దాఁటిపోవంగలవాఁడ నని పలికి వెండియు

క. భూవిభుఁ డనంతుఁ డనఁదగు, నావిభుతమ్ముఁడు ననంతుఁ డతులితబుద్ధి
న్నీవు ననంతవు తమరు, న్నావుడు నంతటను జనకనందన ప్రీతిన్. 513

చ. వెడవెడ నమ్మి యిట్లనియె వీరవరా మదధీశునాజ్ఞని
జ్జడధిఁ గ్రమించివచ్చినయసాధ్యబలాఢ్యుఁడ వౌదు రామభ
ద్రుఁ డిటకు వచ్చి దానవులఁ ద్రుంచి బలం బెసలార నన్ను నె
ప్పుడు గొనిపోక గల్గు నను బోటికి దుఃఖము పారమొందునే. 514

చ. అనివదనంబువంచి విపులాశ్రుసమార్ద్రకపోలయుగ్మయై
జనకజ యూరకున్నఁ గపిచంద్రుఁడు తత్సతి కిట్లు వల్కె నీ
మనమునఁ జింతఁ జిక్కుము క్రమంబున రాఘవుఁడిందు వచ్చి దై
త్యనికరము న్వధించి ముదమార నినుం గొనిపోవు నంగనా. 515

వ. అంతియేల నీవనుమతింపవు గాక వీఁక నియ్యశోకవృక్షవాటికాసహితంబుగా నిన్నెత్తికొనిపోయి రామలక్ష్మణులసన్నిధిం బెట్టఁజాలనే యని పలికి వెండియు.

ద్వ్యక్షరకందము. మానుము నీమనమున ననుమానము నను నమ్ము మిన్నమనుమని ననినా
మ్మానిని నీ మేనున్నన, నూన మమానమును నెమ్మి నూనుము నమ్మన్. 517

చ. అనుటయు సంతసించి జనకాత్మజఁ గ్గొని మన్నిజాకృతిం
గనవలతేనిఁ జూపెద నగంబులు నాదగు కాలిపెద్ద్రవే
లిఁకఁ జిఱుతుంగఁజాలిన బలిష్ఠుఁడనంచుఁ గడంగి మేను పెం
చెనతఁడు విశ్వరూపముఁ బ్రసిద్ధముగా హరిపాల్పు కైవడిన్. 518

క. చుక్కలు తలపువ్వులుగా, నక్కంజవిరోధితనరు నవతంసముగా
దిక్కులు వసనంబులుగా, నక్కపి సర్వజ్ఞుఁడొప్పె నతిపూర్ణుండై 519

ఉ. ఈగతి మేను పెంచిన కపీశ్వరుఁ గాంచి మహీజ చాలుఁ జా
లీగతి నద్భుతాకృతి వహింపఁగ నేరికివచ్చు నీవు ము
న్నేగతినుండి తట్లు ధరియింపుము సూక్ష్మశరీరము న్నభో
భాగము భూమియుం దెసలు బ్రద్దలగుం దను వింకఁ బెంచినన్. 520

క. కడు నమ్మితి నీరూపం, బుడుపథికిమించె నెంచు టుడుగుమిఁ కన్నా
వుడు విరళదేహుఁడై యొ,క్కడు మోదము జనకకన్యకుం బొనరించెన్. 521

వ. ఇట్లెప్పటియట్ల సూక్ష్మశరీరుండై యమ్మహీతనయకుం బునఃపునర్వందనంబులు గావించి తత్సుందరి డెందంబు మహానందంబు నొందఁదగు భాషణంబులాడి యొక్క యవసరమ్మున. 522

క. హనుమ ప్రయత్నంబున దాఁచినరాముని యుంగరంబు సీతకుఁ గాన్పిం
చినఁ జూచి యాలేడీఁ గైకొని యొడలంతంతయుం గగుర్పొడువంగన్. 523

ఉ. కన్నుల నద్దుచున్ మొగంబునఁ జేర్చుచు ముద్దువెట్టుచుం
గన్నుల నమ్మదాంబువులు గ్రాలుచుగాఁగఁ గపీంద్రు నెంతయున్
మన్ననసేయుచు న్మగనిమాటలు దెల్పుమటంచు నార్మికం
బ్రన్నన వేఁడుచున్ నృపతిఁ గాంచినయట్టుల సంతసించుచున్. 524

సీ. ఇందాఁక ననుఁబాసి యెందుండితివటంచు, విభుఁగూర్ప వచ్చితివే యటంచుఁ
గడలి నెవ్విధమునఁ గడచి వచ్చితివంచు, నీ వెట్లు పాసితి నృపతి నంచు
నీవున్నఁ దెచ్చునే రావణుం డనుచును, రాముండు ననుఁ జూడ రాఁ డనుచును
రామలక్ష్మణులకు క్షేమమే యనుచు న న్నెంత పాపజన్మ మో త్రికనుచుఁ
గీ. చేర్చి హృదయమున శిరమునఁ జేర్చికొనుచు, భర్తసన్నిధి వడసిన పగిది నధిక
మోహమందుచు మఱియు నమ్ముద్రికాళి, నీక్షణము మెచ్చి పల్కెఁ బృథ్వీతనూజ.

క. మేనికిఁ బ్రాణముఁ దెచ్చిన, దానవు మద్గతమునకు నిదానవు గానం
దానవుఁ గూల్చ నరేంద్రుం, డేనవు నవుఁ బాటుగల్గదే తేమన్నా. 526

క. నీవిట వచ్చినపుడు నీ,తో విభుఁ డేమనియె నన్నుఁ దోడ్కొనిపోవం
గా వచ్చితివే యని యా,పోవని మాటల్ నిగుడ్చుఁ బొంగుఁ జెలంగున్. 527

వ. ఇవ్విధంబున నతిరిక్తహర్షపరాయత్తచిత్తయగు నమ్మత్తకాశిని యుత్తరచరోత్త
మున కిట్లనియె. 528

క. నీవసమానుండవు నే,నేవిధమున నీ ఋణంబు నీఁగుదుఁ ముని సం
భావిత నీకతనఁ బునర్జీవిత నైతిం గడుం బ్రసిద్ధముగాఁగన్. 529

ఉ. నాపడుపాటు లెల్లఁ బవనప్రియనందన చూచినాఁడవు
బ్భూపతితోడఁ దెల్పి రఘుపుంగవుఁ దోడ్కొనివచ్చి రావణు
న్నూపఱఁ జూపరు ల్పొగడ రూఢివధింప నొనర్చి నన్ను సం
ప్రాపితశైత్యఁ జేయుము కృపాపర మ్రొక్కెద వేయు నేటికిన్. 530

వ. అనుటయు నప్పవనతనయుం డమ్మలికమ్మ క్రమ్మఱదేఱ నయ్యమ్మకు నెయ్యమ్ము
గా నిట్లనియె. 531

క. ఖరనఖరంబుల నరహరి, హిరణ్యకశిపున్వధించు నేడై యదోఁప
న్ఖరశరంబుల రాముఁడు, దురాత్ము రావణువధించు దురమునఁ దరుణీ. 532

ఉ. సందియమేల రాముఁ డనుజన్మసమేతముగాఁ బ్లవంగపు
ల్బృందడిసేయ నెట్టియిన సాగరము న్వెస నిగ్గమించి దై
త్యుం దును మాడి యంతఁ బరితుష్టమనస్కత నొందియాతఁడో
సుందరి నిన్నుఁ గైకొను విశుద్ధచరిత్రవు శోకమేటికిన్. 533

వ. అని వెండియుం దగిన వచనంబుల నూఱడించి. 534

క. సారెకు నెదురు సూచుచు, నీరాకకు తీగభూమి నిలుతురు ప్లవగు
ల్వీరా కపివర్య యనుచు, నోరాకాచంద్రవదన యొసఁగుము సెలవున్. 536

క. నాపైఁ బ్రాణములిడి రఘు,భూపతియుం దదనుజుండుఁ బూవసుతుండుం
జూపులు దీపులుగట్టఁగ, భూపుత్త్రీ చూతు రిపుడ పోవఁగవలయున్. 536

ఉ. జానకిఁ గాంచివచ్చితి నసాధ్యజవోన్నతి లంకనంచు భూ
జానికిఁ దెల్పినం గడు నిజమ్ముగ నమ్మఁగనిమ్ము ప్రత్యభి
జ్ఞానము నావుడుం జనకకన్యక సంతసమంది యమ్మరు
త్సూనుమొగంబు గాంచి పరిశుద్ధపరిస్ఫుటభాషణంబులన్. 537

ఉ. భాసురచిత్రకూటకృతపర్ణకుటీరమున న్వసింపఁ గా
కాసురుఁ డేఁగుదెంచి నను నార్తియొనర్ప నరేశ్వరుండు ని
ష్కాసితుఁ జేసె వాని నొకకన్నువగిల్చి యెఱుంగ రెవ్వరుం
బ్రాసవిదూర యివ్విధము రాఘవు లిర్వురు నేనుఁ దక్కఁగన్. 538

క. కావున నీ కెఱిఁగించిన, యీవిధము నరేశ్వరునకు నేర్పఱిచినచో
నీవు ననుఁ గాంచి వచ్చుట, భావించుంటంచుఁ దెలియఁబలికె ముదమునన్. 539

క. వీఁడు ధరానందనఁ గన్నాఁడని రాముండు మిగుల నమ్మెటుకు సతీ
చూడామణి యొసఁగె న్నిజ, చూడామణి బ్రహ్మచారిచూడామణికిన్. 540

ఉ. నూత్నసరోజగంధి సువనోః తమారుతికి నివ్విధి న్నికో
రత్న మొసంగినం గొని శిరంబునఁ జేర్చుచు నచ్చుణి న్మహో
యత్నముతోడఁ దాఁచి పవనాత్మజుఁ డెంతయు వేడ్క మానినీ
రత్నము వీడుకోల్పడసి రాత్రిచరేశపరీక్షమార్థియై. 541

క. దుర్భరపరుషాక్షరయుత, దుర్భాషలు జనకకన్యతో రావణుఁ డ
ర్భాటిని నాడ వినుట నాఁ, దుర్భరక్రోధవహ్నిదీపితాత్ముండై. 542

వ. సహింపక హనుమంతుండు లంకాపురాభిముఖుండై కేళీవనోద్యానంబునకుం జొచ్చి. 543

క. తోఁటలుఁ బూఁదోఁట లనంటి, తోఁటలు నునుఁదమలపాకుఁదోఁట లగల్చె
న్వాటములు వాజిశాల, వాటము లురువేదికావాటము లూడ్చెన్. 544

వ. వెండియు. 545

సీ. విస్తారఫలతరువిస్తారమ్ములు రాల్చె సాలము ల్సాలము ల్నేలఁగలపు
సారమ్ములైన కాసారమ్ములు గలఁచెఁ గొమ్మలు గొమ్మలు గూలఁద్రోయు
గోపురస్పర్ధులు గోపురమ్ములు వ్రాలఁ ఖగముల ఖగముల కదలఁదోలెఁ
బోటుల గుండెల పోటులఁ బెదరించు ధామము ల్ధామము ల్నమమడఁచెఁ

గీ. దావలమ్ముగ భద్రదంతావలమ్ము, లున్నశాలలు నురుమాడు నాగ్రవాల
జనితవత్తూలవిభ్రమజ్జలదశకల, సంభవుండగు బవమానసంభవుండు. 546

క. వారనికింక న్లంకా,ద్వార మధిష్ఠించి దైత్యవారము దన్నుం
దూరమునఁగాంచి సింహకిశోర మనుచు మిగుల భీతిం జొచ్చి కలంగన్. 547

క. విహరించుచుఁ బ్రాణంబు లపహరించుచునున్న ప్లవగపతిఁ గాంచి భయా
వహమగుచుఁ బారెఁ దనుజని, వహము పులిం గాంచి కదుపు వాఱువడువునన్.

ఉ. అంతం గొందఱు దానవాధములు రక్షోధ్యక్షునిం గాంచి యు
త్యంతంబు న్భయకంపితాత్ములగుచున్ హాహాధ్వను ల్మీఱ ని
స్స్వంతోషంబుగ నిట్లు వల్కిరి దశాస్యా పట్టనద్వారమా
క్రాంతంబయ్యెఁ జుమీ యొకానొకప్లవంగస్వామిచే నెంతయున్. 549

చ కటకట యిట్టి యద్భుత మొకప్పుడుఁ గానము బ్రహ్మచారియ
క్కటుఁ డొకఁ డీవు దెచ్చిన ధరాసుతకుం దగు మాటలాడి యు
ద్భటగతి నిందు వచ్చి మనపట్టణతోరణ మెక్కి క్రవ్యభు
గ్భటకమలాకరంబుఁ గలఁప దొడఁగెం గరివోలె నుగ్రుఁడై. 550

క. ఉపవనములు పవనహతి, న్విపులాపతితంబులైన విధమున మిగుల
న్విపులతరద్రుమవాటివి, నిపాతితములయ్యె నొక్కనిమిషములోనన్. 551

క. కపిమాత్రుండు గాఁడు నృపా, కపిమాత్రుఁడు గాని లోకకంటక వాని
న్నిపుణత నెఱుఁగ యొనర్పక, నృపఁ జూచితివేని జాఁగీడగు మనకున్. 552

వ. అనవుడు. 553

ఉ. కన్నుల నిప్పులొల్కఁ దశకంఠుఁడు దర్పితబాహుసత్త్వసం
పన్నులఁ గామరూపుల నపారజవాఢ్యులఁ బల్వుర న్నిరా
పన్నుల దైత్యులం గని కృపావరహీనుని మర్కటేశుని
గ్రన్ననఁ గట్టి రండు మిము మన్నన సేయుదు నంచుఁ బల్కెనన్. 554

క. ధృతిగతిఁ దత్సేనా, చతురంగములను మృదంగశంఖారవముల్
చతురాశాపూరితముగఁ, జతురత నడిపించి రసురసైన్యాధిపతుల్. 555

వ. ఇట్లు సైన్యంబులు నడిపించుచు. 556

ఉ. దంభులు జంభజిద్రిపు లుదగ్రభటేశులు నేకు లమ్మరు
త్సంఘముఁ జుట్టుముట్టి నిశితప్రదరంబుల నొంపఁ దోరణ
స్తంభముఁ బెఱికి తుండము దమించి సత్త్వుఁడు వాయుకుమారుఁ డాహవా
రంభుఁడు పేర్చి శత్రునికరమ్ములఁ గరమ్ములఁ బట్టి వైచుచున్. 557
దనుజులు వాఁడియమ్ముల పథంబునఁ బైఁబడి బాణవర్షము
న్ననిచినఁ గొండకైవడి విశిఖాలవృష్టి వహించి వాలసం

జనితమదోద్ధతిం దనుజసంఘము నుద్ధతి మాన్చి వెండియున్
మొనసిన నుగ్రుఁ డిట్లుఁ గపి మూర్తి వహించె నసంగరాళుఁడై. 558

క. పదవాలకరనఖరములఁ, నదిమి విసిరివేసి వచ్చి యశ్వాళులన్
మదగజతురగస్యందన, పదాతుల హరించెఁ బవనభవుఁ డొకమాత్రన్. 559

వ. ఇవ్విధంబునం జతురంగంబులం బొరిసమరి. 560

ఉ. రూఢధృతి న్విరోధుల శిరోధుల వాలము చుట్టి తోరణా
రూఢుఁడు వాయునందనుఁడు రోదసి పిక్కటిలంగ నార్చుచుం
గాఢజవంబునం జలధిఁ గల్పుచుఁ బేర్చుచు నిర్విధి న్సని
త్రోఘియ ఖేచరాలి దనుఁ బ్రస్తుతిసేయఁ జెలంగి యాడుచున్. 561

ఉ. వారక వెండియుం దనుజవారము దన్నెదిరింప నయ్యెడ
ద్వారముఁ జేరఁబుచ్చుచు నవార్యబలోద్ధతియై తగ న్బహి
ర్ద్వారముఁ జేరి నిల్వఁ దనవారల చావు గనంబుఁ బందలా
వారలచే నెఱింగి పరివారముఁ గాంచి దశాస్యుఁ డాత్తుఁడై. 562

ఉ. ఘోర విచిత్ర మొక్కప్లవగాధముఁ డిందఱ రాక్షసోత్తమా
చారుల సద్విచారుల విచారవిమూఢులఁ జంపె నద్దురా
చారునిఁ గూల్చి రండని ససంభ్రమత న్నియమించెఁ బాపవి
స్తారచరిత్రులన్ దివిజశత్రుల నేడ్వురమంత్రిపుత్రులన్. 563

ఉ. తత్ప్రభుచోదితుల్ విభుఁడు దమ్ముఁ బంపఁగ సత్వరంబున
న్సప్తమహోగ్రమంత్రిసుతసప్తక మెంతయు నుబ్బి మీఱ నా
తప్తభుజుల్ నిశాచరులు దారుణరావము గూడి కొల్వ సం
తప్తసువర్ణభాసురరథద్విరదాశ్వచమూసమేతులై. 564

క. చని పవనతనూజుం గనుఁ, గొని పోదుపుం దేముఁ దనుచుఁ గోల్లలు సేయన్
హనుమంతుఁడు తనమనమున, ననుమాన మొకింత లేక యతిమాత్రుండై. 565

క. గొదగొని మదకరిపదముల, జెదఁ జడిపినభంగి శుక్రశిష్యబలంబుం
జిదురుపలుసేసి ముదమెద్దఁగ దనుజమంత్రిసుతసప్తకముఁ గిట్టి వేగన్. 566

క. వాలము కరవాలముగా, సాలము గావించె మర్కటాధ్యక్షుం డా
భీలముగా దనుజులకుం, గాలముగా నప్పుడిమపగాలం బగుచున్. 567

గీ. ఇట్లు పోరాడి యిరువుర నెత్తి కేలఁ, బట్టి శిరముల నొండొండఁ బగుల వేసి
దానవామాత్యపుత్రసప్తకము నొక్కఁ, బెట్టఁ బంచత్వ మొసరించి పేర్చి యార్చి.

క. పంచత్వం బొనరించె న్పంచత్వరఁ బంచభూతసహోదాతులం ద
త్వాచకము మంత్రిపుత్రక, పంచత్వం బెఱిఁగి దనుజపతి మతి నొవఁగన్. 569
క. ప్రాప్తసువాలభ్రమణ, వ్యాప్తజగత్ప్రాణఘనసహోదిత హనుమ
ద్దీప్తాగ్ని మంత్రిపుత్రక, సప్తకవన మిట్టులేచ్చి సరభసవృత్తిన్. 570
వ. క్రమ్మఱ నెప్పటియట్ల తోరణస్తంభాధిరూఢుండై విజృంభించుటయు. 571
క. హతశేషులచేఁ దనమంత్రితనూజులు దెగుటవిని యధికరోషసము
న్వితుఁడగు రావణునానతి, నతనిసుతుఁడు వెడలె నక్షయబలుండగుచున్. 572
సీ. కాలకింకరసదృక్ప్రాలదేహంబుల నుగ్రాల పార్శ్వచరుల రాక్షసులు నడువ
రథనేమిహయసింధురఖురపదోద్ధితరజము నాకధునిఁగర్దమము సేయ
నింతవిక్రమశాలి నీకఁజూడనని తండ్రి తనలోన నమితమోదంబు నొంద
నక్షయుం డితఁడు ఘోరాక్షురదుఁడు పక్షపక్షవృద్ధివని సురావలి వడంక
గీ. నధికరాక్షసవంశకుటుంబుఁ దెల్ప, వితతముగఁ బక్షులపసవ్యగతులఁ దిరుగ
నరదమునఁ డెక్కియున గ్రద్ద లాకుచుండ, నెలమి రాక్షసనందనుం డిట్లు వెడలె.
క. అక్షయుఁ డీక్షించె న్నాగ్యక్షసదృక్షు స్స్వపక్షరక్షాదక్షు
న్నృక్షచరాధ్యక్షు నసుగ్రక్షశ్శిక్షావిచక్షు రాజితవక్షున్. 584
వ. కనుంగొని. 575
క. తలపడి తనకంటె న్మను, దలపడి పోరాడి పరఁతనయుని బాహా
బలజలధిమగ్నముగ నిజ, బలజలధిం గాంచి రోషభరితుం డగుచున్. 576
క. శోల లసురుఁడేయ న్వారి, గోలల క్రియ హనుమ లెక్కగొనక బలువిడి
న్వాలములు గురియ నసుర కీ, సాలంబులభంగి వానిఁ జక్కడఁచి వెసన్. 577
ఉ. వెండియుఁ జండకాండములు ప్రేసినవాజ్యము ప్రుమ్మరింపఁగా
మండెడు నగ్నివోలె హనుమంతుఁడు పేర్చి దశాననాత్మపు
త్రుం డరచాపుచావ నొక దొడ్డశిలం దలద్రేయు నొచ్చి యా
తం డవశత్వమొందియుఁ బడంపడి విక్రమదోహలంబునన్. 578
చ. మనుజవిరోధి తన్నె వెడమాయలు వన్నిఁగ గోపమెత్తి య
ద్దనుజవిరోధి యక్షయకృతప్రకృతు ల్దవవొందనీక యా
తనిమెడ నాత్మవాలకలితమ్ముగఁ జేసి ధరిత్రి వ్రేయుడుం
గనుఁగవ నశ్రుధార లొలుక న్విలపించుచుఁ గూలె సోలుచున్. 579
క. క్షయరహితుఁ డనిలసుతుఁ డ, క్షయుని రహితప్రాణుఁ జేయఁ గ్రమ్మఱ దనుజు
ల్భయవృత్తిం బుత్రపరి, క్షయ మెఱిఁగించుటయుఁ బజ్క్తికంఠుం డార్తిన్. 580

క. అక్షయుఁడు దేవకసుపుత్రుఁ డక్షుణ్ణుఁ డగుచు నెక్కి వేయుంక్షుబరిగన
వ్యత్యక్షవరాధ్యాస్త్ర ప్రతతి, శిక్షింపఁగ దేవతులు మెచ్చఁ జిత్రము గంగన్. 581

చ. అతనికిమాఱుఁ డక్షయుఁడు నర్కజుఁ డిగ్రజరాహ్వయుండు దం
డ్రికొలఁదు దీర్ప నేరని వడిన్ జతురంగచమూసమేతుఁడై
వితతరథప్రబద్ధహయవేగముఁ జూపుచు మెచ్చఁ ద్రోణ
సితు హనుమంతునిం ద్రోడమధీరతవెల్వడి యొం డుదుద్ధతిన్. 582

ఆ. అట్లు వెడలి యక్షకుమారకు నంతక, సన్నిభుఁ గాంచి పవనసాహసుఁడు
జేరనరిగి జంభజిజ్జైత్రుఁ డిట్లని, పల్కెఁ గనుంగొనుచు లోఁగఁ జూడ. 583

ఉ. ఇక్కడవచ్చి కొందఱ విహీనపరాక్రముల న్వధించి నీ
వెక్కుడుసత్త్వశాలివని యెంతయుఁ బొంగెదు మచ్చరాహతిం
జిక్కనయేని యొకి నసాధ్యుఁడ నంచుఁ దలంపవచ్చు నం
చక్కటి నాకుఁ డాత్మ చతురంగములం బొరికొల్ప నుగ్రుఁడై. 584

సీ. గంధానసింధురఘనసనాగరథము ల్రాల్చఁ గేసరికిశోరం బనంగఁ
బటుతరోత్కటవీరభటవిమర్దనకేళి నర్తించు నలయుగ్రమూర్తి యనఁగ
రథసారథి సారథ్యకోటుల నీవ లావలఁ గావించు హరియనంగఁ
బఱ్ఱక తరి దైత్యపతిని దోఁక బిగించి వనధిలోఁ బడఁ గుంచువాలి యనఁగ

గీ. నట్లు సంగరకేళీవిహారమగ్న, లింపఁ దన్నునిలింపు లగ్గింప మెఱయు
చున్న పవనతనూజాతు నురుభుజావి, జృంభణము సైంపకయ్యె ప్రజిత్తుఁ డలిగి. 585

మ. అనపై సాలదయాంబువైన వది యంతంతన్నివర్తించి యా
తనిపైఁ దీక్ష్ణశరంబు లేయుటయు దైత్యాంకు భీతిల్ల న
శ్మని కాయంబు నయన్వెంత యుఁ బరోపనాభ్ర ర్తి నవ్వానరేం
ద్రునిటాలాంబుజము స్థలీముఖములం దూటించి వెల్లాన్చెనన్. 586

ఉ. వానరుఁ డొక్కగండశిల వైచిన జూర్ణము౯ర్చి యెంతయుం
బూనికవైమదిన్వళరయు ల్లానుపుంతుఁడు పొల్లునేయ న
ద్దానవుఁ డంబుజాసనకదంబము దేవకదంబమెల్ల వా
హానిసదంబు సేయుఁగ రయంబెసఁగం దెగవాపియేయుకున్. 587

క. మతుసమావేశితు హను, మంతుం జుట్టికొని బ్రహ్మవ్యమగు నస్త్రంబుం
బంతఁ బ్రబంధించెం గను, బంతంబును బ్రేమయ గగన మల్లలనాడన్. 588

స్రగ్ధరావృత్తము. భీమబ్రహ్మాస్త్రపాశాపిహితుఁ హరిసుతుం భీమకాటోపబర్హి
ష్ణుప్రామేయప్రకాశు న్సుభగచరితు నక్షోభ్యవక్షుద్రుమవ్య
గ్రోత్ప్రామిత్యప్రతాపు న్పృథుమహితయశోర్థి న్మహాబాహు దీర్ఘా
యుష్మంతుం బాపఁ దద్దైత్యుఁడు గని యధికోన్మత్తుఁడై చేరి యంతన్.

క. పట్టికొని నిజరథంబునఁ, బెట్టికొనియెఁ గానియితఁ డభేద్యుఁ డెవరికిం
బట్టువడఁ డివ్విధంబునఁ, బట్టువడుట లీలయనుచు భావింపఁ డెవన్. 590

వ. ఇట్లు మఱభిమానంబున నవ్వనచరేంద్రు నిజరథంబునం బెట్టికట్టి మహానందంబున శంఖ
భేరీ మృదంగ ప్రముఖ నిఖిల జయధ్వానంబులు నింగి ముట్టం గదలి. 591

చ. పురముఁ జెల్లవారుఁదను బోరనఁ గీర్తనసేయ నాఁడు ల
బ్బురముఁ దేల నిట్లు కపిపుంగవుఁ దోడ్కొనివచ్చి రాక్షసే
శ్వరునకు మ్రొక్కి చూడుము నిశాచరనాయక కట్టితెచ్చితిం
దరుచరునం దుఁ జూపిన ముదంబునఁ బుత్రకుఁ గౌఁగిలించుచున్. 592

ఉ. తోరణమెక్కి రక్కసులఁ ద్రుంచుచు నక్షయుని న్వధించి యా
ధోరణముఖ్యులం జగిపి దోర్బలనిర్జితశక్రజిత్తైననీ
తోరణమాఁ వరించుటకుఁ దోఁచినవానరుఁ బట్టితెచ్చితో
కారణమేమొ నిన్నుఁ గొని యాడఁగ నేరితరంబు చెప్పుమా 593

వ. అని మఱియుం బ్రియనందను నపరిమితమధురవచనంబుల నగ్గించి రక్షోధ్యక్షుండు
వృక్షచరాధ్యక్షు నిరీక్షించి యాక్షేపకపరుషవచనంబుల నాక్షేపించి. 594

క. ఎవ్వఁడ వెవ్వఁడుపున నీ, వివ్వనరాశిం దరించి యేతెంచితి ని
న్నెవ్వఁ డిటఁ బంపె నవ్వుచు, నవ్వనచరుఁ డసురతోడ నవ్వెడసంగన్. 595

ఉ. రామునియాజ్ఞఁ దెచ్చితి ధరాసుతఁ గన్గొన వారిధి న్రఘు
స్వామియనుగ్రహంబున జవంబున దాఁటితి వాయుపుత్రుఁడ
న్నీమది నొవ్వ దైత్యుల ననేకులఁ బట్టి వధించితిం గపి
స్తోమము సంతసింప నినుఁ జూచి భవత్పురిఁ గాల్చి పోయెదన్. 596

వ. అని పలికె వెండియు. 597

క. అవినీతిపరుఁడ వగుని, న్నవనీపతి సంహరించి యవనీతనయా
నవనీతదేహఁ గొనిచను, నవశ్యమున రాక్షసేంద్రుఁ డాగ్రహుఁడగుచున్. 598

క. ఈతరుచరవరుఁ గపటా, న్నీతు వధింపఁ దగవుడు విభీషణుఁ డుఱని
ర్ధూతాఘుఁడు వారించెం, దూతయవధ్యుఁడని పలుకుదుర బుధులనుచున్. 599

క. ఈకరణి నివారింప మ,హాకోపము నొంది రావణాసురుఁ డసురా
నీకములఁ గాంచి యాకపి, తోఁకకు నగ్గిఁ దవిలించి తోలుం డనినన్. 600

మ. దనుజుల్ తైలవిలిప్తవస్త్రవితతిం దద్వానరాధీశవా
లనిబద్ధం బొనరించి ఘోరగతిఁ గీలాప్రస్ఫురద్ధవ్యవా
హనుఁ గీలించి సురేంద్రజిద్విహితబ్రహ్మాస్త్రప్రబంధప్రమో
చనువాతాత్మజుఁ బొమ్ము పొమ్మనిరి హాస్యంబుల్ప్రసంగించుచున్. 601

ఆ. ఇట్లు సోఁకుమూఁక లెలమి నవ్వుచుఁ దను, జిహ్వసంతసింపఁ జేరి వాని
తోఁక రవులఁబెట్టి తోలఁగి పొమ్మనుటయుఁ, గాలిచూలి మిగులఁ గసరువొడము

క. కీలిప్రకలితనిజఘన, వాలాలాతభ్రమణవివర్ధితవహ్ని
జ్వాలాజాలుఁడై యా,గ్గోలాంగూలోత్తముఁడు సకోపుం డగుచున్. 603

క. పురమునఁ గల బంధురసుం,దరమందిరవారణాయుధస్థలగర్భా
సురుచిరలసత్ప్రాసా,దరథంబుల కొక్కపెట్టి దహనము వెట్టెన్. 604

క. పొగ వెడలి యెల్లదిక్కుల, బుగబుగ మనుచుంట యెగయఁ బోరిబోరిఁ దనుజు
ల్వగనొంది పత్త్రికఁ ధరుఁ, దెగఁ జేరి సతిసీత నేల తెచ్చెనటంచున్. 605

వ. అంతం గ్రమక్రమంబున సప్తార్చిః ప్రవృద్ధార్చియై పేర్చి. 606

క. దళమగు వహ్నిజ్వాలలఁ, ఢళ ఢెళ యని విఱిగి సౌధబృందము పడఁగా
గళవళ మందుచు హుతభు,క్ప్రళయమనుగా వగచి మిగుల భయపడి రసురుల్. 607

గీ. రామకోపాగ్ని యిట్లు దగ్గుటశేరక, యూని లంకాపురము నేర్చుచున్నదనఁగ
వాయుతనయుండు గొఱిక్తైవడి నిజోరు, వాలదండంబు త్రిప్పుచు వర్తిలంగ. 608

సీ. ధామము ల్స్నిగ్ధధూమధామముల్ చేసి జోకమరుప్రోఁదోఁటలు గమఱఁజేసి
వర్త్మంబులను కృష్ణవర్త్మంబు లొనరించి భూతిశాంతయును విభూతిఁ జేసి
కలశాలలెల్ల నింగలశాల లొనరించి జాలంబులను శిఖాజాలముంచి
యవరోధ మధిః ధూమావరోధముఁ జేసి పటురూపములు విరూపము లొనర్చి
గీ. మండపంబులు మండెడు మంటఁగలిపి, గుమ్మములనెల్ల నిప్పులు గుమ్మరించి
కాయమానంబులు ధగద్ధగాయమాన, ములుగ నొనరించె హరివాలకలితవహ్ని. 609

వ. ఇట్లాత్మవాలాభీలవహ్నిజ్వాలాజాలంబుల వాతూలబాలుండు లంకాపురభేదనం
బు భస్మంబుఁ గావించుచుండె నట్టియెడ. 610

ఆ. కంటిమంటఁ దోఁక కంటించికొనివచ్చి, క్రాలుచున్న కాలకాలుఁ డనఁగ
నీతఁ డొప్పెననుచు హృదయంబులు చలించు, చుండె ననురు లుష్ణ మూర్ఛ లేక.

చ. కోలఁకులఁ జేరువారుఁ దమకుం బొగచుట్టిన నక్రవారిక
న్గోలుకులఁ గాలువారుఁ గపికుంజరుఁ గాంచి భయాతిరేకులై
కేలఁకులఁ బాలువారుఁ గడఁగేకలు వెట్టెడువారు నెంతయున్
న్వోలవెలఁబారువారునయి విహ్వలమందిరి రాత్రిసాధముల్. 612

సీ. బడబాగ్ని జడనిధి వెడలిలంకాపురి, నేర్చుచున్నదని యూహించువారు
నదెవిభీషణుఁడు పుణ్యాత్ముఁ డాతనియిల్లుఁ, జేందగ్గి యని వీక్షించువారు
నీకపి లయరుద్రుఁ డిదిప్రళయంబుగా, నితరంబు గాదని యెంచువారుఁ
గొని తెచ్చికొనినట్లు క్రోఁతతోఁకకు నగ్గిఁ, బెట్టి నేలయటంచుఁ దిట్టువారుఁ

గీ. బూర్ణమై మండుచు హుతభుక్శిఖాక, లాపముల గ్రందువారు విలాపమందు
వారుబంధుల బేర్కొనువారుఁ బాలు, వారునైరక్కసులు గడవగలఁ బొగులు. 613

క. వాయుసుతుండెసకొల్పఁగ, వాయుసఖుండు పేర్చి ఘరమవారణ నేర్చెన్
వ్వాయుజవాశ్వరథేభర, థాయతకేతననికేతనాదులతోడన్. 614

గీ. కపికులాధీశ్వరుఁడు దాపికాఁడుగాఁగ, బొదలుధూమధ్వజుఁడు బురము సొచ్చి
ముఖ్యధనధాన్యపరిధానములు హరించె, గాలిచెలికాఁడు జిచ్చనుకన్నగాఁడు. 615

ఆ. సమనివార్యభావిసాగరబంధన, సాధనోపకరణసవరణలకు
నధికయత్న మొప్ప నంగారములు గాల్చె, చందమొందె బవననందనుండు. 616

వ. తదనంతరంబున నిజలాంగూల ప్రభవ శోణిమ ధన సముద్భూత పావనీయాగ్నిం బూ
ర్వసుధాశనరుధిరాజ్యధారాచ్ఛటాసేకంబునం బ్రవృద్ధంబు గావించి మంత్రిసుత
సప్తకాక్షయకుమారాది పశువిశసనంబుఁ గావించి వేల్చి పురందరాది బృందారక
సందోహంబు మహానందంబునొంద రక్కసస్త్రీశోకాలాప మంత్రంబులతో లంకాపురం
బుఁ బూర్ణాహుతిఁ గావించి తద్ధూమాఘ్రాణంబున ఖచరకిన్నరీ కాంతాసంతా
నంబులు మొదల నాంజనేయ సోమయాజి యాజిలీలామఖంబు నిర్విఘ్నంబుగా నానం
దసాగరావభృథస్నానంబు గావించి శాంతిఁ బొందివరలె వాఁ డైతనమనంబున. 617

క. వాలాగ్నికీల మరుదై, వాలగతిం జల్లనగుట వసుధాతనయో
ద్వేలకరుణాసుధారస, మూలంబని తలఁచికొని ప్రమోదభరితుఁడై. 618

క. తనసేమము గోరెడు భూ, తనయకుఁ బ్రణమిల్లి పోయెదనని తదాజ్ఞం
జనికాంచె వారిరాశిం, జనితపరమశైత్యలతితజగతాక్లేశిన్. 619

ఆ. కనిసమగ్రరీతి కాశేరిజ్మఖుఁ, డగుచుఁ గడలిదాఁటె నక్షిమమున
దన్ను నెదురుసూచు తరుచరవర్యుల, ప్రాణవాయువగ నవనితుఁడు. 620

వ. ఇట్లు మహాబలుండు నిజవిఘ్నకర్కశలాంగూలవిక్షేపప్రసూతప్రభూతమహాబలంబున సముద్రంబు పాయవఁజేయుచు నరుగుదెంచు నపుడు వనచరనికరముఖ్యులు వన లోన. 621

మ. చనుదెంచుం బవనాత్మజుం డదె రఘుశ్రీనాథసత్తారావనో
ద్యానవీథిం జెడఁ ద్రెంచె దద్దయు దెసరయం బంచుం బ్రతీక్షించుచుం
డ నభోభాగము భూమియుం దెసలు నిండం బర్వు తేజంబుతో
ఘనుఁ డాకీశవిభుండు వచ్చెఁ బ్లవగోత్కంఠం బనంతంబుగన్. 622

ఉ. దక్షిణవార్ధితీరము ముదంబెసలారఁగ నిట్లు చేర వ
వ్వృత్తుచరోత్తముం గని ప్రహృష్టమనస్కత వానరాళి ప్ర
త్యక్షసమీరణుం డితఁ డటంచు నుతించి కవుంగలించి తా
రాక్షితిపుత్త్రివార్తఁ గని యాతఁడు వన్నె కెక్కెనంగి యుబ్బుచున్. 623

ఉ. గంతులు వైచి రంతఁ బ్లవగప్రభు లంగదముఖ్యు లమ్మరు
త్సంతతిఁ జుట్టి ముట్టి కడు సంతసమందుచుఁ బల్కి రీవు స
త్సంతతి సన్నుతింపఁగఁ బసం జలరాశిఁ దరించి ధారుణీ
సంతతిఁ జూచి వచ్చితి వసాధ్యబలుండవటంచు నెంతయున్. 624

క. వేయువిధంబుల సన్నుతి, సేయ న్మనమునకు వేడ్కసేయం దగన
వ్వాయుతనూజుం డపుడు ఘ, నాయతగర్జాధ్వనిప్రహసితధ్వనితోన్. 625

గీ. జలనిధిఁ దరించి క్రమ్మఱ సాగరంబు, దాఁటివచ్చుట మొదలుఁ దుదయును గాఁగఁ
గలుగువృత్తాంత మెల్ల నక్కపివరులకుఁ, దెల్పి వెండియుఁ బల్కె నద్ధీరుఁ డపుడు. 626

క. సతి రాజవరాళిఁ బాసిన, గతిఁ బ్రాణముఁ జిక్కఁబట్టి గతిలేమినసం
గతి సిలుగుమిగులసీతా, సతియుం డది రాజవరాళి సన్నిధిలేమిన్. 627

క. కావున వేవేగ న్మన, మీవిధము రఘూత్తమునకు నెఱిఁగింపుటయుం
బోవుద మనవుడు విని సం, భావనమెసఁగం గపిప్రవరులు ముదమునన్. 628

క. ఆడుదురుఁ బాడుదురు గుమి, గూడుదురు సమీరజన్ముఁ గొనియాడుదురే
ట్లాడుదు రోడుదురుత్సర, మాడుదురు మనంబులధికహర్షంబులు గాన్. 629

630

వ. తదనంతరంబున.

ఉ. అంగదజాంబవద్ధనుమదాదు లతిత్వర నమ్మహోదధి
స్సంగతతీరము న్విడిచి శైలశిలామహిరుట్తతామహో
త్తుంగనదీవిశాలమగు ఘోరపుమార్గము పట్టి యంత సు
ప్లాంగుము భల్లుకప్లవగపుంగవు లెంతయు హెచ్చరింపఁగన్.

వ. నిరంతరప్రయాణంబులం జని చని కిష్కింధాపురసమీపగతమధువనంబుఁ గనుంగొని.

క. ఉల్లంబుల వెల్లివిరియ, నుల్లాసలసల్లహరిక నోలాడి కపు
ల్ఫుల్లకరరు లవ్వనముం, బల్లన నిలువంగఁ జొచ్చి భయవిరహితులై. 634

సీ. ఫలములనెల్ల నిష్ఫలములుగా రాల్చి యాకులఁ బ్రోవుఁ జేకాఁపు పఱచి
విరిపిడిఁ గోసి వావిరిపిడి గావించి లవములు గాఁగఁ బల్లవములూడ్చి
మూలంబులెల్ల నున్మూలనము గావించి యూడల బ్రేలాడి యూడఁదీసి
కలకంఠములనొప్పు కలకంఠములఁ జోపి గములయి వఱలు భృంగములఁ దోలి

గీ. ఘనలతాక్షయములు బరిత్యజము మొనర్చి, కపివరులు వనమెల్లనుఁ గాసిచేసి
రవనిజావార్తఁ దెచ్చిన యట్టివార, లగుట నించుకయేని భయంబులేక. 635

క. మధుపానం బొనరించుచు, మధుపాన మొనర్చినట్లు మత్తు లగుచు న
మ్మధువనముఁ గాచువారల, విధువనముం జేసి రసమవిక్రమవృత్తిన్. 636

క. జనకజఁ గనుఁగొనఁ జనమును, వనరాశియు నాఁడె యొద్దువచ్చె ననుచు న
వ్వనరాశిఁ గాసిచేసిరి, వనచరు లనివార్యశౌర్యవర్తను లగుచున్. 637

ఉ. తద్వనరక్షు లాతుఱను తాపుగఁ గాంచి నమస్కరించి భా
స్వద్వరపుత్ర చిత్ర మొకవార్త వినందగు నంగదాదులుం
ద్వద్విరదంబులో యన భయంబు బెణుమాత్రము లేక వీఁకయుం
మధ్వనమెల్లఁ జెల్లఁగిల పాల్పడఁ జేసి రొకింత లోపలన్. 638

క. క్షిప్రగతి నేము చని ప్లవగప్రభులం గాంచి యడుపఁగా నడుగక వా
రప్రతిహతప్రభావు ల, గ్రపతిమలు నగుచు నవనిఁ గలిపిరి వనమున్. 639

క. ఇందిందిరములు కుడుచు మ, రందము గ్రోలునెడ సుస్థిరత నగ్రములు మో
పందలఁకునట్టి మధువన, మందఱు వనచరులుఁ గలఁచి యాడిరి స్వేచ్ఛన్. 640

చ. అని వనముం గలంచిరని యాడినమాటకుఁ బొంగి జానకిం
గనుఁగొని వచ్చి రట్లగుటఁ గాదె భయం బొకయింత లేక మ
ద్వనమున సంచరింతు రనివార్యపరాక్రము లంచు రామచం
ద్రున కనుజన్ముఁ డయ్యుడునకుఁ దోయజమిత్రకులీనుఁ డిట్లనున్. F41

క. మన హనుమన్ముఖ్యులు రా, మున రేఖ్య సంతసంబు వల్లడిగొనఁగా
జనుదెంచి యిపుడు మన్మధు, వనముఁ గలఁచి యాడుచున్నవారట వింటే. 642

• కృతకార్యసిద్ధి నరుదెంచితి రని సంతోషభరితచిత్తు లగుచు వా
రతిలోకపరాక్రము లీ, గతి వర్తింతురని మదికిఁ గానఁగ వచ్చెన్. 643

ఆ. అనిన రామచంద్రుఁ డనుజన్మసహితుఁ డత్యంతవ్యాప్తమానసాబ్జుఁ డగుచు
నినము స్వామికార్యనిర్వాహకుల కిట్టి, చనవు దగునఁ గాదె యనిలసూను. 644
వ. అని పల్కె నంత ధాత్రీపుత్రీకళత్రసుమిత్రాపుత్రులు తదాలోకన సీతాసువార్తా
కథాశ్రవణపరాయణచిత్తవృత్తులై యుండి రయ్యవసరంబున. 645
క. ఆవన మివ్విధమున వీ,తావన మొనరించి పృథురయంబు మెఱయ న
ప్పావని మున్నిడికొని ప్లవ,గావలి సనుదెంచె ధరణి యంతయు నద్రువన్. 646
ఉ. ఆత్మజవాపహాసితరయంబె సలారఁగ నిట్లు రా సమీ
రాత్మజుఁ డాత్మజన్మవిజితాత్ముఁడు జాంబవదంగదాదిపూ
తాత్ములఁగూడి హర్షవినయంబుల ప్రోవన నేగి కాంచె శు
ద్ధాత్ముల రామలక్ష్మణతమోంతకపుత్రుల సచ్చరిత్రులన్. 647
ఆ. కని నమస్కరించి కరములు జోడించి, తనముఖంబుఁ గాంచి తరుణి ధరణి
తనయ నితఁడు గాంచి చనుదెంచె ననిరాముఁ, డాత్మఁ బొంగ నిట్టులనియె నతఁడు.
మ. కనుఁగొంటి న్నతిసీత నశ్రుకణముక్తాదామసంవీత నే
కనికృత్తాంబరపూత ఘర్మసలిలాక్రాంతాననాబ్జాతఁ బా
వనసౌశీల్యసమేత భ్రమ్యదసురీవ్యాపారసంభీత నా
త్మనిబద్ధోగ్రభవద్వియోగపరిభూత న్ఘోరలంకాపురికిన్. 649
సీ. అతిభయదోల్కాసహస్రంబులోపల నొక్కతె రోహిణి యున్నయట్లు
శాతకంటకలతావ్రాతాంతరంబున నొకకదళీవల్లి యున్నయట్లు
ప్రసవితేహామృగప్రకరమధ్యంబున నొక్కట సారంగి యున్నయట్లు
బహువిధశ్యేననివహసమూహంబున నొకఁడు బాలకపోతి యున్నయట్లు
గీ. ప్రబలమార్జారినికరకదంబంబులోన, నొంటిమెయిఁ గీరి కలఁకుచు నున్నయట్లు
క్రుద్ధదైత్యాంగనాప్రతిరుద్ధయగుచు, నున్నయది సీత సన్నుతాపన్నజాత.
వ. అని విన్నవించి ధీమంతుం డగుహనుమంతుండు. 651
క. ఏ మరిగి యావ్యదిగ్గత, భూమీధరతరునికుంజపుంజంబుల న
బ్భూమిజ వెదకి కానక, యేమనిపోదు మని వికలహృదయుల మగుచున్. 652
ఉ. వెండి కడంగిరోయుచుఁ గుభృద్వివరం బొకఁ డేముఁ గాంచి మా
ర్తాండమరీచికావిరహితంబగు నగ్గుహ సొచ్చి యందు నిం
దుండన కల్గునాననముతోఁ దప మొప్ప ఘటించుచున్న యు
ద్దండమహానుభావ నొకతం గని భక్తి నమస్కరించుచున్. 653

వ. నిజప్రభాపటలతిరోహితగుహాతిమిర యగు నాస్వయంప్రభ మమ్ము నాశీర్వచన
సముచితాతిథేయంబులం బ్రియంబు నొందించి యమ్మహాబిలంబు వెలువరించిన
దదుపాంతకాంతారాంతరంబున భవత్కాంతామార్గణార్థ చింతాక్రాంతుల మగు
మేము త్తరశిరస్కుల మగుచుం బ్రాయోపవేశంబు సేయం గుశాస్తరణంబుల శయ
నించియుంటి మయ్యవసరంబున. 654

క. మృత్యర్థుల మగు మాకొఱ, కత్యర్థస్వాదువాదుం డగునొక్కఁడు సం
పాత్యభిధానుఁడు గోత్రా,పత్యస్థితిఁ దెలిపి చనియెం బ్రముదితుఁ డగుచున్. 655

ఉ. ఆఖగేంద్రుఁ డిట్లు నెనరాగ మహోదధిమధ్యమంబున
రావణుపట్టణంబున ధరాసుత యుండుటఁ దెల్పి పోవ నే
మావనరాశిఁ జూచితి మనంతర మెంతయు వానరాలి సం
భావన సేయ వార్ధి సులభంబునఁ దాఁటితి ద్వద్దయాదృతిన్. 656

ఆ. ఇట్లు కడలి గడచి యెడనెడ విఘ్నంబు, లెన్నియేని గలుగ నేను గలఁగ
కప్పురంబు సొచ్చి యచట లంకిణి వచ్చి, తిరిగితిరిగి యొక్క తరువునీడ.

మ. కనుఁగొంటి న్నతి సీత నశ్రుకణముక్తాదామసంవీత నే
కనికృత్తాంబరవృత ఘర్మసలిలాక్రాంతాననాబ్జాతఁ బా
వనసౌశీల్యసమేత ద్రాఘ్యదసురీవ్యాహారసంభీత నా
త్మనిబద్ధోగ్రభవద్వియోగశిఖిభూతి న్ఘోరలంకాపురిన్. 658

క. కని వినయంబునఁ జేరం, జనునప్పుడ రావణుండు సనుదెంచి జగ
జ్జననియగు సీత బరుషవచనముల నొప్పించి యతఁడు చనియెం బెలుచన్. 659

శా. రక్షోధ్యక్షుఁ డిట్లు పోవుటయు సంరక్తాత్ములై భీమక
ద్రక్షుగకామిను లాతణంబునను గర్జారావము ల్మీఱఁ బ
ద్మాక్షిన్ రావణుఁ జెట్టపట్టుమని రూక్షాకారలై బిట్టుఁ ద
న్మాక్షేపింప ధరాకుమారి పటుదైన్యాక్రాంతయై మూర్ఛిలెన్. 660

క. నీకు శుభంబగు నసురా, నీకశుభకరము గాఁగ నేఁ గలఁగంటి
న్శోకింప నేల యని సీ,త కాంతఁ దెల్పెఁ ద్రిజట తగువాక్యములన్. 661

వ. తత్సమయంబున. 662

క. మాయమ్మ రామదూత స్సుమా యమ్మలికంబు వాయు మాపదలెల్ల
న్మాయమ్మగు నీయలుక స్సుమా యమ్మగు నింక రావణాసురపతికిన్. 663

క. అనుచు వినీతుఁడనై యుల్లసమ్మెుక్కుఁడు నన్ను సత్కులసతీమణి న
న్మనివ్యాదయంబునఁ జూచి వమ్మని పల్కెను నేను జితహర్షుఁడ నగుచున్. 664

క. మన్నిజరూపముతోన జగన్నుతభవదంగుళీయకముఁ జూపిన నే
దన్నన్ను నమ్మి మిగులఁ బ్రసన్నహృదయ యగుచుఁ జనకజాత ప్రియమునన్.

వ. భగవదీయసుందరచరణారవిందంబులు డెందంబునం దలంచి వందనంబులు గావించి సుమిత్రాపుత్రు నేమంబడిగి మీకుం బ్రత్యభిజ్ఞానార్థంబుగాఁ జిత్రకూటచిత్రకూట కృతకృతకకాకాసురకథాకథనంబు నడిపి యప్పతివ్రతాశిరోమణి శిరోమణి యొసంగి సెలవొసంగినం బ్రణామంబు గావించి నామగిడివచ్చునప్పుడు లంకాపురాభిముఖుండనై యెదిరికొనిన దనుజమంత్రిసుతసప్తకంబుఁ బంచత్వంబు నొందించి యక్షకుమారుం బరిక్షయంబు గావించి తదనంతరంబున నింద్రజిచ్చతురాననశిలీముఖపాశప్రబద్ధుండనై నగుమదీయవాలాగ్రంబున నద్దనుజపతి యగ్గి ముట్టించిన నయ్యనలం బస్మత్తోకోద్రేకవాయువశంబునం బేర్చి కరంబు దన్నగరంబు భస్మీభూతంబుగా విడిచిన శాంతుండనై తరుచరచమూసాగరమ్మున కానందంబు గ్రమ్మం గ్రమ్మఱ సాగరమ్ము గడచి యేతద్వృత్తాంతంబు నీకెఱింగింపం గంటిం గృతార్థుండనై మంటి నని పలికి సీత నుద్దేశించి వెండియు నిట్లనియె. 666

క. కన్నీ రుపరంబునఁ బడి, సన్నగిలుంగాని కొల్వ సాఁగుట లేదే
మన్న విను జనకతనయో, త్పన్నసమతిరిక్తహృదయతాపము పేర్మిన్ 667

చ. అడిరొకఁ డేమిఁ గాంత విను మన్నలినాయతనేత్ర వంత మ
ట్పదములు గాంచి పుష్పరసపానము నెవ్వగఁ గండుఁగోవెల
ల్జిగురుపు పల్లవంబులు ద్విజిహ్వులు వాయువుఁ గ్రోల వేమిచె
ప్పఁ దరు లెరుగ్వ వాత్రఫలభక్షణసేయవు పక్షులక్ష్మిశా. 668

తే. హెచ్చి దశకంధరుఁడు చెఱదెచ్చిపెట్టి, ఖచరకాంతలు దమచెంతఁ గట్టిపెట్టి
యంతఁ గరంబుల మహిజాకాంతఁ గూర్చి, చింతనొందుదు రిఁక వేఱ చెప్పనేల. 669

వ. అని పలికి రామచంద్రుం గనుంగొని. 670

క. జగతీసుత సంతోషాభిగమ యగుచు నీకుఁ బ్రత్యభిజ్ఞానార్థం
బుగఁ జూడామణి యొసఁగెన్, జగదీశ్వర చూడుమని పొసఁగఁ జేనిడినన్. 671

క. మణిఁ గాంచి జనకకన్యామణిఁ గాంచినయట్లు పొంగి మహివిభుఁడు నభో
మణివంశజుఁడు సద్గుణమణి లక్ష్మణుఁ గాంచి మధురమందమృదూక్తిన్. 672

గీ. రత్నగర్భతనయ శిరోరత్న మిట్లు, పంపు టరయంగ నిజభార్య పరమదుఃఖ
భరితయై యుండ నోర్చి తెప్పగిదిఁ గఠినహృదయుఁడవటంచు ననుఁ దూఱు లేమొ వత్స.

వ. అని పలికి కన్నీరొలుక నూరకున్న యన్నం గనుంగొని సుమిత్రాపుత్రుండు విషాదం
బడర నిట్లనియె. 674

క. అవనిజ యమ్మత్స్యాంగ,త్యవిహీనతఁ బెంపు దూలు [illegible] సూచించెన్
భవదంగుళీపలాలిత,మవు నిమ్మణి తొంటి యట్ల నల [illegible] గంటే. 975

క. పద్మభవుచెయిది రత్న,స్సద్మోపగనోపవాసగంస్థితివల
బద్ధాలయోపమమ న,చ్ఛస్మృతికి నిట్టు లనదచాడ [illegible] గట్టా. 676

క. అని వగచుచున్న తమ్ముని, గనుఁగొని రాముండు [illegible] ద్గదకంఠం
బున నేడ్చె ధరణిసుతఁ బేర్కొని తరణిసుతుండు [illegible] డికొని శోకింపన్. 677

వ. తదనంతరంబున హనుమంతుని పలికిన శాంతవచనంబు [illegible] వలు దెలివినొంది రమ్మ
హీభుజుండు పవనపుత్రుం బ్రియవచనంబుల నభినంది. 678

మ. బహునక్రోద్భటతుంగభంగవిచలత్పాథోధి లంఘిం [illegible]
ర్వహగర్వస్థితి [illegible] తుయాదిదనుజవ్రాతంబు ఖండించి [illegible]
ద్బహుసౌధాదిక మాత్మవాలకలితాగ్ని జ్వాలఁ జ [illegible] య
మ్మహిపుత్రీశుభవార్తఁ దెచ్చితివి సామాన్యుండవే [illegible] నీ. 679

క. క్షోణీసుతవార్తఁ బరిక్షీణీకృతమయ్యె ననుచుఁ జ [illegible] చెడు మ
త్ప్రాణము నిలిపితివి జగత్ప్రాణాత్మజ వశమె నిన్నుఁ బ్రస్తుతిసేయన్. 680

క. అని మఱియుఁ బవనతనయుని, గొనియాడె రామవిభుండు గుణుదరిపుజుండుం
గొనియాడె లక్ష్మణుండుం, గొనియాడెం బ్లవగతతియుఁ గొనియాడెఁ గడున్. 681

మ. తను నిట్లాదట సన్నుతింపఁగ జగత్ప్రాణాత్మజన్ముండు రా
మనరేంద్రాదులఁ గాంచి యిట్లనియె సాక్షాత్పుత్త్రి లంకాపురి
న్ఘనదుఃఖాబ్ధి మునింగియుండఁగ నుపేక్షావృత్తి గాదింక నూ
ల్కొనఁ దంభోధి దరింప రావణుఁ గుశీలుం బట్టి పాలార్పఁగన్. 682

క. అని యిట్లనిలతనయుఁ జెప్పినపని కనుఁగొని రఘు మఁ బృథువార్ధావి
ష్మనిఁగి రని చెప్పి వెండియు, ననుమోదరసార్ద్రహృదయుఁడై యిట్లనియెన్. 683

మత్తేభకందగర్భితసీసపద్యము.

సు-జలమేఘాకృతి సాధుపోషణరతీ సామాగమోద్యన్నుతీ మహేశ
సు-లలితానందద సారసాంచితపదా లాక్షణ్యనాభీనవాక్షితిధర
ప్ర-బలదైత్యోత్కర పర్వతాశనికరా పాపాఖుదర్వీకరా పరేశ
య-ఖిలబాధాపహహారి సద్గుణగుహా కీశోరుసౌఖ్యావహా శశిముఖ
విమలయశ పండితావన। సమరవిజయ, చక్రహస్త సర్వాత్మక సా। రమకుట
గరుడతురగ వి। శ్వమహిత పురుషవృషభ, విభవవిహితశ్రీ మునివినుతయుక్తి. 684

చతుర్విధకందము.

హంసకళికసేవిత దైవవ్రతసంసా। శంసితచరిత్ర। దైత్యధ్వంసా।
హంసహాయకంద్యసారకు, భాంసా హంసనుత నిర్దయావిధ్వంసా.

మాలిని నిగమనిగమవాసా సిస్తులస్వర్ణవాసా, వికతవిగతదోషా వేదనిందాబ్జదోషా
సుగుణసుగుణరుద్ధా శుద్ధపాపీరుద్ధా, జగతిజగతిగోశా ఛత్రవత్కృత్తిగోశా.

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణభూసుర ధైర్యవినయ రామశార్య తనయ పండితసేవాసముచ్చయ క్రొత్తపల్లి లచ్చయప్రణీతంబైన దాశరథిశిలా సంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము



శ్రీరామ.

# దాశరథివిలాసము.



## షష్ఠాశ్వాసము.



క. శ్రీమానినీమనోజ్ఞ, వ్యాల,తామరసమకరందపానతాత్పర్యమిళిం
దా మేరుతుల్యవేంకట, నాయకహేమభృదళిందనాయకుకుందా. 1

గీ. అవధరింపు మధికకాంక్ష వాల్మీకిమహర్షి యిట్టు లనియె నట్లు సంత
సాబ్ధి మునిఁగి రాముఁ డర్కనందనుఁ గాంచి, యిట్టు లనియెఁ బ్రేమ మెసఁగ.

క. ప్రాణంబులు మనకు జగ,త్ప్రాణాత్మజుఁ డరయఁ జేసి క్రమ్మఱఁ గలిగెం
బ్రాణము లాళింపక మ,త్ప్రాణేశ్వరి వెదకె నితఁ డుదధిమధ్యమునన్. 3

చ. ఇతని నుతింప నాకు వశమే యిది యట్టుల యుండె నిమ్మునీ
శతులబలాఢ్యులై నష్టవగాధిపుల న్సమకూర్చ నబ్ధి ను
ల్లంఘితఘనభంగలబ్ధిఁ దరించి దశాస్యు వారించి మించి మ
త్సతి సతి సీతఁ జూడక యసాధ్యమనఃపరితాప మాఱునే. 4

సీ. శశికాంతవేదికాస్థలవిరచితసుమశయ్యాతలంబులఁ జందనార్ద్ర
దేహులై సౌరభోద్గీర్ణకారణతాళవృంతానిలాలోలవిపులమార్గ
కుంతలులై మనత్కాంతాసదృక్పరిచారికాశతసహస్రములు గన్న
నైగ నూడిగములు సల్ప మద్బాహుద్వయోపలాలితలై యయోధ్య సౌఖ్య
లీల మెలఁగుచుట్టిలేమను భూరవాంత,రమునఁ గట్టిక నేల రాక్షసీయ
హోగ్రతర్జనముల నొక్కొక్క వణఁకుచు, నుండవలసెఁ జిత్ర మొకఁడు గాదె. 5

క అని మఱియు వగచు రాముం, గనుఁగొని సుగ్రీవుఁ డేమి గలుగ విచారం
బున కిఁకఁ యీకుము ధరణీ,శ యపహారువధసలుపుదము ముద మొదవన్. 6

వ. అని యిట్లారాధనసాధకపోషణంబు లగుభాషణంబు లాడి యప్పుడు. 7

క. అవనిఁ గలప్లవంగమపుం,గవులన్ జతగూర్చి తెచ్చి కనుఁగొంటె మహా
పావకర్కశాంగు లియ్యో,ధవరుల కడ్డమె విరోధిదైత్యబలంబుల్. 8

ఉ. సంభరియింపఁ జాలునె యసాధ్యతరం బగుమద్భాగంబు వి
శ్వంభర యంచు నీ ప్లవగసైన్యము దాఁటెను నభ్రవీథికిన్

దంభ మొకింత లేదు వసుధావర చూడుము నావుహా ప్రణో
జ్జ్వలభిక్షితుం డన్నప్రతిసింహుఁడు సంతస మంది యిట్లనన్. 9

క. కడు సంతస మందితి నిఁకఁ దడ, వేటికి నబ్ధిఁ జేరఁ దరుచరబలము
న్నడిపింపు మనుడు సూర్యసుతుఁడు సంభ్రమ మెసఁగ సమరదోహలుఁ డగుచున్.

క. హనుమద్గజగవయగవాక్షనలాంగదపనసదధిముఖప్రముఖకపీం
ద్రనితాంతావన మగు,సైన్యానీకాయము నావహంబునకు నూల్కొలుపన్. 11

సీ. కుంభినీధరముల గ్రుద్ది బ్రద్దలు సేయఁ జాలినహస్తము ల్సాఁచికొనుచు
ఖచరకాంతాపువ్వకంబులు సుడివడి తిరుగ వాలంబులు ద్రిప్పుకొనుచు
దిక్కరదంతిశ్రుతిస్ఫుటితంబుగా సింహనాదంబులు చేసికొనుచు
వెలయ డెబ్బదిరెండు వెల్లువ ల్గలకపిసేన వెస్సేసిన వీక్షించి రామ
చంద్రుఁ డధికహర్షసాంద్రుఁ డై యప్పు డి,నేంద్రనందనాంజనేయజాంబ
వత్ప్రముఖవనాటకల్లుకప్రవరులఁ, గాంచి యిట్టు లనియె గారవమున. 12

క. భద్రముగాఁగ నపూర్వసముద్ర మనం గంద మిగిలి మొన వెడలెదు ని
ర్నిద్రగతి నింక శార్ఙ్గ్వ, విద్రావణకేళికిపుడ వెడలుద మనుడున్. 13

శా. తద్వాహిన్యధినాథు లెంతయు మహోద్యజ్జైత్రయాత్రాప్రశం
సద్వాక్యానుగుణప్రయత్నభరితోత్సాహంబునం బొంగి మా
ద్యద్వేదండకఠోరధీరణభుజద్వంద్వంబు లుప్పొంగఁ గా
నుద్యన్మహోద్వహనార్హులట్టులు సమీకోద్యోగులై రంతటన్. 14

క. ఉదయగిరిశిఖరవిస్ఫురితదినేంద్రేంద్రు లన దశరథసుతు లనిలజాం
గదభుజశిరఃప్రదేశములఁ దనర్చిరి చూచువారలకు ముద మొదవన్. 15

వ. ఇవ్విధంబున మహాశరధు లగు నద్దాశరథులు కీశరథులై పొలిచి నడిచి రంత వనచర సమూహంబును భాస్కరసుతప్రేరితంబై పుడమి వడవడ వడంకఁ గడువడి నడువం దొడంగె నట్టియెడ. 16

క. తతవానరసైన్యసముద్ధితభూమీరజము వోలిచె దివిషద్గంగా
స్థితరత్నసరోరుహసంతతికిఁ బరాగ మయి యద్భుతస్థితిదోఁపన్. 17

క. పొన్నిఁ బెలగతి వాలము, లన్నిటి దివి నొరయఁ ద్రిప్పి యాడుచు విసలో
మిన్నేటిఁ గూడఁ బొంగెడు, మన్నీటికిఁ జేర నడిచె మొన యలఘుగతిన్. 18

చ. ముదమున నిట్లు రెండవసముద్ర మనం గపిసైన్య మేగి త
త్పదమలతీరపాండురపికాలలసత్పులిన ప్రదేశముం

గదిసె ననంతరంబ పొడగాంచిరి రాఘవభానుసూను లా
పదపథసన్నిరుద్ధఘనభంగవినిద్రము నాసముద్రమున్. 19

క. కని యంత రామలక్ష్మణు, లనఘులు పవనతనయాంగదాంసతలంబుల్
ఘనమతులం డిగిరి గిరియుగ్మమును డిగు హైమవతసింహములజంట యనన్. 20

వ. ఇట్లు కల్పకతరుస్కంధంబులంబోని తరుచరస్కంధంబు లవతరించి చమూనాథపరి
వేష్టితులై సమవిశాలచంద్రికాధవళచిత్రశిలాస్థలాసీనులై సముద్రతరణోపాయం
బుం జింతించుచుండి రంత నవ్వనచరబలంబులును దత్తీరపర్వతగహ్వరంబుల విడి
సె నయ్యవసరంబున లంకాపురంబున దశకంధరుండు. 21

క. ఈలీల రామలక్ష్మణు, లాలమునకు వచ్చి విడిసియుండుట నొ
డ్డోలగమున మంత్రులం గార్యాలోచన మడుగుచున్న యప్పు డతినిభృతిన్. 22

మ. దశకంఠానుజుం డవ్విభీషణుండు భ్రాతం జేరి కేల్మోడ్చి పీ
తశ్రుం డిట్లనిపల్కె విష్ణుండ యామర్త్యశ్రేణి ప్రార్థింప భూ
రిశతారాయుధధారి వైరికుల మర్విం గూల్ప నీలీల మ
ర్త్యశరీరంబు ధరించె రాముండన సీతాపహృత్నోజాలిరాయె. 23

క. అని నారదాదిమునివరు, లన విందుము శాకయున్న నినుములమీఁద
న్మనుజాలు చనుదెంతురె చెప్పినపని గావించునే కపిప్రకరంబుల్. 24

చ. ఒకకపి మున్న రామునినియోగమునన్ జలరాశి దాఁటి జా
నకిం గని యూఱడించి తదనంతర మొక్కట మంత్రిపుత్రస
ప్తకము వధించి యక్షుయు నపక్షుయశౌర్యమదం బడంచి తా
వకపురి గాల్చి పోవఁడె భవత్పరివారము చూచుచుండఁగన్. 25

క. వాలి నినుఁ గొన్న హైహయుఁ, దూలించిన భార్గవు న్విధూనముఁ జేసె
న్వాలిం గూల్చుట నీ, వాలించితి చలము విడవు మాప్రతిపయిన్. 26

వ. అని పలికి వెండియు. 27

క. ఎదిరిం దమ్మ నెఱుంగక, వదిరెడు ప్రెగ్గడలపలుకుబడికి నెడందం
గుదురుపడ నీవయేని, న్బెదరు విడిచి బ్రదుకఁగలరు పిన్నలుం బెద్దల్. 28

క. వనరాశి మనుజు లెవ్విధమున దాఁటెద రని తలంపఁబోకుము మది న
ల్గిన జలధి నింకఁజేయఁడె, మనుజేంద్రుఁడు గన్నదత్తమార్గణవహ్నిన్. 29

క. ప్రణుతించి వేఁడ నానతి, గణుతించి నిశాటకోటి గణుతింపక నై
ఫణి వెఱయఁగ జని పాదప్రణతజనంబుభద్రు రామభద్రుం గనుమీ. 30

చ. కనకరథంబునన్ జనకకన్యక నుంచి నరేంద్రమౌళిక
ప్పన మొనరించి కావుము కృపాంబుధి యుండటి తప్పు లైనఁ బెక్కో
పనుఁడవు గావు నీ వనుచుఁ బ్రాంజలివై ప్రణమిల్లుదేని యే
మనియెదు వాఁడు గాఁడు శరణార్థి నిమం గరుణించు నర్మిలిన్. 31

క. కొల మున్నొనరించితి వా, కొలము న్నిల్పు మని నృపునకుం బ్రణమిల్లం
దలపకుట మానఁ గృతమం, దలఁపఁ డటు గాన యిపుడ తగు నిటు సేయన్. 32

చ. వననిధి దాఁటి వారిటుకు వచ్చుటకు న్మనుగాఁగ జానకిం
గొని చని రాఘవలక్ష్మణులకు న్శరణం బని సంధి చేయుటొ
ప్పు ననుచు నెల్లభంగులను బోఁడిమి నెంతును నీవు సీతఁ దె
చ్చినదినమునం దొడంగి తగఁ జేయుము సౌమ్యత రాజమౌళికిన్. 33

వ. అని మఱియు ననేకభంగుల నుపన్యసించుచు. 34

ఆ. వె. దోషరహితు డవ్విభీషణుఁ డిట్లను, నింక నొండు కలఁపు లెల్ల మాని
సీత నిచ్చి రాముఁ జేరి ప్రార్థించుట, కంటె బ్రదుకుఁ దెరు వొకండు లేదు. 35

చ. అన విని క్రోధతామ్రనయనాబ్జుఁడు లిర్వదిట న్సహోదరుం
గనుఁగొని చాలుఁ జాలఁడఁగి కయ్యము చేయఁగఁ జాలవేని క్రే
వనొదిఁగి యుండ కిట్లు బలవంతులు మానవు లంచుఁ దెల్పుచు
న్మనుజభుగాళికిం బిఱికిమాటలు దెల్పఁగ నేల వేలవై. 36

ఉ. యక్షులమీఁద దాడి చనునప్పుడు నుద్ధవిడిం ద్రివిష్టపా
ధ్యక్షులఁ ద్రోలునప్పుడు భయం బొకయింతయు లేని రాక్షసా
ధ్యక్షుఁడ నొక్క మర్త్య నభయం బని వేఁడుట యెట్లు విద్విష
త్పక్షముఁ బూని నాకు నహితం బొరింపఁ దలంచి తాత్మలోన్. 37

సీ. తపమున మెచ్చి ధాత వరంబు లీయ రా నెంచి యక్షుద్ర మాసించినావు
బుద్ధి చెప్పుటకునై యుద్ధవాధీశుఁ డంపినదూతఁ జంపింప మిడికినావు
బలిమిమై నిర్జరభామలఁ జెఱదెచ్చునప్పుడు వలదని చెప్పినావు
అలనాఁడు వారుఁ బిలువుమాన్పఁగనీక మించినపురముఁ గాల్పించినావు
నిండుకొలువున మనుజుల యండఁ జేరి, కొలిచి బ్రదుకు మటంచు వాగ్రుచ్చినావు
వేడబంబుగఁ దలపోసిచూడ నీవు, మొదలనుండియు నవగుణమ్ములకు తావు. 38

వ. అని తనమనంబున నితండు మదీయవైభవబలపరాక్రమంబులకు నసూయాగ్రస్తుండై
పలుకువాఁడు గాకేమి యని నిశ్చయంబు గనుంగొని. 39

మ. వికటభ్రూకుటిదుర్నిరీక్షుఁ డగుచు న్వీఁక న్సభాదేవవై
రికటుస్పందన మాచరించి ప్రబలార్చిష్మచ్ఛిఖాజాలవ
త్ప్రకటక్రోధకషాయితాక్షుఁ డగుచుం బాదంబునం దన్ని య
న్నికటంబు న్వెసఁ బాసిపోవు మని యెన్నిస్సారణాహంక్రియన్. 40

ఉ. పొమ్మని గెంటియు న్సుగుణభూషణుఁడైన విభీషణు న్మహో
గ్ర మ్మగుమాడ్కిఁ జూచి దశకంఠుఁ డకుంఠితలీలఁ జంద్రహా
సమ్మున వ్రేయఁ బూనుడు ససంభ్రముఁడై పఱతెంచి మాను ఘో
రమ్మని యోఁగ నయ్యెడఁ బ్రహస్తుఁడు హస్తము సాఁచి రావణున్. 41

క. తన్నివ్విధమునఁ గనలుచుఁ, దన్ని వెడలు సునుఁడు శోకతాపితుఁ డగుచుం
దన్నిశ్చితి కోరక భ్రా,తన్నిష్ఠురవచనముల నతం డిట్లనియెన్. 42

ఉ. ఎల్లసభలోన నీ చెడుట కోర్వక యిత్తఱి నొత్తి చెప్పిన
న్నొల్లవు ప్రాణమారుతము నొల్లనివానిక్రమంబున న్మహీ
వల్లభుఁ గానఁ బోయెద నవశ్యము నిన్నుఁ దొఱంగి సజ్జనుం
డెల్లెడ నెట్టి యాప్తుఁ డగు నేనిఁ ద్యజించుట నీతి ధర్మమున్. 43

క. అని పలికి మ్రొక్కి వీడ్కొని, చనుదెంచి సభక్తిపూర్వసాష్టాంగంబున్
జననికొనరించి యాపెకు, వినిచె నిజాగ్రజుఁడు పరిభవించుటఁ దెలియన్. 44

చ. ఇటు వినిపించి రావణున కే నహితుండఁగ నైతిఁ దల్లి నీ
కటు విను మిఁక రాఘవమహీశ్వరునిం గొలువంగఁ బోయి త
త్పటుకరుణాకటాక్షపరివర్ధితవర్తన నొంది యుండెదం
గటకటపాటు మాని గజగామిని వే సెలవిమ్ము పోయెదన్. 45

క. అనవుడు భయ మందుచుఁ దజ్జనని కుమారకునిఁ గాంచి స్వాంతములోన
న్మనః పాటిక నిజభర్తవచనములు దలపోసి వీతసంభ్రమ యగుచున్. 46

శా. సంతోషంబు సుపుత్ర నీ కనుచు వాత్సల్యంబునం బల్కి య
త్యంతప్రీతిఁ గుమారుఁ గౌఁగిటికిఁ దీయం బొంగి యవ్విక్రతః
కాంతారత్నము వీడుకోల్పడసి రక్షఃప్రాణవాతాహిభూ
కాంతు న్రాము సలక్ష్మణుం గన నపేక్ష న్సంభ్రమాయత్తుఁడై. 47

మ. కరమర్థిం జని యాత్మదార సరమం గాఢోల్లసన్మందహా
సరమ న్వీడ్కొని రాఘవేశ్వరపదాబ్జద్వంద్వసందర్శన
స్థిరబుద్ధి న్నిజమంత్రు లెంతయుఁ బ్రపత్తి న్నల్వురుం గొల్వఁగా
వరపుణ్యుండు విభీషణుండు జలధివ్యాకీర్ణ మా తత్పురిన్. 48

క. రామునితో నెదిరిచి సంగ్రామము శివుఁ డైనఁ జేయఁ గాలేఁడు రఘు
గ్రామణి శరణుసొరుము సీతామణి నొసఁగి యని కను హితంబులు సెప్పన్. 59

ఉ. బుద్ధులు సెప్ప నెవ్వఁడవు పొమ్ము మహాత్ము లెఱుఁగ కిట్లసం
బద్ధపుమాట లాడెదవు ప్రాణము లైనఁ ద్యజింతుఁ గాని యా
త్యోద్ధతి తూల మర్త్యునిసమున్నతి సైఁచుట యెట్లు రావణుం
డిద్ధబలాఢ్యుఁ డేల యొకహీననరు న్శరణంబు వేఁడెడిన్. 60

క. అని పెలుచనాడి పరిభవ, మొనరించిన నతనియొద్ద నుండక నిన్నుం
గని కొలిచి బ్రదుక వచ్చితి, ననఘమతీ యే విభీషణాఖ్యుండన్. 61

తే. మాటలకు నెల్ల నోర్చి మా మోట మింత, లేక యాతని బ్రదుకునకై కడంగి
యొత్తి చెప్పఁగ నీరస మెత్తి బిట్టు, కాల దన్న నెపఁడ బెట్టు కాలదన్న ! 62

వ. అని సకరుణంబుగా నాత్మప్రవృత్తి సమస్తంబు నెఱింగించి భవద్భృత్యకోటిం
గలిపికొని రక్షింపు మని ప్రార్థించినఁ రాముం డతనిం గటాక్షించి కపులదెస నిరీక్షిం
చుటయు. 63

క. పగవానితమ్ముఁ డితఁడుం, బగవాఁ డగుఁగాక యెట్లు మైత్రి యొనర్పం
దగువాఁ డగుఁ గడు నికృతిఁ, దగువాఁ డగుఁగాక యనిరి తరుచరు లెల్లన్. 64

తే. అంత హనుమంతుఁ డితఁ డతిశాంతుఁ డింద్ర, జిద్విధాతాస్త్రనివహతిఁ జిక్కియున్న
సమయమున రావణునిచేత సమయునుఁడ, నితఁడ కాఁడె న న్విడిపించె నిద్ధబుద్ధి. 65

క. జాతి కితఁ డసురుఁ డేని, నీతాత్ముఁ డీవిధమున నిందార్హుఁ డగున్
జాతిచేరి కను విహీనుని,చేత మిగుల వలచు నిది ప్రసిద్ధము యనుచున్. 67

క. అనిలసుతుఁడు నుడివిననుడి, లనుకూలము లగుడు రాముఁ డయ్యసురవరుం
గనుఁగొని యభయం బొసఁగితి, ననుమానం బేల డాయు నరుదె మ్మనఘా. 67

చ. అని నెనరారఁ బల్కి యతఁ డానతుఁ డైనఁ గవు గిలించుచు
న్వినుము విరోధితమ్ముఁడవు నిన్గణించుట వింత గాదు న
న్నని శరణంబు వేఁడిన జగత్త్రితయావాసులు మెచ్చ రావణుం
దునుమక తక్కుఁడు న్మిగుల దుర్మతికి న్శరణార్థి వధ్యుఁడే. 68

వ. అని యివ్విధంబున నభయం బొసఁగి కృపాతిశయంబున. 69

క. కలుషకలుషితాత్ముఁడు మ్రొక్కులుఁ దగుభవదగ్రజన్ముకాయము నలిను
క్కులు సేసి యతనిపదవి క,కలుషమతీ నిన్ను విభునిఁ గావింతు దయన్. 70

క. అని యతనిఁ గలిపికొని యా,తనిచేఁ దముల గారవించి తన్ముఖమున శ
త్రుని బలపరాక్రమంబులు, వినుచు ముద్దమ్ము న్నొద్దుమున్న వేళ నిభృతుఁడై. 71

వ. హనుమంతుం డిట్లనియె. 72

చ. కరము దుర మ్మొనర్చి దశకంఠునికంఠము లూడ్చి తత్సహో
దరునకు వానియేలెడుపదం బొనగూర్చుట యెంత పెద్ద నీ
కరయ విధాతఁ గా దని తదంచితశాశ్వతసత్యలోకసు
స్థిరవిభవంబు లాశ్రితులఁ జేర్పఁగ నోపుదు వాత్మ మెచ్చినన్. 73

క. అన విని భవత్సహాయంబున నాకుం గడఁగి తీర్పఁ బోలని కార్యం
బనఘా యొకఁడుం గల్గునె, యని యతని న్మెచ్చి రాముఁ డభినందించెన్. 76

వ. తదనంతరంబున సుగ్రీవాదులు రామచంద్రుఁ గరుణాసాంద్రుం డని పొగడిరి విభీష
ణుండును మంత్రిచతుష్టయసహితంబుగా సంతోషించె నంత రాముండు నిజాంత
ర్గతంబున. 75

క. అంభోరాశి గభీరము, గుంభితనక్రాదిజంతుఘోరము విపులో
జ్జృంభితకపివారము నిర్దంభస్థితి దీని నెట్లు దాఁటఁగ నగునో. 76

వ. అని కించిన్మీలితలోచనాలోచనుండై. 74

క. తుష్టి నుదధిఁ గొల్చి తదుపదిష్టసరణి గపికులాంబుధి న్నడిపె మనో
భీష్టముఁ బడసెద ననుచుఁ బ్రహృష్టహృదయుఁ డగుచుఁ దలఁపు లిగురొత్తంగన్.

క. ఆ రాముఁడు శుచి యై దర్భారచితపవిత్రితాసనాసీనత నా
హారాంచస్వాశ్వహోరవిహారంబులు మాని జలధి నారాధించెన్. 79

ఆ. మఱియు భక్తియుక్తి మానసంబునఁ బయోరాశిఁ గుదురుపఱిచి రామవిభుఁడు
ధ్యాన మేకముఖముగా గావించి సదధికప్రౌఢి మెఱయ నిట్లు ప్రస్తుతించె. 80

క. సరిదోఘంబెల్లను దమి సరసుఁడ వగు నిన్నుఁ జేరి సమ్మోదించున్
ధరణీస్థితి భవదీయావరణంబునఁ గాదె నిలిచెఁ దలపోయంగన్. 81

వ. నీవు సుగుణరత్నాకరుండవు గంభీరుండవు కవిశ్లాఘనీయుండవు నపారుండవు భువన
ప్రశస్తుండవు నని మఱియు ననేకవిధంబులఁ బ్రస్తుతించి కరకమలంబులు ముకుళించి.

మ. మఱి నాపైఁ గరుణించి యీక్షణము సన్మార్గంబు దోఁపన్ సరి
త్పతి నాపైనను నిర్వహింపు మనుచుం బల్మాఱుఁ గీర్తించి యా
నతుఁడైనం గరుణించి రాముని జగన్మాన్యుం గనం బోఁ డపాం
పతి నిర్గంధుఁడె యాతఁ డంచు విబుధుల్ పైపై ప్రసంగింపఁగన్. 82

క. ఇటు పొగడి జలధి నాకుం, దటుకున సాక్షాత్కరింపఁ దలఁపఁ డనుచు సు
త్కటరోషదీప్తుఁ డగుచుం, గటము కదరఁ నిల్చి ఘోరకార్ముకధరుఁడై. 83

శా. క్రోధోద్రేకమనోంబుజాతుఁ డగుచున్ ఘోరాస్త్రముం బూని య
ప్పాథోరాశి హరింప నిష్ఠురకృతప్రారంభుఁడైన న్నభో
వీథి న్మాసె నినుండు తారకలు పృథ్వింగూలె నుల్లోకము
ల్బాధం జెందెఁ గులాచలంబు లొరగెన్ వ్రస్సెం జతుర్దిక్తటుల్. 84

శా. తన్మాత్రంబున నెట్టి పుట్టుటయుఁ బాథస్స్వామి భీతిం గడు
న్నన్మానంబున రామచంద్రపదపీఠాగ్రాతుకాయత్తస
ద్ధ్యానాత్మస్థితి నొందెఁ గాని పటుభక్తి స్వేఁదుచున్నాఁడటం
చు న్నజ్ఞానగఁ బోవఁ డయ్యె జడరాసు ల్మానసుల న్మిత్రురే. 85

వ. ఇవ్విధంబునఁ బొడము భయాతిరేకంబున. 86

క. బడబాగ్ని వేఁడికి న్నడి,వడియెను నే నిపుడు రామబాణాగ్నిఁ గడుం
జెడనె యని యతనిఁ జూడ, న్వ్యాకలె జడధి మానసంబు వేగిరపడఁగన్. 87

తే. వెడలి తనురీతి మూర్తీభవించి జహ్ను, కన్యకాగౌతమీముఖ్యమాన్యనదులు
మూర్తిమంతంబులై తన్ను మొనసి కొలువ, నబ్ధిసారానుకంపరసాబ్ధిఁ జేరె 89

క. వెలవెలఁ బోవుచుఁ జనిరా, ములసచ్చరణయుగమునకు మ్రొక్కి వినీతిన్
జలనిధి వచించె నృపవర, పలువనివారలము కలఁగఁబడమె యలిగినన్. 0

క. ఏ దెలియ నెంతవాఁడ మ, హీమహితవరా భవన్మహిమ బ్రహ్మసురేం
ద్రాదులు నెఱుఁగరు శత్రువి, భేది మదపరాధ మాత్మఁ బెట్టకు మింకన్. 91

క. ఈయుదధి నెట్లు దాఁటుదు,నో యని తలపోసెదే యనవు బుధవిబుధ
ధ్యేయుఁడ వమేయుఁడవు నా, రాయణుఁడవు నీవు మార్గ మడుగఁగలయునే. 92

క. కట్టా యూరక నాపైఁ, గట్టలుక వహింపనేల కట్లం జెట్లం
గట్ట యొకఁడు కట్టక పోఁడ, కట్టునె మార్గంబు నన్నుఁ గడవఁగ మీరున్. 93

ఉ. సేతువు గట్టి రక్కసులఁ జీల్చి వధింపఁగ సేనతోడ నీ
వీతటి నేగు మంచు వచియించి సముద్రుఁ డదృశ్యుఁ డైనను
జ్జాతకుతూహలంబున నిశాచరజాతుల నబ్ధికుక్షిసం
జాతులఁ గూల నేసె మునసాగరవ్రేయఁగఁబూను కోఁచేతన్. 94

వ. అయ్యమోఘబాణుండు తదనంతరంబున నిజసైనికుల నాలోకించి కార్యదశానిరూప
ణంబుగా నిట్లనియె. 95

సీ. గట్టులఁ జెట్టులు న్వ్రెటిచి కంధిపయిం బడవైచి యడ్డుగాఁ
గట్ట యొకండు గట్టిన సుఖంబున లంకకుఁ బోయి రావణుం

బట్టి వధింపవచ్చు నని పల్కిన రాముని భాషణంబులం
బుట్టినసంతసంబునఁ గపు ల్చెలరేఁగుచు నాడి రీగతిన్. 96

క. ఒకకట్ట గాదు జలనిధి, సకలంబును బర్వతముల సంపిహితము చేఁ
తమఁ జాలునట్లు గాఁగం, బెకలింతుమె మందరాదిపృథ్వీధరముల్. 97

క. అని పలికి మఱియు నిట్లని, రనఘా నీయానతిచ్చి నట్టులు సేయం
జనుఁ గాదె సేతుబంధన, మొనరింత మటంచు సంభృతోత్సాహమునన్. 98

క. బలిముఖు లవ్వననిధికి, న్బలివిధు లొనరించి విఘ్నపతి కెఱఁగి కడున్
బలిమి మెఱయ నందఱు గుబ్బలులం బెకలించి తే నృపాలకునాజ్ఞన్. 99

వ. నలుదెసలకుం జని రట్టిసమయంబున. 100

సీ. లవణవారాశిఁ గాలువచేసి యినుమాఱు దాఁటినపవమానతనయుఁ డొకఁడు
తాతకంటెను బలాతీతుఁ డితం డని పొగడంగఁ దగువాలిపుత్రుఁ డొకఁడు
నుత్తరాశాపార మొకక్షణంబునఁ జూచి వడిరావలఁతి శతబలి యొకండు
మును శైలకూటంబు మునుల కై మోఁకాలఁ బగులఁ జేసినఋక్షపతి యొకండు
దధిముఖుఁ డొకండు గంధమాదనుఁ డొకండు, నీలుఁ డొకఁడు సుషేణుఁ డన్వరుఁ డొకఁడు
పనసగజగవయగవాక్షవినతతార, కేసరిప్రముఖులును దక్కినకపులును. 101

మ. విపులాభాగము సంచలింప విబుధు ల్వీక్షించి వార్షింపఁగా
విపులాద్రు ల్పెకలించి తే నలుఁడు పృథ్వీనాథు నాజ్ఞప్తి న
కపు లారీతిని దెచ్చియిట్టి ధరగ్రావాళిఁ జేసంది ని
క్కీ పయోరాశిని వైచి కట్టఁ దొడఁగెం గట్ట న్మహోజ్జృంభతన్. 102

క. తానేమేని సముద్రుని, పైనుంచిన మునుపఁ దగుటఁ బటుకుధరంబు
ల్చేనంది నలుఁడు సేతువి, ధానోన్ముఖుఁ డయ్యెఁ గడు నిదానము గాఁగన్. 103

వ. అప్పుడు. 104

క. ఒకతరుచరుండు పదిగిరు, లొకగిరిఁ బదుగురువనాటు లొకవృక్షచరుం
డొకగిరిగా నిర్వహమునఁ, బెకలిచి తెచ్చి రతితుంగపృథ్వీధరముల్. 105

చ. కడకొని వాలపాశములఁ గట్టి కుభృన్నిచయంబుఁ గీశు ల
ప్పుడు గొని తెచ్చు టొప్పె మును పూర్వసుధాశనులు న్సుధాశను
ల్గడఁగి పయోధిఁ ద్రచ్చి రది గాదని ఘోరసముద్ర మొక్కఁడొ
క్కఁడె తరువంగఁ బూని రను కైవడి నెంతయు నద్భుతంబుగన్. 106

క. మన్నిక జలముఁ బీల్ప మ్రువిన్నా యరు వేఁడి తరుచరులు జలదములం
గ్రన్నఁ దడొక్కని యిచ్చుచు, నన్నారఁ ద్రవ్వి తెత్తు రాగి ఘనగిరులన్. 107

వ్యాకరముగ నప్పయోధి నొకకట్టు యొనర్చితి రీయుశంబు ను
స్థిర మయి ముజ్జగంబులఁ బ్రసిద్ధికి నెక్కఁడె సర్వకాలముల్ 117

క. అనఁ గపులు భవదనుగ్రహ,మునఁ గాక కడు న్సముద్రమున సేతు వొన
ర్పను మావశమె నీయన,మునఁ దలఁచినకార్య మది యమోఘము కాదే. 117

వ. అని సన్నుతించి రంత నంతవృత్తాంతంబును దశముఖుం డెఱింగి కలంగి శుకసార
ణాదిమంత్రులతో మంత్రాలోచనంబు గావించి లంకాపురంబు సురక్షితంబు గా
వించికొని యుండె నద్దివసావసానంబున. 119

క. నూత్నమతి న్వనరాశిఁ బ్రయత్నంబునఁ డాఁచికొన్న యాతనిఁ బోలెన్
రత్నాకరుండు నంబర,రత్నము లోఁగొనియె ననఁగ రవి గ్రుంకెఁ దగన్. 120

వ. ఇట్లు కువలయవ్యథాకరకరగ్రహణంబు చాలించి యినుం డస్తాంతుం డగుటయు.

—: సాయంకాలాదివర్ణనము :—

సీ. పడమటిదొరసానిఫాలభాగంబున సవరించు కాశ్మీరజన్మ మనఁగ
సంఫుల్లలోధ్రకసానుసముచితాస్తమహీధ్రగైరికధాతు వనఁగ
రవిరథపతనకారణవిభాజితసరస్వన్మధ్యబాడబవహ్ని యనఁగ
బ్రాహ్మణార్ఘ్యోదకబాణప్రభిన్నమందేహదేహోత్థశోణిత మనంగఁ
గోకనదపద్మరాగబంధూకబింబ,శుకముఖాశోకతామ్రకింశుకలసత్ప్ర
వాళసురగోపజతుచక్రవాకపక్ష,కాంతి నిరసించి సాంధ్యరాగము రహించె. 122

తే. సాంధ్యరాగప్రథుచ్ఛవి సాగరోద,కంబు కీలాలపద్ధతి గానిపింపఁ
జెలఁగి యసురులు రక్తసేవ సేయఁ, దోఁచి రన నొప్పె నిరులు ప్రదోషవేళ. 123

చ. అనుపమదుఃఖపంకమలినాంగలతాఽపరిశుద్ధయై నవా
నవవనజంబు వాడఁ గఠినస్తనచక్రము లుబ్బువీడఁ బ
ద్మిని విషసంగ్రహం బనుమతించె మనోజశిలీముఖాహతు
ల్దనికిన నోర్వలే కవుఁగదా యినుఁబాసినదోషహేతువుల్. 124

తే. విష్ణుపద మనువిఖ్యాతి వెలయుచుండుఁ, గాన నయ్యెడఁ దోఁచు నఖంబు లనఁగఁ
గ్రమతరపద్మరాగప్రకాశమాన,తారకంబులు నభమున బూనటిల్లె. 125

వ. అంత నొక్కింతసేపునకు. 126

తే. రాజు చనుదెంచుచున్నవార్త విని పుష్క,రాంగన నిజాననాంబుజ మలమికొనిన
భ్రమరకంబుల నెగయించి ప్రబలెననఁగఁ, జీఁకటులు వాసి ప్రాగ్దిశ చెన్ను మీఱె.

క. పవలు కువలయము రవిచే, నవయుట విని యమృతసేచనము సేయ సుధా
నవకలశ మెంతయు న్సము,చయవిధాత్పం డెత్తె నన హిమాంశుఁడు వొడిచెన్. 128

క. త్రిజగత్త్రవిశదమగు తద్ద్విజరాజోదయము మనసు నధిక రాజీవ
వ్రజము ముడిఁగె భువనముల, భుజగవిలసన మడఁగెఁ బో భువనములన్. 129

తే. ఇట్లు చంద్రోదయం బైన నెల్లదిశల, వెన్నెలలు పిండి చల్లినవిధము గాఁగ
దెలిపడుంగులు వఱచిన తీరు దోఁప, నిండికొనఁ గపు లెంతయు గండుమీఱె. 130

చ. హిమకరదీధితు ల్దరికి హేమమయం బయి తోఁచు వార్ధితో
యముపయిమీచు వీచులసహాయమునం జనుదెంచు మించునై
త్యములయామారుతంబు మలయం బులినంబుల సేతుబంధన
శ్రేయ ముముఁగంగ భావిసమరస్థితు లాడుచు నిద్రఁ జొక్కఁగన్. 131

వ. హనుమదాదులును రామలక్ష్మణులమహాయశంబులుం బోని యప్పండువెన్నెలబైట నారాజశేఖరుం బరివేష్టించి నిద్రాసుఖం బనుభవించి రంత.

క. ద్విజసత్ఫలాప్తిఁ జెఱిచిన, వృజినమె పచ్చక్రనిరతవేధాపటుహే
తుజనితదోషమె రాజు ప్రభఁ జెఱిచె నన నిందుఁ డల్పభానుం డయ్యెన్. 133

వ. తదనంతరంబున. 134

సీ. తారాపథాంగన దాల్చుతారావళిఁ గనుపట్టునాయకమణి యనంగ
జారచోరవికారకారియై పాంథుల నటునిటు నడిపించునౌషధ మన
నాకమహీరుహప్రాకటపూర్వదిశాశాఖఁ దగు గుళుచ్ఛం బనంగఁ
గమలారికరబిసకాండము ల్మెసవెడి యభ్రధునీచరద్ధంస యనఁగ
మిత్రుఁ డరుదెంచుట సహస్రపత్రములకుఁ, బద్మభవుఁ డెఱిఁగింపఁగఁ బంపినట్టి
భర్మలేఖ యనంగఁ బ్రాగ్భాగమునను, వెలసె నెంతయుఁ దెలుపెక్క వేగుఁజుక్క

మ. అవనీజాగ్రము వార్ధి గట్టితిరి లెం డాలస్య మిం కేల యో
యవనీజాటకులార! యంచు నవనీజాళు ల్వడి న్నేపుచు
న్నవనం గోకిలకేకికీరముఖనానాపక్షిసంఘాత మె
క్కువిధి న్మ్రోసె విశాలతుంగపటుశాఖాశాఖికాగ్రంబులన్. 136

వ. అంత. 137

క. ఉదయగిరి మండె ననఁ గెం, పొదవిన ప్రాగ్దిశ వివస్వదుదయము రక్త
చ్ఛదమై ప్రతాప మాకృతి నొదవి యరుగుదెంచుచున్నదో యన మెఱసెన్. 138

వ. ఇట్లు లోకచక్షురాహ్లాదకరుం డై భువనచక్షుం డుదయించుటయు. 139

ఉ. అంతకమున్న రాముఁడు సహానుజుఁ డక్కపికోటితోన ని
ద్రాంతము నొంది కృత్యముల నన్నిటిఁ దీర్చి దినేంద్రపుత్రజుం

భ్రాంతక వాయుపుత్రులను భల్లుకనాథును షేషణముఖ్యవి
క్రాంతుల సేతుకృద్ధతిముఖ్యాని వారులఁ గాంచి యిట్లనున్. 140

క. దేవాసురవరులకేఁ భావంబునకైన నిట్టి పని యొనరింపం
గా వలఁతులె యుదధి మహోగ్రావంబులు నిల్చి మీరు కపులే తలఁపన్ 141

వ. అని మఱియు ననేకవిధమధురవచనంబుల నగ్గించి కార్యవచనంబులు ప్రసంగించి 142

శా. గర్జాంభోముపలాశివాగ్విహితలంకాద్వీపము న్మింప వి
స్ఫూర్జద్బాహుతరంగవానరబలాంభోరాశి దుర్వారవి
న్నిర్జితస్థితి నేరుపట్టులు మది న్వీక్షింపు డీరంధ్ర స
చ్ఛార్జిన్మూర్తవపుర్విలాసుఁ డగుఁ గోత్రానాథుఁ డామోదుఁడై. 143

చ. అనవుడు వానిప్రముఖులాకనితో భవదీయసేవకై
దనుజులమీఁది గాలిదుమ దాఁకఁగ నేర్చె నె యుద్ధయాత్రకీ
వనుమతి చేసినప్పుడ జయావహమై నయమహార్థమట్లు గా
వున నెడసేయ కిప్పుడె తఱుంగ లంకపయి న్మహీశ్వరా. 144

వ. అని పలికి యమ్మహాయోధులాయోధనంబునకు నువ్విళ్ళూరుచుండ నక్కపి
యూధంబు యూధనాథసనాథంబై విబుధవరూథినీవిధానంబున గండుమిగిలి
రాకానిశాకరోదయంబునకుం బొంగు నీరాకరము ననుకరించి పొలిచి వెడలు
నత్యరసరంబునం బరస్పరాహ్వాననినదంబును దేవదుందుభిధ్వానంబును జలధితరంగ
విరావంబును నేకీభవించి దిక్కులు పిక్కటిల్లె నంత రామలక్ష్మణులు వనచర
స్కంధస్యందనాధిరూఢులై సప్తజిహ్వుండును ద్విముఖంబులు దాల్చినచందంబునఁ
బ్రతాపంబిమ్మే నైనవిధంబున నేనామధ్యం బలంకరించి మహాకపివీరపరివృతులై
వంశకరుం డగుమకరకరునకుం గరంబులు జోడించి యంబుధిం బూజించి ప్రార్థించి
యాంగికంబు లగు శుభనిమిత్తంబులకుఁ జిత్తంబులు హర్షపరాయత్తంబులగు
చుండ విభీషణుండును మంత్రిచతుష్టయసహితుండై యంతరిక్షమార్గంబునం బఱతేర
సేతుమార్గంబున లంకాపురాభిముఖులై నడువం దొడంగి రయ్యెడ. 145

క. మీఁకెదురువచ్చు దనుజానీకంబుల యొఱ్ఱు విరియ నిజమిత్త్రుకునన
ట్లాకడలిఁ దరంగంబు లనేకంబులు వెడలి విఱుగు నెదురఁ గపులకున్. 146

సీ. అంబుధి నుభయపార్శ్వంబులఁ గనుఁగొని నడికట్టవడుచు నడుచువారు
మేరమీఱి జగంబు ముంచక పాథోధి నిలుచు టబ్బంబని తలఁచువారు
జలనిధికుక్షి నిశాచరు లెట్లు వసించిరో యనుచు నూహించువారు
మేటికడలి యబ్ధిమేఖలామేఖలాకృతి కహించె నని తర్కించువారు

దర మొకింతయు లేక సాగరములోన, నీఁదులాడుచు సేతువు నె
మ్మించి చనువారుఁ జాల హర్షించువారు, నైకపు లాహవాపేక్ష
వ. ఇవ్విధంబునం గపిచమూసాగరంబు సాగరంబుపై నురవడించి చను
క. వారిధితరంగశీకర, వారంబుల లెక్కపెట్టవచ్చు ధరణి నె
వ్వారికిఁ బ్లవగచమూవి, స్తారమ్ము గణింపవచ్చుఁ జాతుర్యమునన్.
చ. అని ఖచరు ల్నుతింపఁ బ్లవగౌఘ మహోఘరయంబు మీఱఁగాఁ
జనిచని వార్ధి ఖేయము నిశాచరహేయము లంక దవ్వులం
గనుఁగొని క్రోధఘూర్ణితముఖుం బగుచున్ దరిఁ జేరి రాక్షస
ధ్వని విని యంత నిల్చెఁ బ్రవిదారణకేళికి నుత్సహించుచున్.
చ. నిలిచినసేనఁ గాంచి తరణిప్రియపుత్త్రుఁడు చేయి వీచి పే
రెలుఁగున లంక చుట్టు దిగుఁ డింక భయం బొకయింత లేదు వా
బలిముఖు లన్నిశాటకులపాలకుప్రోలికిఁ బోవ నొక్కట
న్వాలువడి యెక్కి రున్నతనువేలము సద్విటపీవిశాలమున్.
వ. ఎక్కుటయు నక్కుధరగహనంబు ధరాసురం బయ్యెను నప్పుడ్
కాననసంయుతంబునుం బోలె నయ్యవసరంబునఁ గపులు
సీ. అరివినిర్భేద్యసుస్థిరతరాయోమయద్వారబంధకవాటతతులు గలిగి
పృథులోగ్రదంభోళ్యభిన్నతుంగోరుద్విషత్త్రపుస్థగితకుడ్యములు గలిగి
దనుజసంరక్షితదారుపాషాణయంత్రప్రకల్పితగోపురములు గలిగి
శిఖరసంస్థాపితాసితక్షురికాఖరశాతశకలసాలగణము గలిగి
యుగ్రబాణబాణాసనయోధవీర, బృందధనధాన్యఘాసరసేధ్మసలిల
కఠినబహువిధయంత్ర సంగ్రహనిశాచ, రప్రమూషితఘోరదుర్గములు గ
క. భృంగాకర్షిత మదమా, తంగ పవనజవపరిహసితసుగంధర్వో
త్తుంగరథవీరభటసే, నాంగచతుష్టయము గలిగి యతులితభంగిన్.
క. ఒప్పారు లంకాపుర, మప్పుడు వీక్షించి ప్లవగు లధికౌత్సుక్యం
బుప్పతిల దానిచుట్టుం, గప్పికొనిరి ఘోరవార్ధికైవడి నంతన్.
చ. విడిసినసేనయున్ దనుజభీషణహుంకరణంబు మీఱఁగా
విడిసెడుసేనయుం బ్రిడియ వేతఁక నొందెడుసేన సేతువు
న్నడిచెడుసేన పొంగెడుమహస్థితితో వెసఁగట్టు నెక్కఁగా
విడలెడుసేన యయ్యె రఘువీరున కెంతయు సంతసంబుగన్.

వ. ఇట్లు లంకాపురంబునకు దెసలం బడమి యానిస్రక్రమమ్మునం గ్రమ్మికొనిన యుత్తరచ
రవాహినీవిస్తారంబు. 157

క. నాపుత్రికవ్యాదయుపరీ, తాపము వాయు నని తలఁచి ధరణీసతి హా
ర్షాపరిమిత గా మేనునఁ, జూపట్టెను పులకపటలశోభం దనరెన్. 158

ఆ. వె. అట్లు లంకయను మహాలతాభవనంబు, నలమికొనిన వనహులతాళిన మన
నున్న సేనఁ గాంచి యుల్లంబు సంతోష,మగ్న మగుచునుండ మనుజవిభుఁడు. 159

వ. సోదరసహితంబుగా వనచరస్యందనావతరణంబు గావించి త్రికూటప్రాంతసమ
విశాలరమణీయప్రదేశంబున యోధవీరసహితంబుగా సమాసీనుం డై విభీషణుం
డయ్యయిప్రదేశంబులు వేఱువేఱ నిరూపించి చూపుచున్న యవసరంబున. 160

క. కోపారుణలోచనుఁ డై, భూపాలవరుండు లంకఁ జూడఁగ నాటోప్పెం
దూపుల నేన్నఁ తత్పురిఁ, జూపుల నేర్తు నుభంగి శోభిల్లంగన్. 161

క. అంత దశాస్యుఁడు తద్వృత్తాంతము విని చింతనొందు తదవసరమున
స్వాంతోషము పెరుఁగఁగఁ దత్సంకతి యగు శక్రజిత్తు తా నిట్లనియెన్. 162

ఉ. ఏఁ గలుగ న్విచార మది యేటికి మర్త్యుల నాప్లవంగుల
ల్లేఁగలఁ గాంచి బెబ్బులి చలింపఁగఁ జేసి వధించునట్లు లా
భోగుల నుగ్రుఁ డై ఖగవిభుండు హరించెడునట్లు ద్రుంతు వా
రీఁగలు గంధసింధురము నేను ననుం జెనకంగ నేర్తురే. 163

చ. అనునెడ ఖడ్గహస్తుఁడు ప్రహస్తుఁడు రావణుతోడ నీకుమా
రున కిది యవ్వ రక్కపివరూథిని నొక్కఁడ త్రుంగఁ జాలుఁ ద
క్కినపిశితాశులుం గడఁగి కీశుల నాశముసేయనేర్తు రీ
వనితరసాధ్యవిక్రముఁడ వాత్మ విచారము సేయ నేటికిన్. 164

వ. అని బరవసంబు సేసి పల్కె నంత నతికాయ మహాకాయ మహాపార్శ్వ సుపార్శ్వ
దులును ప్రథనసన్నాహసముత్సాహపోషణంబు లగుభాషణంబు లాడుచుండ నద్ద
శాననుండు గండుమిగిలి భండనంబునకు నెందు నెం దనుడు నద్ధండు లగు దండ
నాయకులు తత్క్షణంబ. 165

సీ. కాలజీమూతసంకాశదేహంబులఁ గ్రాలురక్కసులఁ బెక్కండ్రఁ గూర్చి
కాటుకకొండలకైవడి నిరసించు కరులమొత్తము లనేకములు గూర్చి
పృథులనేమ్యూరవబధిరీకృతదిగిభకర్ణంబు లగు తేరిగములు గూర్చి
పవమానవేగంబుఁ బరిహాస మొనరించు నశ్వరత్నము లసంఖ్యములు గూర్చి

భూరికాహళభేరికాఘోషనినద, మాకసము దీటుకొనఁ జతురంగబలము
నివ్విధంబున సమకూర్చి నేపురేఁగి, యవనియానినకైవడి నతిశయిల్లె. 166

క. ఝంకారసహితస్థితి భటు,హుంకారమ్ములును మదమహోత్కటగజకృ
ద్ఘీంకారము లనురథను,ట్టంకారములుం జెలంగె సైన్యములోనన్. 167

వ. ఇట్లు కట్టాయితంబై రాక్షసబలంబు కయ్యంబునకుఁ గాలు ద్రవ్వుచుండె నటి
రెయెడ. 168

క. రాముఁడు సాధుపికైకా,రాముఁడు పరిహాసితపరశురాముఁడు సీతా
రాముఁడు దర్పితశత్రువి,రాముఁడు కరుణారసాభిరాముం డగుచున్. 169

— ❀ అంగదుని రాయబారము ❀ —

క. వాలికుమారుఁ గుమారుం, బోలినబలశాలిఁ గాంచి భూమివిభుఁ డెదన్
జాలి మిగుల నిట్లనియెను, వాల ముడిగి రాయబార మంపెడుబుద్ధిన్. 170

క. వృత్రారిపుత్రపుత్ర జగత్త్రయశత్రుఁ డగు పంక్తికంధరు దుశ్చా
రిత్రుఁ గని నీవు వాగ్వై,చిత్రి మెఱయఁ బల్కు మేము చెప్పినభంగిన్. 171

ఉ. వాయునుజుఁడు నేను గహనంబునఁ గ్రుమ్మరువేళ జానకిం
దోయజనేత్రఁ దెచ్చితివి దొంగతనంబున దానఁ గోపమ
త్యాయతమైన వానరబలాంబుధితో జలరాశి దాఁటి యం
హోయుతు నిన్నుఁ గూల్పఁగ మహోగ్రత నీపురి కేగుదెంచియున్. 172

చ. మతిఁ గరుణోద్భవం బగు క్షమాసుతఁ దోడ్కొని వచ్చి తప్పనే
పితిఁ గరుణింపు మంచు ననుఁ జేరినఁ బ్రాణముతోడఁ గాతు ను
ద్ధతిఁ దొడరం దలంచిన విధాత్రునిఁ జొచ్చినయేని మచ్ఛరా
హతి మరణంబు సిద్ధము కటా! తగునే బలవద్విరోధముల్. 173

వ. అని యెన్నాడినచందంబున నేర్పడం బలుకు మని చెప్పి మఱియుం దగినవచనంబు
లుపన్యసించి. 174

క. లంక విభీషణునకు నక,లంకధృతికి నొసఁగి నిశ్చలమతి నాకుం
బంకజముఖి సీత నొసఁగి, శంకవిడిచి బ్రతుకు మనుము సారవిచారా. 175

చ. అపుడు నంగదుఁడు భళదస్త్రహతిం గడునొచ్చి భీతి ని
న్గని శరణంబు వేఁడ టుడుఁ గా దశకంఠుఁడ యుండు వచ్చు నీ
వనుపమ సత్కృపానిరతమైనమనఃస్థితి రావణాసురుం
గన ననుఁ బంపనేల సముఖంబున కేఁయు రాయబారమే. 176

క. అని నీపనుపున కెదురా, డినతప్పుతుమింపు సుని వడిం దక్షిణ ప
వ్వనచరుఁడు లంకపైకి నే, కె నసురనాశకరధూమకేతువు నాఁగన్. 177

ఆ.వె. వినయ మెసఁగ రామవిభునకుఁ బ్రణమిల్లి, యతనియాజ్ఞఁగొని రయంబు మెఱయ
లంక మీఁది కిట్లు లంఘించి పంక్తికం, ధరుసభాంతరంబుఁ డఱియ నరిగి. 178

ఉ. ఇంచుకయేని భీతిని వహింపనిచిత్తముతోడ రావణుం
గాంచి నయంబు మీఱ దశకంధర! రాముఁడు రాయబారము
ర్థించి భవత్సమీపమునఁ దేటపడం దగుమాటలాడఁ బు
త్తెంచిన దూత నౌటఁ జనుదెంచితి నప్పని నిర్వహింపఁగన్. 179

క. అంగదుఁడ భూతముల కహి, తాంగదుఁడం బటుభుజాబలాంగదుఁడను నీ
వంగద నొందక తెలియవి, నంగదవయ్యా మదీయనయవచనంబుల్. 180

ఉ. రాముఁ డమోఘగోచరుఁ డరాతిభయంకరుఁ డమ్మహాత్ముతో
సామ మొనర్చి బ్రహ్మకు నసాధ్యుఁడ వైన మను టొప్పుఁ గాక, సం
గ్రామము సేయువాఁడ సుముఖస్థితి రామున కేను భూమిపు
త్రీమణి నీ నటంచుఁ గుమతీ చెడనొప్పనె దుర్వివేకివై. 181

తే.గీ. లంక నీతమ్మునకు నకలంకమతి వి, భీషణున కిచ్చి రఘుకులభూషణునకు
జనకజాత సమర్పించి శరణుసొచ్చు, కంటె బ్రదుకుఁదెరువొకండుఁగంటె చెపుమ.

వ. అని తెగనాడి రాముండు తానాడినచందంబున నాడుమని యానతిచ్చినవాక్యంబు
లన్నియు నుగ్గడించి వెండియుం దగిన వచనంబులు ప్రసంగించి యంగదుండు. 183

క. సింధువు దాఁటియుఁ గరుణా, సింధు వగుచు నీగతి న్వచింపఁ బనిచె ద
ర్పాంధత చన రామునితో, సంధి యొనర్పు మిది మేలు సకలంబునకున్. 184

క. మహిపుత్రి నొసఁగి రాము, న్మహితాత్ము న్శరణు సొచ్చి మనుట కడుఁ దగు
న్బహుపుత్రమిత్రనాశన, మహాహవ మ్మైరింప నెట్టు లగుఁ గలహమునన్. 185

క. కడు సంధి గోరి బలవం, తుఁడు దూతం బనుప వానిఁ ద్రోచిన మిగులం
జెడుట నిజము ఘనవైద్యునిఁ, గడపినరోగిక్రియఁ బంక్తికంధర వింటే. 186

ఉ. నావుడు నవ్వి క్రొవ్వి కపినాటు నిశాటకులాధినాథు న
న్నీవిధి నొవ్వఁ బల్కె దతిహీనులు మర్త్యులదెంత ము న్నసు
ర్యావలిఁ దోలియాడిన మహాబలశాలికి నాకు లంకయున్
దావదవంబు వానరపతంగముల న్వడి బ్రింగ కుండునే. 187

తే.గీ. బుద్ధి చెప్ప నీకెవఁడు బత్తెఁ జిచ్చెనొకొ, బుద్ధి నచ్చు నిన్నుఁ బొలియఁ జేయ
నని దురుద్ధతిన్ దశాననుఁ డంగదుఁ, దిట్టి చంపు మనియె భటులతోడ. 188

ఉ. అట్టియెడ న్మహోగ్రబలుఁ డంగదుఁ డింద్రుని మన్మఁ డట్లు ద
న్నట్టఁగవచ్చు రక్కసులఁబట్టి నఖంబులఁ దన్ముఖంబులన్
బిట్టు పగిల్చి వాలమున బెట్టు నొగిల్చియు మెట్టుమెట్టి య
ట్టిట్టు విదిర్చియు న్వడి ననేకులఁ జంపె విలాసశాలి యై. 189

క. ఇటులు పోలియించి రోషోత్కటుఁ డగుచున్ దశముఖుండు గనుఁగొనుచుండం
బటురక్తసిక్తనఖుఁడై, తటుకున రామావనీంద్రు దరికిం జనియెన్. 190

ఆ. వె. చని నమస్కరించి సకలంబు వినిపించి, రఘుకులాబ్ధిచంద్ర రాఘవేంద్ర
చేటుమూఁడెఁ బంక్తిశిరునకు నతఁ డేల, యాలకించుఁ బథ్యమైనదాని. 191

వ. కావున ననుమానంబు మాని భవదీయదివ్యచిత్తంబున నవధరించిన తెఱంగున మాకు
నాజ్ఞాపింపుం డని కపులం గనుఁగొని పలికిన మందస్మితసుందరవదనారవిందుండై.

క. రశ్మినిభదీర్ఘవాలుర, నశ్మసదృక్కర్కశాయతాంగులనతినూ
త్నశ్మశ్రువిలాసుఁడు ఖర, రశ్మికులజనాథుఁ డాదరము నిండారన్. 193

చ. రవిసుతముఖ్యభూరుహచరప్రభుసత్తములార మీర లా
హవమునకుం దిరం బగు ప్రయత్నము సేయుఁ డనంగఁ బొంగి నిం
గివగుల వాలదండములు గేల నమర్చి విదిర్చుచు న్రఘు
ప్రవరుని యానతిన్ క్షితిధరద్రుమవార్ధ్యపదుగ్రపాణులై. 194

ఉ. క్రుద్ధులు బాహువిక్రమసమృద్ధులు వానరు లంత యుద్ధస
న్నద్ధులు గాఁగఁ గాంచి నరనాథుఁడు రాముఁడు లక్ష్మణుండు ను
ద్బుద్ధమహోద్ధహాసులు ముదంబున నిల్చిరి వెన్క దన్నె య
ట్లుద్ధతి మోహరించిన మహోగ్రబలు ల్కపు లల్ల వెంపునన్. 115

— । యుద్ధారంభము । —

శా. పాషాణంబులు వైచి కూటములఁ దీవ్రప్రక్రియన్ ఉర్వి వి
ద్వేషం బుప్పతిల న్మహీరుహము లుద్వృత్తిం బ్రయోగించి దీ
ర్ఘోషాకర్కశవాలసంహతిఁ గనత్కేతువ్రజం బూడ్చి య
ట్లీమద్భీతులు గాక లంకపయి నక్వృష్టాటు లాటోపతన్. 196

సీ. సాలము ల్నానాస్త్రంబుచే రాల్చి కూటము ల్గూటపంక్తులఁ బగిల్చి
నఖములచే హస్తినఖములు గోరాడి వరగోపురముల గోపురము లడఁచి
వాటంబు లైనకవాటము ల్విదళించి గసులచే వెడలురక్కసులఁ గూల్చి
యశ్వశాలలను గండాశ్మము ల్చిండించి దంతావళముల దంతములు కొటికి

స్యందనమ్ముల నురుతరస్యందనముల, ద్రుంచఁ గడుమోఁచి దానవమందిరావ
రోధవ్యాధయూవరోధనిర్ఘోషు లరిజిగీషు లత్యంతరోషులు కీశు లిట్లు. 197

వ. చలము సాధించుటయు నప్పట్టునం బునం గలవా గాయలగం బొంది హాహాకారంబు
లొనర్చి రంత. 198

క. మండిపడి దశాననుఁడు, ద్దంతులఁ దనదండ నున్న దండాధిపుల
స్యందనములను వరూథిని, గండుమిగుల నడుపుఁ డని సగర్వస్ఫూర్తిన్. 199

క. వ్రణములు వెలికి శరశాలాప్రముఖాలయములం గలఁచి యాడిరి ప్ర
క్షిప్తప్రక్రియఁ దరుచరు, లప్రతిహతవిక్రమాఢ్యు లగుచు బెలుచన్. 200

క. తరసము మెసవెడు మాశాం,శరసము గడు మేలు గాను తలపోయంగా
తరసమ్మత మది కలహం, తరసముఖులఁ దరుచరులను దఱుముఁ డురవడిన్. 201

వ. అనుటయుం జేర్చి చతురంగసైన్యంబులం దత్సైన్యాధిపతులు జన్యంబునకు నూలు
కొలుపుటయు. 202

చ. నరభుజు లాహవోపకరణంబులతో రణభేరికోరుభాం
కరణముతో మదేభతురగంబులతో రథరథ్యకోటితో
నురవడి గర్జితాభ్రములొకో యనఁ గోయని యార్చి తాఁకి ర
త్తరుచరవర్యులం బనుపదారుణచర్యుల ధైర్యధుర్యులన్. 203

వ. ఇవ్విధంబునం దలపడుటయు నంతకుమున్న కట్టాయితంబై యున్న వనచర
బలంబునుం బొంగి నింగివగులు సింహనాదంబుతోడం దాఁకుటయు. 204

చ. తరుశరకోటుల న్నఖరదారుణకుంతములన్ ధరేంద్రము
ద్గరముల వాలఖడ్గముల దంతకుఠారములన్ దృఢద్భుజం
కరపరిఘంబుల న్నగనికాయము గ్రద్దొని పొంగఁ గ్రుంగ వ
త్తరుచరమానుషాదు లతిదర్పితులై సమరంబొనర్చఁగన్. 205

ఉ. మేదశ్ఛాదము లస్థితీగము లిష్టుకీర్ణంబులుగా ఛత్రస
త్కాండంబంబులు ఖేటకూర్మములుఁ జక్రగ్రాహసంకీర్ణము
లొక్కండదండాహులు రక్తవాహినులు రక్షోరణ్యసంభూతము
ల్యాదోనాథునిఁ జేరె మస్తకశిలావ్యాప్తంబులై యత్తఱిన్. 206

లయగ్రాహి.

విచ్చి చననొచ్చి యొయ్యియచ్చరులు మెచ్చఁగమహోచ్చనగముల్వెఱచి తెచ్చి యసురాళిపై
ద్రెచ్చుచులమున్నులను జొచ్చి కడు నచ్చరము వెచ్చ వెఱఁగన్నిగుల గ్రచ్చొను

బుచ్చి బల మచ్చపడ విచ్చుసురియ లనవు లుచ్చిచన గ్రుచ్చిపడి చచ్చినశవంబుల్
పుచ్చుకొని హెచ్చిపయివచ్చె నతమశ్చరసముచ్చయము మాపఱనునచ్చెరువొనర్చెన్.

క. వాలంబులు విసరుచు వా, తూలసుతాదులు గడంగి తోలుదు బలముల్
తూలశకలములభంగిం, మాలి పఱచె వాల్గుదెస లద్రువ మొఱ లిడుచున్. 208

వ. ఇట్లు రాక్షససైన్యంబు దైన్యంబు నొంది జన్యంబునకుం దొలంగుటయు, నన్య
సైన్యవిజృంభణంబు సహింపక వాహిన్యధినాథులు. 209

క. క్రమ్మఱ భీకరసంగ్రామమ్మునకుం గొల్పి కూయు మహిమహావుచు లు
గ్రమ్ముగఁ గ్రమ్మికొనచుఁ గో, కొమ్మని తాఁకుటయుఁ బోరుఘోరమ్మయ్యెన్.

వ. అట్టి సందడికయ్యంబున సొలెడు మత్తదంతావళంబులును సొలెడు హయంబులును గయ్యంబునకుం గాలుద్రవ్వెడు వనచరులును గలహంబుమానెడు పదాతులును నోహటించినవారి నిలునిలుండని యడ్డెడు సేనానాయకులును పాషాణప్రహారణంబులం బూర్వపాదంబులువంచెడు గర్భ్యంబులును బుట్టెడుశ్రమంబులును ద్రేలెడు కతంబులును స్వేద మూరెడు దేహంబులును జారెడు రథంబులును సురియుం గొసెడు వాశ్వికులును గుప్పెడు నగంబులును బట్టెడుసగంబులును దట్టెడుకరంబులును గుతారంబులు వీచెడుసాదులును శరాసనంబు లెత్తెడు రథికులును సాంపరాయికాగ్రణులగెడు యోధులును మడిఁగెడు సారథులును నొకనికంటె నొకఁడు పదియుడుంగు లెక్కుడుగా విక్రమించువారును బెక్కుచుడుంగులు గాఁ బ్రవహించు రక్తపానంబొనరించు భూతబేతాళంబులును దైమకుంగులు వోవుట లెక్కసేయక యుక్కుమిగులువారును ద్రక్కలగు ప్రక్కలును ముక్కలగునక్కలును దుండెంబు లగు తుండంబులును బిండియగుతరుపిండియు శాదంబు లగు మేదంబులును నిపాతనంబు లగు కేతనంబులును బ్రోన్మూలంబులగు వాలంబులును దూలంబు లగుసాలంబులును వక్రంబు లగు చక్రంబులును బ్రోవులగు ప్రేవులును శకలంబులగు సకలంబునుం గలిగి వాలశైవాలంబును హాస్తిశవపర్వతంబును జామరఫేనంబును గీకసమీనంబును రక్తకీలాంబువై యపూర్వవనీకాకరంబు ననుకరించె నట్టిమొదట దనుజవానరసైనికోత్తములు.

సీ. అతతహాయఖురోద్ధూత సంజాతమహా క్షోణీరజంబు బగ్గుండిగాఁగఁ
గరికుంభవిదళనోద్గతసాంద్రతరరక్తధారాచ్ఛటలు వసంతంబు గాఁగ
వస్థిమార్గంబుచే నత్తివ మెదడు చంద్రప్రయోజిత సుగంధంబు గాఁగ
జలజాతనిభకంఠవలయిత దారుణక్షతములు మాలికాక్రమము గాఁగ
నుబ్బియాడెడు భూతసముత్కరంబు, చారుతరమగు నాగవాసంబు గాఁగ
నాహవోద్వాహమండపాభ్యంతరమ్మునఁ, బెండ్లి పెద్దలభంగి నొప్పి రపుడేచి. 212

మ. హనుమంతుం డొకకొండఁ జేకొని మహాహంకారహుంకారుఁడై
దనుజస్యందనవాజివారణభటధ్వంసంబుఁ గావింపఁ జొ
చ్చిన భీతిన్ హతశేషు లావానరాశీభూత చేతస్కులై
చని పంక్తిస్యందనుబాహుయుద్ధకలనాసందేహు దుర్మోహునిన్. 213

క. కనిభీలోలితహృత్స్వాంతులై చతురంగబలవితానము నవనీ
జనిచరులు కలఁచి యార్చుట, వినిపించిన దశముఖుండు విని మన మవియన్. 214

క. నగతరసాలుల నరవానరులు దొడరు టెరిఁగి కమలినాళము లంకా
పురవరనిలయుల కగుశం, కరుకరుణారసము దప్పెఁ గాఁబోలు నెఱకన్. 215

క. పలభోజను లిర్విధమున, ఫలభోజనులం దొడరి విఫలు లగుట మహా
ఫలములపైఁ బడి కండో, పలములు నలఁగురతి యయ్యెఁ బరికింపంగన్. 216

క. అని వగచు నతనికఁ గీ,టునఁబుచ్చును చూపఁ గాలుఁడు న్వేఱ య నరు
ల్వనచరులు నెంత మయ్యెంగ, బహుపుర ప్రహస్తుఁ డొట్టి మంత్రివరేణ్యుల్. 217

చ. పలికిన మీఱు వోయి నరపాలుర వానరపాలురం బ్లవం
గులఁ బొలియించి రండని సకోపమునన్ సెలవీఁ బ్రహస్తము
ఖ్యులు రథవాజివారణసముత్కరముం గొని సింహనాద కా
హళముఖరావంబులు విహాయసముం బగిలింప నుద్ధతిన్. 218

క. హుంకృతులం గలసి ధనుష్టంకృతులు సెలంగ రాక్షసబలంబు మహా
హుంకృతి నడిపి మమఁ గరిఘీత్కృతి నేమీరవంబుఁ గ్రిందుపడఁగన్. 219

క. వడి నడిచి కదుఁ గదలిక నడిఁ బొంగకు నాప్లవంగ వాహినిమీఁదం
గమకొని రథంబు లరిగెను, సమపంబు ల్క్రోలి త్రాఁకి యమ్మకదలిర్పన్. 220

క. ఈకరణిఁ దాఁకుట యుఁ బిఱ్ఱఁ,తీక చలము మెఱయ నుద్ధతిన్ ప్లవగచరా
నీకమనేకవిధోగ్రస, మీకం బొనరించెఁ గుటుశ హాసుటకోటిన్. 221

వ. ఉభయబలంబులు భయంకరభంగిం దంపతి యన్యోన్యవిజయవాంఛాపరాయత్త
వృత్తి నిర్మర్యాదంబుగా సందడి కయ్యం బొనరింప నయ్యవసరంబున. 222

ఉ. దండిమగండు చండభుజ దండుఁడు కుండెడు నగ్నినా గదా
దండము ద్రిప్పివైచుటయు దానిఁ జేకొని శౌరి వాలిపు
త్రుండు దశాస్యసూతి విరథుండుఁగ నేసి యొండు తేఁ దు
ద్దండత నింద్రజిత్తు పరితాపము నొందకపో వ నవ్వుచున్. 223

క. సంపాతిఁ గలిసి యుయుశౌర, సంపాత మెఱచుం బ్రజంఘుఁడు మెఱయు
న్సంఫుల్లాశోకోత్కర, సంపిహితుం జేసె వసుజంఘుసు విలుఁగన్. 224

ఉ. అంతట జంబుమాలి వినయంబు నయంబు భయంబు మాలి తా
నంతట నిండ నార్చి గొనయంబున వారి నమర్చి తూపుల
త్యంతరయంబున న్విసర నద్దనుజాధముఁ దోఁకఁ జుట్టి కా
లాంతకుఁడో యనంగఁ బవనాత్మజుఁ డుద్ధతి వీచె నబ్ధికిన్ 225

క. విఘ్నప్రియకార్యుఁడు మిత్రఘ్నుఁడు మిత్రఘ్నుఁ డసురి దశముఖసహజో
పఘ్నము దొరయుడు నతనిఁ గృతఘ్నుఁ వెఁడుపటిచె నతఁడు దారుణశక్తిన్. 226

వ. విభీషణుండు మిత్రఘ్నుపేరురంబు వగులుచు నయ్యెడ. 227

క. నలతపనుల నలతపనుల, కోలఁది బోరాడఁగని నికుంభుఁడు నీలుం
దలపడ నయ్యిరువురుఁ గొం, దలపడక నగంబు లనఁగఁ దార్కొనిరనికిన్. 228

ఉ. దేవరిపుప్లవంగబలధృత్యనుకూలవిరావు లుల్లస
ద్గ్రీవులు దీర్ఘహస్తపరికీలితఘోరశరాసనోజ్జ్వల
ద్గ్రీవులు రక్తలోచనశరావులు తీవ్రగతిం బ్రహస్తసు
గ్రీవులు వృత్రవాసవులఁ గేణి యొనర్పఁగఁ దాఁకి రార్చుచున్. 229

ఉ. అక్షులఁ గెంపు దోఁప నిశితాస్త్రపరంపర వేయుచు న్విరూ
పాక్షుఁడు లక్ష్మణుం గవియ నారఘుపత్యనుజన్ముఁడు న్విరూ
పాక్షుఁ డనంగఁ బర్వతశరాసను మెక్కిడి యొక్కకోల నా
రాక్షసు మార్చుపుచ్చెఁ గపిరాజి ముదంబున నుబ్బియాడఁగన్. 230

క. నలువురు దనుజాధీశ్వరు, లలుక శరాసారఘోరులై రామాగ్నిన్
శలభప్రక్రియఁ జుట్టిన, బలిమి వెలయు నృపుఁ డధిజ్యబాణాసనుఁ డై. 231

ఆ. అగ్నికేతు మార్గణాగ్ని కాహుతి చేసి, రశ్మికేతు బాణరశ్మిఁ గూల్చి
కోపమెక్క యజ్ఞకోపను శత్రుఘ్నులఁ, గూలనేసె జాటుకోలలేసి. 232

ఉత్సాహ. వజ్రముష్టి మైందుపై నవక్రవిక్రమంబునన్
వజ్రసన్నిభంబులైన వాఁడియమ్ము లేయుచున్
వజ్రవల్లిమీఁద బండి వాలినట్లు పోయి వే
వజ్రముష్టి దేహయష్టి వ్రచ్చెఁ గ్రోఁతు లుబ్బఁగన్. 233

క. ద్వివిదుంపై నశనిప్రభుఁ, డవిరళశరవృష్టి గురిసి యార్చుడు వానిం
గవిసి యశనిపై వడి శిర, మవియ నెగిచె ఘోరభూరుహప్రకరములన్. 234

క. ప్రతపనుఁ డంగదుఁడు మహో, ద్ధతు లిరువురుఁ బోరునెడలఁ దరుచరతయసం
హతిహతి విశిథిలధైర్యస్థితిఁ దొలఁగెన్ దనుజుఁ డరికిఁ దేఱిమనితోన్. 235

క. దర మింతయు లేక మహో,దరుఁడు శితప్రదరమున నుదర మొంప నిరా
దరుఁడై సుషేణుఁడు కృశో,దరునిం గావించె దైత్యదర్పమ్మఱఁగాన్. 236

క. ఋక్షాధ్యక్షునిపై మక,రాక్షుఁడు రూక్షగతిఁ గవియ నజునితనయుఁ డా
రాక్షసువృక్షచయంబున, వక్షము మగల్చెన్ స్వపక్షవానరు లలరన్. 237

క. జృంభితవిక్రములు దిశా,సంభరితవిరావు లగునిశాటవనాటుల్
కుంభుఁడును ధూమ్రుఁడును మద,కుంభులక్రియఁ బోరి రమితకోపంబులతోన్. 238

క. అంతకసన్నిభులైన న,రాంతక దేవాంతకుల రయంబు డిపిరి కా
లాంతకనిభుఁ డగు పనసుఁ డ,నంతభుజావిక్రముఁడు గవాక్షుఁడును ధృతిన్. 239

చ. త్రిశిరుఁడు ఘోరబాణవితతిం గపిసేన వడంకఁ జేసి య
ద్రిశిఖరసన్నిభుండు నతిధీరుఁడు వానరపుంగవుండు నై
నశరభుఁ గ్రూరమార్గణగణంబుల నొంచిన సంచలింప క
ప్పిశితభుజుం ద్రియామలఁటుపి న్విపినాటుఁడు నొంచె నవ్వుచున్. 240

క. కుముదాకంపనులుగ్రశర,సముదాయంబుల దురంబు చలుపునెడం జే
జముగాడి విడిచి యసురుఁడు, జముదాడికి వెఱచి పఱచు చాడ్పునఁ బాఱెన్. 241

క. ఇషుపంచకమున వానర,వృషభున్ వృషభుం జలింపవేసిన దేవ
ద్విషు సారణు నోరిలక, వృష దాసారమున నతనిఁ దెరలఁగఁ జేసెన్. 242

సీ. అతికాయుఁ డతికాయుఁడై చలంబున దంభవినతుల వేర్వేఱ విశిఖపంచ
కంబున నొంప సాలంబుల నుద్ధశకంఠపుత్రుబలంబు కుంఠితంబు
గాఁ జేసి యార్చి రక్కసివరు లలుక ధూమ్రాక్షుండు బలువిడి వక్షమవియఁ
బిడికిటఁ బొడిచిన బెదరక కేసరి కేసరిప్రతిముండు కీశులార్వ
దూలముల నన్నిశాచరుఁ దూలనేసె, సమితమాయావి యగుచుఁ దన్నాక్రమింప
విక్రమించిన దనుజులు వెగడుగుడవ, శరునిఁ బడనేసె వేగదర్శి కడుసలిగి. 243

వ. పార్శ్వచరులు తన్ను వినుతించు రీతిని వాని పార్శ్వస్థుం డలఁగ గంధమాదను
మహాపార్శ్వుఁడు వ్రేసిన నాతనిఁ దరునికాయవినిహతిం జేసి యంతంబు నొప్పించె.

క. ఉజ్జనితప్రమదుఁడు వి,ద్యుజ్జిహ్వుఁడు శతబలిన్మహోగ్రతఁ గవియ
న్లజ్జవిడిచి పాఱ నతని, వజ్జా! మహితాగఖలుల విమర్దితుఁ జేసెన్. 245

వ. ఇవ్విధంబునం దలపడి యమ్మహావీరులసమసమరకౌశలంబున విజృంభించుచుండిరి
తక్కినరక్కసులు నుక్కుమిగుల నక్కపిబలంబు నెక్కుడెక్కుడని మార్కొనిన
నబ్బలద్వయంబున కద్వయం బగువిగ్రహంబు మహోగ్రంబుగఁ జెల్లుచుండ. 246

క. పొదవుఁ జెయిదుండు కదియుండు, చదువుఁడు పోనీకుఁ డడ్డు చనుఁడు రిపులకుం
బెదరకుఁడు చెదరకుం డను, మొదలగునుడు లుభయసైన్యములఁ గడు నిండెన్. 247

సీ. కత్తులచేత మర్కటశరీరంబులు గోసి క్రొన్నెత్తుర గ్రోలువారుఁ
గుంభినీధరములఁ గుంభికుంభంబులు పగిలించి మీఁదికి నెగయువారు
వల్గన్మహాశ్వదుర్వారులై క్రోఁతుల విచ్చుకత్తులఁ దలల్ ద్రచ్చువారు
స్యందనంబులఁ బృథుస్యందనంబులఁ బిండి గావించి రథికులఁ గఱచువారు
ఘోరనారాచముల గుది గ్రుచ్చువారుఁ, గ్రూరపాలాశనికరంబు ద్రొబ్బువారుఁ
గ్రొవ్వుఁ జీరెడువారు జాల్ ఆవ్వువారు, నైరి యుభయబలంబుల నసురకపులు. 149

వ. తత్సమయంబున.

క. అమితాస్రవాహినులు శల్యమహాతటమాంసకర్దమాయతశవమీ
నమదేభనక్రములునై, యమరె నుభయసైన్యాగ్రమారణ్యములన్. 250

క. అంతట రాఘవుఁడు దిశాదంతిశ్రుతిపాటనప్రదక్షశరాసా
స్త్యాంతరణుం డై దనుజుల, కంకకు సంతకు లయాంతకాంతకుఁ డగుచున్. 251

సీ. మండలీకృత మహోద్దండ కోదండుఁ డై చండకాండముల వేదండతుండ
కాండముల్ ఖండించి కాండప్రకాండ పిచండముల్ చెండించి దండి దనుజ
కుండలమండితగండము ల్నొండు దోర్దండము లుండి మార్తాండభీమ
మండలసదృశుఁ డై పుండరీకభవాండ భాండంబు లవియఁ గోదండరవము
ఖండమై నిండ రథపిండి పిండిగాఁగ, భండనంబున మొండెము ల్తాండవింప
మండలపతుండు రాముండు గండుమిగులు, చుండె మండెడు కాండ జన్మండనంగ.2F2

క. అంగము పెరఁగంగ ముఖాంగాంగము లెత్తువడఁ బొదివె నాసురభటు మా
తంగతురంగశతాంగబ, లాంగమ్ముల నృపుఁడు మార్గణాగ్ని జ్వాలన్. 253

క. మన్నిగొను హయంబులు పడి, తన్నికొను గజంబు లొరఁగి తఱిఁగడి తేరల్
మన్నుగొను శవంబులు న, య్యెన్నిస్ఫురబాణుఁ డగు మహీశునుమునన్. 254

సీ. సుమదనిశాటవక్షఃకవాటములపై రయమార నినుపసారసము లెగుచు
విపులాసిపల్లవ విమతాశ్విశారణ్యభాగంబుపైఁ గదంబములు నినుచుఁ
బ్రకట మాయా జాల రక్షోరథికముఖాంబుజములపై శిలీముఖము లేయు
నానాస్వరూపదానవఘోరనాభీదమ్ముల శరసముదయము నించు
నిది విరుద్ధ వన రథమదేభ వేఘ, వాహనుల మీఁద నాశుగవ్యాప్తి సెఱపు
నార యటువంటి ధన్వి యర్కాన్వయంబు, నందు శాదెందు లేఁడని యమరు లెన్న.

సీ. కుప్పలుగా నేలఁ గూలిన రథకేతు దండంబు లురుపవిత్రములు గాఁగ
నుడుగక యడుఁగులై కడువడి వెడలెడు కీలాలధారలు ఘృతము గాఁగఁ
దఱచు గా నెల్లెడఁ దొరఁగినసముదగ్రరథశకలములు సమిధలు గాఁగఁ
బోరిఁబోరి వెడలెడు భూతబేతాళు లుత్సుకము నొందెడుసభాసదులు గాఁగ
మార్గణాలి ఖటాకాక్రమమ్ము గాఁగ, సాగ్రహాహవనీయాగ్ని నాసురభటు
పశువిశసనంబు గావించి ప్రబలి వెల్చె, బుధహితకరుండు రామధార్మికవరుండు.

సీ. శూలప్రతీకాశసునిశితాస్త్రము లేయు నొకమాటు రాజవరాళి కడుసలిగి
చక్రసంకాశపృషత్కౌఘము నిగుడ్చుఁ బురుషోత్తముం డొకపరి కడంగి
బ్రహ్మశిరస్సదృగ్బాణజాలము లువ్వ నొకవేళ లోకేశుఁ డుగ్రశక్తి
వజ్రనీకాశ దుర్వారేషువులు చిమ్మ నొకతూరి విబుధేంద్రుఁ డుక్కుమిగిలి
కాలదండసదృక్షోగ్రకాండచయము, ముంచు నొకసారి యకాలమూర్తి కనలి
ప్రాలి యొకపుడు వీరవ్రతవ మొనర్చె, రాముఁడు శరాసనరణాభిరాముఁ డగుచు.

వ. ఇట్లు రెండవరుద్రుండునుం బోలెఁ బరాక్రమించు నమ్మహాదనుర్ధరు విజృంభణంబు సహింపక శుకసారణమహాకాయమహాపార్శ్వాకంపనాదిదానవలోకం బలోకసామాన్యగతిఁ బరవసంబు చేసి యక్షయశరధి యగు దాశరథిం దొడరుటయుం దచ్ఛరంబులు లోఁగొని భంగంబుల నందింపుటయును నయ్యామినీచరసముదయంబు పొడవడంగె నంతఁ దత్సమయసాంధ్యరాగారుణప్రభాభాసితం బగునభోభాగంబు నపహసించుచున్నదో యన భూదేవియు సాంద్రతరరక్తధారాపరిషిక్త యై యొప్పెనట్టియెడ సౌమిత్రియు ననేకచతురంగజాతంబులం గృశీభూతంబులం గావించి మించెం గుంభినీధరంబులం గుంభికుంభంబులు పగిలించు నాంజనేయుండు నాజానేయంబుల నశ్వతరనికరంబుల నశ్మతరునికరంబుల నశ్వారంబులు గావించె నంగదుండును బరుషపాషాణప్రహారణంబున నింద్రజిత్తు నంగద నొందించుటయు నతం డతనిం గిఱురించి సమరంబునకుం దొలంగెం దక్కిన యక్కపినికరంబును రక్కసులం బెక్కండ్ర నొక్కమొగి నుక్కు మిగుల ద్రొక్కించుచుండి రట్లంగదుం గేడించి భండనపరాఙ్ముఖుండై దశాననందనుండు దురాలోచనంబున. 257

సీ. అగ్నిసంభవమగునరదంబు శరశరాసనకవచంబులు సంగ్రహించి
ప్రబలెడునంధకారమునకు మాయాతమంబుతోఁ దొడఁగి రయంబు మీఱఁగా
నుఱిమెడుజలద మొకో యన మేఘనాదుం డగమ్యస్వరూపుండు గడఁగి
దశవదనాంతర్గత కుచాపల్యంబు విఱుతుఁబో నేఁడని విన్నుఁ బ్రాఁకి

రాఘవులను వానరప్రకరముల భల్లూకనాయకుల ననేకవివిధ
ఘోరసాయకములు గొదగొని పుంఖానుపుంఖములుగ వీచెఁ బుడమినిండ. 258

క. ఒకదెస వెసనార్చు నతఁ, డొకవైపుననుండి వీచు నుగ్రాస్త్రము లిం
కొకకడఁ గడుఁ బేర్చుఁ గకా, పికులై కపిసేన యొదుగ భీషణవృత్తిన్. 259

సీ. ఒకమాఱు పదినూఱులు కటారు లరుదారు గతిఁ వైమఁ గప్పుఁ డొక్కఁ డనంగ
నొకనిముసమ్మ మహోగ్రమ్ముగాఁ జిమ్ముఁ గఱకుదు మ్మహితుల కనులఁ బోవ
నొకవేళ శరజాల మురలీలఁ బటుసాలచరులపై నేయు వక్షములు వగుల
నొకమాటు నగకోటు లాగిమీటు కపినాటుల శిరంబులు ఫలంబులగతి నలఁగ
బాపురే కొంతసేపు సమీపుఁ డగుచుఁ, జూపు నిజరూపుఁ బ్లవగులయేపుఘోర
రూపుఁడై మాపు నురవడిఁ జోపు మేఘ,నాదుఁ డెంతయు మాయావినోదియగుచు.

గీ. దారుణరణంబు మేఘనాదంబు గాఁగ, దేహదీప్తి విద్యుత్ప్రదీప్తి గాఁగఁ
గలితశరవృష్టి వర్షంబు గాఁగ నొప్పె, జన్యభూ శక్రజిత్తు పర్జన్యకరణి. 261

వ. ఇట్టిచో నయ్యింద్రజిత్తుండు శాంబరికుండు గావున ఖండనంబునం గంతు మిగిలి ఝంఝూసమీరణం బరణ్యంబునుం బోలె వానరసేనా కాననంబు నిజాశుగపరుత్ప్రభంజనంబునం బఱవ్యఱం జేయుచున్నం గనుంగొని హనుమదాదులుం దద్దుర్దశోరణం బుపలక్షించి వృక్షపృథుక్షోణీధర క్షేపంబు గావించి విఫలప్రయత్నులై యతిప్రయత్నంబున నిజసైన్యంబు దైన్యంబు నొందకుండం దన్మాయాప్రతిబద్ధుండు గాని విభీషణుండు తోడ్పడ నోపి రక్షించుచు నచ్చెరువందుచు భరంబు నొందుచు నిష్కారణంబ రణంబునం గూలువారలకు విషాదంబు నొందుచుం బరిభ్రమించుచున్నంత రాముండు సక్రోధుండై. 262

క. వీఁకం బ్లవగానీకము, డీకొని పోనీక కడువడిం బోరెడు ఘో
రాకారాకరదనుజా, నేకముఁ బోకార్చి క్రోధ మిమ్మడి గాఁగన్. 263

ఉ. రావణి యేయు మార్గణపరంపర వానరసేన దీఁతం
బోవకయుండ భూరిశరము ల్నిగిడించి తదీయబాణవి
ద్రావణకేళి మన్నయెడ రాముని రామునితమ్మునిం దశ
గ్రీవతనూజుఁ డేసె విపరీతరయాకృతచాపనైపుణిన్. 264

గీ. ఏని గోగోచరుఁడు గాక యెల్లదెసల, నాటుకొని యుల్కక్రమణం బొనర్చి
నట్టు పెఱయుదు నైఁపకయనుజుఁ గాంచి, హృదయమునుకంగ రాఘవుఁ డిట్టులనియె.

క. ఇంటివెంతత్కణమాయా, వింతటి కెగసి కపిబలంబు విఱుచుచుఁ దనచే
నింటి బలుక్కనూఁడు వన్నెట్టుఁ బడక యిట్లు తబధకుఁడు కడిన్. 266

ఉ. కావున సంశయింపఁ బనిగాదు విరించిశరంబు వీనిపై
వేవిడఁ గర్జ మన్న రఘువీరుని గన్గొని లక్ష్మణుండు దు
ర్భావుఁడు వీనిపై నెగువఁ బాడియె బ్రాహ్మము నస్త్ర మన్యథా
జావలి వీని ధూర్తుఁ బరిమార్తము మాస్త్ర కార్తి పూర్తిగన్. 267

వ. బ్రహ్మాస్త్రం బల్పవిషయంబునం బ్రయుక్తంబై త్రిజగత్సంహారంబు గావించు నీవు కోపంబుఁ దక్కు మే నేవిధంబున నైన వీనిఁ బరిమార్పక తక్కుదునే యని పలికి
న శాంతుండై. 268

—। నాగపాశబంధన కథ ।—

క. మాయాతమిస్ర మొంతయు, మాయం బగునట్లు రామమహీకాంతుఁడు ఘో
రాయతమూర్తి ప్రభాకర,సాయక మేయం దలంచు సమయము లోనన్. 269

శా. నాళీకప్రభవప్రదత్తవరగంధస్ఫూర్తి నుద్యక్ష్మ
ద్వేళాబంధురవిక్రముండు హరిజిత్స్వరం దత్రసాయిత
క్ష్వేళానేకముఖోగ్రదంతభయకృజ్జిహ్వానిశాతోజ్జ్వల
ద్వ్యాళప్రగ్రహబంధపీడితులఁ జేయం జూచె భూపాలురన్. 270

వ. రామలక్ష్మణుల నాశీవిషపాశంబుల నాశంబు నొందింతు నని తలంచి యత్తులువ
రక్కసుండు. 271

చ. కనదస్త్రం బరివోసి యేయుటయు నక్కాకోదరాస్త్రప్రసం
జనితాహిప్రకరంబు గోఁజుచు మహాశ్చర్యంబు సంధిల్లఁగాఁ
జని యుద్యద్గతి రామలక్ష్మణులఁ జంచత్కార్ముకోపేతులన్
దివకృస్వాత్ముల నన్నదమ్ములఁ బ్రబంధించె న్మహోగ్రాకృతిన్. 272

క. బంధించిన నురుతరశర, సంధానాకర్షణాది సామర్థ్యము లే
మి ధాత్రిఁ బడరు లూనక, గంధ మెడలి పడిరి నృపు లగంబుల భంగిన్. 273

వ. ఇట్లు నాగపాశప్రబంధబంధితు లగు రామలక్ష్మణులు మేరుమందరంబు లొరఁగిన చందంబునఁ గపిబృందంబున హాహాకారంబు లెగయ వ్రాలి రట్లు వ్రాలిన రాజరత్న
ద్వయంబున. 274

క. నిద్రావినిద్రుఁ డగు లయ,రుద్రుని క్రియ నొరఁగఁబడిన రూఢశ్రీగం
ధద్రుమము భంగి నహివృత,షద్రాజీవుండు రామభద్రుం డొప్పెన్. 275

గీ. చిల్వత్రాటికట్లఁ జెన్ను దొరంగిన, రాజసుతుల దివిజరాజసుతులఁ
జూచి దొరి రనుచు నోఁక్షమూఁకల నేని, పుత్రుఁ డుత్సవమునఁ బురికిఁబోయె. 276

శా. చెంతం దైత్యులు హెచ్చరించుచు నుతుల్ సేయ న్మహాభీతి న
త్యంతంబున్ ఖచరాళి సన్నుతులు సేయం బర్వతాభీలది
గ్దంతిశ్రుత్యభిపాటనక్షమజయాధ్వానంబు మీఱంగ ని
శ్చింతం బ్రోలికి నిట్లు వోయి ప్రతివీక్షించెన్ దశాస్యుం డికన్. 277

క. కపిముఖ్యక కపులు విఱిగిరి, వినిహతులై రహితు లేల వెఱచెద నతిమోదం
బునఁ దేలు మింద్రజిత్తుం, దనయునిఁ గాఁ గనియు నేఁ దలఁక మనమునన్. 279

వ. అనిన విని యవ్విశ్రవోనందనుండు మందోదరీనందనుం గనుంగొని మహానందుండై.

క. ఏఁచిన శత్రుల సమయం, జూచితివి మదీయహృదయశోకతమంబుం
బాచితి విలువిద్యన్నీ, నేచిన క్రియఁ దొల్లి యొరులు నేర్చిరె యెందున్. 280

గీ. రణములోన వింటిరణము మెండుకొన బ్రహ్మ, దారకులు దలంక దారకుండ
సహితశస్త్రకోటి సహిత వానరకోటి, గొలఁత వెట్టె తేమి కొలఁత నాకు. 281

క. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దనయుం గొనియాడి జనకతనయామణికి
న్వినుచుఁ దురగాస్త్రపాశ, ప్రణిహతులై పడిరి చెడిరి రాఘవు లనుచున్. 282

వ. అని సగర్వంబుగా నాడి. 283

చ. భుజదశకద్వయంబు దనుకప్పఁగవుఁ దాప్తులఁ గాంచి మాఱ్తుర
న్భుజగశరోగ్రపాశములఁ బోల్చు హరించితి మింక నింద్రజి
ద్విజయము వీటఁ జాటుఁ డని తెల్పుచు నంతిపురంబులోని కా
త్రిజగదభీష్టఘాతుకుఁ డతిప్రమదంబునఁ బోయె నవ్వుచున్. 284

వ. తదనంతరంబున మత్తుండగు నింద్రజిత్తుండును నధికవిలాసం బగు నిజనివాసంబునకుం బోయె నంతఁ గాపురంబున రక్కసులకుఁ గాఁపురంబు నగులంకాపురంబున విజయఘోషంబు విశేషం బయ్యె నయ్యెడ వెక్కసు లగు రక్కసులుం బుష్పితానోకహానేకఘనం బగు నశోకవనంబునకుం జని ధూళిధూసరితాలకజాతవదనకజాతయగు జనకజాతం గాంచి యిట్లనిరి. 285

ఉ. పావని పావనిప్రముఖపాదపచారుల నెల్లఁ గూల్చి మా
రావణి సర్వమార్గణపరంపరఁ ద్వత్పతిఁ దత్సహోదరుం
బోవనికిన్ నేసి పారిపుచ్చె నిజంబుగ నాత్మలోన రా
మావనిజానిఁ గూర్చి వగ నందకు మింక శుభంబు నీ కగున్. 286

క. ఈవని వగలం బొగిలెద, వీ వని యోదార్ప మమ్ము నిచటికిఁ బంపెన్
రావణుఁ డఖిలజగద్విద్రావణుఁ డీక వగవనేల రాజనిభాస్యా. 287

చ. అనుపలుకుల్ విశేషముల యుల్లసితం బెనుమూర్ఛ నొంది యా
త్తనుతరమధ్య సీత విపతత్కదళీతరుభంగి గాఁగ త్రా
లివలన మాఱుగాఁ బాతిఁ జలించెఁ గడున్ సహజస్థితిన్ ధృతిం
దనరె వినిశ్చలత్వము నుదగ్రవిచారము గల్గియుండుటన్. 288

చ. అవయత మూర్ఛనొందిన ధరాత్మభవన్ నిజవాక్సుధాభిషే
చనమునఁ దేల్చి పుణ్యజలజాతముఖుల్ చనునట్టి పుష్పకం
బునఁ ద్రిజటాభిధాన కొనిపోయి రహస్యవిధిన్ నృపుల్ సజీ
వనులుగ నున్నవా రని ధ్రువంబుగఁ దెల్పి మఱల్చె యానమున్. 289

క. ఈవిధమున సన్నృపతుల, చావమి యెఱిఁగించి యాత్రిజట పుష్పకమున్
వేవెడలించి యశోక మ,హావృక్షముక్రింద నద్ధరాత్మజ డించెన్. 290

క. నిక్కము చింతింపకు మీ, రక్కసులకుఁ దనకు వశమె రాఘవుల ననిం
ద్రెక్కొనఁ జేయఁగ నిటువిను, మెక్కడినక్క సురలోక మెక్కడ నక్కా. 291

వ. అని మఱియుం దగిన వచనంబుల నప్పరమపతివ్రత కప్పుణ్యాత్మురాలు మనస్తాపో
పశమనంబు గావించుచుండె నంత నక్కడ. 292

క. దర్వీకరపాశంబుల, దోర్వీర్యము మాలి నరపతులు చిక్కిన ని
గ్గర్వులగుచు నచటచట, నుర్వీరుహచరులు వగచుచుండెను వేళన్. 293

సీ. నిజవంశజుల కాపద జనించె వారింత మని చనుదెంచు నర్యముఁ డనంగఁ
దనయంత వారు వేదన నొందిరని చూచి చనుదెంచు ఖండేందుధరుఁ డనంగ
దివిజపతుల దప్పి దీర్పఁ గ్రుంపంపు నవ్వ నమృతంపుటుద్ధ యనఁగ
విశదత మూర్తిభవించి రాముని గొల్వ వచ్చియుండెడి హరిభక్తి యనఁగ
ఘనుల లీలామనుష్యవిగ్రహుల రామలక్ష్మణులఁ జేరవచ్చెఁ గల్మషభరవన
నాశనపటుతాశనుండు రణాశనుండు, నారదుం డార్తజనసస్యనారదుండు. 294

క. వచ్చి నిజకాంతి నగచరు, లచ్చెరుపడి చూడ నజగరాస్త్రప్రహతి
నొచ్చిన రాముం గని వా, పుచ్చి విరించిసుతుఁ డిట్లు పొగడం దొడఁగెన్. 295

దండకము.

శ్రీమన్మహాభానువంశాబ్ధిసోమా రిపుస్తోమభీమా గుణస్తోమధామా ప్రభాధామధామా జగద్గీతనామా మహోద్దామరామాభిరామా సురాంచత్ప్రికారామసీమా సమాకారకామా మునిస్వాంతరామా క్షమాకామ చంచత్క్షమాకామ నీలాంబుదశ్యామ సుత్రామగోత్రామరప్రేమ సంగ్రామసోమా కృతక్షేమ సర్వాల్పలక్ష్మరామా వహోమాధ

రిం ద్వైతభావప్రకారంబు లగ్గింప నెవ్వానికిం దీర దేనెంత నీ వాది విష్ణుండ వాద్యంతశూన్యుండ వంచత్ప్రపంచస్వరూపుండ వీభూతజాలంబున న్వ్యాపకమూలంబున న్నిండి యున్నాఁడ వేతత్ప్రపంచప్రవృత్తంబు సర్వంబు నర్కేందు నేత్రంబులం జూతు వూహింపఁగా శత్రులు న్మిత్రులు న్నీకు లేరైన దుష్టాసురధ్వంసశిష్టావనార్థంబు నర్థించుటన్ జన్మకర్మంబులం బొంది వర్తింతు వాదిన్మహామీనకూర్మోగ్ర ఘోణీనృసింహోరుమాయావటు ర్భార్గవాకారము ల్దాల్చి వేదాపహు న్సోమకాఖ్యు న్మహేంద్రారిముఖ్యు న్విదారించి మంథానపృథ్వీధరం బెత్తి దక్షున్ హిరణ్యాక్షు ఖండించి తత్పూర్వజుం జంపి హాళిం బలిం బట్టి బంధించి ముయ్యేడుమారుల్ ఖలావన్యధీశావలిం గూల్చి వేశ్క న్వీరించామరోర్వీపతీదైత్యపుత్రేంద్ర భూదేవులం బ్రోచి తీలీల లీలామనుష్యుండవై దేవతిర్యఙ్మనుష్యాదుల న్బాధనొందించు దుష్టన్మనుష్యాదు లోకత్రయీ రావణు న్రావణుం బుత్రమిత్రాదిసంఘంబుతోఁ గూల్తు సందేహము న్లేదు నీవింకను న్రామకృష్ణావతారంబులన్ బుద్ధకల్క్యాదిరూపంబులం దాల్చుచున్నాఁడవే వార్తిం గరీంద్రుండు రావే కటాక్షించి రక్షింపవే యంచు ము న్వేడబం బొప్ప నిన్వేఁడఁగాఁ బోషితాశేషభూచక్రముం జక్రము న్విక్రమం బొప్పఁగా వైచి యానక్రముం గూల్చి తీవింక నెన్నేనినూం జేసి తట్టుండని మ్మేనబ్రహ్మాదుఁ డీవాయుపుత్రుండు నీపంక్తికంఠారిజన్ముండు నీభక్తసంఘంబులో వారమే కాక యే వారమే భారము న్లేక కైవారము న్నిన్నుఁ గావించు వా వారమే వార మాప్రొద్దు లేప్రొద్దు లావేళ లేవేళ లాత్మన్మహాత్ముల్ భవత్పూజ గావింతు రశ్రాంతము న్నిన్ను వర్ణింపఁ గాలేని యాకాలము ల్గాలము ల్నీకు దాస్యం బవశ్యంబు శుద్ధాత్మతం జేయఁగాలేని యాకాయము ల్గాయము ల్నీసమారాధనాహీనము ల్భోగముల్భోగముల్నీకుఁ గాకున్న యర్థం బనర్థంబు నీవిగ్రహారాధన ల్లేని చంచత్సుయోగంబుల్ కుయోగంబు ల్గను న్నీకృపాపాత్రముల్గాక లాభించు నాయుష్యము ల్లాయువుల్లే నిన్గనం జాలకున్నట్టి యేబాములుం బాములే బ్రహ్మవు న్నీవ రుద్రుండవు న్నీవ విష్ణుండవు న్నీవ జిష్ణుండవు న్నీవ కాలుండవు న్నీవ నక్షత్రము ల్నీవ భూమ్యాదిభూతంబులు న్నీవ దిక్పాలురు న్నీవ యాచార్యుఁడున్ శిష్యుఁడుం గర్తయున్ భోక్తయుం గార్యముం గారణంబు న్సరిద్వార్థులు న్వేదశాస్త్రంబులు న్నీవ సర్వంబును న్నీవ లోకంబుఁ గల్పించి రక్షించి శిక్షించుట ల్నీవ పుంస్త్వంబునున్ స్త్రీత్వషండత్వముల్ సౌఖ్యదుఃఖంబులున్ జన్మకర్మంబులు న్నామరూపంబులు న్బాల్యవృద్ధత్వము ల్నీకు లేవెందు నేకార్యముం దావకీనాంతరంగస్థమే యైన నేనొక్క విజ్ఞాపనం బిద్ధగావింపఁగా వచ్చితి న్సర్వసామగ్ర్యవంతుండవై యుండియుం గానిచందంబున న్నాకుల న్సోఁకుల న్లోకులన్ ఘోరసంసారసంబద్ధులం జేయు నీవీగతి న్నాగపాశప్రబద్ధుండవై చిక్కుటత్యంతమ్ముం జిత్ర మిద్ధాత్రి సౌమిత్రి

ధాత్రీరజచ్ఛన్నుఁడై చెన్నుఁ బోల్పేదఁ గాఁ జేదగా నున్న వాఁ డెన్న నిప్పన్నగవ్యా
ప్తి నిట్లున్న నీబన్నముం గన్నులం గన్న విన్నన్మహోపన్నవృత్తిన్నరుల్ ఖిన్నరుల్మన్నన
న్మిన్నునన్ ఖిన్నతం గన్నవారేకదా వీఁక దాఁకొన్న రక్షోవిపక్షోగ్రశాతాస్త్రజాత
ప్రభూతప్రభూతప్రశాంతుండవై యుంటయున్నీకు లీలావిశేషంబ కాఁబోలుఁ గా
కున్నఁ జీకాకునం గాకులంబోలె నీమూఁకలం బోవఁగాఁ జూతువే చూడు నీనూరెల
న్వీరె లంకాపురిం గాఁపురం బున్న రాకాసులం గోసి వీతాసులం జేయఁగాఁ జాలియు
న్సోలియున్నావు నీవంచు వాతాత్మజాదుల్విచారించి కన్నీరు మున్నీరుగా నించు
చున్నారు కన్నారుగా రీవిపన్నిమ్నఘోరార్ణవోత్తీర్ణ దక్షుప్రకారంబుఁ గ్రూరంబుగాఁ
జెల్లు నైన్యంబు జన్యంబు హైన్యంబుగా నామదైన్యంబు వాట్రిల్లె వేయేల నీదాస
కోటిం గడున్మెట్టి నద్ధైర్యవంతుం గరుత్మంతుఁ జింతింపు మాత్మ న్భవద్వాహనావాహ
నం జేసి యాశీవిషప్రగ్రహాంబుల్ గ్రహాధీశుఁ గన్గొన్న ప్రాలేయజాలంబులంబోలె
దూరంబులౌ నట్లుగాఁ గాయుఁడౌ వైనతేయుండు గాకెవ్వఁడుం జాలఁ డీమూర్తి వీర్పంగ
నేఁబోయెద న్భావిభావింపు భావింప ధర్మార్థకామంబులున్ మోక్షముం సత్త్వమున్ రాజ
సంబుం దమంబున్ దయాసత్యశౌచంబులున్ క్షాంతియున్ శాంతియున్నీకటాక్షోపలబ్ధం
బులై తైన నీకున్న వేరైన యర్థంబులే దీజగత్త్వంబు నీకేల యర్థేందుకూటా నమత్పాద
కంజాతకంజాత సంజాతసంజాతి కంజాతనాభీ సదా మానివార్గప్రదాయీ సదా యాక్రి
యన్నిన్ను వర్ణించువారెంతపుణ్యాత్ములో విశ్వమూర్తీ నమో రామమూర్తీ చిదా
నందవర్తీ జగద్గీతకీర్తీ మహాశసూర్తి లోకానువర్తీ నమస్తే నమస్తే నమః. 296

క. అని నారదుండు వినుతిం,చిన దివ్యజ్ఞానబోధశీలుం డగుచు
మ్మునినాథుఁ బొగడి వీడ్కొ,ల్పినరేం ద్రుఁడు మానసమునఁ బ్రియ మిగురొత్తన్.

శా. పాకారిప్రముఖామరు ల్దినుతింపన్ బ్రహ్మపుత్రోక్తిని
శ్శోకవ్యాకులత న్సమాహితమనస్కుండై తలంచెన్ ఛదా
స్తోకోజ్జాతమరుద్విఘాతహిమవంతున్ ధైర్యవంతుం బ్రభీ
మాకారాహికృతాంతుఁ బాలితగరుత్మంతున్ గరుత్మంతునిన్. 298

చ. తలఁచుడుఁ దక్షణంబ వసుధాధరకాయుఁడు వైనతేయుఁ డు
త్పలహితకాంతినిర్జితపతత్రనికాయుఁడు నిర్వ్యపాయుఁ డు
జ్జ్వలనఖసాంపరాయుఁ డురుసాధువిధేయుఁడు గాఢగూఢపా
త్కలభయదాభిధేయుఁడు రఘుప్రవరుం గనవచ్చెఁ జెచ్చెరన్. 299

ఉ. వచ్చుఖగేద్ధరత్నభవవాతము వేతము సోఁకినంతనే
హెచ్చు దొఱంగి పాములు విహీనధృతి న్నృపబంధనక్రియా

ద్వ్యచ్ఛతురత్వ మేది సమయస్థితి మాయము నొందె గాలిచే
నెచ్చట నైన సర్పములు హీనత నొందునె యంచుఁ జూడఁగన్.

క. కాశప్రకాశుఁడై యా, కాశంబున వచ్చు గరుడు గతి విని భీతి
న్నాశనము నొందె నప్పన్, నాశనబంధములు ప్లవగనాయకు లలరన్. 301

క. గరుడపతంగోదయమున, నురగతమోబంధనంబు లుక్కడఁగెఁ గడుం
దరుచరముఖాంబుజంబులు, పొరిఁబొరి వికసిల్లె లోకముం దెలివొందెన్. 302

క. మరుదారమణీయగరు, న్మరుదారవ మెసఁగ వచ్చి మది యలరించె
న్మరుదారఁ గసరు సోఁకఁగ, మరుదారఁగ నమరు భూసుతాధీశునకున్. 303

వ. వచ్చి నమస్కరించి నిలిచిన సువర్ణవర్ణ సుపర్ణుం డగు సుపర్ణుఁ గనుంగొని విగతశాకో
దరపాశాభిరాముం డగు రాముం డనుజసహితుండై యమ్మహామహుం బ్రత్యభినందన
పూర్వకంబుగా సంభావించి. 304

ఉ. నీ విట వచ్చుటం గడు వినిశ్చల మయ్యె మనంబు నాగపా
శావహవృత్తి మాన్చి మము నక్కటికన్ దరిఁజేర్చి తెట్లు సం
భావన సేయనేర్తు నిను వర్ధనమూర్తి పతంగవంశసం
జీవన యంచు సన్నుతులు చేసినఁ బొంగి ఖగేంద్రుఁ డిట్లనున్. 305

వ. దేవా నీ వాదిపురుషుండవు పురుషోత్తముండవు గాలస్వరూపుండవు నగుదువు. భవదీయసంకల్పవికల్పంబులం జేసి యీత్రైప్రపంచప్రవృత్తినివృత్తులు సెల్లుచుండు నట్టి బ్రహ్మాదిసురప్రార్థితజన్ముండ వైన నీకుఁ బలాశవాతాశనబాణపాశనాశనంబు వింత గాదు రావణకుంభకర్ణమేఘనాదాదిదనుజవధవిధోపాయంబు నశ్రమసాధ్యంబ యని పలికి వెండియు సహస్రనామతుల్యంబును భవభయతారకంబు నగు భవదీయ పవిత్రనామస్మరణంబున జనంబులు గలికల్మషంబులం దొలంగుదు రని చెప్పి వానర వ్యాదయభయశంకాతంకంబులతోడ నంతర్హితుం డగుటయు రామలక్ష్మణులు మహానందంబునం బొదలి రయ్యవసరంబున. 306

క. తతనాగపాశబంధ, చ్యుతులం బంక్తిధరాజసుతుల స్మహిమో
న్నతులం గని కపు లధికో, ద్ధతులై భయదావహప్రదీపితు లగుడన్. 307

క. క్రూరోరగబంధచ్యుతు, లైరఘువు లద్రిచరుల నాహవమునకుం
బ్రేరేపించుట దనుజుఁడు, చారులచేఁ దెలిసి కడు విచారించె నెడన్. 308

వ. చింతించి యద్దశవదనుండు సవిస్మయంబును సవిషాదంబును సభయంబునుగా నిజ
సైనికులం గనుంగొని. 309

ఉ. శాతమహాహిపాశములఁ జావక రాముఁడు లక్ష్మణుండు ను
జ్జాతకుతూహలంబున స్వసైన్యము సంగరకేళికి న్సమా
యాతముఁ జేసి పేర్చుట మహాద్భుత మక్కపిసేనయు న్సము
ద్యోతితపూర్ణిమాహిమకరోదయవార్ధి తెఱంగు దోఁచెన్. 310

చ. పృథివిని వానరు ల్నరులు భేదము నొందమి వింత రాలువా
రిధిపయిఁ దేలియుంట విపరీతము మర్త్యులు నాగపాశసం
శిథిలులు గామి యెంతయు విచిత్రము దానవులార యింతకు
న్విధి చతురాస్యుఁ డేమిటికి విస్మయ మందఁ గడంగుఁ డాజికిన్. 311

చ. అనవుడు ఘోరమస్తులు భయంకరహస్తులు హస్తివాజి వా
హనులు మహారథస్థులు ప్రహస్తముఖాసుర లేమ మేము భం
డనమునఁ బేరువాఁడి నెగడం గల మంచుఁ గడు న్నిడంబులం
బనిపడి గ్రద్దలాడ దిగిభశ్రుతిదారణకారణార్భటిన్. 312

క. లంకాపురంబు వెలువడి, శంకాతంకంబు లేక జలజహితకులా
లంకారుసైన్యము పైన్, హుంకారతఁ గవిసి యార్చి రాయోధవృతిన్. 313

ఉ. తాఁకినఁ బోకపోకుఁ డని తార్కొని కేకలు వెట్టి వానరా
నీకము వీఁక డీకొని యనేకవిధంబులఁ దింత్రిణీక శ
మ్యాకమధూకభూరుహచయంబుల వైచిన దేవదానవా
నీకము చందమొంది తదనీకినులట్లు పెనంగు నయ్యెడన్. 314

సీ. కంఖాణరింఖావిశృంఖలసంఘాతధరణీరజంబు రక్తంబువలన
భూరికాహళఘోరభేరికాహవజయధ్వను లుగ్రబృంహితధ్వనులవలన
బంధురసింధురసైంధవసుభటకబంధము ల్భేతాళపటలివలన
వాలధ్వజనిరంతరాళప్రజనితాంధకారంబు కరవాలకాంతివలన
శ్రమము లాహవవిజయవాంఛలవలనను, జెమటబొట్టులు చిందగ్గిసెకలవలనఁ
బ్రాణభీతి పరాక్రమక్రమము వలన, డిందువడ నొప్పె నపు డక్కడిందిపోరు. 315

వ. అట్లుభయబలంబులు నాహవదోహలంబునం బేరువాఁడిఁ బోరాడుచున్న సమయం
బున. 316

క. అక్షిగళద్ర్యక్షుఁడు ప్రహతతి, తక్షుఁ బృథుక్షోణిభృత్ప్రదృప్తుఁడు సుతక్షున్
రక్షశ్శిక్షాదక్షున, పక్షయము నక్షయవిక్షతుఁ బ్లవగాధ్యక్షున్. 317

మ. పవమానప్రియమాణవుఁ గదిసి కోపస్ఫూర్తి విస్ఫూర్జథు
ప్రవరేష్వాసఘోరటంకృతి నభోభాగంబు వ్రయ్యన్ దరి

త్రివడంక న్నిశితాశుగంబుల విరోధి స్రేవసి నొప్పించె దై
త్యవరూథిన్యనుకూలవృత్తి యగు ధూమ్రాక్షుండు తామ్రాక్షుఁడై. 318

క. నొంచిన దైత్యాధముఁ గోపించి నభస్వత్సుతుండు పృథుసాలముల
న్ముంచినఁ దద్ద్రుమములు దూలించి నరాదుండు గళవళింపనిమదిలోన్. 319

క. శాతాస్త్ర నిహతి వనచర, జాతున్నొప్పింప నద్రిచరసత్తముఁ డు
జ్జాతక్రోధమున ధ్వజ, పాతం బొనరించెఁ బ్లవగబలము చెలంగన్. 320

క. కేతనముతోడ సాతని, సూతునిఁ బడవైచి హరుల స్రుక్కించి కపి
వ్రాతము తన్గొనియాడ వి,భీతకమున యాతుధానుఁ బ్రిదులఁగ నేయన్. 321

చ. విపతితసూతకేతనుఁడు వీతరథాశ్వుఁడు నయ్యుఁ బావనిం
గుపితమనస్కుఁడై గదల ఘోరశరంబుల నొంచి యార్వ న
క్కపికులశేఖరుండు పరిఘాయితదోర్యుగళుండు దానవుం
గృప యొకయింత లేక నొకమహీధరకూటము వైచెఁ బిండిగన్. 322

క. ధూమ్రాక్షిభయదుఁ డగున,ద్ధూమ్రాక్షుం బిండిచేసి తోడరినకినుకం
దామ్రాక్షుండై దనుజుల, సామ్రమణిశోణీరుహముల హత మొనరించెన్. 323

క. తెంపున ధూమ్రాక్షు బలముఁ, జంపెడు నద్రిచరనాథు సైరింపక ని
ష్కంపితవర్తనుఁ డగుచుఁ బ్రకంపనసుతుమీఁద నయ్యకంపనుఁ డడరెన్. 328

మ. అమరాకంపనుఁ డయ్యకంపనుఁడు ధూమ్రాక్షాంతకుం జుట్టుము
ట్టి మహాకార్ముక మెక్కువెట్టి శరవృష్టిన్ముంప మున్నీతిచే
సమరారంభము మానియున్న యసురుల్సంరంభులై వానరో
త్తమసేనం దొడర న్విరుద్ధమగు యుద్ధం బయ్యె నప్పట్టునన్. 325

క. అప్పుడుపదాతిపదాహతి, విపులధరారేణువులు రవిప్రభ నాఁగం
గపులుం దైత్యులు సమ్మ,ర్దపుఁ గయ్య మొనర్చి రద్భుతస్థితి వెలయన్. 326

క. బలుఁలగు నకంపనమహా, బలసుతులబలమున దైత్యబలకపిఁ బలము
ల్బలువిడి దుర మొనరించెం, బలలమునకుఁ బోరు డేగపదువులు వోలెన్.

వ. తదనంతరంబున నుభయసేనాస్రస్రావితరక్తధారాచ్ఛటాపరిషిక్తంబై సర్వాసర్వం
సహారజోంధకారం బడంగుటయు నక్కపిబలంబు.

సీ. కుంభంబుల మదేభకుంభంబులు వగిల్చి కుంభులఁ గుంభులఁ గూలనేసి
యశ్వకర్ణములచే నశ్వకర్ణము లూడ్చి నశ్వాలి నశ్వత్థహతి వధించి
యక్షుంబుల భయంకరాక్షుంబుల విదిర్చి లలిరథంబుల రథంబులను నుల్చి
స్కంధము లక్కక్క శస్కంధంబుల నగిల్చి వీరతరులఘోరవీరతరుల

నలఁపి వైజయంతికల వైజయంతికా, పాతుల నవనిఁ గూల్చి యసురసైన్య
మాకులమున మిగులఁ జీకాకువడఁజేసి, యమితవిక్రమమున నడరుచుండు.

క. నిజసైన్యము ప్లవగులచే, గజిబిజి యగుటెల్లఁ గని యకంపనధూమ
ధ్వజ మస్త్రశిఖల నహిత, వ్రజవన్యావృత్తి మగుడు నవార్యస్ఫురణన్. 329

చ. ఘననిభుఁ డాంజనేయుఁ డురుకాయుఁ డకంపను దేరి కడ్డముం
జని తదుదగ్రశాతశరజర్జరితాంగుల సంగదాముల
న్వెనుకకుఁ ద్రోచి వాలమున వేసిన దానవుఁ డొల్లఁబోక యా
తనిపయి నేసెఁ గ్రూరనిశితప్రదరంబు లనేకసంఖ్యలన్. 330

ఉ. వేసిన వాయుపుత్త్రుఁడు పవిత్రుఁడు కొండరథంబు గుండగాఁ
జేసిన నొండుతేరి కతిశీఘ్రగతిం బఱతేర నాఖిలుం
డాసి నరాదను ల్పడిపడం గుధరాహతిఁ గాలగోచరుం
జేసి నభంబు నిండికొన సింహరవం బొనరించె మించఁగన్. 331

క. ఆ వ్యాహతబలుఁ డపరిమి,తవ్యూహప్రరచనాతిదక్షుఁ డసురసం
భావ్యచరిత్రుఁ డమిత్రమ,నోవ్యాధినిభుం డకంపనుఁడు మృతిఁబొందెన్. 332

క. శోకవ్యాకులమున్ హా, హాకారము నైన దానవానీకము ను
ద్రేకంబునఁ బురికొల్పి యు,పాకాయుం డాహవమున కాయిత మయ్యెన్. 333

క. అంగదముఖ్యులు వానిప, యిఁగవిసిన సైన్య ముత్సహించి యసురసే
నాంగముల రూపుమాపఁ దొ,డంగిన దనుజుండు ధనువు టంకృతి మెఱయన్. 334

చ. కపులఁ గదంబవృష్టిమునుఁగన్ దనుజాధముఁ డేయ నేయ న
క్కపులుఁ గదంబవృష్టిమునుఁగన్ దనుబాధను సేయ మాయచే
విపులరణంబొనర్చి మును విచ్చినసైన్యముఁ గ్రమ్మఱింప న
క్కపులకు దైత్యనాథులకుఁ గయ్యము చయ్యన నయ్యె నయ్యెడన్. 335

క. ముక్కులముక్కలుఁ బక్కలు,రక్కలుఁ గిక్కిఱిసి పడిన వదనరదనముల్
చెక్కులచెక్కలు నక్కడ, నక్కడ నక్కజ మొనర్చె నక్కదనమునన్. 336

క. కుంభితశక్రము లగుచుం, గుంభులచే మత్తకుంభికుంభయు లలితం
గుంభములయట్లు పగిలిచి, కుంభినిఁ గప్పి రపుడేనుఁగులపీనుఁగులన్. 337

వ. ఇట్లు వనచరబలంబు లురవడించుటయు.

సీ. బంధురకంధరగంధసింధురములు బలువైనకొండలచెలువు గాఁగ
ధారామనోజ్ఞగాంధారాశ్వజాలము లావైనతరగల పోల్కి గాఁగ

జృంభన్మహాధ్వజస్తంభోద్ధరథములు తీరైననావలతెఱఁగు గాఁగ
తతదారుణవిహారదానవాకారము లుగ్రమనీషజలజంతు కరణి గాఁగఁ
గావిపెత్తురు బడబాగ్ని కరణి గాఁగ, నసురచతురంగసేనామహాంబురాశి
మార్గణమహోగ్రవ్యాప్తి మట్టుమీఱి, వానరద్వీపము మ్రాపవచ్చునంత. 338

చ. చెలియలికట్టుభంగిఁ గపిశేఖరుఁ డంగదుఁ డాత్మయోధుల
గ్గల మగుశాత్రవాబ్ధి మునుఁగం బడనీక సముద్ధరించి ని
శ్చలధృతిఁ దచ్ఛరంబుల కసాధ్యతనుం డయిపోరె వానరా
వలిఁ గడుమేటి యీతఁ డని వారక యెల్లరుఁ దన్ను మెచ్చఁగన్. 339

వ. ఇవ్విధంబున మహాకాయుసైన్యంబు దైన్యంబు నొందించుచు. 340

గీ. ప్రకటగతి డాసి చక్రరక్షకుల నేసి, సూతుతోడ రథ్యంబుల స్రుక్కఁజేసి
యమ్మహాకాయుఘోరకాయమ్ము మహార్య, హతి నలఁగనేసి చెలరేఁగి యార్చుటయును.

ఉ. మత్తశిఖండినీధ్వజసమంచితదివ్యరథంబు సూతుఁ డా
యత్తము చేసి వేఱ యొకఁ డప్పుడు దేకొనితేర నెక్కియు
ద్వృత్తి బలంబులం బ్లవగవీరులపైఁ గవియించి యార్చుచుం
గుత్తుకబంటి నెత్తురులు గ్రోలుచుఁ బోరిరి రాక్షసాధముల్. 342

వ. అట్టి సంకులసమరంబున. 343

క. పృథుఁడు గవాక్షుఁడు నిరువురుఁ, బృథుతర మగురణ మొనర్చి పృథివిఁ గలిపిరా
రుధిరాశు వజ్రనాభు, న్నుధిరాశున్ ఘోరపటుతరప్రవిహతులన్. 344

వ. పృథుగవాక్షులు వజ్రనాభరుధిరాశుల విగతాసులఁ గావించుట సహింపక. 345

సీ. కాలదంష్ట్రుఁడు మహాకాలదంష్ట్రాకరాళాస్త్రంబు లేయుచు నఖిలసైన్య
మెల్ల భీతిల్లఁగ నేతెంచుటయు వృషభుండు వానరవృషభుండు వాని
బాణంబులెల్లను బాణంబుల మరల్చి సింహనాదము దిశాసింధురముల
కర్ణరంధ్రంబులఁ గడలుకొనఁగఁ జేసి యాత్మయోధులకప్పు డధికహర్ష
మావహింప నొకయుహార్యకూటంబున, దనుజవ్రేయ నతఁడు దానిఁ దుమురు
సేయుటయును దడవు సేయక వానియేపు, మంగుకొమ్ములను దుమురుఁగ నేసి. 346

వ. ఐరావతకులసంభవంబును బర్వతనిభంబు నగు నిభదంతపాటనంబుఁ బాటవంబున
నాచరించుటయు దనుజసైన్యంబుల హాహాకారంబు లెసంగె నంత నక్కాల
దంష్ట్రిండు. 347

క. ద్విరదం బరద మగుడు నొక, యరదమునకుఁ బోవఁ దలఁచనపు డరుదుగ వా
నరుఁడు గిరి వైవఁ గపులు, బ్బిరి యతఁ డేసుంగుతోడఁ బీనుంగయ్యెన్. 348

చ. పనసుఁడు కాలకల్పుని ప్రఘాసుఁ గజుండును దాఁకి వీఁక బ
ల్వనసమహీరుహంబులఁ బలాశకుటుంబులు వైచి యుర్వరం
దునిమి నిశాటసైన్యములఁ దోలిన దుర్భరవిక్రమంబునన్
ఘనగతి దుర్ధరుండు సగగన్నిజయోధుల నూలుకొల్పుచున్. 349

గీ. నడచి యతఁడేయు క్రూరబాణముల నెల్లఁ, బుష్పములు వోలె మేఘపుష్పుఁడు సరకు
గొనక కడకాళ్ళ వట్టి యద్దనుజువాత, నెత్తు రురులంగ మోఁదికి నెత్తివైచె. 350

క. దుర్ధరుఁడు సారఘోరరథ, దుర్ధరుఁ డిట్టిట్టు లనుచుఁ గనుంగొని ధూమ్రుం
డర్ధేందుబాణజాలస, మర్థుఁడు తీవ్రగతిఁ గ్రోధనాఖ్యుం దాఁకెన్. 351

క. క్రోధనుఁడున్ ధూమ్రుఁడు స, క్రోధనులై వానరాసురులు మెచ్చఁగ నా
యోధన మతిదీర్ఘమ్ముగ, క్రోధనగాజిహ్మగముల రూఢప్రౌఢిన్. 352

క. పెద్దతడ వాచరింపఁగ, నద్దనుజాధీశువతు మవియఁ బిడికిటన్
గ్రద్దన గ్రుద్దిన నాతఁడుఁ, బెద్దనిదుర వోయెఁ గడుఁ గపివ్రజమార్వన్. 353

క. శతముఖుని జంభుఁడున్బలె, శతశరశతములఁ దొలంగఁ జేయుచుఁ గడిమిన్
శతమాయుఁడు శతమాయుఁడు, శతబలి నాభీలసింహశతబలిఁ దాఁకెన్. 354

సీ. ఒకమాఱు శూలియై యుగ్రమూర్తి వహించు వహియించి నిజదృష్టివహ్నిఁ జిలుకు
నొక్కమాఱచలుఁడై యుత్తుంగగతిఁ దోఁచుఁ దోఁచి పాషాణముల్వ్రేచి యార్చు
నొకమాఱు జిష్ణుఁడై యురుబలాంతకుఁ డగు నయి శాస్త్రవాగముల్ వాఱ మొనర్చు
నొకమాఱు ఘనరేఖ నుడువీథిఁ బఱతెంచుఁ బఱతెంచి శరవృష్టిపరఁగఁ జేయు
గంధవహుఁ డయి యొకమాఱు గానరాక, యుండు నట్టుండి కఱకుదుమ్మౌళి విసరు
శాస్త్రవాంబునిధి గలంగ శతసహస్ర, మాయుఁ డనఁ బాయుఁ డగు శతమాయుఁ డిట్లు.

క. బలిముఖచమూసమూహం, బలమిఖనగకోటి నెల్ల నచ్చెరువఱుపన్
బలిమి వెలయ నప్పుడు శత, బలి మిగులం గోపమెత్తి పార్థివు లలరన్. 356

మ. కృపయొక్కింతయు లేక పాదపమహావృష్టిన్మహాకాయుమం
త్రిపయి న్వానరుఁ డాగ్రహించుట యునై తేయాధముం డుగ్రగం
ధపరీతాత్ముఁడు దైత్యయక్షసురగంధర్వాళి భీతిల్లఁగా
విపరీతస్థితి ఘోరమార్గణములన్ వ్రేసెన్మహాక్రోధుఁడై. 357

వ. ఏసిన వియదంతరంబు నిండ నార్చుటయుఁ జలింపక. 358

క. సారథిశతబలి దానవు, సారథి వేయుంట యుఁ దళితసారథికమున
తేరురణక్షోణికిఁ గదు, దూరముగా రథ్యవితతి దోలఁగఁగ నిడ్చెన్. 359

చ. శతబలిసింహనాదము దిశాముఖము ల్వగులంగఁ జేయ దు
ర్మతి యను గాధముండు శతమాయుఁడు సైంపక యొండు సూతునిన్
ద్రుతగతిఁ దోడ్కొనర్చికొని తోఁచి వనాటుల నేర్చుచు న్మహో
ద్ధతి మెఱసెన్ దృఢోద్ధతి రథంబని యుంచెఁ గపీంద్రుఁ డుగ్రుఁడై. 360

క. శతకాయుఁడు, శతమాయుఁడు, గతమాయుఁడు వానరప్రకటనిగళశతాం
గత నొందియు వెతనొందక, జతనంబున దురము నెఱపు పనుపున నోలిన్. 361

ఉ. ఆయతరోమరక్తభయదాక్షియుగుండు కపిప్రభుండు శా
ఖాయుత ఘోరసాలమునఁ గంతము వ్రేయుముఁ బాలనొచ్చివై
హాయసవృత్తిఁ దర్పదనుజాధముఁ దోఁకబిగించి చావఁబా
మ్మాయని కూలనేసె శతమాయుని మాయలు మాయమందఁగన్. 362

గీ. ఇవ్విధంబున శతమాయు గ్రొవ్వు చెఱచి, సుస్థిరత మించు శతబలిఁ జూడ వెఱచి
దైత్యబలము పలాయనతత్పరత్వ, మగుటఁ గాంచి మహాకాయుఁ డాగ్రహించి. 363

క. ఘనరథముఁ గపిబలముపైఁ, జననిమ్మని పలుకుటయును సారథి సరయు
మ్మున్నఁ దేరు వోవనిచ్చినఁ, గనుఁగొని దనుజాధములు సగర్వస్ఫూర్తిన్. 364

క. నాదము దివినిండ మహా, నాదముఖాసురులు బలసి నవఘన గపుల
న్నాదగు శరములఁ గూల్చున, నాదరము నొప్పంగ నని మహాకాయుఁ డనిన్. 365

చ. ప్రదరముల న్వనౌకసుల బ్రద్దలు సేయుచు నన్యహృద్వ్యథ
ప్రదరవముల్చెలంగ సుర వజ్రమడ్డము వచ్చె సేనయుం
బ్రదర బొనర్తునంచు వలపావని ముఖ్యుల దేహయష్టిక
ల్పదరము లొందఁజేయుచు న్పశూలుర పైఁ బడ నప్పళించు మన్. 366

క. నభము విఱిగి పడుభంగి, న్నభశ్చరులు వెఱఁగుపడ ఘనప్రదరముల
న్రభసం బుద్రేకముగా, సభయాకృతి దుర మొనర్చు సందడిలోనన్. 367

క. పొడుకొని మహాకాయుని, సోదరుఁడును రక్తపటురసోదరుఁడు మహా
నాదము దివినిండ మహా, నాదుఁడు నతిభీమ్మతరరణం బొనరించెన్. 368

క. అట్లన్నదమ్ము లిరువురు, గట్లపగిదిఁ జెట్లపగిదిఁ గసిమసఁగిన స
మ్మెట్లనఁగ శిలలు గట్లుం, జెట్లు విసరి కపులు రణము సేయుచు నున్నన్. 369

క. దేవాసురసంగ్రామము నా, వెక్కసమగు మహారణం బయ్యెఁ గరు
ల్దీవులుగా నురురథములు, నావలుగా నొప్పె రక్తనదులు భయదమై. 370

క. దందడి నుభయబలంబులు, సందడికయ్యం బొనర్ప సాగిన రుధిరా
నందడిసీ యుద్ధరంగము, బెందడియై యొప్పెఁ గరులు భీతిల్లంగన్. 371

సీ. కరిఘటాకుంభము ల్కడవలపోలిక బహువిధంబులుగాఁగఁ బగులునెడలఁ
బృథుహయరింఛోళి పిండిచందంబునఁ దళముగానందందుఁ దొరుగునెడల
నసురకరంబులు హస్తంబులట్టులు పటుసాంద్రగతిఁ దెగిపడినయెడల
ఘనరథాంగములు చక్రమ్ములరీతిగా మొనసిరక్తనదుల మునుఁగునెడల
నతినిశితకంకపత్రమ్ము లాకులట్లు, వాలవాతూలవినిహతిఁ దూలునెడల
నయ్యెఁ దపనసుతాదు లహంకరించి, మించువేడుకఁ బోరొనరించునెడల. 371

క. సంగరదార్ఢ్యమున మహా, సంగరమొనరించుకపుల సమయించుదురా
శం గరవాలముఁ బూని వె,సం గరములు ద్రిప్పుచు న్నిశాచరులలరన్. 372

వ. మహానాదుండు భుజబలాంగదు సంగదుం దలపడుటయును నతండు.

క. కరవాలమూడిపడ భీ, కరవాలము ద్రిప్పివైచి క్రవ్యాదనభా
సురసాలంకృతదేహము, సురసాలంబేసి డాసి చూర్ణముచేసెన్.

క. అనుజుమహానాదుం జం, పినవాలికుమారురోషభీషణుఁడగుచు
న్మొనసి మహాకాయుం డా,తనిపై నిగిడిచె సుతీక్ష్ణతరసాయకముల్. 373

చ. నినిచినవర్షధారల విశిశ్చలతం దనరారు నద్రిచా
ద్పునను దదుగ్రశాతశరముల్ విపినాటుఁడు లెక్కసేయ కా
తనిపయిఁ గింశుకంబులఁ గదంబములు న్నిగిడింప నాతఁడుం
దునుకలు సేసి తోన పదితోమరము ల్దొరగించి యార్చుచున్. 374

క. పదితోమరములు లీలా,స్పదుఁడై తను దాఁకకుండఁ బట్టి విఱిచి యం
గదుఁడు గదావినిహతికిం, గదలక శిలవైచి సూతుకంఠముఁ దునిమెన్. 375

ఉ. సూతుం గంఠము ద్రుంచి యాత్మునమరక్షోధ్యక్షు నీక్షించి ఖ
ద్యోతుం డుగ్రముగాఁగ బిట్టడరి ఖద్యోతంబుఁ బట్టం బ్రభా
తీతుండై చనునట్లు వానిపయి నుద్వృత్తిన్వడిన్ దాఁటి వి
ఖ్యాతుం డంగదుఁ డాహవోద్ధతు మహాకాయు న్మహాకాయునిన్. 376

క. పట్టుకొని యిట్టునట్టు, న్నిట్టిపడఁగనీకఁ గాలమెట్టిపుడమిపై
బిట్టువిసరి కడురుధిరం, బుట్టిపడన్మట్టిచంపె నుద్ధతిమెఱయన్. 377

మ. బలుమా న్నక్రుఁడు చంపుచందమున నప్పాపాత్ము నారూఢని
శ్చలుఁ డారీతి వధించి రథ్యముల నాశ్చర్యంబుగాఁ గూల్చి ది
క్కులు భేదిల్లెడు సింహనాద మసురక్షోభంబు గావింప ను
జ్జ్వలుఁడై తేజరిల్లెన్ హిమాలయము స్వేచ్ఛన్ డిగ్గుసింహాకృతిన్.

వ. ఇవ్విధంబున దక్షిణద్వారంబు వెలువడి వచ్చిన మహాకాయు దక్షిణదిగ్ద్వారంబుఁ
జేరం బుచ్చి నిజసైనికులం గలసికొని సముల్లాసంబున వారునుం దానును రాక్షస
సంహారంబునం దనివిసని రామచంద్రు చరణారవిందసందర్శనంబు గావించుటయు
నమ్మహాత్ముఁడు మహానందంబునొంది పురందరనందన నందనుం గనుంగొని. 378

క. ఏయెడల మహాకాయుఁడ, జేయుఁడని విభీషణుఁడు వచించుచునుండు
న్నాయెదురన్టివాని నుపాయంబునఁ జంపితెట్లు ప్రస్తుతిచేయఁగన్. 379

సీ. అని పల్కి మఱియు నయ్యంగదు బిగియారఁ గౌఁగిటఁ గదియించి కపులనెల్ల
సంభావనముసేయ సంతోషమునఁ దేలి సింహనాదంబులు సేసిరంత
హతశేషులెల్ల దశాస్యునిపాలికిఁ జని మహాకాయుని చావుఁ జెప్ప
నతఁడు ప్రాణ్వడి తనయాప్తగుణంబులు తలపోసితలపోసి తల్లడిల్లి
యుచితభంగి మంత్రులూఱడింపఁగఁ దల, యెత్తి దిశలు చూచియింతయాప్తు
లైనవారితోడఁ దనైన భాషింపక, యుండియుండి యుల్ల ముడుకుచుండ. 380

శా. సేనానాథుఁ బ్రహస్తుఁ గన్గొని కటాక్షింపం దలంతేని మ
ద్దీనానాథచమూసమూహమతిభీతిం బోకయుండెం గృపా
నూనత్వంబున దీనిఁ జేకొని యజేయుండీ ప్రహస్తుండు నాఁ
గానొప్పారి నప్లవంగశిరముల్ ఖండించిరాఁ బోవనా. 381

ఉ. అనవుడు నాతఁడిట్లను దశానన యేఁగలుగ న్విచారభా
జనతఁ గృశించు టర్హమె నిశాచరజాతులు సంతసింపఁగాఁ
జని కపిచారుల న్విపినచారులఁ జంపక యోహటించి ని
న్గనఁగొన వెండి శత్రునె సగర్వుఁ బ్రహస్తుని నీవెఱుంగవే. 382

వ. అని బరవసంబు దోఁప నాడి యప్పుడు. 383

క. అధికాశ్వికనైస్త్రింశిక, పథికప్రాసికసుహస్తిపకశాక్తికస
ద్రథికోగ్రయాష్టికవర, ధ్వజికులు దనుఁ గొలిచిరా నవార్యస్ఫురణన్. 384

క. క్రందన మురరత్తుల్స్రా, క్రందనముం బెల్లురేఁగి గగన వద్రువ సం
క్రందనభయద మగుమహా, స్యందనుఁడై వెడలె నాప్రహస్తుఁడు కడిమిన్. 375

క. రణకాంక్షన్ శ్రవణవిదా, రణకారణభీమవిజయరణము మెఱయ దా
రుణగుణగణచణుఁడరయ, గ్గణుఁడ ప్రహస్తుఁడు తూర్పువని వెడలఁగన్. 376

సీ. అమితప్రకారతూర్యము లవధ్వనులయి మ్రోగు నెవ్వరఁ దమ మట్టుకుండఁ
బడుసిడంబులు ధరాభాగంబుపైఁ గూలి విస్తారముగ గాలి వీవకుండ

నుత్తమాశ్వంబుల కొల్కాడు కన్నీరులురగణంబున శ్రమనొందకుండ
మొనసి ప్రత్యాసారములను రక్తాసారములు గల్గు మేఘముల్ని లువకుండ
బూకరించుచు నెదిరి వాపోవుచుండఁ, జెలఁగి వంచకములు భీతిఁ జెందకుండ
సైన్యమునను బ్బుమిఁ అంగ సంచరించు, మృత్యుదేవ్యాదులును దన్ను నెఱుఁగకుండ.

క. అట్టిమహోత్పాతంబులు, పుట్టిన దానవులు వెఱపుఁబొందక చలమున్
బట్టి పటు తెంచుటయుఁ గని పెట్టికపులు ససమరోషభీషణులగుచున్. 388

వ. వృక్షపాషాణపాణులై సమరసన్నాహసముత్సాహంబునం బొలిచినిలిచి రట్టియెడ న
పూర్వసముద్రంబుల చందంబున నుభయబలంబులు నొండొంటిం దలపడి ఘోరంబు
గాఁ బోరం దొడంగుటయు. 389

క. పడువారలు మిగులం జే, ద్పడువారలు హితుల కడ్డపడువారలు ప్రా
ణ్పడువారలు ననమునఁ దల, పడువారలునగుచు దురము భయదం బయ్యెన్.

సీ. తఱచుగా నెగసిన ధరణీపరాగంబు కడుచిత్రమగు మేలుకట్టు గాఁగఁ
గడునడి నుడుగక వెడలెడు కీలాల మతివోద్యమగు కలయంపిగాఁగ
గాళులు దెగిపడఁ గదల సైరకయున్న వార లెల్లను దలవరులు గాఁగ
బలువురొక్కనిఁ జలపట్టివధించుట తులువలశిక్షించు చెలువుగాఁగ
స్యందనంబులు ఫలమహీజములు గాఁగఁ, దగినహయములు వినోదపాత్రములు గాఁగ
నొప్పుగాం చెసమిద్భాగ జ్వలత్ప్ర, భావిభాసితమగు సమిద్భాగ మనఁగ. 391

వ. అట్టి దారుణవ్యవసాయంబునఁ గింశుకసంగతం బగు దానవసేనాసస్యంబు రక్తజలా
భిషేకంబునఁ బెచ్చు పెరిఁగి వానరవాలవాతూలంబునం బడల్పడం జొచ్చెనంత.392

ఉ. అంతకదండదారుణుఁడు ప్రహస్తుఁడు చాపము నెక్కువెట్టి కా
లాంతకరాశి విగ్రహ విహార వినోదనిబద్ధచిత్తకా
లాంతకశూలసన్నిభము మార్గణజాల పినద్ధదిఙ్ముఖా
త్యంత మతూహలుండు ప్లవగావలి నుద్ధతిఁ జుట్టుముట్టెన్. 393

చ. పులిఁ గనుఁగొన్న లేళ్లగమి పోల్కిఁ బ్లవంగము లార్తనాదులై
నలుగడఁ బాఱఁ జొచ్చిన వనాటశిఖామణి నీలుఁ డేఁచి యేఁ
గలుగఁ దలంకనేల యని క్రమ్మఱ సైన్యముఁ గ్రమ్మఱించి ని
శ్చలధృతి వానిరథ్యరథసారథులం బడ నేసె నంతటన్ 394

మ. బహుశాస్త్రాగ్నుల జంటమంటలు కడుం బర్వ న్విజృంభించి గుం
భహనుం దద్దణిం బెనఁగుటయు నప్పాపాత్ము నాభీలుడై

త్యహితుం దారుఁ డుదారుఁడై కలిసి శౌర్యస్ఫూర్తి సంధిల్ల భ
గ్నహనుం జేసి వధించె నాతఁడమ రక్షశ్శ్రేణి భీతిల్లఁగన్. 395

ఉ. తద్విజయంబుఁ గాంచి పరితాపము నొంది నరాంతకుండు మా
ద్యద్విరదాకృతిం బ్రబలి యద్రిచరావలి యార్తి నొందఁగా
నుద్వృతాస్యవృత్తి మెయినుండఁ గరంబుఁ జలంబుమీఱఁగా
నద్వివిదుండు సింహక్రియ న్నలిరేఁగి వధించె గోరులన్. 396

వ. తత్సమయంబున. 397

క. నాదసమున్నతుల మహా,నాదసమున్నతుల విధితనయదుర్ముఖులు
న్మాదహరిముఖులఁ గూల్చిరి, భూదేవికి బలియొసఁగు పోలికిగాఁగన్. 398

క. బలియురు నలువురు నిజమంత్రులు పొలియుటఁ జూచి శోకరోషసమగ్రా
కులచిత్తుఁ డా ప్రహస్తుఁడు, కలనువలను జూచి మిగుల గర్వమెలర్పన్. 399

ఉ. అన్యధనుర్గ్రలామము మహారథముం గొని వచ్చి వైన్యనీ
కిన్యధినాథు నీలుఁ బ్రతికృష్టమనస్కత నొవ్వనేసి రా
జన్యునిమీఁదికిం గడు వెసం జనఁజూచిన వాని వాఁగి కా
తిన్యశిలాహతిం బలువిడి న్రథవాజులఁ గూల్చెఁ గ్రమ్మఱన్. 400

క. రథము విరథముగుడు న్సారథి యొండొకరథము సత్వరంబునఁ గొని రా
నధికమతి నధిష్ఠించి స్వమధికాస్త్రము లేయఁ బ్రధన మక్కజమయ్యెన్. 401

వ. అట్టియెడఁ బ్రహస్తుండు. 402

క. ఆఁకలిగొనినపులియునుఁగఁ, గేక లిడుచు నీల దీనఁ గెడసితనుచు న
మ్మూఁక లిరుదెసల నొదుఁగఁగ, రోఁకలి విసరెన్ సమగ్రరోషుం డగుచున్. 403

క. అసమున వెస విసరిన యమ్ముసలము పసఁ బట్టి కొనియమోఘము దీన
న్నసమబలు మని కసరుచు బస్వసమున నసమగతి విసరె వసుమతి యదరన్. 404

ఉ. వైచిన నష్టబాణముల వాఁ డది చూర్ణము చేసి డాయఁగాఁ
జూచి నగాటుఁడుం గదనసుస్థిరుఁడై గిరిఁ గేలఁబట్టి వె
ల్లెచినకిన్క నాతనిపయి న్నిగిడించిన విల్లు నమ్ములున్ 405
వైచి మహాద్భుతం బగురవంబున నేడ్చుచుఁ జచ్చెఁ జచ్చినన్

క. బలిముఖులు సింహనాదంబులు సేయుచు సంతసమునఁ బొదలి నిలిచిరా
కులమానసులై హతశేషులు దోషాచరులు లంకఁ జొచ్చిరి భీతిన్. 406

వ. చొచ్చి మాతులమరణప్రకారం బెఱిఁగించుటయు రావణుం డదరిపడి ప్రహస్తుం
జేర్కొని విలాపంబు గావించి యెట్టకేలకు ధైర్యం బవలంబించి యంతర్గతంబున.

క. దనుజు లనుజహితబాంధవ, తనుజులతో నేగి మడిసెదరు వానరుల
నృనుజుల జయింపలేకే, మనుజను విధికృతము లెందు మానక చెందున్. 408

ఉ. కావునఁ జింత నొందఁ బనిగాదిఁక నేన కడంగి యాప్లవం
గావలిఁ ద్రుంతు నందు భయగామివకేళికి నుత్సహింపఁ ద
ద్భావ మెఱింగి యయ్యెడకు వచ్చె సువర్ణసుగాత్రి శారదాం
భోవిశదాబ్జనేత్ర మయపుత్రి చరన్మణిఘంటికాగతిన్. 409

వ. పరిచారికాశతసహస్ర పరివృతయై మందోదరి మందమందయానంబునం జనుదెంచి.

క. అంతఃపురిఁ జింతాక్రాంతాంతఃకరణధృతి రావణాంఘ్ర్యమలసరో
జాంతఃకలితశిరయగుచు, నంతఃపుర మిట్టులనియె నతనికి నిభృతిన్. 411

తే. చెలఁగి మున్ను ట్టినీట తా మ్నిలిపినపుడ, కపులు దేవత లగుట నిక్కము తలంప
నట్టివారలఁ బనులకుఁ బెట్టినపుడ, దేవదేవుఁడు ఖరవైరి దివిజవైరి. 412

వ. కావున నమ్మహామహుతోడి విగ్రహం బెన్నఁగాని లగ్గు గాదని పలికి వెండియు 413

క. ఇంతకు మున్నుఁ బ్రహస్తుఁ డనంతభుజావిక్రముఁడు మహాకాయుఁడు కా
లాంతము నొంది రకంపనుఁ, డెంతటివాఁ డట్టివాఁడు మృతుఁ డయ్యెఁ గదా. 414

క. కపులఁ బోలియింతు మని చని, కుపాచరులు కపులచేత సమసెదరు మహా
విపరీత మట్లు గావున, నృపగత బుద్ధియు చెడును వాగ్రహావృత్తిన్. 415

చ. మిగిలినవారిఁ జంపక యమేయ బలాఢ్యుఁ గృపావిభూషు స
త్త్వగుణగరిష్ఠు సర్వజనవందితు నాశ్రితవత్సలుం గళా
ధికతు విశేషమూర్తి తితిక్షు ముముక్షు జనానుకూలు రా
ముఁగనుము సీత నిచ్చి కులము స్థలము న్నిలుపం దలంచినన్. 416

శా. సీత న్వాసుక తప్తకాంచన రుచి స్ఫీత న్సమర్పించి భూ
జాతం దెచ్చిన తప్పు సైఁపుము నమస్కారంబు నీకంచు భూ
నేతం బ్రార్థన చేసి వానరులను న్మైత్రత్వముం జూపినన్
భ్రాతం జూచినయట్లు చూచుఁ జనుమీ రాముం బ్రసేవింపఁగన్. 417

చ. అతిబలుఁ డెత్తి పైవిడిసినప్పుడు సంధి యొనర్తుగాని యు
ద్ధతిఁ దొడరం దలంతు వెనయానయవేది విభీషణుండు మా
న్యతముఁడు దీర్ఘదర్శి మతిఁ దాఁటి నిన్నుఁ దొఱంగి మానవ
ప్రతిముఁడ డయోని ధీరమతి రాఘవునిన్ శరణంబు వేఁడునే. 418

క. అను నప్పలుకులు వెడ వెడ, విని మానవుఁ గొలిచి కిటువు వీడి ప్రమదకం
బెను రాఘుచేత సమరఁబుఁ గూలుట యొప్పసేయ ముదితా నారన్. 419

క. మద్ధితకర యుష్మద్వాక్పద్ధతి వినకున్నఁ గీడు వాటిలు నైనన్
యుద్ధము వలదని యిట్లు విరుద్ధపుబుద్ధు లిపుడేల రోషము పెరుఁగన్. 420

క. జయ మొసఁగన్ రిపులఁ బరాజయముం గావించు రాక్షసప్రవరునకుం
బ్రియ నీవాక్యములు మనఃప్రియములు గా వెల్లభంగిఁ బృథులాజి యగున్. 421

క. అతివాద మేల వగవక, యతివా యంతఃపురమున కతికాయపుర
స్కృతవై చను మనుటయు నయ, సుత మందోదరియుఁ జనియె శోకముగదురన్.

వ. అంత రావణుండు. 423

క. లయకాలకరాళయమా,లయసదృశాంచద్ధ్వజోగ్రలపనము లలరన్
రయమహితపిశాచాస్యన, హయములఁ బూంచిన రథంబు నధిరోహించెన్. 424

వ. అనేకవిధబాణబాణాసనవర్మకలితంబును జయధ్వజవిరాజితంబును గోటిద్వయఘంటాకోటిప్రకాశితంబును నగు రథంబున. 425

శా. శంకాతంక మొకింతలేక యసురోత్సాహంబు మీఱన్ ధను
ష్టంకారంబు విహాయసంబు బధియ నిండఁ జంద్రహాసంబు వీ
రాంకంబు దీప్తము వేడ్కనూని పటుశౌర్యస్ఫూర్తి రక్షఃకులా
లంకారుం డగు రావణుండు వెడలెన్ లంకోత్తరద్వారమున్. 426

వ. ఇవ్విధంబున యమకింకరసదృశనిశాచరధ్వజినీపరివృతుం డై వెడలుటయుం గనుంగొని.

క. చాపకళానిపుణుఁ డసమ,చాపుఁడు ఘోరప్రతాపసంయుతుఁడు మహా
కోపారుణితాక్షుం డై, యూపాక్షుఁడు వెడలె రణజయోన్నతి వెలయన్. 428

క. కుంభిఘటాపరివృతుఁ డై, కుంభిని గ్రక్కదల శౌర్యసంభితుఁ డగుచున్
జంభాంతకభయదుఁ డగు నికుంభుఁడు కుంభీనసోగ్రకోపుఁడు వెడలెన్. 429

సీ. నరసురఖచరకిన్నరయక్షతతులకు నెత్తిపిడుగు శక్రజిత్తుఁ డొకఁడుఁ
బూరుమరక్తసంపూరితోగ్రపిచండకుం డగు దేవాంతకుం డొకండు
నఖిలజంతుగ్రసనాసక్తహృదయభీకరుఁ డగునమ్మహోదరుఁ డొకండుఁ
బరిపంథిచిత్తనిర్బంధకృత్ప్రవరనికాయుఁ డా నయ్యతికాయుఁ డొకఁడు
మఱియుఁ ద్రిశిరాదినుతులు లురుమత్తమతులు, వెడలి యొక్కట దనతోడ నడువ నడరి
దవహుతాశనుకైవడి దశముఖుండు, కవిసె వానరవాహినీకాననంబు. 430

క. దుష్కృతనములకు వెఱవక, దుశ్శీలుఁడు రావణుండు దోడిఁబడఁ గపుల
న్నిశ్శంక బిట్టు గవిసి ధనుశ్శిఖి నొకపెట్ట నగ్గునూచము సేసెన్. 431

క. ఈవిధమునఁ గపివాహిని, చేవసెడ మహారణంబు చేసెడువానిన్
రావణుఁడగా విభీషణుఁ,డేఁగని రాఘవుకు విండ్లు చేఁబూని చెప్పెన్. 422

వ. సమరసన్నాహంబునం బొలిచి నిలిచి రంతక మున్న. 433

క. సుగ్రీవుండు సముదగ్రసమాగ్రహుండై యుద్ధవిడి మహాగ్రావము న
త్యుగ్రగతి వైచుటయు నం, బంక్తిగ్రీవుండు తుమురు సేసి కినుక నెలర్పన్. 434

క. పదిచండకాండములం దొ,మ్మిదిశితసాయకము లొక్క మేటియులుగుము
న్మదవృత్తి నైన నయ్యిరు,వదిశరములు వాలనిహతి వ్రక్కలుసేయన్. 435

చ. రవిసుతు పెన్నురంబునశరంబు రయంబున దృష్టిముష్టి సౌ
ష్ఠవమున నాటనేసి వివశత్వము నొందిన యాప్లవంగపుం
గవుఁ గని రోషశోకములు గ్రమ్మఁగఁ దన్నెదిరించువానర
ప్రవరుల లెక్కసేయక నృపాలకులం దొడరం దలంచుచున్. 436

చ. మలఁగనికోపవేగమున మారుతిపైఁ దొరఁగించు మ్రాఁకులా
ములగతిఁ దూలనేసి యొకకోల ముఖంబునఁ బంక్తికంఠుఁడు
జ్వలితి నాట నేయుటయు వానరుఁ డెంతయు నొప్పుమీఱె శృం
గలలిత మేరుభూధరము కైవడి నట్లు దనర్చి ధీరుఁడై. 437

క. కోల వెలికి వైచుచుఁ గడుఁ, గీలాలం బాననముఁ గీల్కొనుటయు వా
తూలసుతుండు రోషారుణ,ఫాలస్థలుఁ డైవసుట్టిభంగిఁ దనరుచున్. 438

ఉ. రావణుఘోరమార్గణపరంపరను న్వెనుకంచ వేయుక
హ్వావని వానితేరికి గుబాలున దాఁటి తదీయదీర్ఘ మూ
ర్ధావళి సంచలింపఁ జరమాంగము నొవ్వఁగ వేసె నయ్యెడం
జావని వానరామరులు సంతసమందుచుఁ గుందుచుండఁగన్. 439

క. రక్షోధ్యక్షుఁడు ప్లవగా,ధ్యక్షు నిరీక్షించి కలుషితాత్ముఁ డగుచు నో
వృక్షచరభగద్ధతి మా,యక్షయముని [illegible]చి మరల నరుదెంచితిఁ జూ. 440

మ. అని సాటోపమనస్కుఁడై శమనదండాఖీలచండాస్త్ర మే
సిన సామీరి యురంబు గాఁడ టుము మూర్ఛిల్లెన్నిజాఘాతవే
దనకుం జావఁడు రావణుండనెడు చింతన్ వ్రాలు చందంబునన్
హనుమంతుం డదిమాచి వానరులు హాహాకారముల్సేయఁగన్. 441

క. కనకాచల మొరగినగతి, హనుమంతుఁడు నొగ్గి [illegible] డైపడుటయు నా
తనిపాటు గాంచి తాఁ గ్రో,ధనుఁడై నీలుండు దశవదను నెదిరించెన్. 442

ఉ. అల్లెదిరించి నీలుఁడు దశాస్యుముఖంబులు వ్రయ్య దట్టపుం
జెట్లు నిరర్చముం గవిసి చిక్కులు వెట్ట నరాముఁ డోలిని

దొట్టిడిగింతు నంచు భయదప్రదరంబుల నీలుమేను బెం
దూట్లొనరించి దేవతలు తొట్రుపడ న్వెపనార్చె నార్చినన్. 443

ఉ. అక్రమ నప్పలాశు ననలాంశభవుం డగు నీలుఁ డగ్నిభూ
ర్విక్రముఁ ద్రుమలం దరుల ద్రేసి మదించిన భూరిసంగరో
పక్రముఁ డద్దశాస్యుఁడు కృపాపరిహీనమనస్కుఁ డంతఁ జ
క్రక్రకచోగ్రశూలపరిఘాప్రతతు ల్విగిడించె నయ్యెడన్. 444

క. తనకన్న మున్న తెలివొందిన తపనజుఁ గూడి యరుగు దెంచియును బ్రథం
జనసుతుఁడు రణపథిజ్ఞతఁ జనఁ డద్దశ రావణునకు సంభ్రమఁ దగుమన్. 445

క. అంతకుఁ డన నంతఁ బ్రహస్తాంతకుఁ డరదంబుఁజేర నరుగ నతఁడు నీ
గంతు లుడిగింతు ననుచుం బంతంబున నగ్నిబిలుకుఁ బైనిగిడించెన్. 446

ఉ. అత్యనలాస్త్ర ముర్వియు విహాయసము న్నిజదీప్తి పర్వఁగాఁ
జయ్యనవచ్చె నీలుఁ డదె చచ్చెను జచ్చె నటంచు వానరుల్
కుయ్యిడఁ జుట్టుముట్టి కపికుంజరుఁ గుంజరవైరివిక్రమున్
డెయ్య నొనర్చె శత్రులు వడంక నిశాచరు లుబ్బి యాడఁగన్. 447

క. రావణుఁడు శిఖివిశిఖమునఁ బావని నీలుఁ గని కనువిచారించుచు దు
ర్భావమున నద్రిచరసేనాపతినం బస్త్రధార నలికెడునెడలన్. 448

క. సౌమిత్రి ససంభ్రముఁడై రామునితోఁ జూడు మిట్లు రావణుఁడు కపి
స్తోమము నలఁచెడు నీతని తోమార్గ్గుని వీని దుర్మదుం దలఁకింతున్. 449

వ. అని పలికి యన్నకు నమస్కరించి తదాజ్ఞా ప్రకారంబున. 450

శా. సింహధ్వానధనుష్టంకృత ద్విపమత్సేనాతి భీమంబుగా
రంహఃప్రక్రియనేగుదెంచి సమరారంభంబు మీఱన్ జగ
త్సంహారంబొనరించు రుద్రుఁ డనఁ బ్రత్యర్థిస్వనీకార్థియై
యంహోదూషితయుంచు లక్ష్మణుఁడు సాహంకారఘోరంబుగన్. 451

క. మర్మవిభేదకములు ఘనధర్మచ్ఛేదకము లైనవాలమ్ముల న
ద్దుర్మతిపైఁ దొరఁగించెఁ జతుర్ముఖముఖ్యామరులు నుతులు సేయంగన్. 452

వ. ఇట్లు తొరఁగించి యద్దురాత్ము నుద్దేశించి. 453

చ. కపటము వన్ని జానకి నకల్మషఁ దెచ్చినయట్లు గాదు మ
ద్విపులశరాగ్ని సంజనితవేదన కోర్చుట యంచుఁ బైపయిం
గుపితమనస్కుఁడై విశిఖఘోరశరంబులు నింప రాక్షసా
ధిపతి దశాననుండు జగతీవరనందనుఁ గాంచి నవ్వుచున్. 454

క. అన్నపయిం గలమన్నన, వన్నము విడనాడి కాయ లాకులుఁ దిని యి
ట్లున్న సహింపక నిను మీ, యన్న ననుంజెనకఁ బంపెనా చావంగన్. 455

క. అన్నం బఱచితిఁ దమ్ముని, దన్ని విభీషణుని వెడలఁ దఱిమితి శరణం
బన్న వధించితి సాధుల, నన్నెఱుఁగక యెదుర వచ్చినాఁడవు కుమతీ. 456

ఉ. కోఁతులఁ గొండముచ్చులను గూర్చి పయోధిఁ దరించినంతనే
పోతర మెత్తెనే చనక పోటరివై నిలు మంచు మించుకో
పాతిశయంబునన్ దశరథాత్మజు లక్ష్మణు సప్తమార్గణా
ఘాతునిఁ జేసి యార్చె దశకంఠుఁ డకుంఠితలీల నార్చుడున్. 457

గీ. పంక్తికంధరుశిరములు పదిశరముల, నొవ్వనేసి సుమిత్రాతనూజుఁ డాతఁ
డెన్ని శరములు నిగిడించె నన్నిశరము, లురవడిగ నేసి మరలించుచున్న వేళ. 458

ఉ. పావని ముఖ్యులద్దనుజుపై నెదిరింపఁ దొలంగుఁ డంచుధా
త్రీవరుఁ డెంతయుఁ బ్రణవిధిజ్ఞుఁడు పో రొనరించె నీసుమి
త్రావరపుత్రబాణహతి రావణుఁ డోపక కాందిశీకుఁడై
పోవక నిల్చెనే యనుచు బోరన దివ్యులు దన్ను మెచ్చఁగన్. 459

శా. యూపాక్షుండు మహోదరుండు నతికాయుం డానికుంభుండు సా
టోపుండైన నరాంతకుండు దరఁ దోడ్తో వారి నెల్ల వ్రణ
వ్యాపారుండగు లక్ష్మణుండు కఠినవ్యాహారఘోరుండు ర
క్తాపోస్నాతులఁ జేసి యార్చె విజయాహంకారదుర్వారుఁడై. 460

క. కోపమునఁ బంక్తికంధరు, చాపముఁ దునుమాడి యొండుచాపముఁ గొనఁ ద
చ్చాపమును దునిమి రథ్యవ్యాపార మడంపఁ దలఁచునంతటిలోనన్. 461

క. శక్తి మిగుల నసురేంద్రుఁడు, శక్తి నెగువ మంట లాకసము నిండ సుర
స్సక్త మగుచు సురనిద్రా, సక్తనిక్రియ మూర్ఛ వడియె సౌమిత్రి వడిన్. 462

వ. ఇట్లు మహాశక్తి ప్రయోగంబున సమ్మూర్ఛితుం డగు లక్ష్మణుం గనుంగొని యాద్దు
రాత్ముండు రథావతరణంబు గావించి. 463

క. నెట్టుకొని నిజరథంబునఁ, బెట్టుకొని వనాటబలము బెదరఁగఁ బురికిం
బట్టుకొనిపోవఁ దత్తను, విట్టటుఁ గదలింపలేక యెంతయు వెత్తిన్. 464

చ. ఇరువది చేతులం బెనచి యెత్తఁగఁజాలక మేరుధన్వికిం
పుర మగు కొండికొండ సరిపోవునె లక్ష్మణు దేహయష్టి క
చ్చెరు విది యంచు విస్మయముఁ జెందెడు రావణుఁ ద్రోచి తత్కళే
బరము గ్రహించి మారుతి నృపాలకుపాలికిఁ బోయెనంతటన్. 465

చ. అరుదుగ నప్డు శక్తి సరయంబుగ రావణుఁ జేర లజ్జచే
నరదము గ్రమ్మఱంగ విబుధాహితుఁ డెత్తెఱ మీఱ నెక్కి వా
నరకరవాల పత్త్రచరణంబులు ఘోరరణంబులోన భీ
కరకరవాలపత్త్రహతి ఖండములై పడ నేయుచుండఁగన్. 466

చ. పొదలెడుకిన్కఁ జాపరవము న్నిగిడించుచుఁ గన్నుదోయిఁ గెం
పొదవ లయాంతకాకృతి శరోగ్రగరుద్ధతి నూఱఁ జొచ్చు కం
బొదువుఖగేంద్రుమాడ్కి నృపపుంగవుఁ డెత్తెఱ రాక్షసేశ్వరుం
బొదివిన సంతసించిరి కపుల్ ముదమందిరి మింట నాకపుల్. 467

వ. ఆరఘుకులశిఖామణి నిజవిశిఖశిఖిశిఖాకలాపంబుల నీకరణిం బొదివి. 468

మ. మహికన్యాపహరు న్సహింపక రణోన్మాదంబు మీఱ గ్రమా
ద్వహుఁ డప్పార్ధనిశాకరాస్త్ర నిహతిం దగ్ధాత్ర మారకత్త్రసం
పిహితంబు న్శిథిలం బొనర్చి యహితా భీలాట్టహాసంబుతో
విహరింపంగని దానవుండును సమిద్విస్ఫూర్తి దీపింపఁగన్. 469

మ. పదివిం డ్లెక్కిడి చాపటంకృతి నభోభాగంబు భేదింప ను
న్మదుఁ డుద్వృత్తుఁ రాఘవేశ్వరుపయి న్మార్కొంటు యత్యద్భుతా
స్పద మయ్యెన్ ఖచరాళి కప్పుడు నభఃపాత్రుండు రాము న్రణా
భ్యుదయుం జేరి వినీతి నిట్లనియె హర్షోత్కృష్ట చిత్తాబ్జుఁడై. 470

క. సరథుం డగు రావణు భూ, విరథుఁడవై మాఱుకొంట మేల్గాదు నరే
శ్వరవర కరుణామతివై, సరగున నెక్కు మిదె మద్భుజస్యందనమున్. 471

వ. అని మహానందంబునం బలుకుటయు నమ్మహాబలనందనుండలి మన్ననంజేసి లాం
గూలధ్వజవిరాజితంబును మనోవేగంబును మహోత్తుంగంబును గామగమనంబును
నగు కపిరథం బధిష్ఠించి యుదయశిఖరిశిఖరస్ఫురితుం డగు తరుణారుణ మయూఖుం
డునుం బోలె శిలీముఖమయూఖప్రసారంబున శత్రునేత్రకుముదంబులకుఁ గుముదం
బావహింప దశముఖున కభిముఖుం డై. 472

క. శరణార్థి నగుచు నిలుచక, శరణార్థివి గాక తొలఁగి చనకున్న నినున్
శరవణభవుఁడో యితఁడా, శక్రుఁడునుఁ జేసి ఒట్టు చంపుదు నాజిన్. 478

వ. అదియునుంగాక. 474

చ. అవికులవర్యు లెందు శరణార్థి వధించుట కుత్సహింప రీ
కవికలబుద్ధి సాధ్వి వసుధాత్మభవం గొని తెచ్చి యిచ్చి దా

నవశిలమున్ హరింపకు మనం గరుణించెదఁ గాక బంటవై
బవరము సేయు నద్దివిడి భస్మము సేయక యూరకుందునే. 475

వ. అని పలికి తోడన. 476

క. సాలుగ విసరెడి విశిఖ,జ్వాలలు వరుణాస్త్రనిహతిఁ జల్లార్చి మహీ
పాలు నురంబును వనచరు, ఫాలంబును నొవ్వనేసి పంక్తిముఖుఁ డనున్. 477

క. విను మాలిమీఁది యాసం, జనుదెంచితి గాక నీకు శౌర్యము గలదే
మనుజునొకనిశరణము చొత్తునె వెఱతురు నాకు దిక్పతులు మార్కొనఁగన్.

క. వనచరసమాశ్రితుండవు, మనుజుండవు వశమె నీకు మార్కొన మనుజా
దననాథుఁ బంక్తికంధరు, ననుచు వెసం గవియుటయు మహోగ్రహుఁ డగుచున్.

సీ. నాకవు ల్వొచ్చు దర్వీకరంబులభంగిఁ దూపులు వీఁపునఁ దూఱనేసి
కులమహీభృత్కూటకోటిపైఁ బిడుగులు పడుభంగిఁ దలల రోపములు నిలిచి
యటవిపై దావాగ్ని యలమికొన్నవిధాన నవయవంబుల విశిఖాగ్నిఁ జొనిపి
ఘనవారిదమ్ముపై గాలివీచినమాడ్కి నరదంబు నాశుగాహతి విదిర్చి
వెగడుపఱిచినఁ బొలివోని విక్రమంబు, మెఱయ దశకంధరుఁడు పదిక ఱకుటమ్ము
లేయఁ గనలుచు నబ్భాహులేయసదృశుఁ, డాయతాంబకముల బాహులేయుటయును

ఉ. అక్కజ మందుదైత్యుఁ గని యక్కటికం బొకయింతలేక వి
ల్మక్కలు చేసి తోడన యమోఘశిలీముఖవృష్టి ముంచి యే
దిక్కునఁ దాన యై పటుగతి న్విహరించినఁ బంక్తికంఠుఁ డ
మ్మక్క నరుండుగాఁ డితఁ డహర్పతితేజుఁడు రాముఁ డారయన్. 481

చ. అని తలపోయు రావణుముఖాంబుజము ల్చినఁగ న్శిలీముఖ
ప్రణిహతి నొవ్వనేసి ప్రసభంబున వెండియుఁ జండకాండము
ల్నినిచినఁ గాలుఁజేయిఁ గదలింప సమర్థుఁడు గాక భీతుఁడై
మనము గలంగ వానరసమాజము నవ్వుచుఁ జూచుచుండఁగన్. 482

వ. సంగరపరాఙ్ముఖుండై. 483

క. రౌద్రోద్రేకనృపశరో, పద్రవమున శౌర్యలేక ప్రాణాపేక్షన్
విద్రావితత్రపుండు భయద్రుతుఁడై లంకఁ జొచ్చె నసురులు దలఁకన్. 484

ఉ. ప్రల్లద మేది యిట్లసురపాలుఁడు లంకకుఁ బాఱి మేదినీ
వల్లభమూర్తి వెన్దగిలి వచ్చినచందము దోఁప నెంతయుం
దల్లడ మందుచున్న వసుధావిబుధాహితుఁ గాంచి బాంధవుల్
చల్లని యిష్టవాక్యముల సాధ్వసముం దొలఁగించు నయ్యెడన్. 485

వ. సమరతలంబున. 486

గీ. దనుజశరకోటి తను నెంత దాఁకకుండ, నాఁగి యమ్ముల శోణితం బానకుండ
నుచ్చి చననేసి యసురుల నుక్కడంచెఁ, గడురయంబున నొక్కనిఁ గడపకుండ.

గీ. రాముఁ డరుణాంబుజముఖాభిరాముఁ డగుచుఁ, దక్కునిశాచరుల నెల్ల నుక్కడంచి
మీఱి యంతకుమును మూర్ఛ దేఱియున్న, యనుజుఁ బొడఁగాంచి కపిరథం బవతరించి.

వ. గజగవయగవాక్షగంధమాదననలనీలసుషేణపనసవినతతారకుముదవేగదర్శివృషభమైంద
ద్వివిదసుగ్రీవాంగదపవనతనయకేసరిశతబలిదధిముఖప్రముఖవలీముఖపరివేష్టితుం డై స
ముల్లాసంబునం దేలుచుండె నంత నక్కడ లంకాపురంబున నెట్టకేలకు నొక్కింత
భయంబు దక్కి దశముఖుం డాప్తుల నవలోకించి. 489

క. హరికులిశము హరిచక్రము, హరువరశూలమును గ్రౌంచహరు శక్తియు నా
హరిభీకరతరదండము, సరిగా శ్రీరామచంద్రుసాయకములకున్. 490

చ. ప్రథితయశుం డ్రఘూత్తము నృపాలశిఖామణి నోర్వలేక దై
ర్యధనుఁడ నయ్యు వైరినిచయంబులు నవ్వుచు సంతసింప వే
పథువు జనింప లంక కిటు పందవిధంబునఁ బాఱివచ్చితి
న్విధి విపరీతవృత్తిఁ బ్రభవించిన యాపద కింత యేటికిన్. 491

వ. అని పలికి విషాదవేదనాహోదూయమానమానసుం డై యూరకుండి. 492

ఉ. నాయనుజన్ము నన్యకపిప్రబలార్చితకాండజన్ము నా
గాయతసత్త్వుఁ బర్వతనిభాసదృశోగ్రవిశాలవక్త్రర
క్తాయతచారునేత్రుఁ బితామహదత్తవరప్రలబ్ధని
ద్రాయతుఁ గుంభకర్ణుని నదభ్రవిదారితకుంభికర్ణునిన్. 493

క. బోధింపుఁ డాతఁ డైన విరోధివరూథిని వధించి రూఢధృతిమను
ష్యాధములఁ గూల్చి లవణపయోధిఁ గలపి మరలివచ్చు నొకనిముసమునన్. 494

గీ. కాన నాతమ్ము సుఖసుప్తినూనియున్న, వాని మేల్కొల్పి యాహవవర్తనంబు
నిర్వహించి మదీయసాన్నిధ్యమునకుఁ, దోడికొనిరండు నా నరాదులు కదంగి. 495

క. ఘననిశ్వసనోచ్ఛ్వసనో,ద్జనితధ్వనిభయము నతినిశాచరమయము
న్మన జాస్థిశకలచయముం, జని కాంచిరి కుంభకర్ణశయననిలయమున్. 496

వ. కనుంగొని యతిప్రయత్నంబున. 497

క. చేరి ఘటకర్ణకర్ణ,ద్వారంబులు రెండు బిట్టు ద్రవ్యులు గాఁగన్
ఘోరనారినాద ఘనశంఖారవము లొనర్చి నిద్రఁ గదలకయుండన్. 498

సీ. కృష్ణవర్త్మనిశాతకీలలఁ గ్రాఁచిన తైలంబు కర్ణరంధ్రములఁ జొనిపి
ధారాకఠోరకుఠారసంహతులచే ముఖమున నందంద మొనసి మోఁది
మత్తదంతావళమల్లంబుఁ గొనితెచ్చి కడువడి నురమున నడువఁ జేసి
పలువురు బలియురు పనివడి తెచ్చి గండాశ్మజాలంబు దేహమున విసరి
గదల నడిచియుఁ బొడిచియుఁ గఱచియు మఱి, యెన్నియే నుపాయములొనరింప నిట్టునట్టు
పొరలి వెస నావులించుచుఁ బొంగనిద్ర, యెట్టకేలకుఁ దెలివొంది యిట్టు లనియె.
గీ. దివిజరిపులార నన్నుఁ బ్రబోధింపనేమి, యవసరం బిప్డు వచ్చె దశాననుండు
రోషవిషమమనుండు బలవద్విరోధ మెదిరి, తెచ్చికొనియెనో తెల్పుఁ డదియునుఁ గాక.
క. కులభూషణుఁడు విభీషణుఁ, డలఘుగుణుఁడు కుశలియే కదా యతఁడున్నం
గలుగదు విపరీతపుటా, కులపాటిపుడేల మేలుకొలిపితిరి నను౯. 501
గీ పెద్దనిదుర వేళ్ళ పెద్ద వరం బిమ్మ, నెడల బలిమి నెవ్వరేని దెలుప
నాఁడు పెద్దనిదుర వీడొందుఁ దను దాన, లేచెనేని జగము నేఁచుననియె. 502
వ. అట్లు గావున నాషాణ్మాసికసుషుప్త్యవస్థుండ నగు నాకు యుద్ధంబున మరణంబు
సిద్ధం బని పలికి. 503
సీ. ప్రకటనిద్రాభంగరక్తలోచనము లంగారధానికల ప్రకాశ మొంద
నలసత దోఁపంగ నావులించినవక్త్ర మద్రిగహ్వరలీల ననుకరింప
నాఁకలిగొని చెన్ను నంటిన జఠరంబు దింకినజలరాశి కీడుగాఁగ
దంతసందష్టనోద్గతధైర్యవారావ మభ్రంబు వెట్టి లేచునట్లు గాఁగ
నున్న కుంభకర్ణు నుజ్జ్వలానలవర్ణు, నగ్రభాగమునకు నరుగ వెఱచి
పార్శ్వముల వసించి ప్రణుతించి యల్లన, నిట్టు లనిరి దైత్యభృత్యవరులు. 504
క. ఓయన్న మహాకార్యము, మీయన్నకుఁ గల్గి నిన్ను మేల్కొలుపఁగ న
త్యాయతమతిఁ బుత్తెంచిన, నీయున్నెడ కరుగుదెంచి నిపుణత మెఱయ౯. 505
క. నిను లేపితి మన్నవలన, విన దగు కార్యంబు లెల్ల నిందు బుభుక్షా
వినివృత్తి గాఁగ మాచే, సినవంటకములను తృప్తిఁ జెందు మనవుడు౯. 506
క. కాల్యములు దీర్చి గంధసు, మాల్యాఢ్యుండై శాకసూపసహితధవళగు
ల్మాల్యాన్నకుధరములు దధి, కుల్యంబులతోడ భక్ష్యకోటులతోడ౯. 507
వ. పాతాళవివరంబునుం బోని నిజకంఠబిలంబునం దిగవైచి వెండియు నక్కుంభకర్ణుం
డనేక మార్జారమాంసంబును నపరిమితకుక్కుటపలలంబును నిశేషమహిషామిషంబు
ను బహుశస్త్రగతరసంబును నసంఖ్యాతసూకరక్రవ్యంబును నగణితమాంసపిశితంబును

నధికగోధికాధాతువును సమధికమూషికపిండికయును నతిరిక్తవిహంగమకాళికయును సమగ్రజలచరపలలంబును రాశీకృతతప్తాన్నంబును మెసవి. 508

క. శతఘటశోణితముఁ దశశతఘటమద్యమును బంచశతఘటమధువుల్
శతఘటగోఘృతము న్నవశతఘటతైలంబుఁ ద్రావి సమసం దగుచున్. 509

మ. విపరీతాకృతి ఘోరహుంకృతిఁ గులోర్వీభృత్సదృక్షోన్నతిం
జపలప్రక్రియ రాజపద్ధతిని జేచ్చన్ భ్రాతృవీక్షాప్రలో
లుపబుద్ధిం జనుకుంభకర్ణు ఖలశీలుం గాంచి నిశ్చేష్టమై
కపిసంఘంబు భయార్తిఁ జేరెను రఘుక్ష్మానాథుసామీప్యమున్. 510

వ. మహోద్భుతలంకాసముద్భూతభూతంబు చందంబున నరుగుచున్నం దదీయవికృతాకృతిం గాంచి వెఱగి పఱచు తనుచరుల నోడకుం డని ధనుర్ధరుండును సత్త్వయుండు నగు పూషవంశభూషణుండు దోషాచరకులవిభూషణుండగు విభీషణుం గనుంగొని.

మ. తనఘోరాకృతిఁ గాంచి భూతమనుచున్ ధైర్యంబు పోల్పెదఁ జే
తనరాహిత్యులపోలె వానరవరుల్ త్రస్తాత్ములై యుండఁ గే
తనవస్త్రంబులు జానులగ్నములుగా దర్పంబునం బోవు నీ
తనిపే రెయ్యది నాకుఁ దెల్పు మరియంత్రప్రక్రియావేదివై. 512

వ. అనుటయు నమ్మహాత్మున కవ్వినీతాత్ముండు. 513

గీ. వీఁడు రావణు ననుజుండు వీనిపేరు, కుంభకర్ణుండు నిద్రగూరియుండు
సమధికబలుండు సమరప్రచండుఁ డాజి, సుస్థిరభుజుండు నాకగ్రజానుజుండు.

క. జాగరముల నెఱుఁగక నిద్రాగరిమను నాఱునెల లితఁడు పవళించున్
జాగర మొకదివసము నాఁ, డోగిరము భుజించు సుఖసమున్నతిఁ గాంచున్. 515

వ. మఱియు నద్దివసంబున దివిజులకు నజేయుండు నేఁడు ప్రజాగరణదినంబు గామి మెలఁగియు దశకంధరుండు భవదీయదివ్యాయుధశిథిలీకృతదేహుం డైనవాఁడు గావునం గార్యాకార్యవినిశ్చయబుద్ధిహీనుండై ప్రబోధింపంబంచినం దెలివినొంది యుగ్రజాలోకనాయత్తచిత్తుండును మత్తుండునై చనుచున్నవాఁ డిన్నిండేని యన్యులచేత బలాత్కారంబున బోధితుం డగు నాఁడ మృత్యువుం జెందు నని బ్రహ్మవచనంబుగలదు గావున నితండు నీకశ్రమసాధ్యుండుగాని దుర్విభేద్యుండు గాఁ డని పలికి వెండియు నక్కుంభకర్ణు జన్మబలపరాక్రమప్రకారంబులు వేఱువేఱ విన్నవించి మఱియును. 516

క. కపులవెలిపు దీఱఁగ నిక్కపుదైత్యుఁడు గాఁడు కాష్ఠకల్పితవిచర
త్కపటాకృతి యని చాటఁ బనుపు మనవుడు మెచ్చి నృపుఁ డనుజ్ఞ యొసంగన్.

క. నీలుఁడు సమస్తసైన్యము, నాలోకించి కపులార యసురుఁడు గాఁ డు
ద్వేలమగు దారుయంత్రము, పౌలస్త్యకృతంబు గూల్చఁ బతి యాప్రతిమన్.

చ. అనవుడు గ్రమ్మఱంగ విపినాటచమూనివహంబనీకసా
ధనమయి నిల్చె నట్లు సుపథప్రవిలేఖనతుంగమస్తుఁడై
ఘనభుజవిక్రముండు ఘటకర్ణుఁడు దీవనఁబ్రోలు పుణ్యకా
మిను లురుసౌధకూటముల మీఁద వసించి పయి న్విడుష్పఁగన్. 519

మ. చని కాంచె న్నవరత్నకీలితమనోజ్ఞస్తంభసంవాహముం
గనదభ్రంకషకేతువాతవిచలద్గాంగాంబుజవ్యూహమున్
మనుజగ్రాహము వైరిభీకరచమూమందీకృతోత్సాహమున్
దనుజవ్యూహముఁ బంక్తికంధరమహోదంచత్సభాగేహమున్. 520

క. కని యాహూతనిరాహ్వాతనికుంభాద్యనిమిషరిపుసంభృతగేహం
బని వారితుఁడై చేరం, జని యగ్రజు చరణసరసిజములకు మ్రొక్కెన్. 521

క. మ్రొక్కిలి లిచిన సహోదరు, నక్కునఁ గదియించి యొద్ద దశాస్యుఁడు గడుపెం
పెక్కువరత్నపుగద్దియ, గ్రక్కున నిడఁ బంచెఁ గుంభకర్ణుఁడు దగన్. 522

వ. పనుచుటు బలియురగు పలువురు రక్కసులు వెక్కసంబునం గొనివచ్చి యిడిన
సమున్నతంబగు పసిండిగద్దియ సుఖాసీనుండై హుంకృతుల నభోభాగం బవియించు
చు నన్నుం గనుంగొని. 523

ఉ. తెంపరులై నిలింపు లవధీరణ చేయఁదలంచిరో విరో
ధింపుమ నష్టదిక్పతులు దేఱిరొ సూర్యముఖగ్రహాళి వే
ధింపఁ దలంపు గల్గెనొ సుధీజనమేను సమీరనమ్రబో
ధింపఁగ నేమి కారణము తెల్పుము సద్గుర దీరకుండఁగన్. 524

చ. కలఁచుమనో పయోధి యుదకంబులు బెదరిగాఁగ మేదినిం
గలఁపుమనో నభంబు పెలుగంబడఁ ద్రోచి దినేంద్రచంద్రుల
న్నిలుపుమనో నభోంతసరణిం జనకుండఁగ నాకుఁ గార్యముం
దెలుపుము గాక నావుడు సతిప్రమదంబునఁ బొంగి యిట్లనున్. 525

క. మనుజు నొస్సోదరియగు శూర్పణఖ నిరపరాధఁ బట్టి ప్రసభంబున ఘో
రనిశాతశరాహతి ముక్కును గర్ణయుగంబుఁ ద్రెవ్వఁగోసి సౌమిత్రేష్టున్. 526

వ. జనస్థానంబున నుత్తమత్రిశిరుఖరులం డొకండ ప్రియానుజప్రియాసహితుండై ప్రవృ
ద్ధరుచున్నం గనుంగొని సహింపక. 528

చ. అనఘమతు ల్చతుర్దశసహస్రనిశాచరసైన్యయుక్తులై
ఘనఖరదూషణాఖ్యు లసమానబలు ల్చని పోరి నర్చి త
ద్ఘనశరవృష్టిఁ బ్రాఁగినఁ బడంపడి కంచన నేను గాలవే
వినఁగుచు వానిభార్యఁ గొనితెచ్చితి సీతఁ గజాతలోచనా. 528

క. పటుకపటంబునఁ దత్సతిఁ, దటుకునఁ దెచ్చుట యది నతఁడుఁ దమ్మునితోను న
త్కటశోకవేగమున మర్కటులం గూర్చుకొని కడలిగడచె నను నెడలన్. 529

క. అర్కకులుఁడు రాముఁడు కోట్యర్కవిభుం డాదివిష్ణుఁ డనుచు మఱియు న
మ్మర్కటులు దివిజు లనుచుం, బేర్కొని వెలిపించె నను విభీషణుఁడు గడున్. 530

క. ఏనుమహీసుతరాముని, కీనని పలుకుటయుఁ గోప మెక్కి నను చతీ
జానిశరణంబు వేడఁగ, దా నప్పుడు వెడలిచనియెఁ దనమంత్రులతోన్. 531

వ. తదనంతరంబున రాముం డనేకవనౌకానీకినీపరివృతుండై సేతుమార్గంబున లంకా
పురంబుపై విడిసి ప్రహస్తధూమ్రాక్షమహానాదమహాకాయాకంపనాదుల నరాదుల
ననేకుల సంహరించి మించి పరాక్రమించి యున్నవాఁ డదియునుంగాక. 532

క. హనుమంతుం డనఁగా నొక, వనచరుఁ డవనిసుత వెదకవచ్చి బలియుండై
విను మింతవ మును విక్రమ,మున నక్షునిఁ జంపి లంకగాల్చి పోయెన్. 533

ఆ. మఱియు నింద్రజిత్తు మహితోరగాస్త్రాళిఁ, జిక్కువఱని రాజసింహులిద్దఱఁ
గడఁగి యేసిపోయి కాండిశీకుండనై, జరగివచ్చితని నిజంబు దెల్ప. 534

క. నీవు సహజబలశాలివి, గావున బోధింపవలసెఁ గయ్యమున ధరి
త్రీవరుఁ గూలిచి నాచే,ఁ దీవన వడయుము మన నతఁడు ధృతిచలనుండై 535

గీ. కొంతతడవూరకుండి యక్కుంభకర్ణుఁ, డన్నఁ గన్గొని వింటె దశాస్య వీత
గాదె నరవానరులు వార్ధిగడచుటెల్ల, భంగిఁ దఁ బోదు దురము శుభంబు గాదు 536

మ. మునుమున్ దాటకసంహరించి భృగురాముం గెల్చి తోడ్తో విరా
ధునిఁ జక్కాడి ఖరాదులం జిదిమి మత్తుండైన మారీచునిం
దునకల్సేసి బృహన్మదాంధునిఁ గబంధుం గూల్చి యేకాశుగ
మ్మున వాలిం బడనేసినట్టి రఘురాముం డేల మర్త్యుం డగున్. 537

క. సముఁడైనవానియెడ సా,మము దానం బధికునెడల మత్తునియెడ భే
దము హీనుఁడైనయెడ దండ,ము సెల్లుఁ దలఁచియు నెవ్వగ [illegible] 538

క. సింధురసైంధవరథభటు, బంధువితతి తెగినఁ గాంచి పదపడి రిపుతోఁ
సంధి యొనర్చిన నదియు, స్సంధి యగుం గాక మొదల సామము వలయున్. 539

క. లోకంబునకుఁ ద్రివిష్టప, లోకమునకు మన మొనర్చు లోపంబులు ము
ల్లోకములకుఁ హితుఁడగు నా, లోకేశుఁడు మున్న శేషలోకేశునకున్. 540

మ. వినయం బొప్పఁగ విన్నవించుటయు నవ్విష్ణుండు దైవాళి న
వ్వినయం బొప్పఁగ బ్రహ్మతో దశరథోర్వీనాథపుత్రుండనై
దనుజధ్వంసన మాచరింతునని యంతర్ధానముం జెంది య
వ్వినుతాకారుఁడె రాముఁడయ్యె బలవద్విక్రమ మింకేటికిన్. 541

క. మును విది యంతయు నారద, ముని విని చెం దద్వచన మమోఘము నాకుం
జనువు గలిగి తెలిపితి యో, జన సేయుము వలదు దుర్విచార మనవుడున్. 542

ఉ. పక్కున నవ్వి పెద్దయని పాడి దలంపక నిందఁ గొల్వఁగాం
బెక్కులు ప్రేలినాఁడ వవిబృందము సంతసముంద నట్టినీ
వెక్కడ నీసోదరుండ వివి యేట్టి వినీతులు చాలుఁ జాలు నీ
వెక్కడ సంగరాంగణ మదెక్కడ నిద్దుర పొమ్ము సొమ్మఁకన్. 543

చ. వెనఁగొను భీతిచే మున్ను విభీషణుఁ డెంతయు నొత్తిచెప్పె నా
తని దొకచిన్నపెట్టె హితంబుగ నీదొక పెద్దపెట్టె యా
తనిక్రియ నన్ను దాటినకతంబున బింక మెఱుంగకట్టి వీ
రుని నిను లేపునా దొక విరుద్ధపుఁబెట్టి గదా తలంపఁగన్. 544

క. రాముఁడె వలమురిదాల్పు వ, లీముఖు లవ్విష్ణుపైన లిబ్బపడఁతి సీ
తామానినియైనను నగు, సామం బేనొల్ల నెట్లు సంగ్రామమగున్. 545

వ. అది యట్లుండనిమ్ము నిద్రాసక్తులు నంగనాసక్తులు భోజనాసక్తులును సంగ్రామం
బున కర్హులు గా రీ వధికనిద్రాసక్తుండవు భోజనప్రియుండవు భయభ్రాంతుండవు
గావున నీసహాయంబు బేనొల్ల నెల్లభంగి సమరంబున విరోధుల వధింపక తక్కను సె
యని పలికి మొగంబు గంటువెట్టుకొని యూరకున్న యన్నం గనుంగొని కుంభకర్ణుం
డు తనమనంబున. 546

క. దుర్నయుఁ డితఁడు వినీతవి, నిర్ణయవాక్యములు వినఁగ సేర్చునె యనుచున్
ఘూర్ణితలోచనుఁ డగు ఘటకర్ణుం డిట్లనియె నన్నకర్ణము లలరన్. 547

చ. తెగనిసుషుప్తిచేఁ బలికితిం గలహం బశుభం బటంచుఁ ద
ప్పుగొనకు మిప్డు లేచితి నృపుల్గపులెంతటివారు వైరులం

దిగిచి క్షణంబులోనఁ బగ దీఱ గ్రసించెద మేనఁ బ్రాణముం
డఁగ వసుధాతనూజ వరనాథున కీయఁగ నీయకొందు మే. 548

క. బాణకృపాణపటుతను,త్రాణంబులు వలదు బాహుదర్పమున రిపు
ప్రాణములు గొందు మూర్ధా,ఘ్రాణం బొనరించి కుంభకర్ణు ననుపుమా. 549

వ. అనుటయు సంతసించి. 550

క. వాలి నడిచి కపుల రవిజు, నేలించిన భంగి నిన్ను నేలించెద దై
త్యాలి రిపుఁ దునిమి యనుచుం, బ్రేలునఁట నృపుండు మన విభీషణునొద్దన్. 551

వ. అదియునుంగాక. 552

క. నిద్రితుఁడవు నీవధికభ,యద్రుతుఁడను నేను నగుట నహితబలం బ
త్యుద్రేకము నూపెదు న,య్యద్రిచరావలి వధింప నరుగు మనవుడున్. 553

సీ. శరశరాసనకవచస్యందనాదిరణోపకరణముల సజ్జగించి
యపజయం బెఱిఁగించు నమిత్రతూర్యధ్వనులకు నపశకునములకు వెఱవక
శూలంబుఁ జేదాల్చి శూలికైవడిఁ బొల్చి పురజను లోర్చనఁ బొగడుచుండఁ
గతిపయభయదరక్షస్సైన్యయుక్తుఁడై తనదునిద్రాభంగమును విరించి
తనయువాక్యములను దలపోసి మరణంబు, సిద్ధ మగు టెఱింగి చింతలేని
మానసంబుతోడ దానవేంద్రునిచేతఁ, జావుఁ గోరి వెడలె సమరమునకు. 554

క. వడిఁ బుర మిర్వెఢమున వెలు,వడి పనివడి కలహమునకు వచ్చెడువాఁ డే
క్కాఁడితఁడని కపులచ్చెరు,వడి చూచుచు నుండి కొంతవడికిం దమలోన్. 555

ఉ. నీలుఁడు చెప్పినట్లు రజనీచరరూపకకాష్ఠపుత్త్రిగాఁ
బోలును గట్టబొమ్మఁగని పోఁడిమి దూలఁగ నేల రామభూ
పాలుఁడు దీనిఁ గూల్చు నని పల్కుచు నుల్కుచుఁ జూచుచుండ నా
భీలుఁడు కుంభకర్ణుఁడు విభీషణపూర్వజుఁ డాత్మయోధులన్. 556

క. తలకడచి దావదహనము, చలిచీమల నేర్చుపగిది సర్వకపులఁ గొం
దలమందఁ గుంభకర్ణుఁడు, లక్రమింగఁదొడఁగెఁ బ్రవిపులముఖుం డగుచున్. 557

వ. భీషణాటోపంబునం గనిమసంగి వనచరులం దిగిచి యహార్యగుహాకుహారసదృశం
బగు నిజబంధురకంధరసుషిరంబునకుఁ జాఱ విడుచుచున్నం గనుఁగొని. 558

చ. పనివడి వానరు ల్పనసపంటికిఁ జీమలు చుట్టినట్లుగా
మునుకొని గంధభద్రగజము న్వడి నీఁగలు మూఁగులాగునం
బెనఁగొన నబ్బలిష్ఠుఁడు కుభృన్నిభమూర్తి విదిర్చి వెండియుం
గొనకొని బొక్కఁజొచ్చె రఘుకుంజరు లంతయుఁ గాంచి పొక్కఁగన్. 559

క. అద్రిచరావలి తనపైఁ, నుద్రేకము మీఱ వైచు నుర్వీరుహఘో
రాద్రిప్రకరములు పృథుచ్ఛిద్రము లొనరించి దనుజసింహుఁడు మఱియున్. 560

సీ. పలువుర బలియుఁడై పట్టి యుర్వ్యుత్తుంగ దిగమ్రింగి వక్త్రంబు దెఱచి యార్చు
మఱియును వేఱొకమాఱు వేవుర ముద్దగావించి మేనునఁ గలయ నలఁచు
నొకమాఱు నూర్వుర నొగి శూలమున గ్రుచ్చి కావిక్రొన్నెత్తురు గ్రాక్రేఁచు
నింకొక్కసారి యనేకుల నేకులకైవడి మూఁకంబుగా విదుర్చు
నివ్విధంబున దానవుఁ డేచి విలయసమయసమవర్తిసమవృత్తిసముదమూర్తి
సమయఁ జేయుచుండ సమరవసుమతి విడిచి, పాఱిరి వనాటు లసురు లేపారి మాఱ.561

చ. సమరము సేయఁ జాలక వెసం బఱవెత్తెడు సేనఁ గాంచి రో
షమహితుఁ డంగదుండు రభసంబున నడ్డమువోయి శౌర్యవా
క్యములు వదించి వానరులఁ గ్రమ్మఱ నాజికి నూలుకొల్ప నొ
క్కమొగి ద్రుమంబులన్ దనుజు కాయము గప్పిరి దాన నంతయున్. 562

క లింగము మాలూరదళాలిం గప్పిన కైవడిం జలింపక యతఁడో
లిం గముల కతికి గ్రుమింగఁ దొడఁగిన ద్విపినుండు గడు బెడంగు లీలన్. 563

ఉ రక్కసు పెన్నురంబున ధరాధరకూటము వైచి యార్వఁగా
నక్కతి నాత్మఁ దుక్కు మెఱయ న్నిజదేహహతిం బగిల్చె యా
చక్కటి వానరోత్తములఁ జక్కడఁపం గని మారుతాత్మజుం
డొక్కయహార్య మద్దనుజు డొక్క చివుంగఁగ వైచె వైచినన్. 564

క. తద్ధతి కించుకసోలి దృఢోద్ధతి నక్కుంభకర్ణుఁ డుద్దవిడి సమి
త్పద్ధతి వెడి మూర్ఛిల్లి బలోద్ధతు హనుమంతు నేసె నురుశూలమునన్. 565

సీ ఆలంబుమాని వాతూలబాలుఁడు నేల వ్రాలిన నీలుఁ డుద్వేలుఁ డగుచుఁ,
బాహాత్మ నిలు నిలు సాతిపోక మటంచుఁ బాషాణపటలంబుఁ బఱపఁ జేయ
నది పిండిగాఁ జేసి యతఁ డున్నెడ గవాక్షనలవృషభాదు లనలసదృశులు
తన్నెదిరింప నందఱఘోరహుంకారమునఁ బాఱఁగఁ జేసి వనచరాలి
బిట్టు చుట్టుముట్టి పీనుంగు పెంటగా, వించుచున్నఁ జూచి విహ్వలించి
యాత్మసేన నిట్టు లలయించునే యిద్దురాత్మఁ డనుచు వాని కడ్డ మేగి. 566

క. వాలిసహోదరుఁ డురుతరశైలంబున వైవ దానిఁ జక్కాడి వడిన్
శూలము విసరుడు నదివాతూలసుతుఁడు మూర్ఛదేఱి తునుకలు సేయున్. 567

క. శూలంబుఁ గేలఁ దాల్పని శూలిక్రియం బేర్చి రాక్షసుఁడు తపనజు ను
త్తాలాద్రికూటమున మూర్ఛాలసుఁ గావించెఁ గపిబలాంబుధి గలఁగన్. 568

వ. ఇట్లు లంకామలయాచలకూటపాటనంబున సమ్మూర్ఛితుం గావించి యుక్కొలుంగుఱేని
పట్టిం బట్టుకొని భుజంబునం బెట్టుకొని. 569

క. లంకాభిముఖుం డై చను, లంకానాథానుజుం దలంకక శౌర్యా
లంకారుఁడు హనుమంతుఁడు, హుంకారముతో నెదుర్చ నూహించి మదిన్. 570

క. ఇనజుఁడు విక్రమఘనుఁ డే, చనునో తనదాన తెలిసి యరుదెంచు నరా
దను మోసపుచ్చి యీతం, డనితరభేద్యుఁ డని తలఁచునంతటిలోనన్. 571

ఉ. అన్నకుఁ జూపువేడ్క హరిదశ్వసుతుం బృథుగాఢమూర్ఛితుం
గ్రన్ననఁ గొంచుఁ బోవు ఘటకర్ణునిఁ గన్గొని పౌరభామ ల
త్యున్నతసౌధభాగములనుండి సుమంబులు పైవిదిర్చి రా
పన్నత వానరు ల్వివిధభంగుల నేడిచి రార్తనాదులై. 572

గీ. అంతఁ గుంభకర్ణు వంసభాగంబునఁ, బుష్పమాలికయును బోలియున్న
రవిసుతుండు తేటి రక్కసుచే నిట్లు, కట్టువడితిఁ దప్పెఁ గార్య మనుచు. 573

క. లోసంతాపము నొందుచు, నాసమయంబున విభీషణాగ్రజు చెవులు
న్నాసికయును మొదటికిఁ దెగఁ, దీసెన్ ఖరనఖరదంతతీవ్రత మెఱయన్. 574

క. ఉక్కుం జేవయు వెలయఁగ, ముక్కుం జెవులూడఁగఁ ద్రుంచి ముదితాత్ముం డై
దిక్కుంజరములు మ్రొగ్గఁగ, నక్కుంజరహితాత్మజన్ముఁ డవనిక నుతికెన్. 575

చ. పృథివికి శాతకుంభమహీభృచ్ఛిఖరాగ్రనివాసి పింగదృ
క్పృథుకము దాఁటు మాడ్కి నసువ్యాత్పటభేదనకోటి నెంతయుం
బృథుగతిఁ జెంగలించి ప్లవగేశుఁడు కీశులభిష్టుతింప భూ
మిధవుల రాఘవేంద్రుల సమీపముఁ జేరెఁ గరంబు మెచ్చఁగన్. 576

ఉ. అంతటఁ గుంభకర్ణుఁ డవురా విపరీతపు వానరంబు ము
క్కంతయు రక్కిపోయె నిఁక నన్నుఁ గనుంగొనఁ బోవఁబాల నా
గొంతుకత్రోవి నమ్ముసలిత్రోఁతిని వైచెదనంచు శోణితా
క్రాంతశరీరుఁ డాక్షణము క్రమ్మఱియెన్ రణ మాచరింపఁగన్. 577

చ. మిగిలినవానరాలి దిగమ్రింగఁ దలంచెడు కుంభకర్ణుని
న్మిగిలి నరాదు లుద్భటసమిత్ప్రసితాత్ములు పోనొర్ప రాఁ
దగిలినకిన్క మర్కటవితానము దార్కొని తద్బలంబులం
దగిలి నటించె నద్భుతవిధంబున నెత్తుట నీఁదులాడుచున్. 578

తనసైన్యము దైన్యముఁ గనుఁగొని రోషావేశుఁ డగుచుఁ గుంభశ్రవసుం
డనివారితుఁ డై మర్కటులను గారించుటలు చూచి లక్ష్మణుఁ డలుకన్. 579

శా. జ్యానాదస్తనితంబు నిష్ఠురరథస్వప్టంకారనిర్ఘాత ము
గ్రానేకాంబకవృష్టి మర్కటమహోద్యచ్చాతకామోదము
ర్వీనాథానుజధూమయోని ఘనమూర్తిం గుంభకర్ణాద్రిర
క్తానూనోత్సవ మెుంచె దానవవ్రాదబ్జామోదహీనంబుగన్. 580

చ. ప్రకటబలుండు రాముఁడును బాణపరంపరఁ బెల్లు ముంప మ
త్తకరికి సిబ్బు సూపిన విధంబున నున్మదలీల శాత్రవ
ప్రకరము నైజసైన్య మనుపాడి దొలంగి కరంబు సాఁచి యం
దికొని గ్రసింపఁ జొచ్చె నవధీరణఁ గ్రోఁతుల దైత్యజాతులన్. 581

వ. అక్కైకసీనందనుండు రామలక్ష్మణభయంకరాస్త్రవహ్నిజ్వాలాపిహితుండును వి
నాశితస్వసైన్యుండును విదారితనాసికాకర్ణోష్ఠుండును నిరాయుధుండును నిరవధి
కాయోధనశ్రముండును నయ్యును జలింపని ధైర్యంబున. 582

క. కరి తుంగమడువుసొచ్చిన, కరణి న్మందరము జలధిఁ గలఁచుపగిది ని
ర్జరముఖుఁ డరణ్యమేర్చు ప్రకరణంబున నలఁచెఁ గుంభకర్ణుఁడు కపులన్. 583

క. కట్టలుక నిట్లలంచుచుఁ, గట్టిడి యగునట్టి కుంభకర్ణుఁడు గనియెం
గట్టెదుర విభీషణుఁ దోఁ, బుట్టువు నంచద్గదావిభూషితు దుగఖిన్. 584

చ. కనుఁగొని తండ్రి నుండకు వగం దనుజాన్వయమంతరింప నుం
డ నిలుపువాఁడ వీవ నరనాథు దయ న్నను నెల్లఁబాసిపో
తి వని మనంబునం దలఁపఁ దీరదు దుర్జనులైన బంధుల
న్మనమును రోసి నిత్యసుఖముం జిరకీర్తియుఁ జెందఁ జెల్లదే. 585

క. నీకఱపులు వినని యపశ్రీకరుఁ డగు దశముఖుండు చెడుట నిజము సు
శ్లోకుండ వీవిధంబున, శోకింపఁగ నేల తొలఁగి చూడుము నన్నున్. 586

వ. అని పలికి తనకు నమస్కరించి యథోముఖుండును నిరంతరబాష్పసలిలధారాపరిపూ
రితలోచనుండునై యూరకున్న విభీషణు ననునయించి యతనిం దలమిగిలి. 587

క. చని వానరు లడ్డము సొచ్చిన వారల నింత సరకుసేయక రాముం
గని యిదె వచ్చితిఁ గలహంబునకు రా రమ్ము తొలఁగి పోవకు మనుచున్. 588

చ. పొగరున నిన్నెదిర్చి సరిపోరుట జన్మఫలంబు పోరిలోఁ
దెగితిన యేని వెండియును దేజము నొంద జనించి నీ మెుదం
బగ గొని గెల్తు నందు నినుఁ బట్టి జయింపఁగఁ జాలనేని పొం
దుగ నినుఁ జేరి బంటు నగుదు న్విను మిట్లు ప్రతిజ్ఞపట్టితిన్. 589

క. ఏను మనుజమాత్రుండన, గాన నికాంబోలు నింత గర్వించెదు నీ
తోనెనసి పోరవచ్చిన, యేను దనుజమాత్రుండనె రహిం దలపోయన్. 590

క. సర్గస్థితివిలయములు ని,సర్గముగాఁ గలుగు నింద్రజాలుఁడవు గను
న్నిర్గుణుండ వనుచు డాయు ధ,నుర్గుణసారణ విభుఁడు దనుజపతితోడన్. 59

క. నీకంఠము దునిమి మహో,ద్రేకుండగు రావణు న్వధించెద నిఁక ము
ప్పోకలఁబోయినఁ జెల్లను, మీకని దశరథసుతుఁడు సమీకోన్ముఖుఁడై. 592

సీ. ఘటకర్ణ సముదీర్ణకర్ణకోటరములు పటుపత్త్రులకు మనికిపట్టుచేసి
పాపవర్తనునేత్రకూపము లిక్కిలి తెఱచుగా శరపూరితములుచేసి
రాత్రించరముఖగహ్వరంబు నానాజిహ్మగములకు వాసయోగ్యంబుచేసి
దశకంధరసహోదరశరీరకాంతార మతులబాణకదంబయుతముచేసి
కైకసీపుత్రు హస్తశాఖలను ఖగని,వాసములుచేసి మఱియు నవ్యాసవారి
ఘోరవక్షఃకవాటంబుఁ గ్రూరనార,సంబులకుఁ దావుచేసి రోసంబు మిగుల.

క. వాని గలుగు వాలిం బడ,నేసిన యస్త్రమును దానికెక్కుడయగుబా
ణాసారంబున మునుమున, నాసురపతి నొచ్చియును మహాగ్రహుఁ డగుచున్. 594

క. గొదకొని వైరిబలంబుల, వదనంబున వైచికొనుచు వారనికిన్నుకన్
గదగొని కదనంబునకుం, గదిసెం గాలాంతకప్రకారము గాఁగన్. 595

వ. కదిసి భయంకరసింహనాదంబు గావించుటయు సహింపక. 596

క. హస్తిసమగ్రబలుఁడు కృత,హస్తుఁడు వాయవ్యశరనిహతి దనుజుబృహ
ద్ధస్త్రము ద్రుంచుటయుఁ బరి,ప్రస్తంబై పడియె గదయు జర్జరితముగన్. 597

చ. గదయును బాహుదండమును ఖండములైపడ నొండుకేల ను
గ్రుఁడయి సాలముం బెఱికి మానవనాయకు ద్రేయఁబూనుడు
న్బిదురనిభేంద్రసాయకముఁ బెద్దయువేడుక నారిఁ గూర్చి నిం
డఁదిగిచి తత్కరంబును బడ న్వడినేసె నమోఘవేగుఁడై. 598

క. శరయుగమున ఘటకర్ణుని, కరయుగముం గూల్పఁ జెల్లు గానవియుసమి
ద్ధరణిఁ బడి చదిపె నసురో,త్కరముం గపిబలము నద్భుతస్థితిదోఁపన్. 599

క. శాఖారహితమహోన్నత,శాఖిప్రక్రియ దశాస్యసహజుండు దురా
శాఖిలమానసుఁ డగుచువి,శాఖనిభుం గవిసె రామచంద్రు న్మ్రింగఁగన్. 600

క. పదహతులన్ ధరణి వియ,త్పదమున్ హుంకృతులఁ గ్రక్కదల బద్దలుగా
నెదిరించి యిట్లు గవియుఁడు, గదనవిశారదుఁడు సమధికబలోద్ధతుఁడై. 601

క. ఏనొకరుండన వైరులఁ, బూని కధించెదనటంచుఁ బోయి రిపులచేఁ
దాన మృతుఁ డయ్యెఁ బురుషుఁడా, దానొకఁడు దలంప నొకఁడు దైవము దలఁచున్.
వ. అని బహుప్రకారంబులం బరిదేవనంబు గావించి తమ్ములం జేర్కొని. 613
క. హా యను మేరుతులితదే, హా యను వక్త్రజితగిరిగుహా యను దగునా
హా యను రిపువనహవ్యవ, హా యను సుమనోమచాపహా యను మతియూన్. 614
మ. అనుజా నిన్నుఁ ద్రివిష్టపస్థులును డాయన్లేరు నీపట్టివో
మనుజాధీశ్వరమార్గణాగ్నిశిఖలన్ మ్రందం గనుంగొంటి నే
నని జాలింబడి రావణాసురుఁడు ధైర్యాయత్తచిత్తంబునం
దనుజాలింగని యిట్లు వల్కెఁ బటుచింతాక్రోధఘూర్ణాక్షుఁడై. 615
చ. గతజలసేతుబంధనము గాదె మృతుండగు వానిఁ గూర్చి శో
కితమతులౌట మీ రరిగి ఖేచరకోటి దలంక నప్పుడి
క్ష్వాకులు వడంక హస్తిహయపద్గరథధ్వజినీసమేతులై
హితమతులార రాఘవమహీశులఁ గీటులఁ జంపి రండనన్. 616
క. అంతకసన్నిభు లగుచున్, రాంతః దేవాంతకులు మహోపార్శ్వాదు
ల్వింతకలకునంబులకు న,త్యంతగ మింతయును లేని యాత్మలతోడన్. 617
సీ. కాటుకకొండలు కదలి యేతెంచెడుభంగి నొప్పెడు మదేభనికరంబుఁ
బూర్వవాయువుల నుప్పొంగు సముద్రంబు తరగలఁ బోలు సైంధవచయంబు
సంవర్తసమయాగ్రజాకాల కాళికాక్రమము గాంచెడు శతాంగవ్రజంబు
సమవర్తికింకరసదృశఘోరస్వరూపప్రదీపితవీరభటచయంబు
నానావపట్టిమ మగుచుఁ దో నరుగుదేర, సమరభేరీరవంబులు చదలునిండఁ
గదలి యుద్ధాశకంతు లుత్కంఠులగుచుఁ, దాఁకి రహితబలంబులు తల్లడిల్ల. 618
క. తాఁకిన నంతకమూర్ణ్ణస, మీకోన్ముఖు లగుచునున్న మిహిరసుతాదుల్
డీకొని ప్లవంగపృతనా, నీకముఁ బురికొల్ప దురము నిష్ఠుర మయ్యెన్. 619
క. ద్రుమచరులు తరుశిలావర్షము దనుజుల మీఁదఁ గురియ రాక్షసులుం ద
ద్ద్రుమచరులమీఁద శరవర్షముగురియించి రతిలోకసాహసవృత్తిన్. 620
చ. అపుడు నరాంతకుండు సరయంబు హయంబు మరల్చి సాధ్వస
వ్యపగతవృత్తి వానరచయంబు గలంగఁ దొలంగఁ ద్రుంగ శ
క్తిపటిమ శక్తివైవ ఘనతించుచు దైత్యులు సందడించి ర
ట్లపరిమితప్రతాపనిధియై దనుజాధముఁ డాక్రమించుడన్. 621

క. కని వానియేపు సైఁపని, హనుమంతుని కడ్డ మరిగి యంగదుఁ డుదుసా
లనిహతి శిరంబు విపులా, శ్మనిహతి శల్యంబు గూలి చదియఁగ నేసెన్. 622

చ. అటుల విహీనశాంతకు నరాంతకు నంతకుచెంత కంపుడుం
గుటిలమనస్కులై రిపులు గూడినతోడన వాయుసూనుఁడుం
జటులరయంబునం బరమసాహసులం బృథుఘోరయుద్ధలం
పటుల నిశాటులం జదిపె బాహుబలంబునఁ జలంబు మీఱఁగన్. 623

వ. మరుత్పుత్రమరుత్ప్రేరితంబును వాలజ్వాలాజాలంబును రోమధూమావృతంబు నగు
నంగదానలంబు విరోధిసేనాకాననంబు దహింపం దొరకొనుటయు సహింపక. 624

క. అశనినిభుఁడు దేవాంతకుఁ, డుశనాంతేవాసిపతి మహోదరుఁ డసుహృ
త్పిశితాశి మహాపార్శ్వుఁడు, త్రిశిరుండును గడఁగి యానదీపితు లగుచున్. 625

శా. సుగ్రీవాంగదజాంబవత్ప్రముఖు లత్యుగ్రప్రభావాఢ్యు ల
త్యుగ్రగ్రావమహీరుహావలి సమీకోద్రేకముం జూప దా
శగ్రీవాగ్రజు లాత్మ మెచ్చక ధనుష్టంకారము ల్సేసి తీ
క్ష్ణాగ్రామోఘశరౌఘము ల్వఱపి బాహాదార్ఢ్యము ల్చూపిరన్. 626

క. అంగదు మునుమున మునుఁ భీ, తిం గూరిన దైత్యబలము దేటిన కపులుం
బొంగుచుఁ దలపడుటయు నురు, సంగరము బలద్వయమునకు నసమగతి నయ్యెన్. 627

క. తలఁప విపరీత మగురణ, తలము గనుంగొనఁగ నద్భుతస్థితి నయ్యెం
దలఁపడు నెడతము స్వైఱను, త్రుపడు నెడముం గడంగి తలపడు నెడయున్. 628

వ. అట్టిక్రందుకయ్యంబునందుఁ గబంధపాఠీనబహుళంబులును విపులాస్థిమార్గసైకతప్రదే
శంబులును మాంసకర్దమంబులును వాలశైవాలంబులును గరవాలవ్యాళవ్యాళంబులు
ను గపాలపుండరీకషండంబులును నగురక్తనదీప్రవాహంబులు వెడలి యనేకముఖం
బుల సాగరసంగమంబు లగుచుండె నట్టియెడ. 629

ఉ. ఆసన మెట్టివాఱఁ బ్లవగావలి మీఱ మరుత్తనూజపం
చానన ముగ్రభంగి నఖరావలి శాత్రవకుంభికుంభము
ల్మానక వ్రక్కలించుచుఁ బలాదనకాననవృత్తియున్న దై
త్యానుగుణంబు గాఁగ విబుధాంతకుఁడుం ద్రిశిరుండుఁ జావనిన్. 630

క. శరములు ముంచునెడ మహో, దరుఁడు మహాపార్శ్వుఁడును మదంబునఁ దోడై
యరుగుడు నీలవృషభు లా, హరివరునకుఁ దోడుపడ మహాహవ మయ్యెన్. 631

గీ. త్రిశిరదేవాంతకులఁ గులాద్రిప్రతిముల, నప్రతిహతప్రతాపుల ననిలసుతుఁడు
పిండి గావించె గండాశ్మపిండిఁ జేసి, యుగమనోహారతద్రథయుగముతోన. 632

క. దరమింతయు లేక మహోదరునిఁ బ్రహస్తాంతకుఁడు ముదంబునఁ గూల్చెం
దరుచరులు మెచ్చికొనఁ దత్కరియును ఘీంకారపూర్వకం బయి వ్రాలన్. 633

క. ఆదర మింతయు లేక మహోదరుసోదరు వధించి యొప్పె నీలుం
డన్నీనిఁ గూల్చు నతిరణాహ్లాది మహాపార్శ్వుఁ డట్టహాసముతోడన్. 635

ఉ. నీలుపయి న్నృశాంగ మవనీరుహచారులు తల్లడిల్ల నా
భీలతఁ బోవనిచ్చి శరభీకరవృత్తి వహింపఁ గాంచి య
న్నీలుని వెన్కఁ ద్రోచి యవనీరుహమున్ బెకలించి యెంతయుం
జోలిక లేనికిన్కఁ వృషభుం డరిభిద్వృషభుండు వ్రేసినన్. 636

గీ. బిట్టు మూర్ఛఁ జెంది పెద్దతడవునకుఁ, దేరిమీఁద మూర్ఛ దేరియున్న
యవసరంబు గాంచి యమ్మహాపార్శ్వుని, వాతనెత్తురులఁ జాతనైచె. 637

వ. పవనతనయవృషభులచేతం ద్రిశిరదేవాంతకమహోదరమహాపార్శ్వులు గూలుటయుం
గనుంగొని కపిబలంబు లుప్పొంగి దనుజబలంబులం గలంపం దొడంగుటయు. 638

క. తుండంబులు దెగిపడు వేదండంబులుఁ బడెను బాహుదండంబులుఁ గో
దండంబులుఁ దొరిగెడు హయఖండంబులు నగుచుఁ గ్రందుకయ్యం బయ్యెన్.

ఉ. చిట్టలు గాఁగ నాప్లవగసింహులతోడ నెదిర్చి పోరి తోఁ
బుట్టువు లేవురుం బొలిసిపోయిన నుద్గతశోక వేగుఁడై
కట్టలుక న్రథంబున నతికాయుఁడు వే మరలించి క్రోఁతులం
బుట్టలుగట్టులం జెదరి పోవఁగ నేసె మహాస్త్రసంపదల్. 640

క. ఇవ్విధి నవ్వనచారులఁ, గ్రొవ్వాడికరంబు జేసి క్రొవ్వుచెఱచుచు
న్నవ్వుచుఁ జివ్వకుఁ గదియుచు, దవ్వుల నవ్వీరు రాముతమ్ముఁడు గనియెన్.

క. కని సరభసంబు మీఱం, జనుదెంచి తొలంగు మిఁక నిశాచరకులపాం
సన రిత్తచావు నమ్మూర్ఖన వచ్చిన నా దశాస్యుకొడు కిట్లనియెన్. 642

చ. ఇతఁ డతికాయుఁ డీతనిపయిం జనుదెంచితి పిన్నవాఁట న
ప్రతిహతబాహువిక్రముఁడు పంక్తిగళాత్మజనూనువుం డగ
ప్రతిముఁ డనల్పుఁ డల్పుల దురంబున మార్కొనఁ డెందు విక్రమో
న్నతు భవదగ్రజన్ముఁ గదనప్రియు రాము జయింపఁ జూచెదన్. 643

క. అలంబుల తెఱఁ గెఱుఁగని, బాలుండవు తొలఁగు మనుచుఁ బటుగతి విశిఖ
జ్వాలలు నిగుడింప మహీపాలానుజుఁడు గూల్చెఁ బ్రతివిశిఖమునన్. 644

వ. మరలించి యాధాన్యమాలినీపుత్రునకు సుమిత్రాపుత్రుం డిట్లనియె. 645

చ. కదనము సేయ నిన్నెదిరి గర్వమెలర్పఁగ నున్న నన్నుఁ జూ
ల్కఁ గదనము సేయుటన్న మె ప్రలాపములం దగు బంటువోలె నీ
వదలిచి యొండుచోటికి భయంబున వంచన చేసి పోయి పో
వఁ దలఁచి తిట్టె కాక బలవంతుఁడవే గణికాకుమారకా. 646

గీ. అనిక్షోణిఁ దిరించి యద్రిపైఁ బిడుగులు, వడఁ దెఱఁగు గాఁగ బహుశరములు
వఱపి యట్టహాసభాసురుం డగుచుఁ గోల్పులిర్పుడంబుఁ బోలెఁ బొదువుటయును.

క. హరినాథు నెదిర్చిన మద,కరినాథుని భంగి నిఱుఁగవిసిన మహీభృ
త్సగణి హరిఁ దాఁకుకైటభు, కరణిం దాశరథి దాశకంఠి యెదిర్చెన్. 648

క. దివ్యాస్త్రరాజ మగువా,యువ్యాస్త్రం బహితుఁ డేయ నతనిశుఁడై
తద్వాయ్వాహతఘోరతరశర,వ్యాపారం బడఁప రావణి కినుకన్. 649

క. దోషాచరులు నతిఁ బడఁగ, నైషికరౌద్రాస్త్రములు రయంబారఁగ న
ప్పావకశిఖుని ప్రేయుచు, శోషించిరి కపులు నృపుఁడు ప్రుక్కెఱటుంచున్. 650

క. అగ్నినిభై రౌద్రాస్త్రము ఘోరాగ్నేయాస్త్రంబు సేసి యవి పొడి యైన
న్భగ్నభ్రుకుటి యగుచు శర, మగ్నినిఁగాఁ జేసె నృపుఁడు మార్గణవహ్నిన్. 651

గీ. ఏసి విల్లు రెండు సేసి సూతుని మెడ, దీసి తెక్కెఱము వడఁ గ్రోసి పగతు
డాసి పార్శ్వచరులఁ గోసి వారనికిన్కఁ, జేసి లక్ష్మణుండు వాసి మిగుల 652

క. అస్త్రశిఖామణి యగు బ్రహ్మాస్త్రమున నభేద్యకవచ మతికాయు ధను
శ్శాస్త్రవిధిజ్ఞు వధించెఁ గృతాసుఁడు రాజసుతుఁ డగచరావలి పొగడన్. 653

వ. కుంభకర్ణుండునుబోని యతికాయుఁ గొండగూలిన చందంబునం గూలనేసి సింహనా
దంబు గావించుటయును. 654

క. వనచరులు సుమిత్రాసుతుఁ, గొనియాడుచు గుంపుగూడికొని చూడుచు రా
మునిఁ జేరఁ బోవుటయుఁ ద, మ్మునిఁ గౌఁగిటఁ జేర్చె నలఁచు ముదమున నంతన్.

క. రణహతశేషులు విఫల, ప్రణ శోషులు దైత్యవరులు వడిలంకాప
ట్టణమునకుఁ బాటి యటరావణుఁ గన్గొని యిట్లు లనరి వడఁకు నోడలితోన్.

గీ. సమర మొనరింపఁ జాలక, సమసె నృపవీరపుత్రితమట్కుఱము మేము
స్సమరవిముఖుల మగుచుని, సుముఖులము వచ్చితిమి నిశాచరనాథా. 657

వ. అని యిట్టిట్టివా రిట్టిట్టివారిచేతఁ దెగిరని నిరూపించి చెప్పి, యేకనిశ్చయంబున నద్వితీ
యం బగు సంగరంబు త్రిలోకభయంకరముగా నాచరించి సేనాంగచతుష్టయం
బులోఁ బంచత్వంబునొందె భవదీయపుత్రషట్కం బనుటయు సప్తవ్యసనపరిభూ

శా. ఉద్గ్రీవుండయి చూచి కంపనుపయిన్ హుంకారమేపార భా
స్వద్గ్రావంబునిగిడ్చి తన్నిహతిమూర్ఛం దన్నికొంచున్న నం
చద్దైవేయకచాపకంధరమిలాచక్రంబుపైఁ దూల ను
ద్యద్గ్రావంబున వైచె దానవుఁడు హాహాకారముల్సేయఁగన్. 710

వ. శిలాపాతంబున మూర్ఛితుండై పర్వతాఘాతంబున. 711

క. కంపనుఁడు పడినఁ గ్రోధనుఁ, డంపజడిభంబునిండ నంగదుఁగడిమిం
జంపుడునని రోసమున నిలింపులు గుంపులయి దివినిలిచి భయమందన్. 712

క. మూఁడుశరంబులురంబునఁ, గాఁడించి యిషుద్వయము ముఖంబుననేయ
న్వాఁడిశరంబుల నతనికిఁ, దోడుపడి ప్రజంఘుఁ డంగదుం దలఁకించెన్. 713

ఉ. మూఁడుఁ బదాఱునాఱు బదివాఁడిమమూఁడుఁ బదేడు నేడు నీ
రేడునిశాతబాణముల నేసి మదించి నంగదుండు దూఁ
గాడియు నీడఁబోవక మహోగ్రమహావృత్తి నగంబువైచి చ
క్రోడై ప్రజఘు నస్తకముఁ గంపను మూర్ధముఁ గ్రేణిసేయఁగన్ 714

వ. అదిగని క్రోధనుండు జంభాంతకపౌత్రుండగు ప్రజంఘాంతకుం దలపడియె, యూ
పాక్షశోణితాక్షులు మైందద్వివిదులను గుంభనికుంభులు సుగ్రీవపవనతనయులను
మకరాక్షుండు పుండరీకాక్షుండగు లక్ష్మణాగ్రజుం దలపడుటయుఁ దక్కినరక్క
సులు నయ్యాయి వనచరులం దాఁకిన. 715

క. కుంభములు పగిలిశోణిత, గుంభితగాత్రములఁ గాలికొండలభంగిన్
గంభీరవేదిపటుచుద, కుంభిసుతులుగూలెఁ బ్రధనకుంభినిఁ దఱచై 716

గీ. అంతమీఱి కంపనాంతకుం డంగదుఁ, డహితమార్గణంబు లన్ని త్రెంచి
తోఁకమెడకుఁ జుట్టి దుమ్ములుసలఁగంగఁ, జెండివిసరఁ గ్రోధనుండు గూలె. 717

క. ద్వివిదుండు శోణితాక్షుఁడు, వివిధశరములేయ వాని విరియించి విరో
ధివరూథిని తలఁకఁగవై, చెవనాటాగ్రేసరుండు శిలఁ దలవగులన్. 718

సీ. క్రుద్ధుఁడై యుద్ధసన్నద్ధుఁడై శోణితాక్షునితోడి యాతఁ డిషుదళకంబు
నాటింప వాని ఖండంబులు గాఁజేసి సాలంబుచే వనచరవిభుండు
వేఁడియు మైందుపై భిండివాలమ్ములుఁ బరశుముద్గరములుఁ బఱపియూర్వ
ద్వివిదుని సహాజుఁ డుద్వృత్తి నశ్వత్థశాఖల్వాటు మహీరుహములు వైచి యేచి
వానిఁ బెట్టుచిపట్టి వక్షుంబుఁ బిడికిట, బిట్టుఁబొడిచి కాలమెట్టి విడువ
శోణితము స్రవింపఁ బ్రాణంబు విడిచెయూ, పాక్షుఁ డక్షిగతుల నక్షులలర. 719

చ. పది నిశితాశుగంబులు నృపాలశిఖామణి నేయ రాముఁడుం
బదిశరముల్ విగిడ్చి పరబాణముల న్విదళింప వెండియున్
గదఁ గొని రక్కసుండు పరగం జనుదెంచిన నించుకేనియుం
బ్రిదులఁగనీక శక్తిఁ గడపె న్మకరాక్షుని శోణితాక్షునిన్. 731

వ. మకరాక్షుం గూల్చుటయుం దక్కినరక్కసులు. 732

క. తెఱమఁగఁ బెరిఁగెడు భీతి, న్వెఱగి పురము చొచ్చి దనుజవిభుఁ గన్గొని యం
దఱు వోర లీల్గుట యాతని, కెఱిఁగించిన నుల్కిపడి విహీనస్వనుఁడై. 733

వ. అగ్రభాగవర్తియగు నగ్రనందనుం గనుంగొని. 734

చ. తనయ మహేంద్రు గెల్చి యుదితంబుగ నొందినవాఁడ వింద్రజి
ద్ఘనతరనామధేయము జగంబున నీవ మగండవట్టి నీ
వనయముఁ బేర్చి శత్రునివహంబుల నోర్చి కరంబుఁ దండ్రి నె
మ్మనమునఁ బుట్టినట్టి పగమాన్పవు నీకిది వీరధర్మమే. 735

క. విస్ఫారంబు లజాండ ప్రస్ఫోటన మాచరింప రిపుల హరింపం
బ్రస్ఫురితధనుర్ధర బాహాస్ఫాలన మాచరించి యరుగు మనవుడున్. 736

సీ. తామసవృత్తి దోఁపఁ దత్తంత్రిఁ బఠించిన నింద్రజిత్తు సం
గ్రామ మొనర్చువేడ్క బలగర్వితుఁ డెంతయు నేకతంబునన్
హోమ మొనర్చి యందు దనరు మొందిన కృత్తి సహాయమొప్పఁగా
నామున దాడివెట్టెఁ జతురంగసమేతముగా నుదగ్రతన్. 737

వ. ఉత్తరద్వారంబున దండువెడలి శర్కరాసహితంబులై దారుణంబుగా నెదుర్కొను మారుతంబులను శివారుతంబులకుఁ దలంకక నడిచి వనచరబలంబుం గనుంగొని నిజబలంబునకుఁ జేయివీచుటయును. 738

క. పూనికఁ దనుశరకోటులు, నూనముగా విసరికొనుచు యుద్ధము సేయ
న్వానరతతు స్సేనా, కాననములు రక్తవర్షకలితము లయ్యెన్. 739

క. అంతట నధికాగ్రహుఁడై, యంతకనిభుఁ డింద్రజిత్తుఁ డద్భుతగతితో
నంతర్ధానుండై నభ, మంతయుఁ దాన యయి మిగుల నార్పులు సెలఁగన్. 740

చ. వితత ఘనధ్వని స్తనిత వీరఘనుం డిలు మిన్నుఁ బ్రాఁకి ఘో
రతమిగ మావహించి సమరస్థల మంబకవృష్టి భూతస
మ్మతరుధిరప్రవాహమున మానక ముంపఁ దరింపలేక దు
స్థితిఁ దమకూర్పు వుమ్మటిపొఁ దీరక వానరు లార్తనాదులై. 741

క. ఫల్లుకడి చూచుచుండ ర, ణోల్లాసము మెఱయ మఱియు నస్త్రాస్త్రములం
జెల్లాచెదరై పోవఁగ, నెల్లెడలం దానయై కపీంద్రుల నేయన్. 742

చ. దనుజుల యుబ్బుమీఱఁగ శతక్రతుజిత్ప్రథితాంబకంబుల
న్ననిఁ గిరిసేనఁ గాంచి రఘుముఖ్యుఁ డధిజ్యశరాసనుం డమో
ఘనిశితసాయకౌఘము నులుకం బరఁగించి విరోధిబాణఖం
డన మొనరించె భండనమునం బిశితాశుల రూపుమాపుచున్. 743

గీ. రఘుకులశిఖామణి భయంకర ప్రచండ, దనుజశరకోటి కపికోటిఁ దాఁకకుండ
నుదుశరంబుల మరలించుచుండె నింతె, కాని దానవుఁ డున్నెడఁ గానఁడయ్యె. 744

మ. దనుజుం డున్నెడ గానకున్నెడఁ బయోదస్ఫూర్తి నాకాశమె
ల్లను నీరంధ్రము గాఁగ నెంతయు రణోల్లాసంబు మీఱన్ దశా
ననపుత్రాగ్రణి వెండియుం బెరిఁగి నానాఘోరఘోరాస్త్రసం
క్తి నిగుడ్చ రఘునాయకుండు కనలం గెంజాయ రంజిల్లఁగన్. 745

చ. గుమివడి సుప్రయోగవిశిఖుం డితఁ డంచు సుర ల్నుతింప డెం
దములకు నొంది సద్దశరథక్షితిభృత్తనయాగ్రజుండు బ్రా
ర్థ్య మినమడింప భీకరమహాస్త్రము నాంగిరసప్రశస్తము
న్నుగ్గు మెఱయు నారిఁ గూర్చి రిపుఁ గూర్చి కడుం దెగలాగి యేయుఁడున్. 746

క. దిగ్ధ మొనరించె నధికవి, సిగ్ధముగా నక్కడంబడహానము పేర్మిన్
స్నిగ్ధాయుణసాంద్రతరా, స్పృగ్ధారాపిహితమూర్తిఁ జెన్నఁటికృత్తిన్. 747

క. కృత్తియపు డివ్విధంబున, మిత్తి గొనిన శాంబరీతమిస్ర మడఁగుడున్
మత్తుఁ డగునింద్రజిత్తుండు, చిత్తమెఱియఁ దోఁచెఁ గపులచిత్తములలరన్. 748

క. మరుదుపకారపరాయణ, మరుదాదేశమున రామమహీకాంతుం డాం
గిరసాస్త్ర మేసి కృత్తిం, బరిమార్చన నంత బయలు పడియు వెఱవమిన్. 749

చ. తనరథ మెందు నప్రతిహతంబయి వర్తిలుచుండ వాలినం
దనరవిపుత్రమారుతసుతద్విపముఖాత్మభవాత్మభూకుమా
రనలసుషేణముఖ్యులు ధరాధరభూమిరుహాశ్మజాలము
ల్పరగున నింపఁ బిండిగ రజంబుగఁ జూర్ణముగాఁగ నేయుచున్. 750

క. ఉన్ముఖుఁడుగాక యాహవ, మున్ముఖ్యుల నేపడంచి మాయాప్రౌఢిం
గన్మొఱఁగి యింద్రజిత్తుండు, సన్మాన్యుఁడు తొలఁగి చనియె సమరంబునకున్. 751

వ. చని హోమోపాయుండై. 752

ఉ. పాతకవృత్తితోడ ననపాయత హోమము సెల్ల శాంబరీ
సీతనమర్చి సంగరము చెంతకు వేకొనివచ్చి వానర
వ్రాతము చూచుచుండఁ దల వ్రక్కలుసేసె నిశాతహేతి దుః
ఖాతిరయంబున రఘువరాయని యేడ్చుచు నేలవ్రాలఁగన్. 753

క. మాయాసీతం గపటో,పాయంబున నిట్లు చంపి ప్లవగబలము లా
హా యని వగ నొందఁగ నస,హాయుండయి నికుంభిలకు రయంబున నరిగెన్. 754

వ. అరిగి స్థండిలాసీనుండై. 755

క. రిపువంశభయంకరము, స్వపక్షశుభద మగు నాభిచారికహోమం
బపరిమితక్రోధహృదయుఁ, డుపక్రమించి యతఁ డద్భుతోత్సాహమునన్. 756

వ. మధురమధూక మదిరాసర్షప విశేషస్నిగ్ధకోమాంసంబులవలనను దధ్యాజ్య
తైలాద్యాహుతిబహుళంబు వలనను దేవముఖు సుముఖుం గావించుచుండునంతఁ గల
హాముఖంబున. 757

ఉ. ఋశ్మసుత నిశ్చయంబుగ నిశాచరఘాతకృపాణిధారవీ
తాసుత నొందె నింకఁ గలహం బొనరింపఁగ నేటి కంచుఁ దా
రాసుతముఖ్యు లున్నయెడ రాఘవులం గని విన్నవించె ఘో
రాసురకృత్య మంతఁ బవనాత్మజుఁ డాత్మ విచార మందుచున్. 758

క. అశ్రుకలితాననయు నై, న్యాశ్రయహృదయయును నై ధరాత్మభవ విశే
షశ్రమమున నేడ్వ నసంశ్రితుఁ డదయుఁడయి చంపి పడవైచె ననన్. 759

క. విని వినిహతమతులై యి,ట్లని రని పని దీఱెఁ గటకటా విధిచెయిదిం
దనతను వభివినుతసతీ, జనజనకజ త్రుంగెనే నిశాచరుచేతన్. 760

గీ. అనుచు వఱిజయు నర్ధరాత్మజఁ దలపోసి, వసరి వసరి యొకట వసుధ కొరగి
రధికవాతవిపతితాశ్వకర్ణకయుగ, భంగి గాఁగఁ బ్లవగబలము లడల. 761

వ. మృతులచందమున మూర్ఛితులయి మహీతలంబునం బడి రంత గొంతవడికిఁ దెలిసి
రామచంద్రుండు ప్రేమాతిరేకంబునం బ్రేయసిం బేర్కొని. 762

చ. విధిఁ బతిఁబాసి శోకమున వేఁగియు నెన్నఁటికైన భర్తృస
న్నిధిఁ బడయంగఁ గాంతునొకో నేనని ప్రాణముఁ జిక్కఁబట్టి వా
ర్నిధి నసురాధివాసమున నింద్యచరిత్రవు గాకయున్న దో
షధనుఁడు నిన్వధించెనె కుజాత ప్రభాతకజాతలోచనా. 763

క. నను మాయలేడిఁ గొని తె,మ్మని పనిచిన నాఁటఁ గోలె నతివ భవద్ద
ర్శనమెన్నఁ డగునొకో నా, కని తలఁచెద నత్తలంపు వ్యర్థంబయ్యెన్. 764

వ. నాకు నీతోడిద లోకం బగుంగాక యన్యథాత్వం బగునే యని నిజచరణసమీపం బునం బలవించుచున్న సుమిత్రానందనుం గనుంగొనుచు దుఃఖాతిరేకంబున వడలుచుండ నఖిలవానరులు బాష్పాకులలోచనులై చిత్రరూపంబులం జిత్రరూపంబులై చేష్టలు దక్కియుండిరంత నేతెంచి. 765

ఉ. భీతివిదూరచిత్తుఁడు విభీషణుఁ డెంతయు భక్తియుక్తుఁడై
చేతులు మోడ్చి యిట్లని వచించె మహీధవ భ్రాతధారుణీ
జాతకుఁ జావు గల్గుట మృషాస్థితి దుఃఖము దక్కు మాఖలుం
డీతెఱఁ గాచరించెఁ గపటేచ్ఛుఁడు నెమ్మది వేగుఁ బెట్టఁగన్. 766

వ. అంతియకాని నిశ్చయంబుగ జానకి వధింపఁబడలేదని సమ్మంబలికి వెండియు నసుర కులవిభూషణుండగు విభీషణుం డిట్లనియె. 767

క. ఉద్ధామభయద మగునే, తద్ధోమము పూర్ణమగుడుఁ దజ్జనితమహా
యుద్ధోపకరణధరుఁడై, సిద్ధ మతం డనికి వెడలి చెనకి జయించున్. 768

ఉ. చెప్పెడిదేమి బ్రహ్మకు నజేయుఁడు వాని నెదిర్చి చంపఁగా
నిప్పుడ లక్ష్మణుండనువు మీ వన రాముఁడు సంతసించి నీ
యప్పని నిర్వహింపు మనుజా యన భక్తి నమస్కరించి పెం
పొప్పెడు దీవన ల్వడసి యుగ్రధనుశ్శరచాపహస్తుఁడై. 769

క. పవనజవతిరస్కరణముఁ, బవనజరథ మదయశిఖరి భానుపగిది నె
క్కి విభీషణుండు ముంగలఁ, గవిభీషణవృత్తి వెడలెఁ గలహంబునకున్. 770

క. కనకాచలనిభతనులఁ, జనపద్వశకద్వశకర్కశశరీరులు గా
లనిబిడజీమూతతులిత, ఘనదేహులు కీశభల్లుకనృలాధీశుల్. 771

ఉ. తారమరాద్రిఁ బోదముఁ దన్ని పగుల్పఁగ నోపువారు దు
ర్వారరదంబునం బలసి రాఘవవంశవరేణ్యుఁ డెంతయుఁ
దూరము వోయి దైత్యపరిదుష్టవిహారమున న్నికుంభిలా
ద్వారముఁ జేరి శాత్రవభినాచణచిత్తుని శక్రజిత్తునిన్. 772

చ. కని రిపుహోమకర్మము నిఘాతము సేయఁదలంచి వానిని
ల్పిరి చతురంగసైన్యములు పేనఁగు వెంటలు గాఁగ నుజ్జ్వల
త్పునిశితసాయకాలి ప్లవనూనుఁడు దానిగిడించెఁ గ్రవ్యభు
గ్వరవరద్విపక్షభూణడశిఃతమదద్విగుణాద్యుభటావళిన్. 773

ఉ. అంతిరమున్న వానరబలాంబుధి వాలకరంగకోటితో
నెంటియుఁ జేరి దానవబలోద్ధహారేణువు లిట్లు ముంచి బ

ల్వింతరణంబుమీఱ నతివేలపరాక్రమవృత్తి నొందుఁ గా
ద్యంతము గాంచి ఘోర బడబానలతుల్యమహారథస్థుఁడై. 774

క. యుక్తాభిచారహోమ,వ్యక్తుఁ డగుచుఁ బంక్తిముఖసుతశ్రేష్ఠుండా
రక్తనయనుండుఁ గలహో,ద్యుక్తుఁడునై యిల్లు వెడలి హుంకారమునన్. 775

వ. మెఱుఁగు మెఱసి నచందంబునఁ గొఱవి గిరగిరఁ ద్రిప్పినప్రకారంబున ఝుంఝూమారు
తంబు మూర్తీభవించిన తెఱంగున దశదిశలం దాన యై కడంగి. 776

శా. చాపం బింద్రధనుస్సుగా నెసఁగు పర్జన్యుండు గాఁ దాను ద
చ్చాపోద్యత్ప్రరుచుల్ దటిత్సమితిగా జ్యానాద సభ్రధ్వని
వ్యాపారంబుగ నారణస్థలవనాటారణ్యమున్ ముంచె భీ
మాపాద్యంబకవృష్టిశోణితము కల్పాగ్రక్రియం దాఁ బొఁగన్. 777

క. లెక్కయిడరాని ప్లవగుల, నొక్కొక్కని గగణితాంబకోత్కరములచే
నుక్కెఱయ బ్రుక్కించుచు, నక్కజమయ్యెం దివాంధసావలి కంతన్. 778

చ. కొగడుపడంగ నిట్లు ప్రతివీరుల నెల్లఁ గలంచి యాడి శ
క్తిగరిమ లక్ష్మణుం బ్రచురతీవ్రశరంబుల నొవ్వఁజేసి గం
ధగజముభంగిఁ బంక్తిముఖనందనుఁ డెంతయు వంచనామతి
న్మగుడఁగ నేగె హోమము సమాప్తముగా నెఱవేర్చుపూనికన్. 779

క. చని హోమంబు సమాప్తం, బొనరింపఁదలంచి యాతఁడున్న సుమిత్రా
తనయునకు విభీషణుఁ డిట్లని యెం గార్యదశ దెలియునట్లు నిపుణతన్. 780

క. అవశిష్టహోమకర్మను, పవనీళ ఘటించి మగుడ నరుదెంచిన దు
ర్వ్యవసాయు వీనిఁ జంపఁగ, నవశమగుం బొడువ నిదియ యవసరమనుడున్. 781

క. క్రమ్మన కోపమ్మున న,గ్రమ్ములగు శరమ్ముల నికరమ్ములు పఱపెన్
సమ్మెటప్రేటులటంచు న,దమ్మదపాతమ్ము లనుచు రావణి నొవ్వన్. 782

వ. వెండియుం జండకాండంబు లొండొండ దండోద్దండంబులుగా నిగిడింప నింద్ర
జిత్తు మండిపడి. 783

క. అపగతహోమకలాపుఁడు, వ్యపగతనిజసైన్యభీకరాలాపుఁడు న
త్యపగతకోపుఁడునై బిట్టుపగతుఁడై నేగు నాతఁడు మహోగ్రుండై 784

వ. విభీషణుండు దృగ్గోచరుం డగుటయు సహింపని రోషాతిరేకంబున. 785

క. కన్నకొడుకు నట్టిఁడ నా,కన్నకొడుకు వీఁ డటున్న కరుణామతి లే
కన్న ననుఁ జంపఁబో నీ,కన్నను వేఱ పగతుండు గలఁడే నాకున్. 786

గీ. శరణుఁ జేరి బంధునాశంబునకు నోడి, గట్టి దయయు నీతి గట్టి పెట్టి
నాఁడ పట్టినీవు నాకు నెక్కుడిపిన, ఇంద్రపదుఁడు నతఁడు తత్క్షణంబ. 787

సీ. సద్విభీషణవృత్తి సద్విభీషణుఁ డిట్లు పల్కె దురాత్మ నీబాంధవంబు
చాలు పోనికి నోర్వఁజాలక బలవద్విరోధంబు వలదని రూఢభంగి
నీకు నీతండ్రికి నేనెంత యుక్తి చెప్పిన నిడుఁగొల్వఁ బ్రియము లేక
యభియాతిరీతి నాకభిభూతి యొనరించినందున మిమ్ముఁ బాయంగవలసె
నదియుఁగాక దుష్టమైనబంధుజతి విసర్జనీయమంత్రు సజ్జనుఁకు
నాఁటిమాటలాడ నేటికి నేఁటికి, మృత్యువశుఁడ వైతి వృపతి హోతి. 788

చ. అనవుడుఁ గోప మెక్కి నరులా కలహంబున నిగ్గయించు వా
రని వెసఁ జాప మెక్కిడి జయానకము ల్మొరయంగఁ గ్రవ్యభు
గ్జవనుఁడు త్రోఁక ద్రొక్కిన భుజంగమపుంగవుచంద మొందినన్
దనుజులు పోక నిక్కఁ బ్రమదంబున మార్కొని రిస్త్రసైన్యమున్. 789

క. మార్కొనుటయుఁ గపిబలము నెదుర్కొన నమ్మానలు రెండు దుర పోరించెం
జేర్కొని నెత్తుర పుడమిం, జేర్కొన భూమిచరఖచర భీకము గాఁగన్. 790

వ. తత్సమయంబున విభిన్నరథాంగంబును విశీర్ణపుండరీకంబును విసష్టహరిప్రతాపంబును
విజృంభమాణరాక్షససంచారఘోషంబును విస్ఫూర్తమానసన్నక్షత్రప్రకాశంబును నై
సంధ్యాసమయంబునుంబోలె. 791

గీ. వరమరుత్సుతభుజపీఠి మరిదహోగ్ర, శిఖివిస్ఫురితంబగు సింహమనఁగఁ
బొల్చు సౌమిత్రి శరవృష్టిఁ బొడిచె బంక్తి, కంధరసుతుండు కంధర క్రమము గాఁగ. 792

గీ. పాడివి చిక్కితెందుఁ బోయెదు నిలుమని, చులుకుమాటలాడి కలకుటమ్ము
లాలునాలు వైవ నన్నిబాణంబులఁ, ద్రుంచె వాని నృపసుతుండు కనలి. 793

ఉ. త్రుంచి దురాత్మ నీశిరముఁ ద్రుంచెదఁ బేలకు మంచు దైత్యు ల
క్షించి ప్రమత్తశత్రువినికృత్తవరంబు శరంబువింటు సం
ధించి బలంబునం దిగిచి తెంపున వానిమహోదరంబు భే
దించిన మృత్యుసంగతుఁగతి న్మహి నాతఁడు వ్రాలెఁ జెచ్చెరన్. 794

క. తెలిసి నరాదుఁడు పొలిపై, బలిసెఁ బ్రమథంబు పోవుభంగిఁ జనుటయుం
దెలిసి నరేంద్రుఁడు వానిం, బలిసిన రక్కసులు వెఱగుపడి పఱవంగన్. 795

శా. క్రాంతాక్షిసుతుఁడు రఘువ్రుఁడ దోర్వీర్యంబు నిండారఁ జం
డక్రోధంబున వైరిభీకరధనుష్టంకార మేపార శా

గీ. గంధవహసుతుమాఱు వక్షంబు నాటు, నైనుసారాదనులఁ జేసి యార్చుటయును
సమరలంపటుఁ డహితురథ్యములఁ నేలఁ, గూలఁగా నేసె మెఱుఁగారు కోలఁ జేసి

వ. లక్ష్మణుండు తోడన వాని కోదండంబుఁ దుండెంబులు గావించుటయు నింద్రజిత్తు.

మ. విరథుండు న్విశిఖకృత్తచాపుఁడును నిర్విణ్ణాంతరంగుండునై
సురసంఘంబులు పిచ్చలింపఁగ మహోపుస్తోమము ల్వించె భా
స్వరకోదండ మొకండు పుచ్చికొని తచ్చాపంబు ఖండించిన
స్వరయం బారఁగ నొండు విల్లుగొనిన జక్కాడె నద్ధ్వయమున్. 810

ఆ. వింటు లెన్ని యెక్కువెట్టిన నన్నియు, నుగ్గుఁ జూచి దైత్యుఁ డుక్కుదక్కి
యధికదుఃఖమగ్నుఁ డై యిట్లని తలంచె, హృదయమునఁ బ్రమత్తుఁ డింద్రజిత్తు. 811

తే. శంబసదృశంబు లస్మత్కులంబములు గుళంబముల పోలె నాటవు లక్ష్మణునకు
శంబసదృశంబు లగుచుఁ దదంబకములు, తనువు నొప్పించు నెంత యుఁ దనువులయ్యు.

ఉ. ఇంద్రు జయించి తద్విభవ మెల్ల హరించి విరించిచేత ము
న్నింద్రజిదాఖ్య దంబు జగ మెల్ల నెఱుంగఁగఁ గొన్నయట్టి దై
త్యేంద్రుఁడ నైన్రేంద్రుని జయించుట దుర్లభ మయ్యెఁ బ్రీతిన
య్యింద్రుని బ్రోచు వేఱొకఁడు పేంద్రుఁడు మానవమూర్తి యయ్యెనో. 813

క. అని తగచి మతిమఱఁ పన యే, సినశక్తిప్రముఖములు నశించిన లజ్జా
వనతాననుఁడై లక్ష్మణు, నని బాహాబాహిఁ బెనఁగ నాలోచించెన్. 814

క. ఈరీతిఁ దలఁచి రణమునకు, కోఱలు వెఱిన మహోరగునికైవడి వి
స్తారాయమ్మంబుఁ బ్రతి, వీర నెముచ్చుటయును వాఁడు వవిగళాగ్రహుఁడై. 815

చ. అపుడు గశక్రదత్తమగు నస్త్రము నారి నమర్చి పేర్చి సు
స్థిరభుజశక్తి లక్ష్మణుఁడు శీఘ్రగతిం బరఁగింప గుండల
స్ఫురితము దైత్యమూర్ధము వసు ధఁ ద్రెళ్ళె మహోగ్రగాహతో
ద్ధురమరుదుర్విభృచ్ఛిఖరితో యమునన్మహిఁ సంచలింపఁగన్. 816

క. తలఁకుడుగ నింద్రజిత్తుని, తల కుండలకర్ణశోభితం బగుచు మహీ
తలము దిగఁద్రుఁగ నమ్మెన, తలపడిరం గపుల కతిముదం బొరింఁచెన్. 817

వ. తత్సమయంబున. 818

శా. కాసారంబులు నిర్మలోదకములై కన్పట్టె లోకంబు శో
భాసారం బయి తెల్విఁ దాల్చె దిశలు న్భాసిల్లె నంతేనియు
న్నాసాంద్రప్రఫలీకృతార్థకమునకు ధస్ఫారమందార సూ
నాసారంబులు పెల్లుగ్రగ్గె సురవేశ్యాలాస్యములెల్లెఁగన్. 819

క. సురదుందుభిరవములు వానరుల జయజయధ్వనులు వినంబడె ధరణీ
వరుఁ డబ్ధి నీఁది పారము, వెఱవుఁ గనుఁగొన్నవాని విధమున నలరెన్. 820

వ. మహానందంబున నిజయోధవీరపరివృతుండై నికుంభిలాద్వారంబు వెడలి వచ్చు నవస
రంబున. 821

సీ. మలయశిఖరాధరోజ్జ్వలహరిచందనవృక్షవాటికలతోఁ బెనఁగులాడి
గంభీరతరవిశాలాంభోనిధితరంగశీకరంబులతోడఁ జెలిమిచేసి
మల్లికాజాతిచంపకకురవకసుమోపవనంబులను బూలబంతులాడి
భాస్వద్భ్రమద్ఘనీవికస్వరకాంతస్వర్గాంబుజాతముల నుయ్యాలలూఁగి
నందనంబున మందయానంబు నేర్చి, చైత్రరథమునఁ జైత్రుతో సరసమాడి
నట్టియురుదక్షిణరము హర్ష మావహించె, భాసితులకు మరుత్సుమిత్రాసుతులకు. 822

వ. పిదప నమ్మహావీరుం డగులక్ష్మణకుమారుండు విజయవార్తాశ్రవణకుతూహలాయత్త
చిత్తుండగు రామచంద్రున కనతిదూరంబునఁ గపిరథావతీర్ణుండై. 823

క. రూఢధృతి నేగి వినయో, దూఢశిరస్కుఁడై చరణతోయజముల కా
రూఢప్రౌఢిమ మ్రొక్కుడు, గాఢాదరతత్పరమునఁ గౌఁగిటఁ జేర్చెన్. 824

క. స్నేహ మిగురొత్తఁగా నుప, గూహనసౌఖ్యంబు నొంది కొనియాడె మహా
సాహసు దానవవీరు ఘ, నాహవమునఁ జంపినాఁడ వనుచు నృపతి సుతున్. 825

క. దేవాసురవరు లోకఖ్యాతి, దైవచ్చినఁ జిక్కఁ డమ్మహామాయికుని
న్నీవు వధించిన నన్మద్భావం బానందపూర్ణమగ్నం బయ్యెన్. 826

వ. అని వెండియు ననేక మధురవచనముల నగ్గించుచు దారుణవిపక్షబాణక్షతశతం బగు
సహోదరుదేహంబు నిమురుచు నిట్లనియె. 827

క. నీ వింద్రజిత్తుఁ గూల్చితి, కావున నే నెల్లభంగి ఖండింతు దశ
గ్రీవుని దురమున మనసు, గ్రీవాదులు చూచి మిగులఁ గీర్తింపంగన్. 828

వ. అని తదనంతరంబున. 829

ఉ. సన్నుతు లొప్ప మారుతిఁ బ్రశంస యొనర్చి విభీషణుం గడు
సన్మానమాటలం దనిపి మర్కటకోటి బహూకరించి శై
రోక్షోన్నతి రావణుం దునుమ నున్న యెడం దదనీక మెంతయుం
జెన్నువహించెఁ బున్నమ నిశిన్ శశిఁ గన్నపయోధితోయమై. 830

క. అట దశముఖుండు భయదోత్కటసంగరమున సుతుండు గడతేఱుట నె
త్తుటఁ జేఱుట కేహావిముఖభటులవలనఁ దెలిసి వివశభావుం డగుచున్. 831

క. శరదంబుదములకై వడి, నరసంబులు మిన్ను ముట్టి యరుగఁగ నడిచెన్
ద్విరదంబులు మహిఁ దడుపుచు, శరదంబులభంగి మదరసస్రావములై. 853

క. సురరిపుతురగఖురాహత, ధరారజఃపాతమున గదా గంగాభా
స్వర్కార్తస్వరజలజము, లురుపంకజములుఁ బరాగయుతములు నయ్యెన్. 854

వ. బహుబాణప్రదీప్తంబు గావున వనరాశిచందంబున సారస్యందనంబు గావున వనరాశికై వడి భయంకరాంతరంబైన యమ్మూలబల వలాహకపటలంబు నిబిడంబై శరాసారంబున ముంచుటయుఁ బెచ్చు పెరిఁగి యవ్వనచర సేనాసస్యంబును దలమీఱి కవిసె 855

క. వ్యూహములు రెండు నమితో, త్సాహమునఁ దలాతలింగ చాకచి బాహా
బాహి నఖానఖి సమ్మర్దాహవ మొనరించె ఖచరు లచ్చెరుపడఁగన్. 856

చ. అమృతనిమిత్తపూర్వవిబుధాయరసంఘములట్లు చండవి
క్రమమున దైత్యభూరుహచయప్రకరంబులు పోరొనర్చినం
గ్రమమున నేలవాలె రుధిరం బది సంకులకాననాంతర
స్థమగు ప్రశోణగైరికవిశాలరసాలలితప్రవాహమై 857

క. పలువురు బలియు లొకనిపై, నలుకక మార్కొని పెనంగు చుట్టి యెడలు న
ప్పలువురు బలియుర నొకఁడుఁగ, నలి మార్కొని చలమునం బెనంగెడు నెడలన్.

సీ. పాషాణములు పిండిభంగి రాలెడుచోట్లఁ బాషాణములఁ దలల్ వ్రయ్యలౌచోట్లు
విచ్చుకత్తులు పట్టి విఱిచెడు నెడలును విచ్చుకత్తుల కొడలిచ్చు నెడలు
భూరుహంబులు చూర్ణముగఁ జేయుపట్లును భూరుహంబుల మృతిఁ బొందుపట్లు
బాణజాలంబులఁ బాఱఁద్రోలెడునిక్కలు నమిత బాణంబుల నడఁగునిక్క
లేనుఁగుల గుఱ్ఱములఁ బడనేయుతావు, లేనుఁగులు గుఱ్ఱములచేత నీల్గుతావు
లాఁకలు తలములు నొరగింప నున్నతలను, లమ్మెఱవచరదైత్యసైన్యములు.

వ. అయ్యుభయవాహినీమోహనాథు లామోహనధను లోహటింపక యోహారిసాహారిం బెనంగులాడునప్పుడు కేలువడినం బెఱకేలఁ బరాక్రమించువారును దలలువడినను లక్ష్యంబులం బడనేయువారును జిక్కువడియు నుక్కుదక్కనివారును బ్రేవులు వ్రేలాడినం బేరువాఁడిం బోరాడువారును బ్రాణంబులు విడిచియు గృపాణంబులు విడువనివారును రుధిరంబునం దడిసియుఁ జలింపనివారును జచ్చియు ముఖంబులఁ గ్రోధంబు డింపనివారును విచ్చియుం బెచ్చుపెరిఁగి కమ్చుకొనువారును గాలుసేతులు దునిసియుఁ గఱవ నప్పళించువారును బడియుఁ దుం బోవపోకు మనువారును సహాయులు మన్నిగొనినను కొన్నివారును నై రయ్యవసరమ్మున. 860

క. కుల్యాశకలసైకతములు, శల్యతటంబులుఁ గబంధశవమీనంబుల్
కాల్యాసవాబ్జములు స్రుక్కుల్యాశతములును సమరసంభిని వెడలెన్. 861

గీ. ఘోరవిజయశంఖభేరీరవంబులు, హుంకృతులును జాపటంకృతులును
జిత్తభద్రదకరణి సింహనాదంబులు, సంగరంబు ఘోరభంగి యయ్యె. 862

క. అసురాశరాగ్ని ప్రఘనక్రోధసమీరోద్రేక మగుచుఁ దఱిమికొని వనా
కసమన్యాహవము నే, యుపమయమున రాఘవుఁడు మహోగ్రుం డగుచున్. 863

క కందబ్జేక్షణములఁ గ్రోధనదేక్షణము లొనరించి కపు లలరఁగ న
జ్జనములనాథుఁడు పలభో, జనకులనాశన మొనర్చె సంరంభమునన్. 864

క. ప్రత్యాలీఢస్థుఁడు శత, ధృత్యండస్ఫోటనరణధికార్కాతరం
కృత్యనుపమచాపధరుఁడు, ధృత్యతిశిష్టుఁ డయి యోగిచెఁ దీవ్రాంబకముల్. 865

వ. ఎడమడుము నద్దివ్యశరంబున ననేకఘోరసాయకంబులు భూనభోంతరాళంబు నిర
వకాశంబుగా నుద్భవించి. 866

సీ. కఠినదానవకాలఖండంబులను జేర్చి పొడవైన యెముకలు పొడుముచేసి
మేదరమవహాస్తిమేదము ల్గరగించి కమనీయతరభటాంగములు తఱిగి
తీరథావయవములు చికుకులు గావించి సాంద్రశోణితరక్తజలముఁ జేర్చి
యుత్తమవోధులచిత్తంబు లుడికించి కంఖాణఘోణాప్రకరము గాల్చి
ప్రకటఘోరకపాలపాత్రికలు గూర్చి, సూపకట్టింపులు చేసె భూతావళులకు
రణమహానసమున దశరథమహీశతనయుశరములు చిత్రనూపజనులట్లు. 867

సీ. మానవాధీశ్వర మార్గణావళు లేచి యమరపిరోధికంఠములు వెదకు
భూమీశ్వరునిశరంబులు మట్టుమీఱుచుఁ గట్టిడిదనుజాల బిట్టు ముంచుఁ
బార్థివాధ్యక్షునిపత్రులు బారులై రాక్షసశ్రుతికోటరములు దూఱు
క్ష్మానాయకశిలీముఖంబు జలిరేఁగి పలలభోజనముఖాబ్జముల ప్రాలు
క్షత్రియాన్వయభవదాశుగములు మీఱి, ఖలనిశాచరకఠినాంగములు స్పృశించు
నద్భుతావహము లగుచు నౌర రామ, చంద్రుసాయకజాలము లన్వర్థకములు. 868

క. వచ్చినవారల నంటఁగ, వచ్చెనె యని రాముబాణవర్గ మసుపులన్
గ్రుచ్చికొని యొడల నుండక, వచ్చినదారి కతఁ డంటఁబడఁగ వేగన్. 869

క గుడుసుపడు వింటి శరములు, దొడగుటయు వాపుటయును దోఁప దసురలపైఁ
బడుటయును దనుజు లవనిం, బడుటయును దోఁచు నొక్కభంగిన యెపుడున్.

వ. వెండియు శ్రీరామచంద్రుండు. 871

సీ. పసుగుర నూర్వుర వాణరజ్జువులచే గుదిగ్రుచ్చు నొకవేళఁ గోపి యగుచు
మంత్రించి పఱద్రోయుమూఁడ్క నేనుంగులఁ బడనేయు నొకవేళ భయదుఁ డగుచు
భూరికదంబము ల్పుంఖానుపుంఖము ల్విగిడించు నొకవేళ నిపుణుఁ డగుచు
దానవోపాకృతతతి మార్గణాగ్ని కాహుతిసేయు నొకవేళ నుగ్రుఁ డగుచు
దనుజతతుకవాటపాటన మొనర్చు, ధారుణీనాథుఁ డొకవేళఁ గ్రూరుఁ డగుచుఁ
దాళఫలముల పోలికిఁ దలలు గూల్చు, భూదయితుఁ డొకవేళ సన్నోసుఁ డగుచు. 872

ప్రగ్వీణీ శ్యామమై కీకసంబు రేకెత్త సంగ్రామభూమీధరాగ్రస్థమై శస్త్రచ
స్థామితప్రౌఢి దైత్యాటవి నస్మంచె శ్రీరామరాజన్యధారాధరం బీక్రియన్. 873

వ. అర్ధనుర్విద్యాపారంగతుండు దోర్గరిణపాండిత్యంబుఁ జూపుటయుం జతురంగం బగు నమ్మూలబలంబు శల్యసంకీర్ణ కంటకక్షితిజాతం బగు దుర్గమారణ్యంబునుం బోలె నందుఁ గపాలంబులు శిఖాలంబు లగువారును ప్రభ్రష్టకంబులు ప్రభ్రష్టకంబు లగు వారును గండంబులు ఖండితంబు లగువారును ఖండంబు లగు వేదండతుండంబులును జీర్ణంబులు నగునశ్వకర్ణంబులును విరూపంబు లగు రూపంబులును రజంబు లగుధ్వజంబులును భూతంబు లగుభూతంబులును గల్గి పుండరీకపుండరీకంబును శిలీముఖశిలీముఖంబును రథాంగరథాంగంబును బరాగపరాగంబును భంగభంగంబును రక్తోత్పలరక్తోత్పలంబును వాలశైవాలంబు నగుసంగరసరోవరంబు రౌద్రబీభత్సాద్భుత భయానకంబులకుఁ దానకం బై యొప్పె. 874

క. చాయకరకుంభకుచరక్తోరుఘుసృణమూలబలపయోజవదన తాఁ
జేరం జాలదు రామున్మారపురుషనాయకు ప్రసజోవతి యగుటన్. 875

తే. లపనములు పిండి యైన విలపను లగుట, చరణములు నఱుకయిన విచరణు లగుట
హస్తములు దెగిపడిన విహస్తు లగుట, నద్భుతావహ మయ్యె నయ్యాహవంబు. 876

క. మూలబలమహోర్మ్యన్నాళము రామాశుగప్రమూల మని మహీ
పాలు నెదిరించె రక్షఃపాలుఁ డలుకమీఱ సైన్యపాలుర మెచ్చన్. 877

వ. నిజకాంతిపరిహాసచంద్రికావికాసం బగుచంద్రహాసభయదాట్టహాసభాసురుండై రామచంద్రుపై రావణుం డురవడించుటయుం దనుజభటపరిస్పృతుండై. 878

క. ఎత్తిచని విరుపాక్షోన్మత్తులను సుపార్శ్వుఁడును వనచరబలము న
న్నెత్తురుఁ దలఁపడిపోరెను, నత్తఱి భండనము గడు భయంకర మయ్యెన్. 879

క. ప్రేవులప్రోవులు పాదవగు, దీవులుగా నెమ్మి లిసుకతిన్నెలుగా బా
ణావలి తరగలుగా రక్తావిలకీలాలసంగరాంబుధి మెఱసెన్. 880

క. ఆతఱి నరుగున వచ్చి విరూపాక్షోన్మత్తుల మహాపాశ్వాయత్తుల యు
ద్ధక్షోణికి బలిగాఁ దద్వక్షంబులు భానుసుతుఁడు వ్రక్కలు సేసెన్. 881

తోటకము. అంగదుఁ డంతట సంగము పొంగం, దుంగరసాలము తూర్ణము గాఁగన్
బ్రుంగఁగ దానవపుంగవు నెమ్మొ, న్భంగము నొంది సుపార్శ్వుఁడు వ్రాలెన్. 882

వ. నిజపార్శ్వవర్తులును మత్తులు నగు సుపార్శ్వవిరూపాక్షోన్మత్తుల మృతిగొనుటం
గనుంగొని రోషాతిరేకంబున. 883

క. దశకంధరుండు కార్ముక, దశకంధరుఁ డగుచుఁ గీశతతి నెంతయు దు
ర్దశనొందింతు ననుచు నిజ, దశనంబులు గీఁటుచును రథంబు మెఱయఁగన్. 884

గీ. వాన గురిసినక్రైవడి వడిగ నిసుము, చల్లినట్టులు విడుశలభాలిభంగిఁ
దెఱపిలేకుండఁ దొరఁగించె దివ్యబాణ, పటలి నొక్కట విపినాటభటులమీఁద 885

వ. సంవర్తసమయసంవర్తంబోలె విజృంభించి. 886

మహాస్రగ్ధర. పదిచండాస్త్రంబులు న్మృత్యుదిపనిశితరోపంబులు న్నాల్గుశాత
ప్రదరంబుల్ వైచి శౌరిం బవనతనయునిం బాకభిత్పుత్రు నొంప
న్మదులై యమ్మువ్వురుం దన్మకుటములదర న్మావులు న్మొంప నాదు
గ్రహాదయుం డాజ్యాహుతిం బేర్చుహుతవహుఁడో యీతఁ డంచుం దలంకన్.

లలితపదము. పెరిఁగి దివౌకసభీకము గాఁగం, దయచరవంశవితానము నెల్లన్
శరబహుళాగ్ని జ్వాలల పేర్మిం, దరికొని కాల్చు హుతాశనమూర్తిన్. 888

వ. దశకంఠుం గనుంగొని రాముండు సయిరింపక. 889

లయవిభాతి.

రభసత నెదిర్చిభుజగభ సదముఁ గార్ముకముఁ బ్రభ మిగులఁ దాల్చి నరవిభుఁడభయవృత్తిన్
గుభగుభయనస్వనము నభమువియ నున్మద దిగిభములాగి మూర్ఛగొను భుభృతతికిన్ రతే
విభవమొసఁగం ద్రిదివసభ పొగడ మీటుచును శుభభరితదృష్టిఁ బ్లవగభటతతివార్ష
ప్రభవ మగుచుండ రవినిభశరముల న్విసరెఁ గుభృదధిపుమీఁద నెగుచుభిదుగమట్లున్.

కవిరాజవిరాజితము.

తనపయి నిట్లుమితం బగుబాణవితానము వైచినఁ దా నలుకన్
దనుజవిభుండు నుదాత్తశరంబులఁ దక్షణమాత్రన దాశరథిం
జొనపిన నిర్జరుఁ జూడఁగ నొప్పిరి శోణితగాత్రు నశోకయుగం
బనయముఁ బుష్పితమై నట్టియించె నటంచుఁ దలంపఁగ నట్టిమెడన్. 891

స్రగ్ధర. రౌద్రాస్త్రం బుగ్రలీల న్రఘువరునిపయి న్రావణుం డేయఁ గ్రోధో
న్నిద్రుం డా రాముఁడుం దన్నిశిచరపతి నాగ్నేయ మాసాయకం బ

త్యుగ్రేకస్ఫూర్తిమై నేయుఁడు శరయుగళిం బుద్ధతిం బోరి కూల
గ్రుగ్రద్వంద్వంబు నానిర్జరనిజవిజయార్థు ల్మహాఘోరవృత్తిన్. 892

వనమయూరము.

వెండియు నిశాచరులు వృక్షచరవర్యు, ల్మిండితము మెచ్చ రజనీచరవరుండుం
జండకిరణాన్వయుఁడు శాతశరకోటిన్, దండిమగు లిప్పగిదిఁ దార్కొని పెనంగన్.

క్రౌంచపదము.

దిక్కులఁ జీఁక ట్లిమ్ముక యయ్యెన్, దినకరరుచి యలఁతిగఁ గనవచ్చెం
జుక్కలు ధాత్రిం బెక్కులు రాలె, న్నృపులు మనములను సొలసిరి భీతిన్
నిక్కక కంధు ల్మిక్కిలి యుంకె, న్నిగమనిగతి యవని నొరిగిపడియెన్
నిక్కము గాఁగ న్మొక్కలు రాలె, న్నిబిడతరగిరివినికరములందున్. 894

తరళ. అపుడు రావణుఁ డార్చి పేర్చి శితాస్త్రపంచక మొక్కటన్
నృపతిసింహుని వ్రేయ నమ్మహనీయకార్ముకుఁ డెంతయుం
గుపితుఁడై పలలాదువక్షము ఘోరదివ్యశరాహతి
న్నిపుణుఁడై పగిలింప మూర్ఛమునింగె వానరు లార్వఁగన్. 895

శుద్ధవిరాట్టి. అంత నమ్మూర్ఛితు నద్దశాననుం, జెంతం జేరక చిత్రరూపులై
భ్రాంతిం జెంది యుపాయహీనతఁ, జింతం బొంది కృశించి రాశరుల్. 896

మత్తకోకిల. తేరిమీఁదను మూర్ఛదేఱి యధిజ్యకార్ముకుఁడై సమి
ద్ఘోరవృత్తి నృపు న్వధింపఁగఁ గోరివచ్చు దశాస్యుఁ గం
ఠీరవంబు గజంబు డీకొనుతీరి మార్కొనియె న్మహా
వీరవర్యుఁడు లక్ష్మణుండు వివృద్ధవిక్రమసంపదన్. 897

క. అన్నకుఁ గన్నా కై యి, ట్లన్నరభోజను నెదిర్చి యాతనిధనువు
ల్మున్న విఱిగించి సిడము, న్మిన్నా నొగసి యున్న దాని మేదినిఁ గూల్చెన్. 898

ఉ. అట్టియెడన్ గదాకలితహస్తయుగుండు విభీషణుండు తోఁ
బుట్టువు రథ్యసారథుఁ బొంక మడంగఁగ మోఁది యార్చినం
దొట్టిన చింత నట్లు విరథుండు సహాస్తశరాసనుండు నై
కట్టలుక న్విభీషణునిఁ గాంచి బొమ ల్ముడి వెట్టి యిట్లనున్. 899

ఉ. బుద్ధులు చెప్పవద్దనినఁ బోయి నరాధము నాశ్రయించి ద
ర్పోద్ధతిఁ దద్ధితంబుగ మదోత్కటు నన్నెదిరించి బంటువై
యుద్ధము సేయవచ్చితి వహోగ్రమృగేంద్రము సారమేయ మే
పద్ధతి మార్కొనంగల దుపాయ మెఱుంగ వహో సహోదరా. 900

చ. కనుఁగొని చేరి యల్ల ముడుకం గడుఁ గంపితగాత్రుఁ డాస్యపుం
డును బెనుమూర్ఛ నొంది యతనన్ శ్రమఁ గొండొకతేటి ధూళిలోఁ
మునిఁగిన తన్ముఖాబ్జమున మోమిడి యశ్రులు వెల్లిగొల్పుచున్
జనకసుతావరుండు కపిసైన్యము దైన్యము నొంద నార్తుఁడై. 912

వ. సహోదరుం జేర్చుకొని. 913

క. తూలమ్ముఁ జిమ్ము పటువాతూలమ్మన రిపుబలమ్ముఁ దూలించిన నీ
వాలమ్మున నొరగితివె ని, ట్టాలమ్మునఁ గడునలుకపటల మలమికొనన్. 914

తే. అధికమదలీలఁ బటుకలహప్రసిద్ధ, విపినభూమి నిరంతరశర్వృత్తిఁ దిరిగి
శత్రుకిసలంబు ఖేలి నామిత్రివాహ,మత్తకరి పంక్తిముఖపంకమగ్నమైతె. 915

క. భరమయ్యెనె నీ బ్రదుకి, ద్ధరణికిని ధరాధురాధురంధరవరసు
స్థిరుఁడగు నహీనమూర్తిక, సురహితుచేఁ బడఁగవలసెఁ జోద్యము గాదే. 916

క. పుడమిని బంధుల గురులం, బుడమినిసువు విడిచి విపినభూమిఁ దిరుగున
ప్పుడు నినుఁ గని ప్రాణంబులు, విడువక నిల్పుకు విడుతు నిన్ను విడిచినకతనన్ 917

సీ. తూరిమి నిద్రింపఁ గోరినయప్పుడు పల్లవచారుతల్పం బొనర్చు
నధికనిద్రాసక్తి నందియుండినయప్డు చేరి యల్లనఁ బదసేవసేయు
దాఁకలిగొని పారణాసక్తి నొందినఁ దీయనిఫలములు దెచ్చి యిత్తు
నవనీజఁ దలపోసి యలఁత నొందినవేళ నుచితంపుమాటల నూఱడించు
నట్టి నీ విట్టివో నను బెట్టి నిదుర, పోక తగునయ్య యదియును గాక చింత
నెంతయుడలిన నూరార్పవేటి ధర్మ, మలుకనొందితె పిలిచినఁ బలుక వనుజ 918

క. తమ్ముఁడ నీపడుటకుఁ జి, త్తమ్ము శతసహస్రశకలితము గామి నిమి
త్తమ్ము పృథుకఠినవజ్రకృతమ్మగుటం గాదె నిశ్చితం బూహింపన్. 919

చ. నిను విడనాడి ప్రాణముల నిల్పఁగనోపితినేని రావణుం
దునుమఁగనేర నొక్కగతి దున్మఁగ నేర్చితినేని వీటికిం
జనుటకుఁ జాల నట్లు చనఁజాలితినేని సుమిత్ర నత్తమం
గనుఁగొనఁజాలఁ గాన నిటుఁ గాలవశత్వము నొందు టొప్పగున్. 920

గీ. ఒంటినున్నయపుడు సౌఖ్య మొందునపుడు, నాఁడునప్పుడు బంధులఁ గూడునపుడు
మఱపురాక సహోదరమరణశల్య, మెమ్ములను గీఱుచున్నె నూఱేండ్లకైన. 921

ఉ. ఖండనభూమి నీపడినభంగిఁ గనుంగొని వానరుల్ భయా
ఖండతరార్తి నేడ్చుటయ కాదు విహాయసమండపస్థులౌ

ఉ. నీవు కృతప్రతిజ్ఞుఁడవు సీతలపోసినదాని కంతరా
యావలి యెన్నఁడుం గలుగ దర్కకులాగ్రణి పద్మినీ మనో
భావితుఁ డయ్యెనం దుదయపర్వత మెక్కఁగ రాకమున్న సం
జీవనిఁ జేసి లక్ష్మణు సజీవుని జేయుట చాల మేలగున్. 933

క. అని హనుమంతు న్విపులోరుజవనిరాకృతఫణికృతాంతు స్స్వామిప్రియకా
ర్యనిరూఢబుద్ధిమంతు ననుపమధైర్యహిమవంతు నతిబలవంతున్. 934

ఉ. శ్రీరమణీశభూధరశరీరుని ధీరుని గీశసైనికా
ధారుని నిర్వికారుని సదాగతిముద్దుకుమారునిం గడుం
గూరిమితోడఁ గన్గొని కనత్ప్రియదాకుచచందనాయమా
నోపయశంబు గైకొనఁగ నొక్కఁడ వయ్యెదు రమ్ము చెచ్చెరన్. 935

వ. అని ససంభ్రమంబును సప్రేమంబును సస్నేహంబును సగౌరవంబును సబహు
మానంబునుగాఁ జేరఁబిలిచి కార్యదశానిరూపణంబుగా నిట్లనియె. 936

గీ. ద్రోణధాత్రీధరము కడుదూరమందు, గలుగుసంధానసౌవర్ణకరణులును వి
శల్యసంజీవకరణులు సమములుగ, రాత్రు లయ్యోషధీనికరము వెలుంగు 937

వ. సర్వసేనామూర్ఛాసమయంబున జాంబవంతుం డెఱింగించినచందంబున దూరంబును
మార్గంబును లక్షణంబును నీ వెఱుంగుదువు. 938

సీ. ఈవల నావల కినుమాఱు మున్నూఱు దాఁటనోపుదు పయోపధి కడంక
నమితవేగంబగు నర్కుని తేరిగుఱ్ఱంబులతోడఁ బాఱంగనేర్తు
భూనభోవలయంబు పూర్ణంబుగా మేనుఁ బెరఁగింపఁ గడునేర్తు బిగువుగాను
బాలలీలాప్రౌఢి భానుబింబమునైనఁ బట్టి మూడఁగ నేర్తు ఫలముభంగిఁ
దెత్తు వేసీమలోనిప్రవృత్తినైన, నట్టి నీకెన్ని యంతరాయములు గల్గె
నేని వారించి సంజీవనీనగంబు, నిమిషమాత్రంబులోనఁ దేనేర్తు వనఘ. 939

గీ. అనుడు ముదమంది యతఁ డమ్మహౌషధీవిశేష మారసి తేఁదలంచినఁ దదీయ
ముఖవికాసము గాంచి రాముఁడు ప్రహర్షమగ్నుఁడై యిట్లనియె హనుమంతుతోడ.

శా. చంద్రద్రోణధరాధరాగ్రవిలసత్సంజీవని న్శాంబరీ
సాంద్రద్రోహాల విఘ్న మేమఱక కీశశ్రేణి యగ్గింపఁ బ
క్షీంద్రుం డయ్యమృతం బజయ్యుఁ డగుచున్ హేలాగతిం దెచ్చిన
ట్లింద్రారాతుల గెల్చి తెచ్చి యిపు డిమ్మో దాన విఖ్యాతమ్మునిన్. 940

క. భూపతిచేతను లాఘవ సుమ, నోవేగము లాఘవ సుమనోభవ యెట్లు
న్నీ వెసమిఁ జాలునవఁదగ, దేవరవునైనఁ దీర్పు మీ కార్యంబున్. 941

క. అనుటయు మేరువుఁగతి మే,నునిగిడ్చి నరేశ్వరుం గనుంగొని సంజీ
వని దెచ్చెద నరుణోదయ,మునకు న్మనుగాఁగ సకల మునుఁగను మింకన్. 942

వ. అని యనుజ్ఞ వడసి. 943

క. అక్షణమునఁ గపులక్ష్మ,ణాక్షుణ్ణులై విజయలక్షణంబులఁ బొగడం
బక్షీంద్రుపగిది నిజవా,లక్షేప మొనర్చి దాఁటె లవణపయోధిన్. 944

వ. దాఁటి యొగసి మిన్నుముట్టి యుత్తరాభిముఖుండై. 945

క. ప్రకటలవణాంబునిధిఁ బ్రచ్చ,కగుంటవిధంబు గాఁగఁ జూపట్ట నగ
ప్రకరంబులు దినకుం దొం,తికడవలై కనఁబడఁగ నతిత్వరితగతిన్. 946

సీ. బహుదూరమా ద్రోణపర్వతం బేక్రియఁ జనువాఁడనో యను సంశయంబు
యక్షరక్షఃప్రభయంబు మార్గం బొక్కరుండ నెట్లొకో యనుగుండెదిగులు
నాలస్యము ఘటిల్లి యంతరాయంబులు తోఁచునో యనెడు నాలోచనంబు
నమ్మహౌషధుల రయంబున నెవ్విధిఁ గనుఁగొందునో నిసి నన తలఁపు
నించుకయు లేక నిజరయాహీనరణము,బ్రహ్మలోకంబువారికి భయముగూర్పఁ
బూతసంజీవినీసమానీతబుద్ధి, నరుగుపవమానసుతుని లోకైకనుతుని. 947

క. పోరిఁబోరి సురలగ్గించుచు, విరులు గురిసి రమరదుందుభిధ్వానంబు
ల్గరము మొరసె శైత్యసమా, కరుఁడై సుతు నెదురుకొనియెఁ గరువలికరుణన్. 948

వ. అంత నయ్యాంజనేయుండు నిరంకుశద్వీపంబు కుశద్వీపంబు గడచి యెడనెడ వినోదంబు
లగు నదీనదంబులను హిమానీపిహితచ్ఛదంబులై పాలసముద్రంబునుం బోని యభిన
వంబు లగువనంబులను విశేషంబు లగుఘోషంబులును మహోత్తుంగంబు లగుమహీ
ధరశృంగంబులను గతమునిజనతాశ్రయంబు లగు నాశ్రమంబులును జూచుచు నేక
నిశ్చయంబునం జనునవసరంబున. 949

గీ. పంక్తికంధరుండు పనిచెఁ గంధర, పంక్తి వోనిక్కృతకబహుళమైన
కానఁగూర్చి యందుఁ గాలనేమి జపంబు, సలిపె నిక్కపుజటిలునిభంగి. 950

సీ. మకరందరసతుందమధుకరనికరఝంకారశుభకరద్రుమగుహంబు
సహకారకిసలభక్షణపృథుక్షణప్రతిక్షణకుహూకారపికవ్రజంబు
లంబబింబారుణలపనాఖిలంబభాషాకమనీయశౌకాకరంబు
సమబాలతృణకిశుద్ధస్థలచంక్రమణసుమనోహరహరిణపృథుకంబు
గావన మొనర్చి యచ్చోటఁ గపటవేషధారియై దనుజాధమాధముఁడు కాల
నేమి తప మొనరించెడు నెలవు గాంచి, యంతరంగంబునం బవనాత్మజుండు. 951

క. మును సంజీవనిఁ దేఁబో,యినతఁడె నిక్కముఁ గాన నే మార్గమున
ప్పినవాఁడనో యిమ్మనికత,మునఁ దెలియుమనుచు దాసి మ్రొక్కెన్ నీతిన్. 952

క. ఇక్ష్వాకుకులంబున భీమ,ప్రక్ష్వేడను దహితప,శపవనాంబురఘూ
ద్వక్షేశధారి లయుసను,యుత్స్వేశగుణుండు రాముఁ డసురవరులకున్. 953

క. అతనితమ్ముఁడు లక్ష్మణుఁ, డాతతమార్గాన శాత్యుఁ డగుటయుఁ దెలుపన్
దూత నగుట సంజీవని, దేతెమ్మని పనుప వచ్చితి నన్నని వాథా. 954

వ. అని తదీయ సమయప్రకారంబు సవిస్తరంబుగా నెఱింగించి వెండియు. 955

క. వచ్చితి మార్గము దప్పితి, నిచ్చట నినుగంటిఁ బ్రోవ యొఱిఁగించి దయం
బుచ్చు మదిగాక కొలపోకఁ, డిచ్చేరువనున్నఁ జెప్పవే దగఁగొంటిన్. 956

చ. అనుటయు సంతసించి దనుజాధముఁ డెంతయు దివ్యదృష్టిచేఁ
గనుఁగొను వానిపోలికి మొగం బొకయించుక యెత్తి చూచి పా
వనిఁ గని సర్వముం దెలియవచ్చెను మామక దివ్యబోధచే
వినవిభ తేజు లద్దశరథేశుతనూజుల కింక మేలగున్. 957

గీ. వారు పితృవాజ్ఞ చెల్లింప వచ్చినారు, వచ్చి ఘోరాటవిఁ జరింపఁ జొచ్చినారు
తాటకాత్మజపంక్తికంధరులు ఖలులు, హెచ్చి వారి నటు మోసపుచ్చినారు 958

వ. వంచించి సీతాపహరణంబు గావించుటయును వనచరసహాయులై సేతుమార్గంబున లం
కాపురంబుపై విడిసి. 959

క. ఉద్ధతవిస్ఫారంబు హ,రిద్ధ స్త్రిశుతిస్ఫుటబధిరీభూతగతిన్
యుద్ధ మొనరించి పిదప స,మిద్ధతఁడై లక్ష్మణుండు మృతునివడ వునన్. 960

ఉ. రావణుశక్తిఁ గూల సుకరంబుగ నాతనిఁ దెల్పవేడ్క సం
జీవనిఁ దేర నీవిటుకుఁ జెచ్చెర వచ్చె నెఱుంగుదుం దదీ
యావసరంబు లేదు విమలౌషధరాజము లేనొసంగుదుం
ద్రావుము నీరు నీ వతిమృదంబుగ నిక్కమలాకరంబునన్. 961

వ. అని పలికి తదీయాంతరంబున మకరంబు మెలంగుట దా నెఱుంగుం గావున. 962

క. అకలంకుఁ కామాయికుఁ,డు కరాంగుళిఁ జూపె నటు మదవుకొక్కుండు
న్మకరాకరతుల్యమును హి,మకరాతపఫేన మగ్రమకరాకరమున్. 963

క. చూపుడు రంభాకారం,భోషణసక్రముకతీరభాగం బగున
వ్యాపిఁ గనుంగొని యప్పుడు,తాపోశనబద్ధి డిగ్గి తుస్నానడిగ్గెన్. 964

క. కడఁగి కొలనఁ గాల్సేతులు, గడిగికొనఁ దలంచి మించి కరువలికొమరుం
డడుగెడు డిగ శాపచ్యుతి, నడిగెడుగతి మకరి యాతని యడుగుం బట్టెన్. 965

క. అలసత వాఁడై యీ మడుఁ దగ్గిలయుఖముఁ గూర్మి క్రితిమి రుతమగు మగ్నా
జలములు రాఁ గుత్తుకఁ బ్రే, వుల ప్రోవు బవనజుఁడు దవుల్కొనఁ జేయన్. 980

సీ. వనగజంబుల గ్రసించిన వానిఁ గావరే యనుభంగిఁ బద్మినద్యంబు పొచ్చ
నెలనెలనితఁ గోల్తు నెలకొన్న కృపఁ జూడు నెల యనుభంగిని నింగిఁ జూచు
ధ దుండు సదయుఁడై నను దాఁచ నరుమాడ్కి నుత్తరాశ యునింగ నొదిఁగియుండు
జలచరం బలుకొంది స్థలచరం బయ్యెనో యనునట్లు లోనికిఁ దిగినిలుచు
రామకార్యంబునకు నంతరాయకారి, నైతినని పకనిగ్గన్నదై పోల్కిఁ
బ్రాగల్భ మిగులఁగ వెడవెడబురదఁ జొచ్చు, మొనసియూపిరి వెడలక మ్మొసలి మొసలి

వ. మఱియు ననేకవిధంబులం బరితాపంబు నొందుచుం బరిభ్రమింపం జొచ్చెఁ దత్సమయం బర్ధరాత్రం బయ్యె రక్తఘుమ్మంగంబుకతంబునను గుముదకుముదంబువలనను జక్రప్రబోధకారణంబునను భాస్కరోదయావసరంబునుం బోలె 981

క. వనచరుఁడా నేను మకరము, వనచర మటుగాన దుఃఖవననిధితీరం
బునఁ జేర్పరలదె యనుతీ, రునఁ బవనసుతుండు దాని రోధముఁ జేర్చెన్. 982

ఆ.వె. ఇట్టు గట్టుఁ బెట్టి దిట్టతనము చూపి, గొట్టుపట్టి దాని కొట్టఁ బట్టి
బిట్టు చించి రక్తపిహితశరీరుఁడై, వెడలె నినుఁడు మబ్బు వెడలు కరణి. 983

వ. ఉపాయంబున వెడలుటయు నయ్యవసరంబున. 984

సీ. తాటంకరుచిభగద్ధగితంబులగు చెక్కుటద్దములు కరికావ్యాప్తములుగ
ముఖసరోజంబున మూఁగెడు భ్రమరకంబులమాడ్కి భ్రమరకంబులు దలింప
వలిపంపుఁ బట్టుకంచెలఁ బిక్కటిలఁ జేయుతోరంపు హీరకుఁ జందోయి గుబ్బలుకఁ
గమికొన్న కామాంధకారంబు వెన్నంటు కైవడి నుసుదలకట్టు దనరఁ
దావల మకరందబిందుసందోహ మనఁగ, కరణిసంతోషబాష్పముల్ క్రమ్ముకొన్న
కన్నులమరంగ నన్నుల మిన్న యనఁగ, సౌష్ఠవసుపక్వబింబాధరోష్ఠ మెఱప.

క. కాసారలక్ష్మి భువనోల్లాస నొసర్చితివి దుర్జలచరము చావం
జేసి యని వటుని గనవచ్చె నెనఁగ మకరి యొక్క చేడియ యగుచున్. 985

ఆ.వె. ఎదుర నిలిచి మ్రొక్కి యేధాఖ్యమాలిని, నొక్కమౌనికోపయుక్తిఁ జేసి
మకరి రూపుఁ దాల్చి మడువునఁ దుండితి, నిటనెన్నియేని యేండ్లఁ బట్టి 986

వ. అని తనరుం బూర్వసంచిత మునిశాపం బెఱింగింపం దలంచి యిట్లనియె. 987

క. అస్ఖలితాగమవిదుఁడవు, నస్ఖలితాహావునకున్మహావునకు శు
ద్ధాస్ఖాలితోక్తికిని న, య్యస్ఖలితబ్రహ్మచారి కప్సరస యనున్. 988

క. చండకిరణసంకాశుఁడు, చండక్రోధుఁడు తపోవిచారుఁడు శాండి
ల్యుం డను పేరిటి మునినాథుం డొకతఱి నన్నుఁ గని పృథుసుమశరహాతిక్. 991

గీ. మనము గలఁగ ధాన్యమాలినీప్రముఖప్రమ్లా,-మాలినీ తపంబు మాలి నీకుఁ
జిక్కువడితి నింకఁ జిక్కులు వెట్టకు, తీయవిల్తుబారి కీయకుమని. 992

వ. చిడిముడిపాటునం దమకించిన యద్ధర్ణీదేవతాసత్తమునకు నుత్తమంబును సంప్రా
ర్థనంబును సవినయంబునుం దేటపడునట్టి హితవచనోపన్యాసంబునం జిత్తంబు
మెత్తఁబడమి యెఱింగి. 993

క. ఏను రజస్వల నన్నుక్, భూనుతగుణ యెవ్విధమునఁ బొరసెను స్నానం
బైనఁ జను దెంతుఁగ, వయ్యును, నానట్టులు చేయుమని యనఘుఁ డతఁ డనఁగన్. 994

సీ. ఏగాన మిందిరాహృదయేశహృదయంబు గరఁచి విమానంబు గలుగఁజేసె
నేగాన మద్భుతం బెసఁగ రాల్గరఁగించి పట్టిమ్రాఁకుల నన ల్వుట్టఁజేయు
నేగానము భవాబ్ధి నీఁద నూహించు మానీంద్రులకైన మోహింపఁజేయు
గంధర్వకామినీగణముల నేగాన మించుకేనియుఁ దలపెత్త నీదు
దట్టిసంగీత మొకసమయమున గంధమాదనంబునఁ దగుతాళమానముగను
విస్తరింపఁగ నచటికి వేడ్కవచ్చె, రావణుండు త్రిలోకవిద్రావణుండు. 995

క. వచ్చి నను మెచ్చి కలదని, యచ్చుపడం దెలుప వినక యనిలహతలతా
వచ్ఛలిత నన్నుఁ గైకొని, యచ్చపలుఁడు దేలియాడె నభిమతిగతులన్. 996

క. అతనికతన నాకదుపున, నతిబలుఁ డతికాయుఁ డనెడునతఁడు వొడమినన్
సుతుఁగొని యప్పటితుఁ డసురపతి సనియెన్ నైజయోధపరివృతుఁ డగుచున్. 997

గీ. అంత నాలకనాఁడు నీరాడి వలిప, తెలిమడుగుఁ దెలిప్రూఁతయుఁ దెలియలరులు
నలర నేనున్న శాండిల్యుఁ డనియెడి జడధారి చనుదెంచె నలపున్కదారి యనఁగ.

వ. వచ్చి నిజతపోమహానుభావంబున నాదుండగం బెఱింగికొనినవాఁడు గావున నపరిమిత
క్రోధదుర్నిరీక్షుండై. 998

క. ఇంతుల పాపమునకుఁ గుదు, రింతుల యనృతప్రవచన లింతుల శఠలు
య్యింతు లాకనికిం గూర్తురె, యింతుల నమ్మంగఁ దగునె సుమేషునకైనన్. 999

వ. అని నన్నుం గనుంగొని. 1000

మ. మతి నవ్వంచన చేసి రావణు నసుస్వామ్యస్మరప్రీతిఁ దే
ల్చితి వీ వియ్యపరాధహేతువున గాసిం బొంది సక్రంబు నా
కృతి దుఃఖస్థితి ఘోరమూర్తి వగుచుం గ్రీడింపఁ బొమ్మంచు శా
పితఁ జేసె న్ననుఁ గీశవంశకలశాబ్ధిప్రోజ్జ్వలేందూదయా. 1001

వ. తదనంతరంబున. 1002

క. మదమునఁ దెలియకనిన్నున్, మదధీన స్త్రైణుఁడు సుమశరక్రీడం
గదియుట సుతహితయుతుఁడై, యొదుఁగుచు సంఘాతమరణ మొందు నరులచేన్.

వ. అని యివ్విధంబున. 1005

క. ఖాండవుఁడు కోపితుఁ డగుచుఁ జటు, శాప మొసఁగిపోఁ దలంచు సమయంబునఁ జిం
తాపరతంత్ర నగుచు నత్తాపసిపదములను భక్తి దాల్చి వ్యాసున్. 1006

చ. కరములఁ బట్టి నన్మకరిగాఁగ శపించెదె యెందుఁ గామిను
లగ మఱి నీకు లిట్లగుటఁ గాదె బుధుండ ప్రతీపదర్శనీ
పరిసరవర్తి గాక యనపాయతపోమహిమానుభావ ను
స్థిరమతి నిత్యసౌఖ్యమును జెంది సుఖించుమ యానుండు నెప్పుడున్. 1007

వ. యతివరా శాంతుండవు గమ్ము తపఃఫలధ్వంసంబగు నన్యాంగనాసంగ మసంగుండవ
వయ్యును దానిఁజేయు మహాక్రోధంబున కేల వశగతిం బొందెదవని ప్రార్థించుటయు.

క అవనీసురవరుహృదయము, నవనీతము పలుక దారుణబిడౌజమహా
స్త్రనిరుద్ధము గావున న, న్నవలోకించి కరుణారసార్ద్రహృదయుండై. 1009

క. వ్యర్థ మగునె మద్వాక్యము, సార్థ మగుంగాక ఘోరశాపప్రతిమో
క్షార్థిని వినురాఘవకా, ర్యార్థి త్రిలోక హితకారి యనిఁ బల్కె డిటరున్. 1010

క. వచ్చు మొనసి నీయుదరము, ప్రచ్ఛన్నతనికతనఁ బాపరాశిఁ దొలఁగి పో
వచ్చు దివంబున కని సెల, వచ్చుపడ నొసఁగి చనియె నదినిజమున్యాన్. 1011

వ. మహాత్మా భవదీయచరణారవిందదర్శనస్పర్శనంబులు శాపమోక్షంబు గావించుట
వింతయే. 1012

మ. కపివంశోత్తమ కాలనేమి యను రక్షఃశ్రేష్ఠుఁ డీరీతి ని
క్కపుమాయింపలెఁ ద్వత్ప్రయాణ్నమకు విఘ్నప్రక్రియాలోలుఁడై
తపస్విమిచ్ఛొట్టవ్యపాస్థితిం బ్రకటరూపం జేయు వీనిం బరం
తప ఖండింపుము పొమ్ము కన్గొనుము చంద్రద్రోణశైలాంతమున్. 1013

క. కృతకార్యసిద్ధుఁడవు నిష్కృతి కాభిష్టుతుఁడ వగుము కీశోత్తమ దు
ష్కృతమునకు నన్ను బహిష్కృతఁ జేసితి వాత్మ సంతసించితి ననుచున్. 1014

క. తన యుపకృతిఁ గావించిన, దనుజుం దనతోడ సురపథమునకుఁ గొనిపో
మనమునఁ దలంచియో యా, నినిఁ జంపక ధాన్యమాలిని పనుచు టరయున్. 1015

వ. పనిచి యద్దుగాత్ము కాపట్యంబును మహామధీరధురవధానసంధానకరణా
ద్యపథసంధానక్రమంబును సవిస్తరంబుగా నెఱిఁగించి యమ్మహామహుఁ వల

గొని యద్భుతాకార శీల యగు మహద్ధాన్యమాలిని యంతర్ధానంబు నొందుటయుం బరమాద్భుతక్రోధసంభరితహృదయుం డగుచు నాంజనేయుండు కల్మషక్రియా నిత్యు దైత్యుం గనుంగొనుటయు నెఱుంగమి భావించుచు నతం డతనితో నిట్లనియె.

క. తడసితివి మిగుల నెత్తుటఁ, దడిసితి విది యేమి మంత్రతంత్రౌషధము
ల్వడసెదవే గురుదక్షిణఁ, బడసెదవే రయ్యు నాఁగఁ బావని కినుకన్. 1017

క. గురుదక్షిణ యొసఁగెద నని, గురుదక్షిణభుజము సాఁచి క్రుద్ధిన నతఁడున్
గురుదక్షిణ నెఱుఁగ నియ, గుఁగఁ దక్షిణమునఁ జలంబు గొని పోయెనెడన్. 1018

ఉ. వెక్కసమయ్యె నంతఁ గను విచ్చి శరీరంబు రూపమూని యు
మ్మొక్కలి రక్కసుండు కపిమూర్ధము శాతనఖాళిఁ జీఱెన్
నుక్కు పగిల్చి తొక్కులను ముక్కలు చేసిన ధంబు వింతఁ బే
రుక్కున నక్కపీంద్రుఁడు మహోద్ధతుఁ డార్చెఁ గాలనేమి యుఱన్. 1019

క. సింహప్రక్రియ వానర, సింహంబున కడ్డ మేగి స్థిరధృతి నసుహృ
త్సంహరణకరణఖరనఖ, సంహతుల నొప్పింపఁ బవనసంభవుఁడు వడిన్. 1020

ఉ. పాటవ మొప్ప వాలమునఁ బట్టి గదీకుసటాచ్ఛటాసము
త్పాటన మాచరించి వెస దంష్ట్రిలు దుల్చిన దుష్టచిత్తుఁ డ
త్తాటక మన్మఁ దప్పటివిధంబు దొఱంగి దినేంద్రసూనుఁడై
గాటపువైళి మొప్ప సముఖంబునకుం జనుదెంచి యిట్లనున్. 1021

క. అక్రియుఁడై బాహుబలప,రిక్రియుఁ డగు లక్ష్మణుం డరిప్రకరముదై
న్యాక్రియముగఁ గనఁ దేఁ జె వ్వ,గ్రాక్రమపో నేల యోవ ధకుధరమునకున్. 1022

క. సౌమిత్రి మూర్ఛ దెలిసెన, సామీరిం దోడితెమ్ము చయ్యన ననుమున్
రామాజ్ఞ వచ్చి యియ్యా,రామంబునఁ గంటి మఱలి రమ్మా యనినన్. 1023

ఉ. ఇంచుక సంశయించి మొగ మెత్తి కడుం బరికించి పోల్చ నూ
హించి దినేంద్రసూనుఁ డిటు కేమిటికిం జనుదెంచు వీఁడు న
న్వంచన చేసి యీ కరణి వానరమూర్తి వహించె వీని ఖం
డించెద నంచు నెంతయుఁ గడింది మగంటిమి యుల్లసిల్లఁగన్. 1024

క. తేలెమ్ము దురాత్మ యనుచుఁ, గోలెమ్ము విఱిగెడునట్లు క్రుద్ధింపఁ దఁడీ
కీలెమ్మోయిఁ దెలిసె ననుచుఁ, గోలె మ్మని నోరు దెఱచికొని వివశగతిన్. 1025

క. పడియె దనుజాధముఁడు గీ, ద్వాడి శతశృంగుఁ డయి వేఁగ వానరపతిపైఁ
బడి నఖాయుధములఁ గద్మువడి నొప్పించుటయుఁ గొంతవడి కద్దనుజుఁడై. 1026

మ. శ్లోకిల. వాలపాశముఁ గాలపాశము బాహుదండము దండముం
గాలయాంతకుఁ డీతఁడో యనఁ గాలనేమి మృషాకృతిం
గూలఁ ద్రోచిన వెండి దైత్యుఁడు ఘోరమాయపురూపముల్
చాలఁ దాలిచి వాయునందనుఁ సంహరించుచు వచ్చినన్. 1027

క. ఉక్కఱి మారీచసుతుఁడు, ఢక్కరితన ముడిగి సుడివడం గపికోలపుం
జక్కరవతి వానెత్తుక, జక్కర వెడలంగఁ బట్టి చంపె మగంటిమిన్. 1028

వ. ఇట్లు నిజరూపధరుం డగు కాలనేమిని రణంబునఁ గాలనేమీరణంబు వినం బుచ్చి యటఁ దవీయ మాయాజాలంబుతోన కాననం బదృశ్యం బగుటయు విస్మయాంతరంగుం డగు నబ్బల్లిదుండు. 1029

చ. పృథురయ మొప్ప నేగి కనియెన్ హనుమంతుఁడు ద్రోణశైలమున్
గ్రథితమహౌషధీద్యుతి కాచ్ఛవిభాకరదీపజాలముం
బ్రథితగుహావిశాల విచరత్సురకిన్నరకామినీమణీ
మధురసుధారసప్రచురమానిత గానవినోదమూలమున్. 1030

వ. అమ్మహాబలవంతుఁడగు మహోవలాహకంబు ద్రోణధాత్రీధృచ్ఛిఖరసంస్థితం బగుటయుఁ దశ్శవిధచతుర్విధప్రకటౌషధీలతావితానం బంతర్ధానం బందుట గనుంగొని. 1031

గీ. పరమధార్మికుఁడును జగద్బాంధవశ్రీవయ్యుఁ డగు రామునాజ్ఞఁ బి వచ్చినాఁడ
నేఁ జగత్ప్రాణతనయుండ నీవును జగతీధరసహిష్ణుఁడవు మందుతీవలిమ్ము. 1032

క. అని హనుమంతుఁడు సంప్రార్థన మొనరించుటయు ద్రోణధాత్రీధర మా
తని సరకుగొనదు పయఃపూర్ణనమున నీరీతియేక దా రాసూపుల్. 1033

వ. వెండియు నప్పవమానమాణవకుండు. 1034

ఉ. జన్యములోన రావణుని శక్తి యురంబున నాఁటి రామరా
జన్యుని ముద్దుసేయు ననుజన్ముఁడు లక్ష్మణదేవుఁ డిప్డు శా
శి ష్యప్రమూర్ఛఁ బొందిన వడి న్విమలౌషధసంగ్రహార్థమ
ధ్యాశ్రయమహోచ్ఛిక్ప్రదరయంబున వచ్చితి నిన్నుఁ గాంచితిన్. 1035

క. రహిఁ ఘనతరులకు నెలవగు, మహిభృద్వరపాదకటకమండన నాకున్
బహుళౌషధధనముం గతిఁ నహ్వాదయుఁ డవుగాక యొసఁగినన్ జగమెల్ల గన్,

వ. ఏను గృతార్థుండ నగుదు నీవును మహోన్నతుండ వయ్యును నాకుం గరుణింపవే యని ప్రస్తుతించి. 1037

క. లక్షింపని ద్రోణము నుపలక్షించి వెస న్మహోపలక్షేపము గా
లక్షగజబలుఁడు సురలు విలక్షులగుచుఁ జూడఁ గడుబలంబున నార్చెన్. 1038

ఉ. అక్కట రామలక్ష్మణుల కాపదవొందెనొ భూమిజాతకే
చిక్కు ఘటిల్లెనో మిగులఁ జెట్టలఁ గనుఁగొంటి వానరుం
డొక్కఁడు గట్టుఁ బట్టి భుయిలోడక వేకొనిపోవఁ జొచ్చెడు
న్నిక్కము ఘోరరూపరజనీచరభూతము గాఁగ నోపెడున్. 1052

క. పసుపాలుగుసద్దుబులుఁ, దుడిమొట్ట గవచ్చె నిపుడు దుర్ఘనం బి
ట్లాదవునె రాముని కేమ్యా,పద వచ్చెనొ యనుచు వగచి పడపడి కినుకన్. 1053

మ. కైకాపుత్రుఁడు భూమిభృద్వరధరన్ ఖ్యాతోరుచ్ఛాయం గాంచి ఘో
రాకారం బిది కాలువంచు ద్విడభేద్యక్రూరనారాచము
స్తోకక్షిప్రత చేయఁ జూచుడుఁ బరిక్షుణ్ణంబు లయ్యెన్ దిశా
ద్భూకంబుల్ గలఁగెం బయోనిధులు గట్టుల్ ప్రమ్మొగ్గె నుల్కల్ పడెన్. 1054

వ. ఆయవసరంబున. 1055

ఉ. అంబరవాణి యోదశరథాంగతనూభవ చూడు వీఁడు నీ
తుం జెలివాఁడు గాఁడు కపికుంజరుఁ డారఘురాము దూత నీ
విం బరిమార్పఁ జూచుటవునే విడురోపమటంచుఁ దెల్పన
య్యంబరరత్నవంశ్యుఁడు భయాద్భుతసంభ్రమసమ్మదాత్ముఁడై. 1056

. రోపముతో హ్వారసుపరీ,తాపముతో నహితహృదయదారుణరణకృ
చ్చాపముతోఁ దోనయులఘు,కోపము విడనాడి యారఘుప్రభుఁ డంతన్. 1057

చ. పాయక రామమూర్తికి శుభప్రతిపాదకదేవతార్చనల్
చేయుచునుండె నట్లు కపిసింహుఁడు వే చని కాంచెఁ దుంగభం
గాయతదోఃప్రగాఢపరిఘాత్యుపగూహనలబ్ధజాహ్నవీ
ప్రాయికలోహితాంబుజపరాగలసద్ఘుసృణప్రవాళమున్. 1058

క. వనచరకులానుకూలము, వననిధికూలమ్ముఁ గాంచి వనచరుఁడు భవాం
బునిధి దరించుపగిది నం, బునిధి న్వెస సంక్రమించి పోయెడు నెడలన్. 1059

క. హనుమంతుఁ గూల్చి ద్రోణము, దనధిని వైపంచి రా నరాగ్యఘ్నాణన్
దనుజవిభుఁడు దశకంఠుఁడు, పనిచె న్మతిమంతు మాల్యవంతు న్మంతున్. 1060

వ. పసుచుటయు నయ్యామినీచరవరుండు. 1061

క. పోసఁగినపస నలువదిక్రో, శసముబలాఢ్యు లసురులు సహాయులుగా స
త్తసమృద్ధి వేగి యాఁగె, న్వెస ద్రోణముఁ గొంచుఁ బోవువీరశ్రేష్ఠున్. 1062

క. ఇట్లాఁగి ద్రోణ మేటికిఁ, బోట్లాడక విడిచి బ్రదికిపొమ్మనునెడలన్
జెట్లాఁపఁ బిశితాశవ,క్రోట్లకనిఁ జుట్టుముట్టికో యని తాఁకన్. 1063

చ. పవనసుతుండు మూర్ధధృతపర్వతుఁ డందఱ కన్నిరూపుఁడై
జవ మొసఁగం బదాహతుల జర్జరితాంగులఁ జేసి కొందఱం
బ్రవిమలదంతకుంతనఖక్షురికాహతిఁ జేసి కొందఱన్
రవినిభుఁ డుగ్రదైర్ఘ్యకకరంబులఁ గొందఱ బిట్టు చంపుచున్. 1064

క. రంహప్రక్రియ నసుహృత్సంహతి సంహరణలసదశనికైవడి వీ
తాంహుఁడు వాలముఁ ద్రిప్పుచు, సింహధ్వని చేసె దిశలు చెవుడుపడంగన్. 1065

వ. భైరవారావుండై యసురజీవితకాలక్షేపంబుగా వాలక్షేపంబు గావించి. 1066

క. గాలి వసుడాసుపసువుం, దూలించినభంగి నగ్గి దూదితునుకలం
గాలించినపోల్కి సోఁకుల, గాలిసుతుఁడు ద్రోసె వేడ్క గ్రాలెసుమదితోన్. 1067

గీ. ఇట్టు లొకనికైన నిట్టట్టు పోనీక, చంపి జలధిలోనఁ జల్లు టరయ
వనచరుండు గాన వనచరంబులకెల్ల, సెరలు వెట్టె ననఁగ నెసఁగె నంత. 1068

మ. అరిమర్దాంతుఁడు మాల్యవంతుఁడు మహాహంకారఘోరాకృతి
స్ఫురితుండై గగనాధ్వ నప్పవనసంభూతుం దలంకింప స
త్వరుఁడై యుద్ధము సేయ పోవ మనుడు న్వాతూలబాలుండు ను
ద్ధురసత్త్వాతిశయంబుమీఱఁ గవిసెన్ దోర్దర్ప మేపారఁగన్. 1069

చ. మొదలఁ బదద్వయిన్ దనుజుమూర్ధము దన్నిన మాల్యవంతుఁడుం
గదలక మాల్యవంత మనఁగా నచలస్థితి నిల్చియుండుట కాం
చఁదగ మహీధ్రభృత్పవనసంభవు డొక్కట నెత్తిఁ బెట్టి దు
ర్మదుఁ డగుపంక్తికంధరు సమతుముఁ జేర్పఁ దలంచెనో యనన్. 1070

క. తదనంతరమున భయద,ప్రదరద్రుఘణాసి ముసలపరశుగదా దు
ర్మదశక్తిప్రముఖంబులఁ, బొదివెఁ బయోధరము ధరముఁ బొదివినయాడ్కిన్. 1071

చ. పొదివిన సింహకేసి వెఱఁ బొందని డెందముతోడ నాగముం
గదిసిన పింగదృష్టి యనఁగాఁ బవనప్రియనందనుండు త
ద్వదనబిలంబునన్ రుధిరధారలు గ్రమ్మఁగ బిట్టురంబు బె
ట్టిదముగఁ దన్ని దౌడలు కడిఁదిబలంబున నూడఁబీఁకుడున్. 1072

వ. తొల్లి గరుడవాహనుండును జక్రధరుండును నగు విష్ణువుతోడం గడంగి పెనంగి యో
హాటింపని యమ్మాల్యవంతుండు వివిధమాయాజాలంబులు ప్రయోగించి నిష్ఫలం
బగుటకుఁ జింతించుచు నుగ్రశక్తి విసరి యదియునుం బొల్లువోయిన నిర్వ్యాజఁగొఁది
యుండఁ బవననందనుండు నద్దురాత్ము నిజవాలపాశంబున నతికిఁ గిరగిరం ద్రిప్పివైచిన

ద్రోణంబు తాఁకునఁ బ్రాణంబులు వదలి తోడిదానవులఁ దోడుచేసికొనం బోవు
చందంబున నంబునిధి మునింగె. 1073

క. హెచ్చి పవమానతనయుఁడు, తెచ్చెడువిపులాంచితౌషధీశుధరసము
ద్యచ్ఛాయలోహితరుచిస,ముచ్చయముం గాంచి రాముఁ డురుచకితుండై. 1074

వ. అరుణోదయంబనుతలంపున 1075

మ. అనువ్యాద్దౌష్ట్యమున స్వసహోదరుఁడు మూర్ఛాయత్తుఁడై యుండఁగా
నణువ్యాద్ధుగళభరంబునన్ నృపతిసింహం బిట్లు చింతించె నో
యి సుమిత్రాసుత సంగరాంగణమునం దీరీతి నిన్ డించిపో
యిసుమిత్రాదిక బంధుకోటి కెదురై యేనెట్లు జీవించెదన్. 1076

క. ఏనిన్నుఁ గూడవచ్చెదఁ, గాని బ్రదుకనోపఁ దిగ్మకరుఁ డుదయింపం
గానున్నవాఁడు మారుతి సూనుం డరుదేక యున్న సుకరుం డగుచున్. 1077

తే. ప్రథితసంజీవనీరసౌషధములఁ జేసి, వెలయులక్ష్మణుప్రాణము ల్దెలి యుపొందఁ
గ్రాలఁజొచ్చెనినుఁడు వంశకర్త యయ్యుఁ, దల్లి పిల్లలఁ దినసేమి తగవు గలదు. 1078

వ. భగ్నప్రతిజ్ఞుండనైతి నని కపులంగలయఁగనుంగొనిన వారలు నవిరళబాష్పధారాపూరితలోచనులై రందుఁ గొందఱుచితవచనంబుల నాశ్వాసించినఁ గుదురు వడని డెందంబున దినకరునుద్దేశించి కలుషించి. 1079

తే. హరితపనుఁ డుగ్రమూర్తి మాయావినోది, పద్మినీకాముకుఁడు సత్రభాషణోది
కోకహితవర్తి కువలయక్షోభకారి, తవునె యీతని లోకబాంధవుఁ డనంగ. 1080

ఉ. మిత్రుఁడుగాఁడు నాకితఁ డమిత్రుఁడు నన్నుఁ గరంబు భూమిభృ
న్మిత్రునిఁగాఁ దలంచె నతిమాత్రమదీయ శరాగ్నిహోత్ర మి
ద్ధాత్రి వడంక నిప్పుడ పతంగముఁ బోలెఁ బతంగు నేర్చి లో
కత్రితయంబుఁ జీకటులుగమ్మఁగఁ జేయుదె యద్భుతాకృతిన్ 1081

క. అనిరౌద్ర మెసఁగ రామా,స్త్రనిరూఢప్రహతిఁ దరణి ధరణింబడనే
యనిరూపించెడు రాముఁ, గనుఁగొని యిట్లనిరి భల్లుకప్రభుముఖ్యుల్. 1082

మ. నృపచూడామణి వాయునందన సమానీతప్రశస్తౌషధీ
విపరీతచ్ఛవిగాక భాస్కరకరావేశంబుగాఁ దోఁప దీ
నపలాపింపకుఁ దెల్లవాఱెనని ధైర్యస్థైర్యచిత్తుండవై వ్రాఁ
దిపరీక్షింపుము మూఁడుయామములు వర్తించున్నిజంబింతకున్. 1083

క. భూమీశ యిప్పుడు పాల్గవత్ము ప్రవేశించె నుదయసమయం బగునే
నీమేయిఁ దారక లలరునె, కోమల భూమిరుహకోటిఁ గూయవె పులుఁగుల్. 1084

క. వ్రచ్చునెదిరించు దనుజులఁ, దెచ్చును సంజీవనీ లతికలిప్పుడు నీ
కిచ్చునొమ్మొదము మరల, న్వచ్చు న్మహీనాథలక్ష్మణప్రాణంబుల్. 1085

క. మనమార న్మనమారుతి, వినుమానికమునను మున్న వినుమావచ్చె
న్మనుమానవపతి లక్ష్మణుఁ, డనుమానము మాను మాత్మ నణుమాత్రంబున్. 1086

క. అంబరమణి సంశ్రితులకు, నంబరమణి కొలఁతుగాని యాతనిఁబడ నే
యం బరికింతువె డింపుచ్చలం బెదురుగఁ బఱపు కపిబలము మారుతిఁ గన్. 1087

ఉ. సందియమేల యొక్కనిమిషంబునఁ జనుదెంచు నమ్మరు
న్నందనుఁ డౌషధంబులు ఘనంబుగఁ జేకొని వాపు నమ్మహా
నందము నొంది రామనరనాథుఁడు కీశుల భల్లుకేశులం
గ్రందుగ వానరేంద్రు నెదు రన్నియమించె ననేకకోటులన్. 1088

వ. అయ్యుత్తరక్షణంబున. 1089

సీ. ద్రోణధాత్రీధరద్రుమసంచలనపతత్సమములాచార లాజములు గాఁగ
విపులకర్కశఘోరరిపుభయంకరదీర్ఘతరవాలయష్టి కైదండ గాఁగ
సదమలమణివిభాచ్ఛాదిసంజీవనీక్షోణీధరము వెలిగొడుగు గాఁగ
దగ నెదుర్కొనవచ్చి తనచుట్టు నడిచెడి తరుచరపతులు కింకరులు గాఁగ
నిజరయప్రజనితమహోన్నిద్రభూరి, పవనసంచారములు బరాబరులు గాఁగ
బ్రకటసంజీవనీధనరాశిఁ గొనుచు, క్షితిప్రగతి మీఱ వచ్చెఁ గపిప్రభుండు. 1090

వ. వచ్చి యమ్మహామహీధరంబును యథోచితస్థానసుస్థితంబుగా డించి. 1091

క. తివిరి కపు లభినుతింపఁగఁ, బవనసుతుఁడు మోడ్పుఁగేలు ఫాలతలమునం
దవిలిచి సరభసగతిరాఘవునింగని యిట్టు లనియెఁ గడు ముద మొదవన్. 1092

ఉ. విఘ్నము లెన్నియేని ప్రభవించినఁ ద్వద్దయవాని మామకో
పఘ్నముఁ జేసనీక యొకభంగిగ మందులు దెచ్చినాఁడ శ
త్రుఘ్నవనౌకసావలికిఁ, దుష్టి ఘటిల్ జనియింప నింక శ
త్రుఘ్నుని తోడఁబుట్టువున దూర్ణమ తెల్పెద మేల గాసిలన్. 1093

మ. అనినం బెన్నిధిగన్న పేదక్రియ నయ్యారాఘవాధ్యక్షుఁ డా
హనుమంతున్ బిగియారఁ గౌఁగిటికి దీయం బొంగి మిన్నందె నా
ఘనుఁ డావేళ సుషేణుఁ డోషధులఁ జక్కం జూచి తా నేర్చి తె
చ్చిన సౌమిత్రి ససంజ్ఞుఁడై తెలిసె నక్షీణప్రభాపూర్ణతన్. 1094

క. పృథునిద్రితుఁడు మేల్కను, విధమునఁ దెలిపగని రామవిభుల సదంఘ్రి
గ్రథితశిరస్కుఁ డగుడు భూ, మ్యధినాథుఁడు కౌతుకమున నాలింగనమున్. 1095

వ. కావించె నయ్యాఱనీపతిం గనుంగొని వనచరులు నపరిమితహర్షితోషులైరంత హనుమం
తుంగని యనుగ్రహాతిశయంబున లక్ష్మణాగ్రజుం డిట్లనియె. 1096

గీ. తొల్లి ఖగనాథుఁ డమరులఁ ద్రుళ్ళడంచి, తల్లి వినతను గుణవతీమతల్లి సంత
తమ్ము ముదమొంద నయ్యమృతమ్ముఁ దెచ్చెఁ, గరణిఁ దెచ్చితి సంజీవకరణి వత్స.

చ. వనచరవర్య నీవబలవంతుఁడవు న్నగవాఁడ వెల్లచోఁ
గనుఁగొనిరమ్మ సీత ననఁ గాలిచివచ్చితి పంక్తికంఠుప
త్తన మిపు డౌషధంబులు ముదంబునఁ దెమ్మనఁ గొండఁ దెచ్చి తె
ట్లు నతి యొనర్ప నేరుతు వటుప్రవరా నిను నీగుణంబులన్. 1097

క. మారుతి యేగతి నీఁగుదు, నీఋణ మస్మత్కులంబు నిలిపితివి సమి
ద్ఘోరస్థలిఁ మూర్ఛపడిన, యీరాజకుమారు నెత్తి యెంతయుఁ గరుణన్. 1098

వ. రెండవలోకేశుండవై లక్ష్మణప్రాణంబులు సృజియించితివనవ్వ యని కొనియాడు
చుండె, నపుడు దపురు లమృతరసాస్వాదనంబునం బరితృప్తి నొందిన ద్రోణసానుమ
త్సానుప్రదేశంబుల ఫలరసమధురమధురసానుభవంబునం బ్లవంగపుంగవులునుం బ్ర
మోదమగ్నమానసులైరి. 1099

మిత్రసుపుత్రసుమిత్రాపుత్రాదులు నిజరయంబుఁ బొడఁగని ప్రాగ్దక్
ధాత్రీపతియానతి నా,ధాత్రీధర ముంచి వచ్చెఁ దగ నెప్పటిచోన్. 1100

జంఘాలుండగు నమ్మరున్నందనుఁడు స్థూలజంఘులగు స్థూలజంఘాదు లనేకులు
పొదివినం జిక్కుపడక యొక్కమొగిఁ జిక్కువఱచి యుక్కడంచి యమ్మహా
మధీమహీధరంబు నాస్థానస్థాపితంబు గావించి వచ్చెనంతట. 1101

క. తన కెంతేవాసి మిగులఁ, దనయంతేవాసి ద్రోణధాత్రీధరమం
గొనితెచ్చి వైచివచ్చుట, విని కనుఁగొన వచ్చెనన రవి యుదయమయ్యెన్. 1102

ఇట్లు భానూదయంబైన నెల్లకపులు, నుల్లసంబున రాఘవయుక్తులగుచుఁ
గయ్యమునకు నాయత్తులై కాలు ద్రవ్వ, చుఁటు చారులచేతను వింటఁజేసి 1103

విషాదవేదనాయత్తుండును బశ్చాత్తప్తుండునునగు దశకంఠుండు. 1104

క. విక్రాంతత్వముడిగి వైరక్రమము దొఱఁచి విగతరాక్షసుఁడై ని
ర్వ్యగ్రత నిశ్చింతతన్, శత్రుం గని యిట్టు లనియె శోకితుఁ డగుచున్. 1105

చ. గురువర రామతోడఁ బగఁగొంటి సహోదరుఁ గుంభకర్ణు సు
స్థిరబలశౌర్యపూర్ణు బలజిజ్జితు నాత్మసుతుం బ్రహస్తు భీ
కరతరహస్తు సైనికనికాయపతిం గడతేర్చుకొంటి నీ
తిరతుఁ విభీషణుం దడిసి స్వీయ తోఁటికి భూతి చెల్లునే. 1106

క. అతికాయుఁడు మహాకాయుఁ, డతిలోకపరాక్రములు లయంబందిరి నా
గతి నీవ యింక నేనే, గతి నహితులఁ గూల్చి హితులగతి నంపింతున్. 1107

క. కుంభనికుంభసదృశులు, కుంభనికుంభు లనిలోనఁ గూలి రహితులో
స్తంభనిగ్రహితు లగుచున్, దంభముగా నెట్లు వారిఁ దఱుమఁగవచ్చున్. 1108

క. హితసుతసోదరబంధుస, హితు లహితులచేత దితిజు లీల్గిరి పోరో
హిత యిష్టు నీకుఁ బ్రసమీ, హిత మిదియని తెలుపు మార్య భృగుకులవర్యా. 1109

క. పత్తనముం గాలిచి రప్పిత్తరుచే ఘోరగతిఁ గపిప్రకరము లా
పత్తున మిత్తికిఁ జిక్కితి, నిత్తఱిఁ జే పట్టు నెవ్విధిఁ బోదున్. 1110

వ. అని పరవానరాక్రమణంబును నిజపరాజయంబునుం జెప్పి. 1111

క. ప్రస్వభవము విప్రక్రతు, భుగ్వనితాకృతము సుంతపోలుపఱపుండన్
దిగ్విజయము త్వదనుగ్రహ, దృగ్విశవత గాదె మున్న తేజమునొందెన్. 1112

ఉ. కావున భూమినుత్చరనికాయసమాశ్రితు లన్నరాధము
ల్లావు దొఱంగి సిగ్గటి చలంబు మహీసుతలోన డించి నా
పోవుచుఁ బోవునట్లు భృగుపుంగవ యెట్లు లనుగ్రహించెదో
నావుడుఁ బంక్తికంఠువదనంబులు గన్గొని కావ్యుఁ డెంతయున్. 1113

క. బోధించి బుద్ధి చెప్పినఁ, గ్రోధించినయట్టి సురవిరోధిం బ్రమనో
వ్యాధినిరోధిం బంక్తిశిరోధిం గని నవ్వుచున్ గురుం డిట్లనియెన్. 1114

క. దిక్ప్రభులు దలంకఁగ హుత, భుక్ప్రియమగు హోమకర్మము నొకఁడు మాంసా
స్రుక్ప్రకటిత మొనరిచి యస, కృత్ప్రబలుండ వౌదు వింక దివిజులకైనన్. 1115

ఉ. తూర్ణముగాఁగ వేలిమి యదూషితమై విధివంతమై సుసం
పూర్ణమునొంద నం దసురపుంగవ వర్మశరోరుచాపని
స్తీర్ణరథంబు పుట్టు నది చేకొని వైరులబాడి వెట్టినం
జీర్ణపలాశము ల్పవను చేతఁ బలెంగడ నోహటించరే. 1116

క. నరు లెంతటివారైనా, నరులెంతటివార లీశుఁ డయిన వైశ్వా
నరుఁ బూజింపు గుహాలఁ గి, న్నరులు పొగలు మిగులఁ బోగుల నరతరసాసీ. 1117

క. నిఘ్నకృతిగాక వేల్మికి, నిఘ్నం బగు నేని రిపుల నేఁచెదు నమమ
న్విఘ్నము గల్గిన శమనో, పఘ్నమునకుఁ బోదు విది నిబద్ధి తెలియుమా. 1118

వ. అని తన్మంత్రంబును దదాహుతిప్రమాణంబును దత్పశుప్రకారంబును దన్నిధానంబు
ను దద్విధానంబును యథోచితంబుగా నెఱింగించి సమధిగతకాలచక్రుం డగు
శుక్రుం డ స్థానంబు నొందుటయు 11

శా. ఉగ్రాంశుప్రతిమానతేజుఁ డగు నయ్యుర్వీసురాగ్రేసర
వ్యగ్రాదేశముఁ జాలనమ్మి నిజధైర్యస్ఫూర్తిఁ బోఁద్రోఁచి నీ
లగ్రీవుం బరమేశు నీశ్వరుఁ గడున్ లక్ష్యంబు గావించి పం
క్తిగ్రీవుం డపు డగ్నికార్యకరణాంగీకారచిత్తాబ్జుఁడై.

వ. పెద్దయుఁబ్రొద్దు చింతించి యేకనిశ్చయుండై.

మ. కుహానోత్కంఠుఁడు పంక్తికంఠుఁ డసదృక్షోణీభృదంచద్గుహా
కుహారం బొక్కఁడు చొచ్చి యందు హుతభుక్కుండంబుఁ గల్పించి దై
త్యహితుం డెల్లెడఁ గాపువెట్టి పలరక్తద్రోణికల్గూర్చి ని
ష్ఠ హుతాశి స్సమకొల్పి వేల్వఁదొడఁగె న్సమ్యగ్విధానంబునన్.

వ. దారుణహోమకర్మతుండును రక్తగంధమాల్యాంబరధరుండును మౌనవ్రతుండై
కుక్కుటమార్జారాదిఖగమృగనివహంబులు సంగ్రహించి.

క. దుర్భగశస్త్రాస్త్రంబులు, దర్భలుగా రక్తమాంసదధ్యాజ్యముల
న్నిర్భీతి శ్మశానమహీ,గర్భాభీలాగ్ని వేల్వఁగాఁ దొడఁగుటయున్.

క. గ్రహరాజపరిగ్రహణా,గ్రహమున కెల్లను తమఃప్రకారమున భయా
వహ మగుచు నెల్లయెడ హుత,వహనిర్గతమైన ధూమవర్గము వెడలెన్.

సీ. వనచరు లొక్కలంట మనలంకఁ గాల్చుచున్నారేమొ యని దైత్యనారు లదర
ఖచరకాంతలు దశకంఠుఁడు పంపిన కాలిసంకెలలంచుఁ గడల గొడఁగ
బిలములలో నున్న యెలుకలగతి నద్రిగుహలఁ గిన్నరుల మక్కళబిగింప
వసురాధముమహాపయశ్శీ మిన్ను మూర్తీభవించి రోదసి నాక్రమించె ననఁగ
హోమధూమంబు వెలువడి యుగ్రమగుచుఁ, గపులు నివ్వెఱపడిరి తత్కారణంబుఁ
గలనుపడఁగ విభీషణువలనఁ దెలిసి, జన్యరిపుమూర్తి రామరాజన్యమూర్తి

శా. తద్ధోమప్రవిఘాతసంఘటనబద్ధస్పర్ధుఁడై పంచె నం
చద్ధాత్రీధరభూరిసాలమహోచ్చక్ష్మారుహాగారులం
బద్ధాశ్యంబుధరావళీమళికితాపవ్యద్ధసిరోధశా
వ్యద్ధిర్ఘృభ్రమదబ్జసంభవమహాయవ్యాపారవిస్తారులన్.

మ. నలనీలాంగదవాయునందనసుషేణక్రోధనాథు ల్మహా
నలసంకాశులు కీశులాత్మజమనానాదిక్పరిస్ఫోటనో
పలవిక్షేపులు కామరూపులు దృఢప్రాకారదుర్దాంతమున్
ఖలరక్షఃక్షతసంతమున్ నయదలంకాపట్టణప్రాంతమున్.

క. వడిఁ జేరి యాహవంబుల, గడిదేఱిన వారి నూరి కావలివారిం
గడతేఱిచి ప్లవగులు వడి, బడిఁ దేకుల నద్రిసన్నిభముల నిభములన్. 1129

గీ. విఱిచి ప్రోవులు వెట్టుచు విసరికొనుచుఁ, గోప మొదవంగ ఘోటకకోటిఁ జదిపి
యంగడులు రచ్చకొట్టము లవనిఁ గలపి, లంక సకలంక నిట్లు కలంచి యాడి. 1130

క. వెండియు వెండియుఁ బైఁడియు, నిండఁగ నుండెడు నిశీథినీచరవిలస
ద్భాండాగారము లసదృ, గ్భాండాగారములు నీఱుగావించి వడిన్. 1131

వ. గృహారామసీమామనోహరప్రదేశంబులు, గలంచి యయ్యాయిస్థలంబులఁ ద్రిమ్మరి
యెంతయును దారుణరావణహోమస్థానంబు గనుంగొనఁ జేరక తొట్రుపడుచున్నంత.

క. రావణుఁ డీమెడ వేలిమి, గావించెడు ననుచు సరమ కడుఁగొనముల వెం
దీని విభీషణు పట్టపు, దేవి యుపాంశుగతిఁ దమకుఁ దెల్పి చనుటయున్. 1132

క. బిలముఖమునఁ గీశులు బిల, బిలఁ జని యొకచోట శైలబిలగర్వాహరున్
జ్వలనసమర్పణధృతచరు, కలితకరు న్వింశతికరు ఘటితపరికరున్. 1133

క. కని జెట్టిఁ జీమలు చుట్టినభంగిం బ్లవగు లురవడిం గవిసి చలం
బున నెన్నియేని బాధలు, పొనరించినఁ జలింపక కనుగవుఁ గవుఁడు ధృతిన్. 1134

శా. నిర్విఘ్నంబుగ హోమకార్య మనుసంధింపన్ మహాక్రోధు ల
య్యుర్వీసుతాసనాథముఖులు పురస్థోమాకృతస్థాలికా
దర్వీస్రుక్స్రువసమిద్గర్భాపవిత్రాదికా
పూర్వప్రాకటహోమవస్తువితతిం బోకార్చి వెల్లార్చిరన్. 1135

క. వదలని మౌనంబున దశవదనుఁడు నిష్ఠ మెయి హవ్యవాహుఁ గృశానుం
బదిలుఁడయి పూజసేయుచుఁ, గదలక యుండుట గని రోషకలితాత్మకులై. 1136

క. కనకాద్రి ననుపమ మ్మెట్టు, లను గొట్టినమాడ్కిఁ గడుఁ జలంబునఁ గపుల
ద్దనుజాధము దృఢదేహము, ఘనముష్టిప్రహతిఁ బొంచి కదలక యున్నన్. 1137

వ. హోమవిఘ్నమునకై యడిచియుం బొడిచియుం గఱచియు నద్దనుజాధమునం దించు
కయుఁ సంచలనంబు గానక కాననచరులు నివ్వెఱఁగంది కంది కుంది రయ్యెడ

క. శుద్ధాంతఃకరణుఁ డగుచు, శుద్ధాంతము సొచ్చి వాలిసూనుఁడు నయసం
వృద్ధాసుర వృద్ధవయః, శుద్ధాంతముఁ బంక్తికంఠు శుద్ధాంతంబున్. 1138

తే. చేరి తత్సుందరీపరిచారికాస, హస్రసమగ్రపరిపూర్ణ నేత్రాంత మగుచు
నొదుఁగ మందోదరికబరి నొడిసిపట్టె, భయదయమపాశసదృశోగ్రవాలుఁ డగుచు

వ. మందారకుసుమదామసంబంధం బగు మందోదరీచికురబంధంబు వామకరంబునం
బట్టి రక్షోరాజ్యలక్ష్మిం దిగిచినచందంబున మణిమయోన్నతాసనంబు దిగం బడఁ

గ్రోచి రావ్వబిందుసందోహంబు కంఠహారముక్తాఫలయుక్తంబై నేలరాల భద్ర
దంతావళంబు మృణాళనాళంబునుంబోలె నీడ్చికొని పోయి దశకంఠు సముఖం
బునం బెట్టి నిర్దయుండై. 1142

క. అజ్ఞదెలిసి దశముఖ నీ, పజ్జను గులకాంతఁదెచ్చి పఱచుచునుండన్
లజ్జించి వెనుకఁజూడక, యొజ్జల బుద్ధి విని చనునె హోమము సేయన్. 1139

శా. ఫుల్లాంభోజముఖీవివీన సుమచాపున్ ఘోరచాపుం గృపా
కల్లోలిన్యధినాథు రాఘవు నయుంగా నాత్మనూహించి సం
పల్లాభంబులు పొందెదెల్లు కపటోపాయంబుఁ జింతించి ము
న్నల్లోకంబులమాత సీతఁ గదుమరోత్మోహంబునం దెత్తురే. 1140

వ. అని కపినోక్త లాపుమ నవనిం బడఁద్రోసిన నమ్మరుతనయ. 1141

క. వలఁ గట్టువడిన పులుఁ గన, సిలుఁగు మిగుల దైవమునిషేధించుచుఁ దా
వలిగట్టుఁ గదలక రిపు, నలుగకయున్న ధవుఁ గాంచి యడలుచు ననియెన్. 1142

క. పతి దాఁ గురించి సీతా,పతి. దెచ్చితి చోరవృత్తిఁ జర్చింప భవ
త్సతి మందోదరి దీనతఁ, బతిసన్నిధిన కపిచేత భంగముగుడిచెన్. 1143

ఉ. వాలిసమారుఁ డాలి బలవంతము గాఁ దలకట్టి యీడ్వ నదే
వాలిఁ దలంకఁ జేయుద్రవిణాఢ్యుఁ డితం డని పెంపునొందఁగాఁ
జాలిననాఁడవయ్యె మునిచాపున నూరక చూడఁగాదు నీ
వేలిమి బూదిగాను బడవేయుము మత్పరితాపకారకున్. 1144

క. అని పదరి యింద్రజిత్తుఁ, దనమదిలోఁ దలఁచి పుత్రుఁడా నీవున్న
న్నను దేటి చూడఁగా వచ్చునె మర్కటఘటునికనుచు శోకించు నెడన్. 1145

వ. పరిత్యక్తనిజహోమకర్మకలాపుండై 1146

ఉ. ఆయతరోషలోహితదశాననుఁ డైన దశాననుండు క్రా
త్తేయుక మగ్రభంగిగమకించుచుఁ గేల సమర్చి యుద్ధతన్
బ్రేయుడు నంగదుండు పిరిపీడిన తాలిమి వీడె నాసురీ
స్వాధు దసర్ఘసత్ర్సగనుబంధముఁ దత్సతి కేశబంధమున్. 1147

క. భీమము విచకితఖేచర,భూమము సంపిహిత ఘన నభోవలయ మహా
ధూమము నిజసంకల్పిత,హోమము విఘ్నంబగుడు మహోగ్రుం డగుచున్. 1148

క. హుమ్మనిడాసిదశముఖుఁడు, స్వమూర్ఛితునంగదున్ని శారింపఁ బ్రబు
త్వమ్మొప్పరింపనెఱిఁగి త్వరి,తమ్మునెడసాచ్చి మారుతసుతుఁ డగల్చెన్. 1149

ఉ. ఈకరణింగడంగిన కపీంద్రుఁ దిరంబుగఁ జూచి దానవుం
డాఁకలి గొన్న మృత్యువుక్రియం బదిరుత్తుక లెత్తివానితో
నాకుల మెల్ల నీఱుగ నొనర్చితి వక్షయపుత్రుఁ జంపి నీ
వేకతినుండ వెల్లకపివీరులలోన మదం బడంచెదన్. 1150

వ. అని మిట్టి పడి యవ్వాలిసుతుపట్టిం దొట్టి చెట్టుమనికిపట్టు దిట్ట తిట్టులం గట్టిసెలకట్టి యలం గొట్టిన నజ్జెట్టియున్ దట్టుకుఁ జలపట్టి చుట్టుకుట్టి మెట్టులమెట్టియు నెట్టన మొట్టియు బెట్టుఁ దిట్టియు నిప్పట్టున పెట్టుపుట్టం గుట్టు మట్టు వెట్టె. 1151

క. పగతు న్నిష్ఠాధైర్యాపగతుం గావించి ప్లవగభల్లుకముఖ్యుల్
విగళితమూర్ఛావశగుణుఁ, డగు వాలిసుతుండు తమకు నగ్రేసరుఁడై. 1152

గీ. కడఁగ నడుమ నున్న కావలివారలఁ, దఱిమి తాఁయువగులఁ దన్ని చొచ్చి
నట్టి బిలముఖమున నందఱు వడివడి, న్వాలి రామధరణి విభునిఁ గాంచి. 1153

వ. తాము పోయివచ్చినకార్యం బెఱిఁగించి తదీయసంభావనాతిశయంబునం బ్రమోదం బునొందిరి. అధికత్రపావనతవదనయై నిజాంతఃపురంబు సొచ్చి

క. దరిగడచిన సీత్వ్బిక సుందరి గంధగజేంద్రయానతగుచానఁ గృశో
దరి కమలనేత్ర మందోదరి కన్గొని శోకగద్గదస్వరయగుచున్. 1154

ఉ. మన్ననఁ గల్పితాప్తులఁ గుమారులఁ బ్రేయసిభంగిపాటు నీ
కన్నులనిండఁజూచి గతగర్వతనొందితి మున్న శత్రుద
ర్పోన్నతిఁ గాండిశీకతయునొందితి వేఁటిచలంబు శౌర్యసం
పన్నవరేంద్రు రాముఁగని భక్తి మహీసుతనిచ్చి మ్రొక్కినన్. 1155

క. నినుఁ బ్రాణయుక్తుఁగా నా, రని కృపరతుణమొనర్చి రక్షోరాజ్యం
బున నీతమ్ము విభీషణుల, దనరఁ బ్రతిష్ఠించి చనుఁ గృతక్రియుఁ డగుచున్. 1156

ఆ. వె. సీతఁ దెచ్చి తప్పచేసితిఁ గరుణింపు, మనుచు రామభద్రు నంఘ్రియుగముఁ
బట్టుమింకఁ జలముఁ బట్టఁగ నేటికి, వినుము నాదుపలుకు దనుజనాథ. 1157

క. మానవు గద చలము రిపు, న్మానవుఁగఁ దలఁచుట యసుమానవుఁ బాటు
న్మానమున కనువులకు నను, మానము నూన మగు ననుపమానవిచారా. 1158

వ. అనిన నిజవల్లభకు దనుజవల్లభుఁడు. 1159

క. కాయంబులు బహుళసుఖని, కాయంబులు వివిధధననికాయంబు లభి
ప్రాయంబులు ప్రాయంబులు, ప్రాయంబులు సతి తృణాంబురప్రాయంబుల్. 1160

వ. కావున. 1161

క. ఆశల జయించుటుడిగి దు,రాశలన జయించి జనకజాత్మాధీశున్
బాశార్హ్వప్రతినిధి నద్దాశరథిం దొడరి పోరఁ దగు నాకెట్లున్. 1162

క. తరణీతచ్ఛగధారా,పరిధారాప్రకటితాత్మ పంథుఁడనై సు
స్థిరపుణ్యలోకసంప్రా,ప్తి రహింపం దలంపుచేసితి న్మదిలోనన్. 1163

వ. అని కృతనిశ్చయుండై. 1164

క. ముడితచెయివట్టి మెల్లన, మది తల్లడము డుగునట్టి మాటలు వొసఁగిం
చిదశాస్యుఁ డెట్టకేలకుఁ, దదన జ్ఞాతుఁడయి కదల తాత్పగ్మనునన్. 1165

సీ. బ్రహ్మాండభాండంబు పగిలి బీఁటలువాఱ ద్రుతగతి విజయదుందుభులు మొరయఁ
గల్పాంతబహుప్రకారఘోరాకార యములునాఖడ్గరోమాదు లరుగ
జలముల్పై నోడ చలన మందెడుగతిఁ జతురంగబలగతి జగతిగదలఁ
బటుహరిద్ధరికర్ణపుటభేదన సమర్థ కలితశంఖారవంబులు సెలంగ
శంఖశతకోటి సదృశంబు శాతఘోర,చంద్రహాసంబుచే నిజాంసంబు దనర
రథమధిష్ఠించె లోక విద్రావణుండు, రావణుండు మదావహైరావణుండు. 1166

సీ. సలలితకళ్యాణశరపరిపూర్ణమై పాణ్మాతురోద్భవస్థానమనఁగ
ఘనరాహుముఖకేతు కలితాంబరంబయి మహనీయతారకామార్గ మనఁగ
నధికసారాక్షుబాణాసనకలితమై కఠినకాంతారభాగం బనంగ
వరసువర్ణసహస్రహరిపరిస్ఫురితమై నవచండభానుమండల మనంగ
నగణితమణిప్రభాధగద్ధగిత మగుచు, సదమలోత్తుంగరోహణాచలమనంగ
నొప్పునరదంబు రక్తగంధోత్తరీయ,మాల్యదైగంధమెసఁగ సమ్మోద్దికెనెక్కె. 1167

చ. అనుపమశక్తి షోడశరథాంగపరిస్ఫుట నేమి ఘట్టన
ధ్వనియును ఘంటికాపృథురవంబును నొక్కట విస్తరిల్లఁ బె
ల్చన నరదంబుఁ జిత్రగతులం దనసారథి కాలకేతుఁ డూ
ఱ్యనఁ గడపం దదశ్వహృదయంబున కెంతయు నాత్మ మెచ్చుచున్. 1168

క. శకునాపసవ్యగతిదు,శ్శకునంబని యాత్మ నద్దశశిరుఁడొకయిం
చుకయేని సంశయము నొం,దక వడితో వెడలి యోధతతిపర్వ్వుకొనంగన్. 1169

వ. అనర్గళవీరస్వర్గాపవర్గమార్గ సర్గనిసర్గులరై పెనఁగుఁడని చేయివీచి. 1170

క. రాముం జంపెదఁ జచ్చెద, రామునిచే నింతెకాని రణరంగమునన్
దీమసమేది చలంబఱి,యే మగిడి ఫురంబుఁ జొత్తునే యొబ్బంగిన్. 1171

వ. అని బరవసంబుగావించె. 1172

క. కపిసేనావార్ధిపై విపరీతాసురబలాబ్ధి వెల్లి విరిసెనా
నుపమాతీతమగుచుఁ బొంగి పయింబడె నదియును నిశ్చలితగతి మొనయన్. 1178

క. ప్రాగ్విషమతఁ బూర్వపరు, ద్విగ్విషలోకంబు వారి వెగడుగుడుపఁగా
నద్వయ మగుసంగరము బలద్వయమునకయ్యె సంకులబహుళమగుచున్. 1179

క. రజనీచరచతురంగధ్వజినీవ్రజఖుర ఘోరవాహిన్యంఘ్రి
వ్రజనిహతభూతధాత్రీరజోనికరజలద మంబరంబున ఘనమై. 1190

క. శరవర్షము విపులోపల, కరకాయుత మగుచు బలయుగవనద్వయి ను
ద్ధరసింహనాదగర్జాస్ఫురితం బైకరిసె రక్తము నదులుగాఁగన్. 1191

ఉ. హత్తిన కిన్కఁ దత్తటి నరాదనయోధులు గండగొడ్డళు
ల్గత్తులు డొంకెనల్గుదెలుఁ గట్టెలుఁ గోలలు ఖాంటీఁ టెంబు
న్మొత్తముగాఁగ వానరచమూనివహంబులపై విదుర్చుచుం
గుత్తుకబంటి నెత్తురులు గ్రోలుచుఁ బోరొనరించి రార్చుచున్. 1191

శా. మధ్వాపానమదప్రభత్తుల వదోన్మాదంబునం బేర్చి సిం
హధ్వానంబున భోధ్వనిం చయభీమాహాదిగా నెంతయుం
బృథ్వీభృత్ప్రతినిధ్యభంగఘనకుంభీస్యంద నారోహులై
పృథ్వశ్వంబుల నెక్కి దైత్యులరిమూర్తిస్ఫూర్తిఁ బోరాడఁగన్. 1192

క. రీణానుకంపులై ప్రాపాణాసారమున సుభటసామజరథఘో
ట్టాణాశ్వకరథికనికర, ఘోణాపుటము లనలంగఁ గొట్టుచుఁ గపులున్. 1193

ఉ. దుర్దమభంగి శాత్రవవిధూననకేళియొనర్చి ఱట్టిస
మ్మర్దపుటాహవంబున విమర్దితమైన నిశాచరావలిన్
దుర్దశనొందనీక మునిదూషితనాముఁడు శిద్ధరోముఁ డ
న్నిర్దయుఁ డేచి బీరమున నిర్జరయోధులు పిచ్చలింపఁగన్. 1194

చ. వెడలి దురంబొనర్పఁగని వృశ్చికరోముఁడు సర్పరోముఁడుం
గడకొని మార్గణానలశిఖానిచయంబుల వానరావలిన్
బడలువడంగఁ జేర్చి ప్రసభంబున వెండియు నన్యసైన్యముల్
సుడివడ నెంతయున్ సమరసుస్థిరులై విహరించిరయ్యెడన్. 1195

క. బెడిదములగు నడిదమ్ముల, జడిదమ్ములనొంచు శైలచరయోధులు దం
దడి మూర్కొనఁ జేర్కొను సందడి కయ్యంబు గ్రమమయ్యె దత్సమయమునన్. 1196

సీ. పరిపంథిదారణప్రణిపాతవారణ మృదువసావసనసమితి ధరించి
ప్రేవునొడ్డాణముల్ బిగియఁ గట్టుక గూర్చి కత్తుక చిమ్మగ్రోవులూని

క. అంతకమున్న విలయసమయాంతకనిభు లంగదప్రహస్తాంతకులన్
గంతు బడిపి యెదిరించిరి, గంతునగొన సర్పవృశ్చికతనూరుహులన్. 1219

గీ. ఖడ్గసర్పవృశ్చికతనూరుహులవారయు, తనరు వాలితనయుఁ దహనతనయు
లురక గూలుమటయు సుర్వీశుఁ డస్త్రివ, స్తుఁజేరి గొట్టు రావణుండు వెలిసి.

క. కనికరముకన్ హృదయుంబునఁ, గనికరముఁ దలంచికొనక ఖలుఁడై దోసఁగుం
గనికరయుగదశకుఁడు ప్లవ, గనికరముం జీల్చికొనుచు గర్వస్ఫూర్తిన్. 1221

సీ. ఖచరవిస్మయవిశిఖశిఖాకలాపమహా బడబాగ్నియై వార్ధి నడచినట్లు
శాతాస్త్రతుండాండజప్రభూతములపైఁ గ్రూరసర్పం బెదుర్కొనినయట్లు
లమితప్రభానాతపార్కబింబంబుపైఁ బటుక్షమఃపటల మడ్డినట్లు
ఖరతరనఖరమహా కంఠీరవంబుపైఁ గ్రొవ్వి సామజము గాల్ద్రివ్వినట్లు
క్రోధశతకోటి దంభోళి భూధరంబు, డీకొనిన యట్టులు హుటాహుటిగ దశాన
నుండు గండుమిగిలి రోషప్రచండలీలఁ, దలపడియె రాముఁ గ్రూరశాత్రవవిరాము.

క. నరసింహాకృతిఁ బూనిన, నరసింహు నెదుర్చు రావణపలాదన మూ
ర్తిరహించిన కనకకశిపు, కరణిం గపిమూప సురనికర మెంచఁగంగన్. 1223

గీ. స్ఫారనిస్ఫార మంబరస్థలిఁ బరుల్పఁ, బొట్టక్రొవ్వగ నిట్టులు బిట్టెదిర్చి
ములుకులను బోలుపలుకుల మున్నకొంచి, మొనసి సాయకవృష్టిచే ముంచి నతియు.

క. దర్పముఁ గార్పణ్యంబుఁ ద్వనర్పఁగ నాప్పులు దలిర్ప నవవిడమహా
సర్పముఖశరావలుల న్మహాప్పతికులనాథు నొంప నాతఁడు గినుకన్. 1225

క. హమ్మని హుమ్మని కరిసిం, హమ్ముపగిదిఁ బొదివి విగ్రహమ్మవరిత్రదే
హమ్ము చినుఁగంగ శరనిక, హమ్ములు నిగిడించి సూగ్రహమ్ము మిగులఁగన్.

క. దాశరథి యిట్టు లనియె, న్నాశరవుల కగ్గమైతి నాశమగుమహీ
నాశర నినుఁగావవశమె, కేశవ లోకేశ గగనకేశుల కైనన్. 1227

ఉ. వానల నెండలంబడి లవంబును గ్రోధము లేక సాధులై
కానల నున్న తాపసులఁ గాటిమువెట్టఁగవచ్చు నీలువుం
జానలఁ జోరవృత్తి నిముసంబునఁ బట్టఁగవచ్చు మత్కృదం
బానల మోర్చె దెట్టులు దశానన విప్రవనీవిధూనసా 1228

వ. అని మర్మవిదారణంబుగా నాడి క్రోధోద్రేకంబున. 1229

శా. ఆలీఢాంఘ్రియుతుండు రాఘవుఁడు దైత్యస్వామి నోనేయుచో
గోలీఢాపితగంబులం దమనగుల్ గ్రూగస్థితి న్మొంగఁ బ

తే. అంతఁ దత్సూనుఁ డింకొక యగద మాయు, నమ్ము గానించి తెచ్చిన దానినెక్కి
మఱియు వింతలు పూని రామమహీశుఁ, డెదురఁ గదన యవిస్మయాస్పదమొనర్చె 1243

వ. ఆదశవదనుండు.

క. పదివిండ్లెక్కిడి శరములు, పదిపదులుగ విరిగి చిమ్మ దూర్పఁ బదపడి శరము
ల్పదివేలు లెక్కలింపక, పదిలుండై యెసఁగె రామభద్రుఁడు మఱియున్. 1244

క. మునుకొను నైశమునఁ గ్రమ, మ్మున నా నాశరంబులే మను వైచిన య
మ్మునమెమక వైదిన శరం, బుల నాఁకెను లెక్క నిముసమునఁ జిట్టలుగన్. 1245

ఉ. పూర్ణధృతి న్నరేశ్వరుఁ డపూర్వశరంబులు నాఁటఁ గూర్చుచు
ర్దూర్ణముగాఁగ నేయుచుండఁ దూణములోని శరాలిఁ గొంటలు
న్నిర్ణయ మొప్పఁ దోఁప నొకనేర్పున దక్షిణహస్త మెప్పుడుం
గర్ణముఁ బాయకుంట కనఁగానగుఁ దత్కలహాహవంబునన్. 1246

సీ. పాదపంబులు కంకపత్రమయంబులయ్యె నుపవనంబులు బాణమయములయ్యె
నంబరంబెల్ల ఖగాకీర్ణమయ్యెను శరమయంబయ్యె సాగరము కరము
నాశుగపరిపూర్ణమయ్యె రోదసి యారయ్యె మందురంబులు కాండమందిరములు
కోశపూర్ణములయ్యె గుహలశాభవనము లతికదంబనూత్నాస్త్రలయ్యె గిరులు
రామరాజన్యమానవ్యథాసాధకంబు, పృథుభయద్గ్రాహాగ్రజాప్రవీణ మగుచు
సాకసీరంధ్రపాతుకాసారమునను, మొనసి రావణుబాధకంబు ముంచుటయును. 1247

గీ. ఆదరించి మనువుఁ శరవాలుఁ బంపిఁ, దద్ధరాయుల కెండ దవులనీకఁ
గూడదనుచు మీఁదఁ గూఁడుగట్టినభంగిఁ, బఱపె నంబకములు పార్థివుండు 1248

క. వడిచెదక పొలసుపిండియు, నడిపోవని తాల్మికల్మి నొప్పు చిలుకుల
ప్పొంకు ప్రకటించి కొంచక, నడమోముపలగతి దాయుణక్షరమువలై. 1249

వ. ఇరువురు నన్యోన్యవిజయకాంక్షాపరాయత్తులై క్రొవ్వునిర్బంధహస్తిముఖబంధంబు
నఁ బరివేషాంతర్విభాసిభాస్వద్బింబద్వంద్వంబు వంచనంబుక నిష్కిరణంబులు నెఱపుచు
మండలీకృతకోదండదండులై మండలాదిస్థానపంచకంబులు నాటియుం బన్నిగ క్త
పరిషిక్తనానాముఖాయోధంబులు మహోదధితరంగంబులకుం బ్రవాళలతావితాన
ప్రకారంబు గానింప నుద్దవిడి రుద్ధమజమనుజగల్లములు పోరాడుచున్న సమయంబున.

గీ. ధర్మగుణయుక్తిఁ బాసి వక్త్రముఖ విమతు, చిలుకు రావణు చిలుకులు చేరి రామ
చంద్రుఁ గాఁడి యధోగతిఁ జెందవన్నె, యనఁగ నృపుఁ డూసి పాతాళమంటఁ జొచ్చె.

గీ. శరధి జన్మించి సద్గుణస్ఫూర్తిఁ గాంచి, యధికదైత్యారి పాణిగ్రహణ మొనర్చి
నట్టిసాయకలక్ష్మి వెల్లడగుటయును, గలఁగె దానవఘోరాంకాపురి-బ్ధి 1252

క. నిర్ఘాతపాతవిప్రలఘ్వనర్ఘోషము నిష్ఠిల్ల నాఱుశరంబుల్
దుర్ఘటవేగం బొప్పఁగ, దీర్ఘభుజాబలుఁడు రామదేవుఁడు వైచెన్. 1252

సీ. పార్థివుం డేచి సర్వముఖాంబకం బేయ గరుడాస్త్రనిహతి రాక్షసుఁ డడంచు
నాగ్నేయసాయక మసురేంద్రుఁ డేసిన వరుణాస్త్రనిహతి భూవరుఁ డడంచు
సర్వాంసహాభర్త పర్వతాశుగ మేయ వజ్రబాణహతి రావణుఁ డడంచుఁ
దివిరి దశాస్యుండు తిమిరాస్త్ర మేసిన భాస్కరాస్త్రహతి భూపతి యడంచు
సింధురశరంబు మానవసింహుఁ డేయ, సింహశరమున దానవసింహుఁ డడఁచు
నివ్విధంబున వడి నితరేతరాస్త్రఖండన మొనర్చుచుండిరి భండనమున. 1253

క. కంధరపృషత్కముం దశకంధరుఁడు నిగుడ్వ నృపతికంఠీరవుఁడున్
గంధవహాశుగమున పర్వగం ధరణింగూల్ప నలిగి గంధాంధుండై. 1255

క. శూలధరుఁ డో యితం డన, శూలము రాఘవుని యురముఁ జూచి విసరుడున్
భూలోక మెల్ల వహ్నిజ్వాలాజాలములఁ గప్పి వచ్చెడు నెడలన్. 1256

గీ. పిచ్చలించుచు ఖచరులు విచ్చి చనిరి, యచ్చెరువు నొంది కపులు హాహారవంబు
లిచ్చి రసురలు రావణు మెచ్చుకొనిరి, చచ్చెఁబో దీన శ్రీరామచంద్రుఁ డనుచు.

తోటకవృత్తము. మాతలి మెచ్చ నమానవతేజో, రీతి నరేంద్రవరేణ్యుఁడు కీశ
ప్రీతికరంబుగఁ బిండి యొనర్చె, న్యాతదివస్పతి సంచితశక్తిన్. 1258

క. ఈలీల నద్రిచరవరు, లాలోకింపఁగ భీకరాలోకుండై
శూలము సురలోకహృదయ, శూలము బ్రజలోప్తపటుకశూలముఁ గూల్చెన్. 1259

మత్తకోకిల. శక్తిచే నిజశూలశక్తి కృశత్వ మొందిన నాహవో
ద్వృత్తుఁ డద్దశకంధరుండు మహోగ్రసాయకముం జయా
సక్తి నద్ధతిఁ బూన్చి తన్నృపచంద్రు తేరిసిడంబు సం
సక్తవాసరసంచయంబు విపాద మండఁగఁ గూల్చెన్. 2601

క. సాధ్వసముగ నిజదివ్యరథధ్వజము దశాననప్రదరభీకరధూ
మధ్వజమునఁ బడినఁ బ్లవగధ్వజినీనాథు లుడలి కనుఁగొన నలుకన్. 1261

క. రామక్ష్మానాథుఁడు విశ్వామిత్రుఁ డొసఁగిన ట్టిసాయకములలో
పాశుద్రాపతిద త్తనిరామౌఘశరంబు లేయ నసురవరయున్. 1261

గీ. సకలభూచరులకును విస్మయము నిండఁగ రవము కలుషశమునకుఁ గడపునిండ
భూనభోంతరమంబరస్ఫురణ నిండఁ, జెచ్చి రణమునఁ బోరొనర్చుచుండ. 1262

గీ. పటులవణవార్ధిఁ బుడిసిలింపంగ నైనఁ, గడఁగి వింధ్యంబు నణఁగఁ ద్రొక్కంగ నైనఁ
జాలువాఁ డగుదెంచె నచ్చటికిఁ గుంభసంభవుండు శుభగాత్రలాసంభవుండు. 1263

ఉ. వచ్చి నరేశ్వరుల్ జయ శుభవశ్యము నీ కగు నంచుఁ దెల్పుచున్
గ్రుచ్చి కవుంగిలించుకొని ఘోరవిరోధిశరాళి నెంతయున్
నొచ్చిన కాయము న్నిజమనోహరహస్తముచే స్పృశించి పెం
పచ్చుపడంగ నిట్లనియె నమ్మహితాత్ముఁడు భక్తి మ్రొక్కఁగన్. 1264

క. దశకంఠు శ్రయంబున, విశసింపఁగ నోపుట్టి వెరవు దెలిపెదన్
దశరథరాజసుతా వినుమ, దశరథరాజాని వినుము దాని తెఱంగున్.

సీ. హరిజగద్బంధుఁ డమోపహారి సహస్రపాదు సత్యాధారుఁ బరమపురుషుఁ
గమలానుకూలుఁ జక్రప్రియుఁ బుణ్యజన ఫలప్రదానుఁ దూర్ణఖగయాను
నమితప్రతాపు విప్రారాధ్యు నాలంబు ఘనవిభావస్వభిఖ్యాఖ్యనోష్ణు
ననఘు దేవోత్తము ఘనవిగ్రహుఁ బుష్పగాంక మిత్రు విశ్వాత్ము విచిత్రచరితు
నితరవాహాధ్వసంచారు నిర్వికారుఁ, బ్రాకటనుశీలుఁ బీతాంబరరుచిజాలు
నచ్యుతు ననంతుఁ బుణ్యాధికాగ్రగణ్యుఁ, బ్రస్తుతించినవారికిఁ బ్రాఁతె జయము 1266

భుజంగప్రయాతము.

త్రిమూర్తిస్వరూపు స్సుధీపాపదీపున్, భ్రమాశోకసంతాప రాశీనిరూపు
న్ననూచీనభక్తిప్రజాతాంతరక్తిప్రమోదంబునం గొల్వ భద్రంబు గల్గున్. 1267

క. కస్తి దొలఁగు నునుకలవా, స్వస్తి యగుం గాన ఖరగభస్తిం దురితా
పాస్తవతిఁ గొల్వ మనుచు న్గస్తి తెలిపి చనిన సముధిక కుతూహలుండై. 1268

క. భాస్కరు నాశ్రిత సుశ్రేయస్కరుని సహస్రకరునహస్కరు విపులో
రస్కుఁడు రాముఁడు భక్తిపురస్కరుఁడై నను మెసఁగఁ బ్రణుతులొనర్చెన్.

వ. అనంతరం బయ్యనంతరత్నకంశరత్నాకరాభినవసుధాకరుండు ప్రభాకరుంగూర్చి
దివిజవిరోధి దశశిరోధిశరధారా పరిత్రస్తాంతుఁడును దివ్యదథచిత్రాసనస్థుఁడును
ధర్మాభిరతుండునై సూర్యాంతర్యముండు భగుం డనునివి యాదియగు నష్టోత్తరశత
మహానామోచ్చారణంబు గావించి మిత్రరవిసూర్యభాను ఖగపూషహిరణ్యగర్భమరీ
చ్యాదిత్యదితదీయ ద్వాదశనామోపన్యాసంబు నడిపి సౌరసూక్తంబులు పఠించి
యగస్త్యోపదేశప్రకారంబున. 1270

తే. హృదయా పలరంగ నాదిత్యహృదయపఠ, మాచరించి తదీయదయాసమృద్ధి
నధికతరతరుఁ డగుచు నయ్యధిపవరుఁడు, గట్టిగాలుఁ దాల్చి దశకంఠు గిట్టఁజెచ్చె. 1271

శా. మారీచాధము దుస్సహోద్యమున ఛద్మస్ఫూర్తిపై మున్న మ
న్నారీరత్నము దొంగిలించితివి కానం గాన నస్మద్ధనుః
స్ఫారామోఘశిలీముఖప్రహతులన్ ఖండంబు లొందింతు నో
రోరీ రావణ మస్తకాంఘ్రు లిఁక మాయోపాయముల్ చెల్లునే. 1272

క. నారీమణి సీత మఱు, న్నారీమణిపూత నిచ్చినను దనుజులు మ
న్నారిపుఁ బ్రదికెదరు, న్నారీవేళ నటుగాక నను మార్కొనఁగన్. 1273

వ. అని కఱకుగొరకల నఱుపులం బోని ముఱుకుఁబలుకు లమ్ముఱుకు నెఱకులు గాఁడ నాఁడి యంతనిలువక. 1874

మ. ఉదితధ్వానధనుర్ధరుండు ప్రథనోద్యోగుండు కామత్స్థుఁ డై
ర్వ్యదభీష్మప్రదరంబు లేమటు నుమ నిష్ఫ్వాసుం దశగ్రీవుఁ డి
ర్వ్యదిభీమాస్త్రముఁ లేసి యొక్క మొగిఁ బైపై యుద్గప్రాస దు
ర్మదశక్తి ద్రుఘణాయుధంబు లఱప ఖుంభద్ద్వై సంరంభుఁడై 1275

గీ. శిఖిశిఖాముఖ ముగ్రవిశిఖ మసురశిఖామణి యురంబు గాఁడఁగ రాముఁ డేసె
విగతధర్ముఁ డశాంతుఁడు నగుచుఁ జావు, వోనియూర్చు మునింగె దశాననుండు. 1276

ఉ. చచ్చె దశాననుం డని విషాదము నొందిరి రాక్షసాధముల్
ముచ్చట లాడుచున్ ఖచరముఖ్యులు సమ్మదమున దిరెల్లభూ
భృచ్ఛుభు లిచ్చ మెచ్చుచు నభిస్తుతి చేసిరి రామునిక్రమం
బచ్చొటువాపె నుద్భట రథాంగశతాంగముఁ గాలకేతుఁడున్. 1277

క. కొంతవడికి దశముఖుఁ డొ, క్కింత తెలిసి యెల్లదిక్కు లీక్షించి సమి
ద్భ్రాంతి శరదంబు ద్రిప్పితి, సుంత కడిమిలేక యనుచు సూతుఁ గినియుచున్. 1278

వ. తదీయప్రతివచనరచనానుకూలుండై. 1279

క. ముఖము లెగయించి కలహో, న్ముఖుఁడై దశముఖుఁడు దేవముఖభయదశిలీ
ముఖుఁడై నిజసారథి కభి, ముఖుఁడై తనరథము నప్రముఖరాంతకుపై. 1280

వ. అని పలికి యాతం డట్ల చేయ. 1281

గీ. మలయు కీలాలధారలు మదము గాఁగ, గరధనుఃకరవిశిఖశీకరనికరము
కరము దనరాఁ దైత్యకుంజరము పేర్చి, తీవ్రగతి నన్నృపతి పింగదృష్టి దాఁకె. 1282

ఉ. నిక్కుపుబంటువోలె రజనీచరయోధులు నవ్వఁ గొంచపున్
ముక్కుడిమూఁక నేర్చి కడు మోదము నొందెదు నీవు నీవపే
రుక్కుగలాని రావణు మదోద్ధతు మార్కొని వంటుమిల్లు మ
త్తెక్కు శశంబు చొచ్చుగతి నెల్లిద మైతివి మానవాధమా. 1283

క. కాయలు నాకులుఁ గూడుగ, మేయుచును జరించు పట్టి మేటివి నీవుం
గాయలు నాకులుఁ గూడుగ, మేయుచును జరించి కోమ్మమెకములు బంటుల్.

తే. తాటకాదులఁగూల్చి వనాటపతుల,చేఁ బనుల్గొని వార్నిధి శిలలు నలిపి
మచ్చరించెదు నీవొకమాయికుఁడవు, గాని నిక్కపుమనుజుఁడవే నరేంద్ర 1285

క. మానాభిమానములు నవ,మానంబును నీకు లేవు మానిసి వోలెం
బూని విహరించెదవు గుణ,హీనుండవు నిన్నెఱుంగనే సత్త్వనిధీ. 1286

చ. ఛలమున నన్నె దుర్ఘటుకుఁ జాలక సంద్రముఁ జొచ్చితేనియుం
బలముల మోచితేనియును బద్దలుగా మహి వ్రక్కలించి యు
మ్ములఁ బకళించితేనియును బ్రోడనుఁ బడ్లిగిలించితేనియుం
దెలియక పాఱువాఁడ వయి తేనియుఁ జంపక పోవనిత్తునే. 1287

క. అని కార్ముకదశకగుణ,ధ్వనిగర్జాయుతుఁడు నాయుధతటిద్వృతుఁడుగా
ఘనుఁ డసురుఁడు శరధారల, ముసిఁగించె రామశైలముఁ గపులు వడఁకన్. 1288

క. క్ష్వేడాభీముండై ప్రక్ష్వేడన విసరములు విసరి వేఁడియు నిషువుల్
తోడన రోదసి నిండఁగ, వాఁడి మిగుల వైచు నత్యవసరము నందున్. 1289

మ. క్షతనిర్యద్రుధిరప్రవృష్టిఁ దురు మేఘశ్యాముఁ డారాముఁ డు
న్నతకోదండమహేంద్రచాప మమరన్ నక్తంచరాధీశప
ర్వతరాజంబు జగద్భయంకర శుభాస్వత్సాయకాసారమ్మ దా
వృతముం జేసె ఘనారవస్తనిత మూర్విభాగభీమంబుగన్. 290

క. ఉగ్రాంశు నిశాచరవర,గ్రామణు లుగ్రబలులు సంగ్రామమహో
దగ్రులు భూనాయకపు,త్రగ్రీవులు పోరు టధిక కీర్తి మయ్యెన్. 1290

క. అస్థిశకలముల నతికుణ,పస్థానంబులను మాంసభక్షణచణభూ
తస్థిరసర్తనములఁ గల,వాస్థిని భయదవ్యవస్థితావస్థకమై. 1291

వ. జగద్భయంకరంబు గాఁ బెంచె నప్పుడు. 1292

క. ప్రౌఢి వెలయఁగ దాశవ,గాఢశరావళులు పంక్తికంఠుపయి జయా
రూఢి నిగిడించి ప్రత్యాలీఢాంఘ్రియుఁ డగుచు మాతలి ప్రేరితుఁడై. 1292

క. పదిశిరములు వెడ వెడ సిరమాదిశిరములు వైచి భూమిపయిఁ డిలఁ గూల్చెం
బదిశిరములు రావణు నిర్వాదికరములు నొక్కపెట్టి వానికినక్కన్. 1293

గీ. ఒల్లు పడఁగ నసి యొకపెట్టి జట్లు మొలచి, యున్న కరశిరములు చూచి యుగ్రవృత్తి
వెండి పడఁగ నేసి మొలచిన వేఁడి గూల్చి, వెండి మొలచిన నురవడి వెండి గూల్చి.

క. ఆహవ మిట్లీ విధమున సప్తాహోరాత్రంబు లుగ్రమై చెల్లె జగ
ద్ద్రోహి వధియింపు మిఁక సందేహింపకు మనెడి సారథివచనరచనల్. 1316

శా. స్వస్త్రీభ్రూణవిభేదనక్షమపటుధ్వానాతిరిక్తంబు ర
క్షస్సైన్యాసవదావఘోరవిపులాకారంబుఁ బ్రస్విద్విప
చ్ఛస్త్రాజీవనజీవనానిలఫణీట్సాన్నిధ్యా బసాధ్యంబు బ్ర
హ్మాస్త్రం బుద్ధతి నారిఁ గూర్చి ప్రబలాహంకారహుంకారుఁడై. 1317

చ. క్రతుభుగభీష్ట మింక నగుఁగా కని డీకొని దృష్టిముష్టి సు
స్థితి వెలయ న్సమంత్రకముఁ జేసి సరోరుహసంభవాస్త్రము
న్ప్రతిహతవిక్రమక్రమధురంధరు రావణుఁ గూర్చి పంపె నీ
క్షితి నతివిస్ఫులింగములు చిమ్మఁ జలమ్ము బలమ్ము గ్రమ్మఁగన్. 1318

క. నృపతీంద్రకరోద్గతవజ్రపటిష్ఠాదృశ్య మైన బ్రహ్మాస్త్రము వై
రిపలాదన తనుగిరిశిఖరపరిమితం బైన తచ్ఛిరం బిడఁగూల్చెన్. 1319

శా. ధాత్రీమోఘశిలీముఖాగ్రనిజమూర్ధ్యస్తమై యెంతయున్
ధాత్రీభాగము గ్రుంగ రావణకబంధం బస్రసంసిక్తమై
చిత్రస్ఫూర్తిని గూలు టొప్పె శిఖరచ్ఛిన్నాతిధాతుస్ఫుర
ద్ధాత్రీభృద్వరమో యనంగ విబుధాశ్చర్యాతాద్భుతాపాదియై. 1320

ఉ. ఆతతకమ్ర యద్భుతతరయాత్మసముద్భవహవ్యభుక్ఛిఖా
క్రాంతి నరాతిసూతతురగధ్వజసంయుత మైన తేరునిం
తింతలు చెక్కులై పడఁగ నేర్చి మహోగ్రగతి న్రసాతలో
పాంతముఁ జేరి మీఱి పొదియుం దిమిడె న్మహితాంబకం బొగిన్. 1321

సీ. పర్వతాగ్రము లైనఁ బడఁద్రోయు దీనికి మెచ్చరే యని చెప్పుటనఁగ
సీతాపహారి నిర్జించితి వగవకు మను మధాత్రికిఁ దెల్పఁ జనియె ననఁగ
దానవరక్తసిక్తతఁ బాప భోగవతీసరిత్స్నానంబు చేసె ననఁగ
బ్రహ్మహత్యాలిరసవార్థ మర్థించి వచ్చి రాముతూణముఁ జొచ్చె ననఁగ
రావణుని తల గోసి ధరాతలంబు, దూసి పాతాళలోకంబు డాసి రయము
వాసి నృపతినిషంగసంవాసి యయ్యె, సత్వరంబుగ విశ్వసృట్పృషత్కంబు. 1322

క. హర్షించిరి నరులు విరులు, వర్షించిరి సురలు దానవవరులు ముదము నా
కర్షించిరి ఖేచరు లుత్కర్షించిరి జముని సన్నికర్షించి రయల్

సీ. అమృతపాన మొనర్చినట్లయ్యె సురలకు మునులు బ్రహ్మానందమునఁ బొదలిరి
ఖచరులకెల్ల ఱెక్కలు వచ్చినట్లయ్యె భయము మేదిని వదలెను బయలు మెఱసె

గ్రహనాయకుఁ డనుక్రమగతినొందె మిన్నదె ధరణీకాంతయును సుస్థిరతఁ బొలిచె
గోలకులు కమలానుకూలతఁ గొమరారెఁ గడుఁ గిన్నరులకు రాగములు బలిసెఁ
దిశలు విశదంబులై యొప్పె దేవదుందుభిధ్వనులు నప్సరోవరప్రభృతుల తాండ
వంబులును జెల్లె నారదుఁ డంబరమున, నాఁడె రావణు పడుటకు నాత్మఁ బొంగి.

క. మందారకుసుమయోగా,మందసురభి యగుచు మలయమహితం బగుచు
నమ్మందానిల మయ్యాశ్రిత,మందారుని సమ్ముఖమున మలసె శిశిరతన్. 1825

క. శౌరియు సౌమిత్రియు సా,మీరియును విభీషణుండు మృదువచనములం
జేరి కపినికరయుతులై, బోరన వినుతించి రాస్యములు వికసింపన్. 1826

క. కంధరములఁ దునుమాడిన, గంధవహాత్మజునిఁ బంక్తికంధరుని లస
త్కంధరములు చిదిమి మహా,గంధవహుం డగుచు నృపతి కడు నొప్పారెన్. 1827

గీ. అంధకార మడంచిన యర్కుఁ డనఁగ, నంధకాసురుఁ దునిమిన యభవుఁ డన మ
దాంధు రావణుఁ బరిమార్చి యప్పుడొప్పె, సాంద్రవిక్రముఁ డగు రామచంద్రవిభుఁడు.

చ. భృశబలు లంజనాసుతవిభీషణముఖ్యులు హర్షకృత్యయుల్
విశదముగా నొనర్ప రణవేదిక నంబకవహ్ని విద్విష
త్పశువిసరం బస్పృక్ప్రఘుష్పృశస్ఫులనం దగ వేల్చి ప్రట్టిత
ద్దశరథసూతి రాజ్యవభృథం బదిసెల్లె మహాముదంబుధిన్. 1829

వ. అంత నమ్మహీనాయకాగ్రేసరుండు. 1830

గీ. సంతసమునఁ జెఱకువి ల్వసంతుచేతి, కొప్పగించిన మదనునియొప్పు గాంచె
నెక్కుడుముదంబుతోడ విల్లెక్కుడించి, లక్ష్మణునిచేత నిడి కృతలక్షణుండు. 1831

ఉ. రాఘవఘోరకేసరి శరస్ఫుటదీర్ఘవిశాలభీకరా
మోఘనఖాహతిం బ్రలయముం గను రావణభద్రదంతి వీ
తాఘుఁడు దత్సహోదరుఁ డహంకృతిదూరుఁడు మాన్యసజ్జన
శ్లాఘి విభీషణుం డురువిషాదమునం జని కాంచె దీనుఁడై. 1832

క. పుట్టిననాఁటంగోలెను, దిట్టతనము గట్టి పట్టి దిగ్జాధిపులన్
బిట్టులుకఁ బెట్టు నీకుం, గట్టా కిట్టుంగవలసెఁ గట్టిఁడివగుటన్. 1833

క. ఘటకర్ణుఁడు సోదరుఁ డఁట, కుట్రిలు నిపుణుఁ డింద్రజిత్తు కొడుకఁట తాను
త్కటబలుఁడు రావణుండఁట, యిటు కటకట పుడమిఁ గూలునే విధి చెయిదిన్.

క. బలవద్విరోధ మేటికి, వల దని నినొత్తి చెప్పి వారింపఁగలే
నిలఘుత్వబుద్ధిఁ గుమ్మాను లభింపదె బంధుమరణఘోరార్తిఁ బడన్. 1835

గీ. మయతనూజాత యింద్రజిన్మాత దశశి,రోవధూమణి కుంభశ్రవోవధునికి
దేవకంటకు పట్టపుదేవి యనఁద, యయ్యె భర మేమి బలవంతమైనవిధికి. 1344

క. అని పతి నుఁ బెక్కుతెఱఁగుల, దనుజవిభుం దలఁచి వగచి తద్వల్లభశో
కనిమగ్నయగుచు నటుఁ గనుఁ,గొని మెన్నిజపుత్రమిత్రకోటిశవంబుల్. 1245

వ. కని సహింపని దుఃఖాతిరేకంబున. 1346

సీ. పరిపంథికాండాగ్ని పరిపీత మయ్యె నే యయ్యనేఁ డింద్రజిదంబురాశి
విద్విషత్పటుశరవృష్టిని యాఱె నయారె నేల ఘటకర్ణానలం బు
అరికుమారకశక్తి పాలఁజేసి మాయనో మాయమ్మ గునె యతికాయశిఖరి
యభియాతిఘోరాశుగపాతిఁ జెల్లఁబో చల్లఁబోలుఁ బ్రహస్తసితఘనంబు
దస్యుకోపదవానలదగ్ధమయ్యె, నక్కటకటా నిశాటభటాటవీప్ర
దేశ మని భీమభూతనివేశ మగుఁ గనుంగొనఁగ లేక మూర్ఛ మునుంగటయును.

క. వనచరులు దెలుపఁ దెలివొం,దినయట్టి విభీషణుండు ధీరోక్తుల న
వ్వనితకడఁ జేరి తేటిచె, ననయానునయనయసవినయాలాపములన్. 1348

వ. తదనంతరంబున. 1349

సీ. అస్రవాహినులనోలాడుభూతములు నెమ్ములు చవిచూచెడుభూతములును
బిట్టల నాఁడ్రను బిల్చుభూతములుఁ బ్రేవులు గబళించెడుభూతములును
మెదడు డేచ్చికొని తిని మదమెక్కు భూతము లొబ్బొబ్బలు వెట్టెడుభూతములను
పీనుఁగులను ద్రొక్కి పీఁచుభూతంబులుఁ బొగడుచుఁ ద్రేఁచెడు భూతములును
ఆడుభూతములును బాడుభూతంబులు, నాఁడుభూతములును బాడుభూత
ములుఁ జెలంగుభూతములు నవ్వుభూతము, లవియు భూతసంచయమును గలిగి. 1350

వ. భూతభయంకరంబు గాకుండియు భూతభయంకరంబై కీలాలపరిషిక్తంబు గాకుం
డియుఁ గీలాలపరిషిక్తంబై పారిశలీముఖచక్రపుండరీకబహులఘనరసాకరంబు
గాకుండియు పారిశలీముఖచక్రపుండరీక ఘనరసాకరంబై కబంధప్రసారితంబు గా
కుండియుఁ గబంధప్రసారితంబై యొప్పు నప్పొలికలను నెట్టుకేలకు వెలువరించి. 1351

చ. ధృతి వ్రతబంధకోటికి విధిఁ దగు సాధనయుక్తి వహ్నిసం
స్కృతి పొసరించి యెల్లర కళేబరతం బరలోకసత్క్రియా
ద్యుతి నెగడొంది యొప్పిన సుధీనుతు శాస్త్రదశాంచు వానర
ప్రతతియుతు న్విభీషణుని రాముఁడు గన్గొని సాదరంబుగన్. 1352

వ. సౌమిత్రిఁ జూచి. 1353

క. రావణుచేఁ బాలితమగు,దీవి కిఁక విభీషణుం బ్రతిష్ఠింపుము రా
జై వెలయఁ గాత నీకం, డాఃధుగిరిజాధిపధరకార్ముకుఁ గాఁగన్. 1354

వ. అని సత్యసంధుండును గరుణాసింధుండును దీనజనబంధుండును బ్రతిజ్ఞాబంధురుండు
నగు రామభద్రుం డానతిచ్చుటయు మహాప్రసాదంబని సువర్ణ స్వర్ణ మహార్ఘ వార్ణఃపరి
పూర్ణ భద్రకలశహస్తులగు వనచరప్రశస్తులసహాయంబున సమిత్రవైభవాస్పదం బగులం
కాపురంబుఁ బ్రవేశించి యుచితసమయజ్ఞుండై. 1355

క. పుణ్యసతులు సేసలిడఁగఁ, బుణ్యమతులు సన్నుతింపఁ బుణ్యదినమునం
బుణ్యజనసమ్మతమ్ముగఁ, బుణ్యాత్మ నాసీనుఁ జేసి పుణ్యవిధి దగన్. 1356

క. లంకాపుటభేదన మకరాంక ధృతి విభీషణునకు లక్ష్మణుఁడు గుణా
లంకారుఁ డించుకేని కలంకగొనక యాభిషేకలక్ష్మిం గూర్చెన్. 1357

క. పరమామహితు విభీషణు, పరమామహితు న్నిఖిలనిశాటపదవికిం
గరుణారససేచనభాసురతరపట్టాభిషేకశోభితుఁ జేయున్. 1358

చ. అమరులలోన నింద్రుఁడు హిమాద్రికులాద్రులలోనఁ దారకా
సముదితమండలంబున నిశాపతి భూరుహకోటిఁ గల్పక
క్రమమున నవ్విభీషణుఁడు రాక్షసరాజికిఁ దా నధీశుఁడై
యమరవిరోధివర్గలసదంతరము న్వెలిఁగించె నెంతయున్. 1359

క. ఈచందంబున సకల నిశాచరరాజ్యాభిషేకసామ్రాజ్యయుతుం
జూచి విభీషణుఁ బొగడిరి, భూచరభూమిరుహచరనభోరాత్రి చరుల్. 1360

వ. అంతంత నిఖిలరాక్షసరాజ్యలక్ష్మీవిరాజమానుండై మండోదరీప్రభృత్యంతఃపురకాం
తాసందోహం బానందించు వర్తనంబునఁ బ్రసిద్ధుండై. 1361

క. పదిమోములయ్యతమ్ముఁడు, పదితేరుల జియ్యకొడుకు పజ్జనుఁ జనితాఁ
బదివేల్జేజే లొప్పరిం,పఁ దివిరి జేజేలు చేరి పయి విరివానల్. 1362

తే. కురిసి రచ్చరలాడిరి మొరసె దేవ, దుందుభులు మింట నతిశయాస్పదచరిత్రుఁ
డతి పవిత్రుఁడు మిత్రవంశాబ్ధిసముద, మిత్రుఁ డాతని మిత్రత మీఱఁ జూచి 1363

వ. అభినందించెఁ దదనంతరంబున. 1364

చ. సరసబహూకృతి న్వెలవొసంగిన మాతలి తేరుగొంచు వి
స్ఫురితగతిన్ దిశల్వెలుఁగ సూర్యసుతేశ్వర బాహుసాహస
స్థిరధృతి విక్రమాదులు నుతించుచు నప్రతిలీల దేవతా
వరులు నుబ్బుమీఱఁ ద్రిదివంబున కేగె ననంతరంబునన్. 1365

సీ. వరవియోగాతపభరకృశయై ఘనోదయముఁ గోరెడులతాతన్వి యనఁగ
దినకరస్పర్శనాపేక్షయై దోషాచరనిబద్ధయైనపద్మిని యనంగఁ

గంధగజయానమేనున గంధ మలఁది, పద్మకామిత మృదులీలఁ, బాదుకొల్పి
యశ్వారోహానేక విమానాధిరోహఁ, జేసి రాముని సన్నిధి సేసిరపుడు.

క. తడయక జేజేపూజడిఁ, దడియుచు సరమాపతియు సదాగతిసుతుడున్
జడియక మంగలసందడి, జడియుచు రా సీతఁ దెచ్చి సమ్మతి నిలుపన్. 1874

క. ప్రీత స్మితమృగివి, స్మిత దృగబ్జాత రాత్మసీమను పేతన్
భూతలసంభూతం బరి, పూతం గని సురలు మదముఁబొందిరి మిగులన్. 1875

ఉ. మాన్యచరిత్ర కజ్జనకమానవనాయకపుత్రి కప్డురా
జన్యునిఁ జూచువేడ్క మహిజానికి జానకిఁ జూచువేడ్క సా
మాన్యముగాక యుల్లముల మల్లడి సేయఁగఁ దద్వధూకరా
న్యోన్యముఖావలోకన మహాముద మొక్కట నెల్లెఁ బెల్లుగన్. 1876

క. చిరకాలవిరహదుర్భర, తరచింతానిధులు భూసుతా దాశరథుల్
గరుపారెను మేనుల నొం, డొరులం జూచికొని పొంగి రుల్లములఁ గడున్.

క, నిధిసన్నిధి యగు నధనుల, విధమున జలరాశి నీఁది వెడలిన భంగిం
బృథివీతనయా రాములు, మిథస్సవిధులగుచుఁ గరము మెఱసినయంతన్. 1878

క. పావనిముఖ్యులు లక్ష్మణ, దేవునితోఁగూడి యపుడధికహర్షమునం
బావనిఁ బుణ్యసతీసం, భావినిఁ గని నెమ్మనములఁ బ్రబలిరి మిగులన్. 1879

సీ. బ్రహ్మాదిదేవతాపటలంబు సనుదెంచి సుమనోభిరాము రక్షోవిరాము
జితపరశ్వధరాము వితతసద్గుణపికారాము నాత్మారాము రాముఁ బొగడి
విపులశుచిప్రవేశపరమశుచిరుచిరరుచి మహీకన్యఁ బ్రస్తుతించి
సారకల్పకసుమాసారపూర్వకముగా నప్పతివ్రతఁ బతికొప్పగించి
యతని మతి పొంగ నప్పుడా యతులరణమృతులఁ బ్లవఁగపతుల నమృతలలితప్ర
వృష్టిఁ బ్రదికించి వెండియు వివిధగతులఁ, బొగడిరి నరేంద్రు రవివంశపూర్ణచంద్రు.

రగడ. జయజయపూషనుసంతతతతిభూషణ, జయజయరావణ జలధైరావణ
సుజనవిధాయక సుఖసంధాయక, సృజిత వికర్తన వేదవికర్తన
సరసనిబంధన సాగరబంధన, భరితసలాంగద బాహుబలాంగద
అరిచయమారక యాజిసమారక, సురనివహావన సూరిసుహావన
శుకసమవర్తన శోకనివర్తన, సకలదూషణ సాధితదూషణ
ప్రసన్న సుదారక సంశయదారక, యసదసనోదన హర్షవినోదన
జనకసుతావర శక్రహితావర, వినుతమహాబల విపుల మహాబల
ఖలరఘువధీవర కమ్రేంద్రీవర, కలితసులోచన కార్యాలోచన

పృథుభవతారక హితబృందారక, ప్రథననిశాచర పద్మనిశాచర
నమిత విభీషణ నాస్తికభీషణ, విమల యశోధన విద్యాశోధన
వపుజిత నారద వందితనారద, విపులనిరూపక విశ్వసురూపక
నతశశిశేఖర నరపతిశేఖర, శ్రితవరదాంకిత సిద్ధ పదాంకిత
భయహరివారణ ప్రథనావారణ, భయదశిలీముఖ భక్త్యశిలీముఖ
నిహతశిరోరుహనేత్రసరోరుహ, బహునుతబాడబ భవవనబాడబ
స్మయఖగనాశన మదపవనాశన నయగుణవర్ధన నరభుగ్వర్ధన
మునిపరిపాలన గోముఖవిఘాలన, యనఘనికేతన యహిరిపుకేతన
నశచతురాగమ భక్తవరాగమ, భృశబలవిక్రమ భీమ త్రివిక్రమ
వలిముఖరంజన వరద నిరంజన, సలలితతారక సన్నుతతారక
కైశికకంధర కంబుసుకంధర, వీశసువాహన విబుధావాహన
అనయకదంబక హననకదంబక, కనకకృతాంబర కాంతివృతాంబర
పాలితగోగణ పావనగోగణ, కాలనిరూపణ కార్యారోపణ
సకలసభాజన సమ్మదభాజన, ప్రకటనమజ్జన పంకనిమజ్జన
తమ వీరుల నెఱుఁగము నీకంటెను, మముఁ బ్రోచిన ధర్మము నీకంటెను
దీనులకొఱకె త్రితి నవతారము, మానుగ నీనామము భవతారము
చెదరక నిన్ను భజించెడువారికిఁ, గదలఁగ నేటికి గంగావారికి
కృతకృత్యుఁడవై కీర్తి వహించితి, నతిశయమిశ్రమ మంత సహించితి
నీవగువారము నీదేభారము, ఏదియు నేరమిఁ కెంచకు నేరము. 1881

సర్వతఃప్రాససీసము.

నిస్తులదురిత నిరస్త సదాభయహస్త విశామ్య ద్విహస్త విపుల
విస్తీర్ణసంసార దుస్తరాంభోనిధి విస్తారక బుధేష్ట వస్తుదాయి
ప్రస్తుతసుజన సమస్త మునీశ్వర ప్రస్తుత విద్విషాపాస్తగంధ
శస్త్రప్రదశర యశస్తోమ తీక్ష్ణగభస్తి వంశాబ్ధిప్రశస్తసోమ
విస్తరామ్నాయ సువిచార నాస్తికహార, హస్తిరిపుకోటి శౌర్యవిధ్వస్త చౌర్య
త్రస్తలోకోద్ధరణ ఘనోపాస్తికరణ, స్వస్తిపదరామ భక్తవిన్యస్తకామ. 1882

ముక్తపదగ్రస్తకందము.

స్మరసుందర దరసంహార, హారవందిత దితమహారిహారివిభవభా
సురసురపూజిత జితఖర, ఖరశరశరకీర్తినికర కరపదపద్మా. 1883

ఖడ్గబంధోత్సాహవృత్తము. రామనాథ సోమధామ రాజరాజపూజకా
కామితార్థ దాయకా సుక్షైక సద్విధాయకా
కామినీ సితాబ్జసాయకా మనోజ్ఞనాయకా
కామశోక మోహలోభ ఖండనాదికారకా. 1384

చక్రబంధ శార్దూలము.

జన్యాలక్షితరాత్రుసోత్కర దయాసామర్థ్య శౌర్యక్రమా
మన్యూర్జస్సగవ మత్తపామరవిరామా ధ్వస్త శోకక్రియా
యన్యాయాపహ నాగభాస్వరశరాయానా వంద్య భూభ్రమా
మాన్య శ్రీజనకామ నిర్భయద రామా శ్రీదయాద్యుత్తమా. 1385

పాదాదిపాదాంత ముక్తపదగ్రస్త సింహావలోకన ద్విప్రాస నిరోష్ఠ్యకందము.

శరధీడిత కీశరధీ శరధీహితకీర్తి నిరత చలితాశరధీ
శరధీద్ధగాధశరధీ, శరధీరారివ్రాతసునూన చయ దాశరధీ. 1386

గోమూత్రికాబంధకందము.

సరసీజాక్ష రమాభా, సుసీతాకామ దాసశోకవిరామా
సురపూజా వరశోభా, భరపూతారామవాసపైకపరామా. 1387

క. అని మునులీ విధంబున, నినకులు లిట్లభినుతించి యందఱకును ద
జ్జననాథుఁడు సెలవొసఁగినఁ, జని పొందిరి రభిమతలీల స్వస్థానంబుల్. 1388

వ. అయ్యవసరంబున దశస్యందనుండును నందన సందర్శన సంస్పర్శన సంభాషణ సంభా
వనంబుల నమందానందకందళిత హృదయారవిందుండై 1389

క. మీ కొఱగొడ్డెము లాడిన, నాకొఱగాములు సహించి నాకొఱకు మదిన్
శ్రీకొఱకు లెక్కసేయని, మీకొరయలు సమానులే సమిద్ధ్యుములారా. 1390

చ. అని పదివేలచందముల నాత్మజులం దడవాడి క్రోధలిం
గనుఁగొని రాముఁ జూచి జనకక్షితినాథతనూజ సాధ్వసౌ
ఖ్యనిహతి కాత్మనోర్చి యనఘస్థితి లోకము కెక్కఁ జేసె నే
మని పలుకంగ వచ్చునని యాడి కడుంగొనియాడి వేడుకన్. 1391

క. తనయుఁ డగుభంగి మ్రొక్కిన, తనయుల దీవించి దశరథవిభుఁడు మునువ
చ్చిన సురవిమానరాజ, మ్మున నగ్రమ్మునఁ జనియె దివిజముఖ్య సహితుఁడై. 1392

చ. హరిపదబంధురంబుఁ గన లానుగుణం బరుణప్రభాధ్యమున్
గరుడ సహస్రము వేగ మనఘుం బతిరిక్త విశాలకిన్నరా

మరఖచరాభినంద్య మసమానకళాఢ్య మనంతరత్న వి
స్ఫురితము సూర్యమండలముఁ బోని కుబేరకపుష్పకాగ్ర్యమున్. 1393

మ. అధిరోహించి సతీసహోదరులు దన్నర్థిం బ్రసేవింప నం
బుధిపై త్రోవ నుదగ్రశాఖిముఖుఁడై పూర్ణప్లవంగావలి
గ్రథితంబైన విమానరాజమున దక్షశ్రేణియున్నిండఁగాఁ
బృథివీనందన సేతుధర్శనమునం బ్రీతాత్మఁగావించుచున్. 1394

మ. చని కిష్కింధయు ఋశ్యమూకము జనస్థానంబు వేర్వేఱ భూ
తనయాసాధ్వికిఁ జూపిచెప్పుచు ప్రగాంధసాంద్రముం జిత్రకూ
టనగేంద్రంబు నతిక్రమించి యధిరూఢ స్వల్పకీరాగ్రశా
దళబద్ధేష్ట విడారికా తము భరద్వాజాశ్రమోపాంతమున్. 1195

ఆ. కాంచి యచటఁ బుష్పకసమావతీర్ణుఁడై, రాఘవుఁడు వసుధరాసుతాస
తీసహోదరుల్ నుతింప భరద్వాజు, చరణపీఠమునకు సాఁగి మ్రొక్కె. 1396

వ. అమ్మహానీయు సంయమీంద్రుండు మేదురాదరాశీర్వాదపూర్వకంబుగా నొసంగు
దేవోపచారంబులఁ బరితుష్టుండై యిష్టగోష్ఠీవినోదంబులం దగిలి యుండునంత. 1397

క. హనుమంతునిచే నంతయు, విని యుం బ్రాయోపవేశవృత్తిం దొఱఁగి త
మ్మునితో నందిగ్రామము, మునిగణుఁ డాభరతవిభుఁడు ముదమున వెడలెన్. 1398

క. కడలేని వేడ్క యనియెడు, కడలిమునింగి తేలి వెడలి కైకకొడుకెదం
గడలుకొనిన పేరిమి నలు, గడలం దగవరులుగొలిచి కదలెం బ్రగన్. 1399

వ. శత్రుఘ్నుం గనుంగొని. 14 0

క. తల్లులకుఁ బౌరజనులకు, నెల్ల సుహృద్బాంధవులకు నెఱిఁగింపుచు సం
పల్లలితుఁ డగుచు రాముఁ, డెల్లి యయోధ్య కరుదెంచు నంతయు వేడ్కన్. 1401

క. అని చెప్పి శోభనపదార్థనిధి సాకేతరాజధాని నలుకా
రనిరూఢిఁ బెంపు మీఱఁగ, నొనరింపం బంపు మని సముచితభంగిన్. 1402

శా. కైకానూనుఁ డభీష్టదానహితవాక్యశ్రేణితోర్వీసుర
ల్లోకానూనుఁడు దిగ్విభాగశి సమాలోల ప్రశస్తప్రభా
స్తోకానూన యశఃప్రసూనుఁ డహితస్తోమానధీనాత్రి వి
ద్యాకారుణ్య గుణప్రధానుఁడు సమాధానావధానుం డొగిన్. 1403

తే. పటుజటోత్కట వల్కలపటలితోడ, వినయమాన్యశ్రీవూని విధముతోడ
హర్ష సంభ్రమ భయవిస్మయములతోడ, సముచితాచార సజ్జనోత్తములతోడ. 1404

మ. చనికాంచెన్ ఘననీలు బింగళజటాజాలు స్వలీలున్మహీ
తనయాలోలు నలోలు మోక్షపదవిద్యాజాలుఁ బుణ్యాలవా
లు నిరాభీలు సమస్తలోకపరిశీలుం బ్రాంగరోక్త్యాలకా
లు నవాచాలు లసన్నిటాలు సుకృపాలున్ రామభూపాలునిన్. 1405

క. కనిమోడ్పుఁగేలు ఫాలస్థమ్మునఁ జేరిచి భరతభూవిభుఁడు మహీతనయా
పతిజాత మఖిలతన్మణి, తనయాన్వితుఁడై సన్నుతిపదంబుల వ్రాలెన్. 1406

క. వ్రాలి నుదగ్రశుభశ్రీప్రక్షాళిత పదకములుఁ జేయఁ గని రామమహీ
పాలుఁడు సోదరముఖ్యు ద్వ్యాధాలింగితుఁ జేసి మూర్ధ మాఘ్రాణించెన్. 1407

శా. ఆశీర్వాదపురస్సరంబయిన మూర్ధాఘ్రాణముం జేసి ధా
త్రీశుం డల్లను పల్లవింపఁ బ్రియవాక్ఛృత్యంబు దీపింప శో
భాశాల్యాత్మక రాజ్యజాతపరిష్కృద్ధస్థానుజేద్ధాంగక
ప్రాశస్త్యంబయి సేమమే భరత శుంభద్ధైర్యసత్యవ్రతా 1408

క. అని యాడి పిన్నతమ్మునకును ముద్దులబిడ్డలకును గురువరును బురం
బున గలవారలకు నఖిల జనపదవాసులకుఁ గడుఁ గుశలమే యనినన్. 1409

వ. భరతుండు మహానందభరితుండై. 1410

చ. స్మితరుచికాముదీపటు సముద్ధవిశద్ధ తలోచనోత్పల
చ్యుతమకరంద రూప విభవోజ్జ్వల సమ్మదబాష్పసత్సుధా
ప్లుత విలసత్కపోల పరిపూర్ణ భవన్ముఖచంద్రమండల
ద్యుతిఁగని యింతయుం గుశల మొందవె యాశ్రితదృక్చకోరముల్. 1411

తే. అట్టి నీదర్శనమున నానాట్టివారి, కెల్ల సేమంబు గల్గుట కేమి వింత
యడవి నీవున్న పదునాల్గుహాయనమ్ము, లారయఁ జతుర్దశయుగంబు లయ్యె నాకు. 1412

మ. కుశలము నీసహోదరులకున్ మాగురువర్యులకున్ సమాజంబు భూ
పకుభము పౌర జానపద బాంధవకోటికి సమ్మదంబు ని
త్యకుచికరుంధతీపతి కమాప్తినవంశ పయోధిచంద్ర నీ
కుశలము సర్వభూతములకుం గుశలంబు తలంచి చూడఁగన్ 1413

క. తలిదండ్రుల మదితోరికి, దెలిసి యడవికరిగి కొండ్రదిమ్మరిప్రోవుక
[illegible]లఁ బుగొని పీఁకసోఁకుం, గొల మణఁచిన నీకుసరియగుదురే సాయుల్. 1414

క. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దమఁ బొగడుచున్న యట్టి తమ్ముని భరతు
న్మనమున హర్షించి పునఃపునరాలింగనములవ్యాభుం డొనరించెన్. 1415

వ. తదనంతరంబున వసుంధరానందనానందగపదారవిందంబులకు మ్రొక్కి యశోక్యచ
లియెమ్మెడుగుణంబు లగ్గించి మిక్కిలి దీవనలు వడసి సమస్తంబు కుశలంబ యని
యడుగు. 1416

క. ఆతఁ డతఁడైన విధమునఁ, గౌతూహల ముప్పతిల్ల గాఢస్నేహో
పేతమతిఁ గౌఁగిలించిరి, ఖ్యాతిసుమిత్రాసుతుండుఁ గైకాసుతుఁడున్. 1417

తే. అవల శత్రుఘ్నుచే రాఘవాగమనము, విని వసిష్ఠుఁడు ముదమంది విస్మయమ్ముట్టి
దశరథాంగనలును దోనఁ దగినయాన, పంక్తితోఁ జనుదేరఁగఁ బయలుదేఱె. 1418

క. పరమోత్సవం బయోధ్యా, పురమునఁ గావింపఁ బంచి భూరిద్యుతివి
స్ఫురితాంబరపుష్పకమునఁ, దమ భరద్వాజనియమిధన్యాశ్రమమున్. 1419

ఉ. చేరి వనాటరాత్రిచరసేవితు నాతఁడు భ్రాతృయుక్తుఁ ధా
త్రీరమణీసుతాయుతుని శ్రీరఘురామమునీంద్ర వంద్యుఁగ
న్నారఁగఁ జూచి జన్మము కృతార్థత నొందె నటంచుఁ దన్నమ
స్కారము లర్ఘ్యపాద్యములుఁ గైకొని కైకొని యాదరంబునన్. 1420

వ. ఆశీర్వదించి యభినందించి. 1421

క. దశకంఠుని బాధల దుర్దశఁ గంతగాములైన ప్రజల దివిజుల
న్విశదగతిఁ బ్రోచు మతిమనుజశరీరం బూనినట్టి శార్ఙ్గి సుహృ 1422

త్రిమూర్త్యాత్మక స్తవకందకము. శివవిప్రవినుత యమృత,భవభయమోచన శశిప్రభాకర రాజీ
వవిలోచన దేవముఖవి, భవభాషానాథవంద్య భవ్యనిధానా. 1428

వ. అని యనేక విధంబుల నతని వివినవాసకథాసేతువిధానకథాదిక ప్రయోజనం
బు లగ్గడించి సౌమిత్రి యుచితవర్తనంబుఁ గీర్తించి జానకి యుత్తమగుణంబులెత్తి
పొగడి యానందించుటయు. 1424

క. అంతకుమున్న సుమిత్రా, సంతత్యవరజనితుండు శత్రుఘ్నుఁడు ఫా
లాంతాంజలిపుటుఁ డసకృత్సంతోషయుతుండు రామచంద్రుపదములన్. 1425

క. తననయనచకోరంబులు, దనివోవఁగ నూఁదియున్న తమ్మునిశత్రు
ఘ్నుని నప్పుడు గాఢాలింగన మొనరిచె న్చిరంబుఁ గడుమూర్కొనుచున్. 1426

క. దీవించుచుఁ దమ్ముని సంభావించుచు నిర్విధమునఁ బరిరంభణసౌ
ఖ్యావహమున మేను మఱచి, భూవిభుఁ డసకృత్ప్రమోదమున మునుఁగుటయున్.

వ. లక్ష్మణానుజుండునుం బొంగియుండె నంత రాముండు వనజసమేతుండై. [illegible]

క. మొగిచిన చేతులు ఫాల, మ్మొగిఁ జేర్చి విభృతినారఘూత్తమమణి వే
ముగురమ్మలఁ బోలిన యా, ముగురమ్మల పాదపద్మములకున్ మ్రొక్కెన్. 1429

ఉ. మ్రొక్కినరామలక్ష్మణుల మోముల మోములు చేర్చి చేర్చి యా
యక్కులు నక్కుమారకుల యక్కుల నక్కులు మోపి మోపి చ
న్ముక్కలదుగ్ధబిందువులు మోముల సమ్మదబాష్పపూరముల్
గ్రక్కుచుఁ బారవశ్యమును గాంచి మునింగిరి సమ్మదాంబుధిన్. 1430

క. బుడుతలు తమకు న్మ్రొద్దులఁ, బుడుకుచు మ్రొక్కఁగ శిరములు మూర్కొని మేనుల్
పుడుకుచు మువ్వురమ్మలు నప్పుడు గాల్చిరి చింతల నెనుప్రదుకల నెల్లన్. 1431

వ. వెండియు నపరిమితానంద భరితలగుచుఁ గుమారుల ముహుర్ముహుర్నమస్కారంబులకుం బునఃపునరాశీర్వచనంబు లొసంగుచుఁ దదీయవనవాసాదిక్లేశంబు లుగ్గడించి కన్నీరు నించుచుం బ్రత్యేకకుశలప్రశ్నంబు సేయుచు 1432

తే. కటకట కట్రిక క్రొగ్గంటి తుటుముతోడ, నొడల వ్రేలెడు నిడుద కెంజడలతోడ
మారవు దటిగిన మెట్టుఁదామరలతోడ, వచ్చి కన్పడఁ బడినార వత్సలార. 1432

వ. అని యిట్టి ప్రేముడి పలుకులం బాలకులం బొదివికొనియుండి రట్టియెడ సీత యత్తలకు మ్రొక్కుటయు. 1433

ఉ. గ్రుచ్చి కవుంగిలించుకొని కోడలి దీవనలిచ్చి మచ్చిక
ల్పెచ్చు పెరుంగ నాపె గుణబృందము లెంతయు నచ్చి మెచ్చి వా
పుచ్చి పతివ్రతామణిని భూసుత పుట్టిన యిల్లు వేడ్కమైఁ
జొచ్చిన యిల్లుఁ గీర్తులకుఁ జొన్పితి నిన్వినుతింపనేర్తుమే. 1434

క. దాసీనివహం బెల్లను, దాసీనివహంబుగాఁగఁ దలఁచి సుఖములం
బోసి మది విసువవైతి స్వభాసిక నినుఁ బోలునట్టి పడఁతులు గలరే. 1436

క. ఘాంగెడు గతి నలవాణియు, మంగళదేవతయు సర్వమంగళయును గా
కంగనలు నీకుఁ బురుడే, మంగళదేవతవు సర్వమంగళవాణీ. 1437

సీ. కౌశికసంవ్యాప్త కౌశికపరిపూర్ణవనములు క్రీడోపవనములనుచుఁ
బటుపలాశపలాశ భయద కంటకలతా భవనము లేకేళీభవనము లనుచు
వ్యాళసంవేష్టిత వ్యాళమహాద్రిగుహలు విలాసాంతర్గృహంబులనుచుఁ
గ్రవ్యాదసంచక్రక్రవ్యాద సంకలితాద్రులం చత్కృతకాద్రులనుచుఁ
గఠినకాసరధూసరాగాధఘర్త్తరీకదంబంబు దీర్ఘికానేక మనుచుఁ
[illegible]చి యొదఁదాల్మి నెంజొల్పి ధవుని పిఱుఁద, విపినములఁ దిరిగి వచ్చితివి గదమ్మ.

క. నినుఁ గోడలవని మన్నించిన శతమున మాకులము ప్రసిద్ధి వహించెన్
నినుఁ బుత్రిగాఁగ మహిఁ బడసిన జనకుని భాగ్యమహిమ చెప్పన్వశమే. 1439

క. బహుమాన పూర్వకముగా, గుహునిం బోఁబనిచి యారఘుప్రభుఁడు మహా
మహుఁడపుడు సోదరత్రయ, సహితుండై పటు జటావిసరము గదిర్చెన్. 1460

చ. ఇటులు జటోత్కరం బపనయించి పృథుస్తనయిత్నుమండలో
ద్భట పటలంబుఁ ద్రోఁచిన సుధానిధిచందము నొంది సద్భటా
ర్భటు లలియంగ నంత రఘుభర్త మహార్హము నిశ్చయించె ని
స్ఫుట పటుశోభనంబులను జొన్పెడు నాని నగోహాభ్య కేగఁగన్. 1451

క. కడుకొని నినుఁ దలఁచిన యప్పుడు వత్తువుగాని కదలి పొమ్మని పూజ
ల్గడు నొనరించి కుబేరుని, కడ కనిచె న్నృపుఁడు పుష్పకము సాదరుఁడై. 1452

వ. తదనంతరంబున.

శా. స్నానోద్భక్తితను ల్సహోదరవరు ల్పాంక్త్యంబులం గొల్వఁ బా
దూయుగ్మోచ్చ మహోత్తమాంగుఁడు మరుత్పుత్రుండు మున్నేగ దై
తేయస్వామి విభీషణుండు గకుభక్తిం జేరి రానప్డు యా
త్రాయత్తంబగు చిత్తవృత్తి రఘువంశ్యస్వామి యుత్సాహియై

క. కుండల దీప్తిచ్ఛాళిత, గండస్థలుఁ డగుచు రథముఁ గైకొని యొప్పెం
జండకిరణుండు పొడుపుం, గొండ పయి న్వెలుఁగు గతి రఘూద్భుం డంతన్. 1354

శా. చక్రాసరద ఉవా ప్రభానురుచిరోచ్చస్యందనారూఢిప
చ్చక్రాళి న్వెలయింపఁ జేయుచు మనోజ్ఞ ప్రక్రియాలోలుఁడై
శక్రాద్యష్ట దిగీశభావితయశోజాలప్రతీతుండునై
శక్రాశ్మప్రభాసత్తనుండు వెడలె స్సాకేతవీక్షార్థమై. 1455

వ తదవసరంబునం గౌసల్యయు సపత్నీద్వయసహితంబుగాఁ బుణ్యనితంబినీకదంబవల
యితం బగు జనకనందన కర్ణీరథంబు ననుసరించి సముచితయానంబున వెడలె నంత.

మ. హితవృత్తిం జని రాఘవుండు గనియెన్ హేమప్రభాజాలరి
ఙ్గిత పక్షద్వయచక్రవాక మిథునాక్షేపప్రచారంబుఁ జా
రుతరంగోద్ధత వాతకంపితమహీరుట్శాఖికాడోలికా
స్థితకీరంబు లసన్మనోజ్ఞ సరయూతీరంబు దూరంబున్. 1457

క. కని తత్సమీపమునకుఁ, జనుఁ నప్పుడు కుముద కమలసౌరభము వెసం
గొనిన మలయానిలమున, న్మనిఁగిన రాముఁ డను లక్ష్మణుం డిట్లనియెన్. 1458

సీ. కలిత రక్తోత్పల కలికా విశేషహారతి దీపకళికాప్రతతులతోడ
నధిక వాః కేళీ సమాయాత భద్రేభపటుకుంభభద్రకుంభములతోడ

శైవాలసంగతచరమాంగ చక్రవాకమనోజ్ఞ కిసకలశములతోడ
హంసపక్షచ్ఛదనాచ్ఛాదిత విశాలసైకతవేదికాచయములతోడ
గండశైలాచార లాజాప్రకరములతోడఁ, గమఠ సౌవర్ణచారుపీఠములతోడ
భావిపట్టాభిషేక సంభారములఁ బొనర్చునది వోలె నున్న దిన్నదిని గంటె.

క. అని లక్ష్మణుఁడు నతుఁడు నచనముల నగ్గింప భరతశత్రుఘ్నులు సొ
ల్పునఁ గీర్తింపఁగ రాముఁడు, చని కాంచె నయోధ్య నహితజనతాసాధ్యన్.

వ. కాంచి యపార కపివార పరివార సహితుండై తూర్యనాదంబులు విప్రాశీర్వాద
లు మిన్నుముట్ట వనాగమనంబునం బొంగుకులాంగనయుం బోలె వివిధాలంకార
భితయై వసంతసమయోద్యానంబునుం బోలెఁ గుసుమ విర విస్ఫురద విశాల
లంబై హిమకరోదయావసర ఘూర్ణమానమహార్ణవంబుం బోలె ధవళ తురంగ
గంబై శారదాముఖంబునుం బోలె సంగీతవిద్యానిలయంబై వెలయు నయ్యయోధ్యా
రాజధానీప్రవేశంబు కృతశుభయంబునం బొడలు మహేంద్రుండు సురాచార్యా
తుండై త్రిదశాలయప్రవేశంబు గావించు చందంబున దశకంఠభంజనుండగు రా
ముండు వసిష్ఠానుమతుండై యాచరించె నంత.

తే. గీ. ఉపవనంబులఁ దూఱి పయోజవనవి, హారమొనరించి ధారాగృహములయందుఁ
గంధగజగండ మిళితమదకలితగంధ, గంధవహావృత్తి నెదిరించె గంధవహుఁడు.

క. సుందరగతి రాముఁడు పౌరందరవిభవమునఁ దత్పురం బేగనుఁబో
నందఱుఁ బౌరులు ముదమునుం, బొంది రమ్యతమాను నవ్విబుధులవిధముగన్.

చ. ఇభఘటలు లమ్మహామహాన కీనల వాకల నేగ మౌక్తిక
ప్రభలు వెలుంగ ఛత్రములు పట్టి సమస్త మునీంద్రకోటి ప్ర
త్యభినవభూషణాంశుకాలయం బటువేత్రకరుల్ నటింప భూ
విభులు పదారవిందములు వేడ్క భజింపఁగ రాముఁ డాదృతిన్.

ఘంటాపథంబుఁ దఱియం జొచ్చిన నయ్యవసరంబున.

ఉ. లాజలు నక్షతలును దూర్వాజాలంబులును బూవులు మౌక్తికముల్
రాజపథసౌధపఙ్క్తి, స్త్రీజనములు చల్లి పుష్పవేసలు పతిపై.

క. శ్లాఘాతిశయపవనజుని, మాఘాతసముద్రలంఘనాద్యభినుతితో
రాఘవవిరోధివిజయుని, మాఘోషము చెల్లెఁ బురముఁ దెల్లెపలఁగన్.

క. హనుమద్భల్లూకపసౌరినలాంగదకుముదకేసరి దధిముఖమహా
పనసగజగంధమాదన, వినతసుషేణగవయద్వివిదముఖ్యాదుల్.

చ. బహువిధభూషణంబుల నపారవిభూషవిభూషితాంగులై
యహిపరిముక్తకంచుకనిభాంశుకము ల్ధరియించి గంధమా
ల్యహితశరీరులై ఫలరసాదులఁ దృప్తి వహించి యెంతయున్
రహివిహరించిరప్పురవరంబున రాముఁడు సంతసింపఁగన్. 1470

క. తాలిమి శ్రీహనుమత్సీ,తాలక్ష్మణభరతశత్రుఘ్నారకశత్రు
ఘ్నాలంబనుఁడై రఘుభూ,పాలుం డత్యాదరమున బట్టక మేగెన్. 147

వ. ఇట్లఖిలజనానందంబుగాఁ బురవిహారంబునం బ్రీతుండై. 1471

క. భూమీసురబాంధవభృ,త్యామాత్యకనాగరకుల నానతిఁ బెరిం
భామితకరుణాదృష్టి,ప్రేమాబహుమాన సుఖపరిప్రశ్నములన్. 1472

ఉ. సంతసమందఁ జేయుచు వసంతుఁడు పుష్పవనంబులోని క
త్యంతముదంబునం జనిన యట్లు వినూత్నచిరత్నదీపికా
క్రాంతశిరోగృహాంతవిధుకాంతశిలాస్థగితోరువేదికా
భ్యంతరమందిరాంతరమహార్పితిజూఁచి సొచ్చె వేడుకన్. 1473

వ. అనంతరము భగవంతుండభీష్టసుఖావాసంబు లగునివాసంబుల హనుమన్ముఖ్యుల విడి
యించె నంతసీతాకాంతయుం బుణ్యకాంతాకరాంతలతాంతతాళవృంతానిలాలోల
చూర్ణకుంతలయై శుద్ధాంతంబు చొచ్చె నట్లఖండవిభవంబున నగరుసొచ్చి రాముం
డుచితపనోదంబుల వీణాదిమనోహరమంగళనాదంబుల బాంధవామోదవాదంబుల
నారేయి సుఖవృత్తిఁగడపుటయు. 1474

సీ. ఉదయభూభృచ్ఛిఖరోత్తుంగ ఫణిఫణా రమణీయకృదనంతరత్న మనఁగ
విధుమయూఖవృతాల విస్రగ్రసనవిహారయసరస్సంచార హంసయనఁగ
భువనప్రకాశకబుద్ధి వీక్షితవాయుపక్షి రద్దక్షిణచక్షువనఁగఁ
బంక్తికంఠవిదారి పట్టాభిషేచనార్థసురకల్పితవసురాశి యనఁగ
రహియజుస్స్వామబుగ్గతురసస్మృద్ధి, మూఁడుమూర్తులు మెదిపిన ముద్ద యనఁగ
నుదయమయ్యెనినుఁడు ప్రాక్తలోదరీముఖస్థగితచిత్రకాన్తి శిఖగతి ఖగతి. 1475

తే. శ్రీరఘుస్వామి పట్టాభిషేకమునకు, సర్వతీర్థాదృతంబులు సంగ్రహించి
ధర్మకలశంబు వేలుపు లంపిరనఁగ, భానుఁ డుదయించె నభినవభానుఁ డపుడు.

సీ. వజ్రసంకల్పితద్వారబంధములనుఁ బొలుపారుకుందముపూఁతలగుచుఁ
మణీయబహుచిత్రకాయమానములను నవకిసాలయతోరణంబు లగుచుఁ
బ్రాతస్సముద్ధితభామాధరములనుఁ గర్పూరతాంబూలకాంతులగుచు
మేరుగోత్రాధరచారుహాటనిభసౌధతతికిఁ గైరికధాతు లగుచు

నరుణసరసీరుహ సరోవిహారమునక, రమ్యోర్మిలకునొప్పు సుపర్ణాగమ్యోర్మిలగుచుఁ

బలురథములకు రత్నకంబళములగుచు, నరుణగతి మించెఁ దరుణారుణాతపములు.

చ. అహిమకరోరుభాస్వదుదయమ్మునను న్మనుగాఁగ వేసుక

న్నహాసహాజన్ముఁ డన్నృపతిచంద్రుఁడు రామచంద్రుఁ వందిమాగధ

ప్రహితనుతుల్సెలంగఁగఁ బ్రభాతమునం దగ మేలుకాంచెఁ బూ

ర్ణహిమకరాననాంశురుచి యందొలుకందొవలుల్సహింపఁగన్. 1478

వ. మేలుకని కృతకాల్యకరణీయుండును ధృతదివ్యాంబరవిభూషణుండును నతసామంత మహీపాలకుండును వృతబంధుసహోదరామాత్యుండును భృతమహీదేవతానివహుండును నుతపౌరజానపదకవిప్రవరప్రకరుండును స్మితసుందరాధర ముఖాంభోజుండును మితచతురమధుర వాక్సమాజుండును మహాతేజుండునగు రామరాజుం గనుంగొని సమన్విత వామదేవాది మహామునిశ్రేష్ఠుండగు వసిష్ఠుం డెల్లవారల యుల్లంబులుం బల్లవింప నల్లన నిట్లనియె. 1479

ఉ. చేరువ యయ్యె మారుతము శిష్యులఁగూడి మునీంద్రులెల్లరుం

జేరి రయోధ్యజానపదసేవిత యయ్యె వరాభిషేకసం

భారములెల్లఁ జొప్పడె సమస్త మహీవలయాధిరాజ్య మిం

పారఁగ రామమూర్తికి సమర్పణసేయుట జాలమేటికిన్. 1480

క. నుతపుణ్యనదీజలములఁ, జతురంభోధ్యుదకములును శైలచయులు స

మ్మతిఁ దెచ్చి రఖిల జనమాన్యతమై పట్టాభిషేకనిలయుం బనుచేన్. 1481

వ. అని పలికి కౌసల్యాగర్భసంభూతభూత ప్రభూతవర్తనం బుగ్గడించి. 1482

సీ. పదునాలుగునబ్దంబులఁ, బదునాల్గు యుగంబులయ్యె భరతుఁ కతఁడు

న్మదమందె ధరాభారముఁ, గదలించి రాఘవుల బెట్టఁగా వితినను మన్. 1483

క. కావున రాఘవు నఖిల మహీవలయముఁ బేర్మిగొను లేలు విభునిగాఁ

గావింతమ యభిషేకమహావిభవం బనుచు మున్నిగా నందముకన్. 1484

వ. సమస్తజనానందకరం బగునమ్మహావాగ్ర దశరథాంగలకెలంగించి తదనుమతంబు వడసి దేవతాజయజయధ్వానంబులతోన భూదేవతాశీర్వాదంబులును దివ్యదుందుభి రవంబులతోఁ దూర్యారవంబులును కల్పకప్రసూనాసారంబుతోన పుణ్యకాంతాక రాక్షతాసారంబులును గంధర్వాప్సరోలాస్యంబులతోన వేశ్యాలాస్యంబులును నొక్కటనింగికి నేలకుం జాలియొప్ప నప్పు డరుంధతీవల్లభుండు సితప్రభాభాసురంబును ముక్తాఫలవికీర్యమాణంబునునై క్షీరవార్నిధిమధ్యంబునుంబోని సభామండపాభ్యంత

రంబున నుత్తుంగంబై పూర్వశైలసదృశంబగు భద్రాసనంబున రోహిణీపతిపురుండగు
హిమకరునట్టి జానకీసనాథు రామమహీనాథు సుఖాసీనుం జేసె నంత. 1485

క. నవరత్నమయాలంకరణవిశేషము పేర్మిరోహణమహీధ్రమునా
నవనివిభుఁ డొప్పటుయు నప్పుడు వసిష్ఠాదులు గడఁగి కడునొప్పమునన్ 1486

మ. ఉపమాతీత యశోధురంధరు గుణాఢ్యు న్సర్వ సర్వంసహా
ధిపతిత్వంబు వహింపు మీ వనుచుఁ బ్రీతిన్ధర్మపట్టంబు సు
త్యపదిష్టస్థితి మానవేశ్వరలలాటోపాంతమునం గూర్చి ర
చ్చపలగప్పం బెనుమబ్బు తీవమెఱపు న్సంధించుచందంబునన్. 1487

చ. కలిత మనోజ్ఞపల్లవనికాసిత పుణ్యనదీజలోజ్జ్వల
త్కలశము లొప్ప నవ్యకరక జములన్ ధరియించి మానిచం
ద్రులిటులు త్వద్ద కూరసముఁ జిల్కుము మాపయినంచుఁ దెల్పు న
చ్చెలువున రామచంద్రు నభిషేక మొనర్చిర శేషభూతికిన్. 1488

వ. మఱియు నందగువారెల్ల రాఘవుం బుణ్యతీర్థజలంబుల విధ్యుక్తక్రమంబున నభిషే
కించిరి. 1489

సీ. కుముదబాంధవుఁ బోలెఁ గువలయానందుఁడై యమృతధారాపూరితాత్ముఁ డగుచుఁ
గనకాచలముఁ బోలె ఘనపావకలితుఁడై విబుధనదీజలవిముఖుఁ డగుచు
సప్తమూర్తిని బోలె నారాధ్యమూలుఁడై సంగతగంగోత్తమాంగుఁడగుచు
నీలాంబుదముఁ బోలె శాలివిలాసుఁడై విహితాంబుపూర సంప్లిహితుఁ డగుచు
గల్పకమునోలె మధురసకలితపాణి, పల్లవుండయి యభినవఫలముఁ డగుచు
సీతతోఁ గూడి పట్టాభిషేకశోభ,నము వహించెడు వేళ రామమహివిభుఁడు. 1490

క. పాటించి రామమూర్తికి, హాటకకలశోదకంబు లభిషేకింపన్
మేటి జలధారలొప్పెం, గాటుకకొండపయి వజ్రకవచము మాడ్కిన్. 1491

వ. ఈరీతి నఖిలభూతధాత్రీవలయాభిషేక సామ్రాజ్యసంశోభితుండై గురుబ్రాహ్మణ
మాతృదేవతావందనంబు లాచరించి సమస్తజనంబుల నభిమతప్రదానంబులం దనిపి సం
తుష్టుండై. 1491

క. ఆవిభుఁడు దనరుఁ గాన్కలు, [illegible] భూ
షా [illegible] 1493

